బూతుపురాణము గాదిది
ప్రాంతపురాణమునుగాదు, పాతకహరమౌ
సూతపురాణం బియ్యది
పూతపురాణంబు పుణ్యపురుషావళికిన్.

# సూతపురాణము

## ప్రథమాశ్వాసము





కవిరాజు

త్రిపురనేని రామస్వామి చౌదరి

# శ్రు తి ఫ ల ము

సూతప్రోక్తపురాణసంహితను సంశుద్ధాంతరంగంబుతోఁ
బ్రాతస్స్నాయములం బఠించునెడలన్ బ్రహ్మాయురారోగ్యముల్
భూతప్రీతియుఁ జిత్తశుద్ధియుఁదమోలుంటాక వైరాగ్యమున్
నీతిప్రోత వివేచనంబుఁ గలుగున్ నిత్యంబు సత్యంబుగన్.

ఈ కథ వ్రాసిన విన్నను
వాకొన్నను పాడిపంట పడుపసు సుబ్బున్
తేకువ జోకయుఁ బ్రబ్బున్
ప్రాకటముగ లిబ్బులుబ్బు పైరసు లబ్బున్

# రామస్వామిగారు

అగ్రజాతి నిరంకుశత్వం; మిగతాజాతుల మౌఢ్యం, అజ్ఞానం, బానిసత్వం—అవీ ఆరోజులు.

అప్పుడూ రామస్వామిగారి జననం. చిన్నతనం అంగలూరులో. కోణంగి తనానికీ, కొంటెతనానికీ ప్రసిద్ధి. ఇప్పటికీ పిట్టకథలుగా చెప్పుకుంటూ వుంటారు— "అమ్మ కడగొట్టు బిడ్డ."

గుడివాడలో చదువు.

ఇంత చిన్నతనంలోనే వొక సంఘటన—

రామస్వామిగారికొక బ్రాహ్మణ స్నేహితుడుండేవాడు. ఒకనాడు యిద్దరూ మిఠాయి దుకాణం దగ్గరకు వెళ్ళారు. రామస్వామిగారు మిఠాయి కొంటూ వుండగా బ్రాహ్మణ స్నేహితుడు నాక్కూడా కొనిపెట్టవలసిందని అడిగాడు. దానిక్కూడా రామస్వామిగారే డబ్బిచ్చారు. తన పొట్లాం జేబులో పెట్టుకొని రామస్వామిగారు రెండో పొట్లాం అందుకోబోయేసరికి బ్రాహ్మణ స్నేహితుడు వారించాడు. "రామ

స్వామీ! నీవు ముట్టుకోగూడదు!" అని ఆ పొట్లాం తానే తీసుకొన్నాడు. రామస్వామిగారికి పెద్ద ప్రశ్న కలిగింది —
"నే డబ్బిచ్చాను. నేనెందుకు ముట్టుకోగూడదు?"

తరువాత బందరులో చదువు. నాలుగోఫారం నుంచీ కవితావ్యాసంగం. బందరులో యెక్కువగా కృషి. ఒక ప్రక్క కవిత్వం—మరొకప్రక్క స్పోర్ట్సు. ఫుట్‌బాల్ అద్భుతంగా ఆడేవారు. టీముకు కెప్టెన్. ప్రిన్సిపాల్‌తో పోట్లాడి, ఈ సంవత్సరం నీ కాలేజీకి కప్పు రాకుండా చేస్తాను.' అని చెప్పి మరొకస్కూల్లో చేరి, ఆ స్కూలుతరఫున టీముకు కెప్టెన్‌గా వచ్చి కప్పు గెలుచుకు వెళ్ళారు.

కవిత్వం...అవధానాలు. కవిత్వ విషయంలోనూ, సంస్కృతాధ్యయనంలోనూ అష్టకష్టాలు—యెక్కడకు వెళ్ళినా వొకటేమాట. "నీవు శూద్రుడవు." ఆసూరి కాంతయ్యసూరిగారి (జిల్లారెజిస్ట్రారు) వద్ద కావ్యపఠనం. చివరకు వెంకటశాస్త్రిగారి శిష్యత్వం. స్కూల్లోనే కాకుండా వారింటికి వెళ్ళి చదువు—వెంకటశాస్త్రిగారి వాత్సల్యం.

రామస్వామిగారి ఆనాటి కవిత్వానికి వొక నిదర్శనం—

ఒక బ్రాహ్మణవిద్యార్థి రామస్వామిగారి పద్యాలు తన గురువుదగ్గరకు తీసుకు వెళ్ళి ఎవరు వ్రాసిందీ చెప్పకుండా, "ఈ పద్యాలు దిద్దిపెట్టండీ," అన్నాడు. ఆయన పద్యాలు చూచి, వొకపదాన్ని చూపుతూ, "ఈ పదం తీసివేసి మరొక

పదం వేస్తే బాగుంటుంది" అన్నాడు. "ఈ పద్యాలు రామస్వామి వ్రాసినవి" అన్నాడు విద్యార్థి. "అయితే ఏదీ, మళ్ళీ వొకసారి చూడనివ్వు," అన్నాడు గురువు.

చౌటపల్లిలో స్వయంవ్యక్తులను తయారుచేసే సంఘ స్థాపన. అన్నివృత్తులూ తామే (ఈ సంఘమే) చేయాలని దీని ఆదర్శం. ఐర్లెండ్‌నుండి వ్రాసిన ఉత్తరాలనుబట్టి, ఆ గ్రామం లో పురాణాలకు వ్యతిరేకంగా, దేవుడులేడనీ, దయ్యాలు లేవనీ, అగ్రజాతికి ప్రత్యేక హక్కులుండగూడదనీ ప్రచా రం చేసినట్లు తెలుస్తూవున్నది. ఈ ప్రచారంవల్ల వాగ్వా దాలూ, దూషణతిరస్కారాలూ జరిగినట్లుకూడా తెలుస్తూ వున్నది. రామయ్యగారికి వుత్తరంవ్రాస్తూ, "ఉన్న సంగతులు నీకు విశదంగా వ్రాశాను. మీరే ఆలోచించుకొని వొక నిర్ణ యానికి రండి! నేను చెప్పానుగదా అనిమాత్రం చేయ బోకండి!" అనివ్రాశారు.

ఒక చిన్న సంఘటన—

రామస్వామిగారు వొకనాడు మొహంపుల్లలకోసం చెట్టు యెక్కబోతూవుండగా, ఆ చెట్టుకి యినుపమేకులూ, మేకులకు జుట్టూ చుట్టివుంది. క్రిందికి చూచేప్పటికి డబ్బులూ, నిమ్మకాయలూ, వేపబెత్తమూ (చేతబడిసంబంధం) పడివున్నాయి. కొంచెం తటపటాయించారు. చెట్టెక్కి పుల్ల కోసుకొని, నెమ్మదిగా చెట్టుదిగివొచ్చి, డబ్బులు జేబులో

వేసుకొని, బెత్తం తీసుకొని వూళ్లోకి వెళ్ళారు. ఊళ్లోగోల—ఆ బెత్తం చాలారోజులవరకూ వారిదగ్గరేవుంది.

రోజులు గడిచాయి. తమ సిద్ధాంతాలను వూరూరూ తిరిగి ప్రచారం మొదలుపెట్టారు. పురాణాలను నమ్మగూడదనీ, దేవుడు లేడనీ, బ్రాహ్మణులు శూద్రులను పశువులకంటే నీచంగా చూస్తూవున్నారనీ, ఈ బానిసత్వాన్ని పోగొట్టుకోవాలనీ ఉపన్యాసాలు...ఫలితం! రాళ్ళు రువ్వటం, రాక్షసుని చూచినట్టు చూడటం, వెళ్ళినఊళ్లో భోజనంకూడా చిక్కక తిరిగిరావటం.

"పలనాటి వీరులపౌరుషం", "రాణాప్రతాప్" నాటక ప్రచురణ—సమాజాలు ప్రదర్శించటం—నాటకాలు ప్రేక్షకుల్లో ఉద్రేకాన్ని పెంచటం—ప్రభుత్వం—ప్రభుత్వం పట్టుకుంటుందని అనుమానపడి "రాణాప్రతాప్" తగలబెట్టటం—

కురుక్షేత్రసంగ్రామ ప్రచురణ. ఆ రోజుల్లో పాండవులంటే ఎంతో పూజ్యభావం! అప్పుడు పాండవులకంటే కౌరవులు నీతిపరులనీ, పాండవులకు రాజ్యార్హత లేదనీ వ్రాశారు! ఇంకేముంది? ఒక్కసారి సంఘం గుప్పుమన్నది. "నలను తుర్యోధనుకు నాస్తికుడు" అని లోకం కోడైకూసింది. అగ్రజాతి ఒక్కసారి భగ్గున మండిపడింది. ఒక పత్రికలో ఒక విమర్శకుడు, "ఆముఎద్దులు రెండు పోరాడుచుండ" అనే పద్యాన్ని విమర్శిస్తూ, "శూద్రకవీ, శూద్రపోలికలు" అన్నాడు.

వాదోపవాదాలు చెలరేగినవి. తిట్టారు, శపించారు. సంఘం తన ఆక్రోశాన్ని వెళ్ళగ్రక్కింది. సంఘంలో ఈ పుస్తకం కలిగించిన అలజడి మరేపుస్తకం (శంబుకవధ తప్ప) కలిగించ లేదు. పది సంవత్సరాలు తిరిగి వచ్చేటప్పటికి మాత్రం ఈ పుస్తకాన్నే "యింటర్మీడియేట్"కి పాఠ్యగ్రంథంగా పెట్టుకొన్నారు.

1914 లో ఇంగ్లండు ప్రయాణం. యుద్ధంరోజులు. బంధువుల నిరోధం. వినేస్వభావముంటేనా? పైగా వెళ్ళ బోయే ముందు యెవరో తుమ్మారట. అందరూ బ్రతిమా లారు; వినలేదు; బయలుదేరారు. లండనులో గాంధీదర్శనం— కృష్ణాపత్రికలో వ్యాసపరంపరలు—

ఐర్లెండ్లో మూడేళ్ళు విద్యాభ్యాసం. బాల్యాదీ, మాంసనిషేధం. అప్పటికీ, యిప్పటికీ, యెప్పటికీ అంతే, పాశ్చాత్య దేశాల్లోనూ అంతే! దోసకాయముక్కలూ, టొమేటోలూ ఆహారం—

జీవహింసచేసి జీవింతు ననుకంటె
జెట్టయెందుఁగూడఁ బుట్టఁబోదు
జీవహింసమాని జీవింపరాదొకో—

అని సిద్ధాంతం. పాశ్చాత్య దేశంలోకూడా వేషంలో మార్పేమీలేదు. ఎక్కడకు వెళ్ళినా తలపాగా ప్రత్యక్షం. ఒక లేడీ—"రోమ్లో ఉన్నప్పుడు రోమన్లా వుండాలి; నీవు

ఇలా వుంటావేం!" అని అడిగింది. రామస్వామిగారు—
"అయితే మీవాళ్లు మాదేశం వచ్చినప్పుడు ధోవతులు కట్టరేం!"

ఆమె మాట్లాడలేదు!

అవి యుద్ధంరోజులని చెప్పాం. ఒకరోజు ఒక యువతి రామస్వామిగారి దగ్గరకువచ్చి చందా అడిగింది. "ఎందుకూ!" అని ప్రశ్నించారు రామస్వామిగారు. "దెబ్బలుతిన్న సోల్జర్ల కోసం" అన్నదాయువతి. "నయంచేయించుకుని మమ్మల్ని హింసించటానికేగా! నేనివ్వను" అన్నారు రామస్వామిగారు.

డబ్లిన్ గ్రంథాలయాలలో పఠనం; శంబుకవధ పీఠిక యీ గ్రంథాలయాల్లోనే తయారు. బారిష్టరుపట్టా.

ఇంగ్లండు ముఖ్యపట్టణాలూ, ఉత్తర దక్షిణ ఆఫ్రికాలూ, సింగపూర్, సిలోన్ వగైరాప్రదేశాల పర్యటనం...

దక్షిణాఫ్రికాలో ఒక సంఘటన:—

డర్బన్‌లో స్టీమరాగింది. ఆసియావాసులు అక్కడ దిగకూడదని ప్రభుత్వం వుత్తరువు జారీచేసింది.

రామస్వామిగారు అవమానంతో కంపించిపోవటం:
"నేనేం దొంగనా! ఆసియావాసులంతా దొంగలా!"—

ప్రభుత్వ ప్రతినిధి వచ్చి 'ప్యాస్‌పోర్టు' చూపమని అడిగాడు. నోటీసు ఉపసంహరించుకొనేవరకూ చూపనని రామస్వామిగారి జవాబు.

"చూపవ్ ?"

"చూపను"

"అరెస్టుచేయిస్తా !"

"చూస్తాను."

అది జపాన్ ఓడ. కెప్టెన్ వచ్చి బ్రతిమాలాడు. విన లేదు. కెప్టెన్ వెళ్ళి ప్రభుత్వపు ప్రతినిధితో మాట్లాడాడు. తిరిగివచ్చి, "డర్బన్ చూట్టానికి వెళ్ళవచ్చు" అని చెప్పాడు. "ఏషరతులతో", అని రామస్వామిగారు అడిగారు. నేను 'స్యూరిటీ' వున్నాను అని కెప్టెన్ చెప్పాడు. "అయితే నేను దిగాదిగను-ప్యాస్‌పోర్టు చూపాచూపను", అని రామస్వామి గారి జవాబు. కెప్టెన్ కేమీ తోచలేదు. అప్పటికే గంట ఆలస్యమయింది. గంట ఆలస్యమంటే యెంతో డబ్బునష్టం. మళ్ళీ వెళ్ళి ప్రభుత్వప్రతినిధితో మాట్లాడి రామస్వామిగారి దగ్గరకు నవ్వుతూ వచ్చి, "మీరు ఏ షరతులూ లేకుండానే దిగవొచ్చు" అని చెప్పాడు. అప్పుడు రామస్వామిగారు తన ప్యాస్‌పోర్టు చూపారు.

ఇక్కడ మరొకమాట చెప్పాలి. యూరప్‌లో ప్రయాణం చేసేటప్పుడు రామస్వామిగారు ప్రతిహోటల్లోనూ 13 నెంబరు గదిలోనే మకాం. ఎందుకో తెలుసా? 13 నెంబరు మంచిదికాదని సాధారణంగా తెల్లవాళ్లెవరూ ఆ నెంబరు గదిలో వుండరు. అందుకని అద్దెతక్కువ. రామస్వామిగారు

అనివార్యంగా హోటలు మానేజరు దగ్గరకు వెళ్ళి, "13 నెంబరు గది కావాలి" అని అడిగేవారు. మేనేజరు కాసేపు తెల్లబోవటం; మనిషిని ఎగాదిగా చూడటం; చివరకు తీసుకు వెళ్ళి చూపటం.

ఇతరులకు 13 నెంబరు పడదు; రామస్వామిగారికి మాత్రం ఆ నెంబరే కావాలి!...స్వదేశాగమనం. బందరులో ప్రాక్టీసు. మళ్ళీ సంఘసేవా, సారస్వతసేవా మొదలు. మళ్ళీ సంగ్రామం మొదలు. బ్రాహ్మణేతరోద్యమమూ, ఉపన్యాసాలూ, ప్రచారమూ. దినపత్రిక నడపటానికి బెజవాడ నివాసం. ఇంగ్లండునుండి స్వదేశంలో అడుగుపెట్టగానే జస్టిస్ పార్టీకి వ్యతిరేకంగా జరిగిన బ్రాహ్మణేతర మహాసభకు అధ్యక్షత...

రైతుపత్రికా సంపాదకులుగా తెనాలి ఆగమనం. పత్రికద్వారా మళ్లీ సంగ్రామం.

శంబుకవధ ప్రచురణ. రాముడు శంబుకుని చంపుట అధర్మమనీ, ద్రావిడులను దాస్యంలో ఉంచటానికి వసిష్ఠుల వారు పన్నిన కుట్రఅనీ, ఆర్యకుతంత్రంవల్ల రామరాజ్యంలో ద్రావిడులకు భగవంతుని పూజచేసుకునే హక్కుకూడా లేదనీ దీని సారాంశము. ఈ స్వాతంత్ర్యముకోసం శంబుకుడు తన ప్రాణాలను అర్పించాడు. ఈ పుస్తకానికి కలిగిన వ్యాప్తి తెలుగులో మరే పుస్తకానికీ కలగలేదు. దక్షిణాఫ్రికా వెళ్ళింది, ఊరూరూ తిరిగింది, ఉద్రేకం పెంచింది, వివాదాలూ

దూషణతిరస్కారాలూ, అప్పటి రామస్వామిగారిస్థితి శంబుక వధలోని అంగదుడే చెప్పాడు—"ప్రాకృతజనంబునకు మీ చరిత్రము దురవగాహము. ద్విజులు మిమ్ముఁ బాషండుఁడ వనియు, మతద్రోహివనియు దెగడుదురు. ద్విజేతరులో విద్యాగంధములేమిచే బ్రాహ్మణద్వేషివనియుఁ దన్మూలమున రాజదండనకుఁ బాత్రుడవనియు గొణుగుదురు. కట్ట కడకు మీ రిరుతెగలకు గానివా రగుటయే ఫలితము."

ఇలా గేవుండేవి పరిస్థితులుకూడా! అగ్రజాతిలో ద్వేషం పెరిగిపోయింది. మిగిలినవారిలో భయమెక్కువైంది. దగ్గరకు రావటానికి భయం—తమనుకూడా లోకం బ్రాహ్మణద్వేషులని దూషిస్తే! కాని ఆరోజుల్లోకూడా అమృతఘడియలు లేక పోలేదు—

ఒక మీటింగులో ఉపన్యాసంచేసి రామస్వామిగారు బయటికి వచ్చారు. ఒక శతవృద్ధు కఱ్ఱపోటుతో వచ్చి అమాంతంగా రామస్వామిగారిని కౌగలించుకొని ఆవురుమన్నాడు. "ఏమి ?" అని తబ్బిబ్బుపడుతూ అడిగారు రామస్వామి గారు. "ఏంలేదు బాబూ! ఇక నే నెక్కువరోజులు బతకను. నిన్నుచూచి చచ్చిపోదామని వచ్చాను" అన్నాడు ఆ శతవృద్ధు...

తరువాత టంగుటూరు కమ్మమహాజనసభ కధ్యక్షత. మదరాసులో జరిగిన కమ్మ మహాజనసభలో స్వసంఘ పౌరోహిత్య తీర్మానం. మళ్ళీ మీటింగులు. స్వసంఘ పౌరోహి

త్యాన్ని గూర్చి ప్రచారం. మాంసంతినటం మానిపించారు. యజ్ఞోపవీతాలు వేయించారు. స్వకులంలో పురోహితులను సృష్టించారు. మంత్రాలు చదివించారు. పెండ్లిండ్లు చేయించారు. యజ్ఞాలు చేయించారు.

కొల్లూరు కమ్మ మహాజనసభలో "కమ్మవారు క్షత్రియులా ?" అంశంమీద శంకరపీఠాధిపతులతో వివాదం. పీఠాధిపతుల పలాయనం.

తెనాలి చైర్ మన్; ఆంధ్రాయూనివర్సిటీ సెనేట్ మెంబరు; తెలుగు టెక్స్టుబుక్ కమిటీ మెంబరు—సంస్కృత ప్రాముఖ్యము తగ్గించటానికి ప్రయత్నం.

చైర్ మన్ గా వుండగా:

కొల్లుపులొచ్చాయి. కొలుపులు కొలవాలనీ అమ్మవారికి బలియివ్వాలనీ, కౌన్సిల్లో మెజారిటీ పట్టుబట్టింది. రామస్వామిగారి పార్టీలో ముఖ్యులే పట్టుపట్టటం! రామస్వామిగారు వినలేదు—"జీవహింసకు వొప్పుకోను" అన్నారు. ఊరంతా అలజడి. "అయితే విశ్వాసరాహిత్య తీర్మానమే" అన్నారు కౌన్సిలర్స్. "ఏమైనాసరే" అన్నారు రామస్వామిగారు. విశ్వాసరాహిత్య తీర్మానం పెట్టారు, కాని చౌదరిగారు వినలేదు...ఏమైనాసరే !! అప్పుడు కొలుపులుమాత్రం జరగలేదు. జీవహింస ఆగిపోయింది.

ఈ రోజుల్లో నూతపురాణ ప్రచురణ:—

పాతపురాణాల్లోని పొల్లు సర్వమూ తూర్పారబట్టారు.

పాతపురాణాలు తాను చెప్పినవిగావని సూతుడే చెప్పాడట— "నా మెడకు అంటగట్టారు" అని చెప్పి యదార్థధర్మాలు చెప్పాడు. ప్రజల్లో కొంతచైతన్యం: అక్కడక్కడ ఏకలవ్యులు బయలుదేరటం. ఏవూరికి ఆ వూరిలోనే ప్రశ్నలూ జవాబులూ.

ఆంధ్రమహాసభలో కవిరాజు బిరుదు. ఈ సంగతి ఎవ్వరోవచ్చి చెప్పారు. "ఓహో", అన్నారు రామస్వామి గారు.

సూతపురాణ ప్రచురణతో అగ్రజాతిలో ఆగ్రహం మరీయెక్కువైంది. ఒక్క వుదాహరణ! ఒక 'వాల్మీకి'కి ఒక శాస్త్రి సూతపురాణాలిచ్చాడు—"ఎవరివి?" అని 'వాల్మీకి' అడిగాడు. "రామస్వామిగారివి." "ఆ నాస్తికుడివా! ఆ నాస్తికుడివా !!" అని ఆ పుస్తకాలు లాక్కొని ముక్కలు ముక్కలుగాచించి తగలబెట్టాడు. ఈ సంగతివిని రామస్వామి గారి జవాబు—"అందరూ నా పుస్తకాలు కొని, ఈ విధంగా చేసినా బాగుండు—" ఖూనీపత్రికటన:-ఆర్యఋషులకు తమ నిరంకుశత్వాన్ని నిలబెట్టుకోటానికి,స్వర్గం వొక వంక—సంఘాభి వృద్ధికి. భగవంతుడు ఆటంకం-లోకం నాస్తికమయం కావాలి- తమ అధికారానికి ఆటంకమయితే హత్యచెయ్యటానికి ఆర్య ఋషులు వెనుదీయరు !!

తంజావూరు జస్టిస్‌పార్టీసభకు బొబ్బిరాజాకు వ్యతిరేకంగా అధ్యక్షత. అప్పుడు మునుస్వామి నాయుడుగారు

ప్రధానమంత్రి; జస్టిస్‌పార్టీ నాయకుడు — నాయకత్వానికి బొబ్బిలిరాజా పోటీ! అందుకే తంజావూర్లో ఆ మీటింగు. ఇది జరక్కుండా చెయ్యాలని పట్టుదల...ఎక్కువ ప్రతినిధులు మునుస్వామిగారి పార్టీవారే రావటంవల్ల, మీటింగు పెట్ట టం ఆలస్యం చేశారు. మీటింగు పోస్టుపోన్‌చేస్తారు అని పుకారు. ప్రజల్లో ఉద్రేకం పెరిగింది. గోడలు దూకారు. రామస్వామిగారే ముందు! హాల్లో ప్రవేశించారు. ప్రతినిధులు రామస్వామిగార్ని ప్రెసిడెంటుగా ఎన్నుకున్నారు. తీర్మా నాలు ప్యాసుచేశారు. మీటింగు సమాప్తి.

దీన్నిగురించి వ్యాఖ్యానంచేస్తూ 'రామస్వామి అనే ఒకరు' (One Ramaswamy) అని ఒక పత్రిక వ్రాసింది. రామస్వామిగార్ని బాగా తెలిసివుండికూడా బొబ్బిలిరాజాకి ప్రతికూలంగా చేశారనే ఉద్దేశంతో అలావ్రాసింది. రామ స్వామిగారు అది చూశారు. మద్రాసువచ్చి ఆ పత్రిక ఆఫీ సుకు వెళ్ళి, 'రామస్వామి అనేఒకరు' (One Ramaswamy) అని విజిటింగ్ కార్డుమీద వ్రాసి ఎడిటర్‌కి పంపారు. ఎడిటరు గబగబా తలుపులన్నీ బిగింపించుకున్నాడని వేరే చెప్పాలా?

"తంజనగరపు కోటగోడలు చెంగుచెంగున నెగురుసప్పుడు
కంచికోటల కంచుతలుపులు కంగుకంగున మ్రోయుసప్పుడు"
—గీతం.

"వీరగంధము తెచ్చినారము వీరుడెవ్వడో తెల్పుడీ
పూసిపోదుము మెడను వైతుముపూలదండలుభక్తితో" —గీతం.

ఆంధ్రరాష్ట్రోద్యమం—ప్రచారం—గీతాలు:—

తెలుఁగుబిడ్డా మరచిపోకుర
తెలుగుదేశము పురిటి గడ్డర
కొక్కొ-రోకో పాటఁబాడర
తెలుఁగువారల మేలుకొలపర—మొదలైనవి.

శుద్ధిసంఘం-కారణం-ఆర్యుల్లాగా, బ్రిటిషువారు తమ రాజకీయాధికారాన్ని నిలబెట్టుకోటానికే మతాన్ని వాడటం. ఇది జరక్కు-ండా క్రిస్టియన్స్‌ని హిందూమతంలోకి జేర్చుకోవటం. తెలుగుమంత్రాల్లో పెళ్ళిళ్ళు-మళ్ళీ ఉపన్యాసాలూ-ప్రచారమూ!-"వివాహవిధి" పుస్తక ప్రచురణం-ప్రతివీ అర్థంకాని సంస్కృతంలో వుండబట్టేగదా అగ్రజాతి ప్రాముఖ్యము. అందుకని మంత్రాలను మామూలుమాటలు చేశారు. తానే నడుంకట్టి పెళ్ళిళ్లు చేయించటానికి పూనుకున్నారు. ఈ పెళ్ళిళ్లు చాలా త్వరలో పాప్యులర్ అయ్యాయి. ఎన్నో పెళ్ళిళ్లు చేయించారు. చేయిస్తున్నారు. ఒక పెళ్ళి చెయ్యటం-ఒక ఉపన్యాసం ఇవ్వటం. ఇదీ పద్ధతి...

'భగవద్గీత' ప్రచురణ:-భగవద్గీత హృదయం బ్రద్దలైంది. భగవద్గీతా, భగవంతుడూ హాస్యాస్పదులయ్యారు. పరిహాసం సంఘసంస్క-రణకు ఎంతబాగా ఉపయోగిస్తుందో ఈ పుస్తకం నిరూపిస్తుంది.

ఈ గీత ప్రబల శత్రువుల్నీ ప్రబలమిత్రుల్నీ తయారు చేసింది. విమర్శకుల మాటలు విని రామస్వామిగారిలా

అన్నారు—"అయితే నా పుస్తకం తన కర్తవ్యాన్ని నెరవేర్చు కున్నదన్నమాట."

తరువాత గుడివాడలో సన్మానం—కవిరాజు సన్మానం. రామస్వామిగారు చేసిన సారస్వత సాంఘికసేవకు సన్మానం.



# తొలిపలుకులు

అతిప్రాచీనకాలముండొట్టి యిందనుక భారతవర్షంబున ననన్య సామాన్యప్రతిభాప్రభావంబున సర్వప్రపంచమును గబళింపఁజాలు ప్రజ్ఞాచక్షువులున్నను, విద్య, ప్రాకృతజనదుర్లభ మగుటంజేసి, భారతలోకం బజ్ఞానగాఢాంధకారబంధురముగా నుండె. ఏతత్కారణంబున నక్షరాస్యులకు మిక్కుటమగు గౌరవము చేకూరియుండెను. వారు చెప్పినదే మాట, వారు పాడినదే పాట యయ్యెను. నాల్గు మాటలు నేర్చిన జాల్మఁడైనను జనసామాన్యముచేఁ బూజనీయుఁడుగా నెంచఁబడుచుండెను. సంస్కృతము కవిభాష యగుటచేతను, బ్రజలకు దురవగాహ మగుటచేతను, దద్భాషయం దేమి చెప్పఁబడినను నయ్యది యతిపవిత్రతఁగాంచెను. చిలుకలవలె నాల్గుసంస్కృత శ్లోకములు పఠింపఁ జాలినవాఁ డత్యధిక మాననీయుఁడయ్యెను. ఈ విధముగ విద్వల్లోకమునుండి కాలక్రమంబున నాచార్య పరంపర బయలువెడలెను. తొలుదొల్త నీ యాచార్యకము వ్యక్తిగతమై, తుదకుఁ దచ్ఛిష్యపరంపరా వశమై యుండెను. పదపడి కొండొకకాలంబునకుఁ గులాధీన మయినది. ఆచార్యత్వము వ్యక్తిగత మైనప్పుడు, విశేషప్రజ్ఞాధురంధరులు గురుపీఠము నలంకరించిరి. కులక్రమాగత మైనయప్పుడు ప్రాజ్ఞులాచార్య పీఠమునకు దూరగులైరి. దూరగులగుటయే కాక, మీఁదుమిక్కిలి, రానురాను బహిష్కృతులయిరి. ఆచార్యత్వ

మొకకులమున జీర్ణించినప్పుడు విద్యావ్యాసంగము శీర్ణించుట స్వభావసిద్ధమేకదా? ఏతన్మూలమున గురుసాన్నిధ్యముననున్న పండితమ్మన్యులకన్న దరితరులే యతిశయశేముషీధురీణు లగుట సంభవించుచుండెను. నేడు చూడరాదా? పుష్పగిరి శంకరపీఠము నధివసించిన వర్తమాన శంకరస్వామి ఆదిశంక రునితో నుపమింపఁబడుటకు నర్హుడా? శక్తి సామర్థ్యములు సన్నగిల్లినకొలంది, గురుపీఠంబునకుఁబండితప్రకాండుల దెసనీర్ష్యా సూయలు వర్ధిల్లఁజొచ్చెను. ఇతరుల విద్యాప్రకర్ష తాత్కా-లికాచారపరంపరకుఁ గన్నుగుట్టగుండెదిగు లేర్పడినది. పదం పడి కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యగ్రస్తమైనది. ఆచార్యత్వమునకు రాచబాట లుత్పన్నమగుటచే, దొంగ దారు లుత్పన్నమైనవి. విద్యాపక్షపాతము నశించినది. ధర్మ పక్షపాతము శిథిలమైనది. సత్యనిరతి కృశించినది. "యథా గురు స్తథాశిష్య" యనునట్లు ప్రజాసామాన్యమునందు ధర్మ చ్యుతి యేర్పడినది. చిత్తశుద్ధి లుప్తమైనది. చిత్తసంస్కారము లేని శుష్కాచారమె మోక్షసాధన మను గాథలు తలయెత్త సాఁగినవి. ఈ యభిప్రాయమె క్రమక్రమముగ నలుదిక్కులు నలముకొనుటంజేసి, నేఁటి భారతవర్షంబున దాంభికులకు, జాల్ములకు మానమర్యాద లేర్పడినవి. దాంభికులు ధర్మాధి కారు లగుటచే ధర్మము వ్యత్యస్తమైనది. ధర్మాధర్మవివక్ష జ్ఞానము గల్గియు మోమోటగలవారగుటచే ధర్మాధికారులు కూడ నిటునటు "ఉయ్యాలో జంపాలో" యనుచున్నారు.

ధర్మాభిమానము, కులాభిమానము, ఆత్మాభిమానముగామారి నది. ఇవన్నియు నుత్కృష్టస్థానమునుండి పతితమైనజాతియొక్క బహిర్లక్షణములు. వర్తమాన భారతలోకంబు చచ్చి చావని యవస్థలో నున్నది. అవతారపురుషులును, గారణజన్ములు ననఁదగిన మహాత్ముల యుద్బోధచే జీవలక్షణములు కొన్ని యస్ఫుటముగాఁ గన్పించుచున్నవి. సూత్రప్రాయముగానున్న పై వాక్యములను సోదాహరణముగా సందర్భానుసారంబుగా నిట విపులీకరించుచున్నాము.

## యుగములు

కాలచక్రంబునకుఁ గృత త్రేతా ద్వాపర కలియుగంబులను నాలుగాకు లుండుననియుఁ, బగటిని కన్నంటి రాత్రి యెట్లు వచ్చుచుండునో, యట్లు మర్యాద దప్పకుండ జనఁగా గృతము ముగిసినవెంటనే త్రేతయుఁ, త్రేత ముగిసిన ద్వాపరము, ద్వాపరము ముగిసినఁ గలియుగము, వచ్చునని పురాణములు చెప్పుచున్నవి. ఈ పరివర్తనము కేవలము నైజవిరుద్ధముగాఁ గన్పట్టుచున్నది. కాలమునకు స్వభావసిద్ధముగా మంచి చెడుగులు కలవనుట సైతండికులాడుమాట. మంచి చెడుగులను గల్పించునది లోకము. "లోకమేనాఁడు కాసు వీసమయిన వీసరపోకుండ, మర్యాద మీరకుండ, నీతిబద్ధమై, ధర్మపక్షపాతమున సంచరించునో, నాఁడు కృతయుగమవతరించును. నాల్గవపాలు ధర్మపీడ తటస్థించినయెడలఁ త్రేత

యే తెంచును. ఆరవపాలు ధర్మము శీర్ణమయినచో ద్వాపరము పొడచూపును. మూఁడువాళ్లు ధర్మనాశనము కగ్గినఁ గలి యుగము తలచూపు"నని పౌరాణికుల వాదము. ఈ యనంత కాలమున యుగపరివర్తనము పురాణోక్త నియమబద్ధముగాక ప్రవర్తిల్లు విషయము మన మెఱుంగుదుము. ప్రజాబాహు ళ్యము యొక్క ధర్మప్రవర్తనముచే యుగములు కల్గుచుండు ననుట నిర్వివాదము. లేనిచోఁ బ్రపంచమునం దెల్లెడ నొక్క కాలమునం దొక్కయుగమె ప్రవర్తిల్లవలయును. ఇది యను భవ విరుద్ధమమగుటయేకాక, సనాతన మతసిద్ధాంతమునకే ప్రతికూలము. ఏకకాలమునందలి వివిధదేశ చరిత్రలఁ బరిశీ లించి, పఠించినయెడల మా వాక్యములు సుబోధములు కాకమానవు.

చీనాదేశ యాత్రికుఁడయిన "ఆహ్యునుత్సాంగ్" మిగుల పురాతన కాలమున హిందూదేశముయొక్క యాయాప్రాంత ముల సంచరించుచుఁ దత్కాలపు హిందువులనుగూర్చి వ్రాసిన వ్రాతలను జదివినచో శరీరము పులకరించక మానునా? పిమ్మట నా కాలమునాఁటి యన్యదేశముల మీఁదికి దృష్టి సారింపుఁడు. ఇంగ్లాండు నిజముగా మృగదశనుంచి వెలువడు చున్నది. పర్వత కందరమందిరములు, కోటరకుటీరములు, చర్మాంబరములు, అపక్వమాంసగ్రసనము, నిరంతర దేశభ్ర మణము కల్గి మృగదశాలీలావిలోలమై యున్నది. ఆకాలము నాఁటి "అమెరికా, ఆఫ్రికా" దేశములను బరికించినచో

నంతకన్నను లోఁచ్చె హీనమానవసంవాసితమై యున్నవి. పురాణములుచెప్పు మాటలు నిజములే యగునెడల నన్ని దేశములయందును నొక్క కాలమున నొక్కవిధమగు నాగరికతయే, యనఁగా నొక్కవిధమగు ధర్మావలంబనమే లోచన గోచరము కావలసియుండును. భిన్న దేశముల యందొక్క కాలముననే, భిన్ననీతి ప్రవర్తిల్లుచుండవచ్చు నందురా? అది మా వాదమునే స్థిరపఱచును. పురాణము లొక్క భారత దేశమునుగూర్చియే వక్కాణించెనందురా? అట్టిది. కాన రాదు; మ్లేచ్ఛదేశములనుగూర్చికూడ నీతులు, ధర్మములు బోధింపఁబడినవి. కావున కృతయుగమునుండి క్రమక్రమముగాఁ జల్లఁగా కలియుగము వచ్చుననుట విస్రంభపాత్రము గఁదోఁపదు. పాఠక మహాశయా! కొన్ని యంశములను ముందు చర్చింతుము. సావధానముగా నాలింపుము.

బంగరుముద్ద నెగరవేసికొనుచు నటవీమార్గంబునఁ బోవుచున్నను జోరభీతి కల్గింపనట్టియు, దానపూర్వకముగా, మతవివక్షత లేక బండారమునను్న ద్రవిణమునంతయు వెచ్చించి పండితపరివరులఁ దనియించి యశఃకాయుఁడైన హర్షవర్ధనునిచేఁ బరిపాలింపఁబడినట్టియు, పూజ్య రాజ్యము, అన్నదమ్ముల పాళ్లు తెగక, రాజ్యకాంక్షచే నొకరి కుత్తుక లొకరు తెగనఱికికొని చచ్చిన పాండవరాజ్యమునకన్నను, భగవద్ధ్యానముఁ జేసికొనుచుఁ గాలక్షేపముఁజేయు నిరపరాధుని వంకఁబెట్టి చంపిన రామరాజ్యము కన్నను నుత్కృష్టము

కాదా! చేఁజిక్కిన నిరుపమాన సౌందర్య ఖనియు, బలవద రాతులయిన తురుష్కుల రాణివాస స్త్రీయునగు, మదవతీ శిరోవతంసమును మాతృభావమున నాజన్మవిరోధియగు మొగలాయి చక్రవర్తి సన్నిధికంపిన ఛత్రపతిశివాజి, త్రిభువ నసామ్రాజ్యమదంబున విజ్ఞుఁడయ్యుఁ గపటాకారంబున, విషయవాంఛాపరత్వంబున, మునిపత్నినిమోసగించి సంభోగిం చిన యింద్రునికన్నను, భర్తయగు శంఖచూడుని జంపి తద్వే షంబున మహాపతివ్రతయగు తులసీసతిని వంచించి రతిక్రీడలం దేలిన శంకరునికన్నను, వివాహితయగు స్త్రీని బలాత్కారం బుగ రాజ్యగర్వంబునఁదెచ్చి మన్మథక్రీడలకుం జొచ్చిన త్రిశం కునికన్నను నుత్తముఁడుకాఁడా! శివాజీకాల మేయుగ మగును! ఇంద్రాదుల కాలమే యుగమగును! యోజించిన బోధపడకుండునా! ఉపర్యుక్తపురాణగాథలు పౌరాణికవాద మును నిర్మూలితము చేయుచున్నవి. మహనీయుల నిష్క లంక పవిత్రప్రవర్తనచేఁ దెలుపఁబడిన సామాన్యజనముయొక్క ధర్మాధర్మప్రవర్తనముపై యుగములాధారపడియుండును. అనఁగాఁ గృత త్రేతా ద్వాపర కలియుగంబు లొకదానిని వెన్నంటి యొకటి రావలయునను మర్యాదలేదు. తారుమా రుగా రావచ్చును. హిందూదేశమున నెన్నిసారులో యిట్టి యుగపరివర్తనము తటస్థించినది. ఆత్మలాభము నపేక్షించి వేలకొలంది గోవులను వధించి యజ్ఞమును మిషచే విప్రసంత ర్పణముఁ గావించిన రంతిదేవుని కాలము కృతయుగమా!

కలియా ! విచారించిన బోధపడును. పరివ్రాజావస్థము సన్యస్త రాజ్యుఁడై, త్యక్తకళత్రపుత్రికుఁడై, జీవితకాలము నంతయుఁ గుడిచిన చోటఁ బండక, పండినచోటఁ గుడువక వెచ్చించి కాలగోచరుఁడయిన బోధిసత్త్వునికాల మేయుగమునందుండ వలయును ?

సర్వస్వమును సనాతన ధర్మారాధనకయి సమర్పించి, దానందనివిఁజెందక, నిర్మోహముతో, వీతభయముతో, నాత్మ సమర్పణముఁ గావించిన శ్రద్ధానందసన్యాసి జీవితము, ఈర్ష్యా లోలుండయి పరులను జెడఁదిట్టి,శప్తుఁడయిన వసిష్ఠునిజీవితమున కన్నను నుత్తమముకాదా! ద్విగ్నముకాని చిత్తముతోఁ బాఠకమహాశయా ! పరిశీలింపుము. సంస్కృతగ్రంథములను వెనుక ముందు బిరుదులను తగిలించుకొన్నయట్టి వారెవ్వరో వ్రాసిపెట్టిరని చెప్పి యా గ్రంథములయందు వాకొనఁబడిన దంతయు ధర్మమని భ్రమప్రమాదమునకు లోనుగాకుము.

## కృ త యు గ ము

ఏతన్మీమాంసకు వలయు పరికరములన్నియుఁ బురాణ గాథలనుండి గ్రహింపఁబడినను, శ్రుతిస్మృతేతిహాసముల నుండి యేకొలఁదిగనో యిచట గ్రహింపఁబడుచున్నవి. కావున పాఠకులు సావధానముగ నాకర్ణింపఁ బార్థింపఁబడుచున్నారు. యుగములను గూర్చియు యుగధర్మములను గూర్చియు విపు

లముగా నిచట చర్చించి యేకాల మేయుగ మగునో చూపింతుము.

కృతయుగమునందు సార్వభౌములు లేరు. బహుబాహు బలగర్వ విలీధుఁడయిన వీరుఁడెవ్వఁడో రాజ్యసముపార్జనముఁ జేసి రంతులు వైచుచుండును. జైత్రయాత్రలనుగూర్చి చిత్ర గుప్తునివంటి వాఁడెవ్వఁడో వ్రాయసమర్థుఁడు. జాతి మత వివ క్షతలు లేవు. గాంధర్వవివాహములు మెండు. తప్పిన, రాక్షస వివాహములు తఱచు. వివాహబంధ మామరణ ముండునది కాదు. వధూవరుల యిష్టానిష్టములపై నాధారపడి యుండెను. జాత్యంతర వివాహములు జరుగుచుండెను. వావి వరుసలుకూడ నున్నట్లు కన్పట్టదు. తాత మనుమరాలిని నుద్వాహమగు నాచారము శిష్టాచారముగఁ బరిగణింపఁబడు చుండెను. ఓఘరథుని తండ్రియయిన సుదర్శనుఁడు, ఆత్మజుని కూతురయిన 'ఓఘవతి'నిదగినవరుఁడు దొరకమిచేఁ బెండ్లి యాడెను. 1. ఏకగర్భజాతులు పెండ్లిచేసికొనుట దోషము కాదు. ఇంద్రియసంతృప్తిఁ గావించుకొనుట దక్క వివాహ సంబంధ మెట్టిదో యెఱుఁగని స్త్రీ పురుషు లుండిరి. విటీ విటుల వనవిహారములు, నెత్తమ్ములపై సయ్యాటలు మిక్కు టము. దీర్ఘముగ విచారించిన నాఁటి వివాహములు నేఁటి పాశ్చాత్యదేశమందలి వివాహములట్లు పొడకట్టు చున్నవి.

---

1. భారతము. అకూతీరుచి ప్రజాపతి సంతానమయిన యజ్ఞుఁడు, దక్షిణ యను వారు మిధునమయిరి.

స్త్రీలకు సంసార సంబంధములుకూడ నామమాత్రముగ నున్నవి. "ఇల్లాలు, మగనాలు" అను మాటలయర్థము నాఁటి సతీమణులకు బోధపడుట దుస్తరము. శుల్కములు లేవు. గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు మొదలగువా రందఱు దేవయోనులఁట. అనఁగా ఆంగ్లకవి శేఖరుఁడగు "బెర్నార్డ్షా" కవి కల్పితుఁడయిన అతీతమానవుఁడు -Super Man. తత్కారణంబున వారి చరిత్రలను జర్చించి భారత ధర్మనిర్ణయముఁ జేయుట సమంజసము కాదేమో! కాని నాఁటి హిందార్యులకు వారివర్తనమే వారి శీలవృత్తమువలె యాదర్శప్రాయముగా నుండెను. అందుచేతనే నేఁడు మనము కేవలము జారత్వముగా నెంచుచున్న గాంధర్వవివాహము గంధర్వులచే నవలంబింపఁబడియుండుటచేతనే పవిత్రతఁగాంచినది. ‡ కులముంబట్టి విద్యానిషేధము లేదు. మానవుని ప్రకృతినిఁ బట్టి తన్నిషేధము కల్గుచుండెడిది. జనులు సత్యశీలురు. అబద్ధమాడుట యెఱుంగరేమో! ధర్మసంస్థాపనార్థమై గురువులతోఁడి పోరాటము బాహాటము. విధవలనుటయే యెఱుంగము. ఱతి బాల్య వివాహములకు నుపపత్తియే లేదు. * కుటుంబ జంబాలమున్నట్టు లూహింపఁజాలము, స్వైరవిహారము మెండు. జారత్వముచే సంతానము కల్గినను తాళిగట్టిన మగఁ డేవపడుట కానము. దేవగురువైన బృహస్పతిభార్య, తార, పరపురుషుఁడును, భర్త ఛాత్రుఁడునైన చంద్రునితోఁగవగూడి గర్భిణియై

‡ సత్యకామ జాబాలి చరిత్రము. * సంధ్యాదేవి జననము.

పంచాయతిలోఁ జంద్రునివలన గర్భిణినైతినని యొప్పుకొని బిడ్డనుగని యాబిడ్డను జంద్రుని కేయొసంగి, మరలఁ దాళిగట్టిన మగఁడగు బృహస్పతిఁజేరి కాపురముఁ జేసెను. ఇందుచే సంఘ బహిష్కృతకాలేదు. భర్తయు దేవతా గురుపదంబునుండి చ్యుతుఁడుకాలేదు. ఇఁక బృహస్పతియో మతిలేక మమతచే నన్నభార్యయుఁ బూర్ణగర్భిణియునగు 'మమత' సమ్మతిలేక పైఁబడి గర్భస్థశిశువు వలదనుచున్నను బలిమిమై రమించెను. ఇందుచే మమత దోషదూషితకాలేదు. బృహస్పతి దివస్పతి మన్ననకుఁ బాత్రుఁడు కాకపోలేదు. ‡ సర్వసాధారణముగ బ్రాహ్మణులకు క్షత్రియులు లోఁబడియున్నను నప్పుడప్పుడు బ్రాహ్మణులపైఁ దిరుగుబాటుకూడఁ గలదు. ఈ కాలమున మఱవఁదగని విషయ మొకటున్నది. * స్త్రీలవిషయమై యెట్టి కపటవర్తనముఁజూపి, యెట్టి యత్యాచారముఁ జేసినను దోష ముగాఁ దలంపఁబడలేదు.

## త్రే తా యు గ ము

ప్రజలకు స్థిరవాసము లేర్పడెను. స్వైరవిహారము తగ్గెను. తపోనియతిచే దేహాయష్టిని గృశింపఁజేయుట వృద్ధి

‡ క్షత్రియులు భార్గవకుల నిర్మూలనము గావించుట. ఔర్వుని జన్మ చరిత్రము జూడఁదగును. (భారతము)

* బృందను విష్ణువు మోసగించుట. తులసిని శివుఁడు మోసగించుట. అహల్యను నింద్రుడు మోసగించుట. క్రతుస్థలను యక్షుఁడు మోసగించుట యెఱుఁగఁదగును.

యయ్యెను. ఐహికఫలాపేక్షచేఁ దపస్సు చేయుటకుఁ దోడుగా నాముష్మిక చింతచే నా మరణానంతము తపస్సునందు లీనమై యుండుట తటస్థించుచుండెను. ఆశ్రమపద్ధతి విరివిగా నవలంబింపఁబడుచుండెను. సంసారసంబంధంబులు వృద్ధికాఁజొచ్చెను. స్త్రీలు సర్వ స్వతంత్రురాండ్రుకారను నూహ యుత్పన్నము కామొదలిడెను. జననీజనకులు వధువుచు నామెయభిప్రాయ మడుగకుండ వరునకిచ్చుట పొసఁగుచుండెను. ‡ అధిష్ఠాన పురాధినేత యగు యయాతి తన కుమారితను, దారుణ్య లావణ్యముకలదానిని మాధవి యను కన్యను గాలవుఁడను బ్రాహ్మణుఁ డొక్కఁడు గుఱ్ఱములకై యాచింప, నా బ్రాహ్మణుఁడు కోరిన గుఱ్ఱములు తనవద్ద లేమిం జేసి, యితరులకడఁ గుదువఁబెట్టి గుఱ్ఱములను దెచ్చికొనుటకై సమర్పించెను. గాలవుఁ డామెను గైకొని, క్రమక్రమముగ మూవుర రాజులకు నిచ్చి, యొక్కొక్కపుత్రుఁడు కలుగునవఱకు నుంచి, వలయు హయరత్నములంగొని, కడకు సుదతీరత్నముఁగూడఁ గైకొని తన గురువగు విశ్వామిత్రునకు నశ్వములతోఁబాటు మాధవిని గూడ గురుదక్షిణగా నొసంగెను. దీన మాధవి కన్యాత్వము దూషితము కాలేదు. కైవల్యము నపేక్షించి యడవులంబట్టి యున్న ఋషులు లౌకికవ్యాపారరతులై రాజసమ్ముఖమునకు ముఖములం ద్రిప్ప నారంభించిరి. గాంధర్వ రాక్షస

‡ మాధవియందె ఇక్ష్వాకునకు, వసుమనస్సు జనించెను. దివోదాసునకు ప్రవర్దనుఁడు ప్రభవించెను. ఔశీనరునకు శిబిపుట్టెను. (భారతము.)

వివాహములకు స్వయంవరము తోడ్పడినది. గోమాంస భక్షణముకాని, మాంసభక్షణముకాని సామాన్యముగనే యున్నది. అనూచానుఁడైనను, గోమాంసభక్షకుఁడుగ నుండుట విపరీతము కాదయ్యె. ♦ త్రిధన్వుని కాలములోఁ బెద్దకఱవు వచ్చినది. విశ్వామిత్ర ఋషీంద్రుఁడు కుటుంబమును బోషించుకొనఁజాలక కుమారుని నొక్కని నూరుగోవులకు విక్రయించి యుదరపోషణముఁ గావించుకొన నడుకట్టి వీథులవెంటఁ దిరుగుచుండఁగా త్రిధన్వుని జ్యేష్ఠపుత్రుఁడయిన త్రిశంకునృపతి విశ్వామిత్రుని కుటుంబమును బోషింపఁబూనికొని తినుబండారము సమకూర్పఁజాలక, వసిష్ఠుని గోవును నాహారార్థము దొంగిలించికొనివచ్చి, యాఁకటబాధకోర్వక తానే యాగోవునుజంపి, నంజుడు భుజించెను.

ఇల్లాండ్రు వెలయుచుండిరి. ఒకరిభార్య నొకరుదెచ్చి యుంచుకొనుట ధర్మపీడగా నెంచఁబడుచుండెను. త్రయ్యారణ్యుని పుత్రుడయిన త్రిశంకుఁడు వివాహిత నొక్క స్త్రీకను బలాత్కారముగాఁ గొనివచ్చినందులకుఁ దండ్రి కుపితుఁడై వానిని రాజ్యభ్రష్టునిగాఁజేసి చండాలరూపంబున వర్తింపుమని శపించెను. కులద్వేషము మోసులెత్తెను. ‡ శూర్పణఖా పుత్రుఁడైన జంబుకుమారుని మాయోపాయముపన్ని బ్రాహ్మణులు లక్ష్మణునిచేఁ జంపించిరి. * ఈ విధముగనే తపోనియతినున్న శంబూకుని రామునిచే దయమాలి జంపించిరి.

---

♦ బ్రహ్మపురాణము. ‡ రామాయణము. * ఉత్తర రామాయణము.

# ద్వాపరము

ద్వాపరమున నూతనధర్మపీడలు వెలువడినవి. రాజ్యతృష్ణ విపరీతముగఁ బెంపొందినది. శంతనుఁడు జ్యేష్ఠభ్రాతయయిన దేవాపిని రాజ్యభ్రష్టునిగావించి, యడవులకంపి తాను రాజయ్యెను. వీని సంతతియైన కురుపాండవులు కూర్చుండనోల్లక పాళ్ళుకుదురక తాము కొట్టుకొని చచ్చుటయేగాక భారతఖండమునంతయు రక్తప్లావితమును జేసి, భారతదేశమున దరిద్రదేవతను దాండవింపఁజేసిరి. ధరణీరాజ్యమితరులకుఁ జేరునేమో యను చింతాశల్యముచే గళత్రములను బరులవద్దకంపి సంతానమును బడయుటకు ఘనుదీయరైరి. ♦ 'బహుపతిత్వము చరమదశయందుండెను. గోమాంసభక్షణము మానఁబడెను.' గోమేధము, నరమేధములులుప్తములయ్యెను. అశ్వమేధము మాత్రము నసలు సాఁగుచుండెను. అశ్వమాంసభక్షణము నేఁడు జర్మనులయందున్నది. సురాపానము వెనుకకు మరలినట్లు కన్పడదు. బలరాముఁడు సురాపానప్రియుఁడు. వీనికి సభాపూజ్యత కల్గుచునే యుండెను. యాదవప్రళయమునకు సురాపానమే మూలకారణము. విప్రముఖంబుననే విద్య పరివర్తిల్లవలయునను

---

♦ పాండవజననము, ధృతరాష్ట్ర పాండురాజుల జన్మము; ఆత్మకుని జన్మము, అంగరాజు జననము – భారతము.

వాదము బయల్వెడలెను. * శూద్రుఁడైన యుగ్రశ్రవసుఁడు తనకుఁ బ్రత్యుత్థానముఁ జేయలేదని బలరాముఁడు త్రాగిన మైకములో నాగలితోఁ బ్రాణములు గొనియెను. ప్రజలల్పాయుష్కులు గారు; దుర్బలులుగా గూడ లేరు. రామాయణ యుద్ధకాలముననున్న ద్వివిదుని బలరాముఁడు సంహరింపఁ గల్గెను. జాంబవంతుని గృష్ణుఁ డోడించి పుచ్చెను. పరశురాముని గురుకుల పితామహుఁ డయిన భీష్ముఁ డోడించెను. గాంధర్వము, రాక్షసము, స్వయంవరమునకుఁ దోడు వధూవరుల జననీజనకులే పెండ్లిరాయబారములు సాగింపఁజొచ్చిరి. ♦ అచ్చటచ్చట వధూవరు లేర్పఱచుకొన్న నిబంధనలపై వివాహములు సాఁగుచుండెను. ‡

## కలియుగము

విద్య, ద్విజుల ముల్లె యనుమాట ప్రచారములోనికి వచ్చెను. తాము చదువవచ్చు ననుటకన్న నితరులు చదువఁ గూడ దను వితండవాదము హెచ్చినది. స్త్రీలస్వాతంత్ర్యము నిర్మూలింపఁ బడినది. బుద్ధదేవుని మహిమాతిశయముచే యజ్ఞయాగాదులు నశించినవి. బలులు మటుమాయమైనవి.

---

* భాగవతము.

♦ శశిరేఖావివాహము. ఉత్తరావివాహము.

‡ జరత్కారుని వివాహము. ఉలూచీ చిత్రాంగదా వివాహము.

—భారతము.

నరమేధములకుఁ బ్రత్యామ్నాయముగఁ గాళీపూజ బయలు దేరినది. గోమేధము, అశ్వమేధము పూర్వకథలైపోయినవి. అష్టవిధవివాహములు కాలక్రమమున నశించి శుల్క-సంభావితమైన నామమాత్ర వివాహములు రేకెత్తినవి. పెండ్లివిషయమునందు వధూవరులకు లవలేశమయిన స్వాతంత్ర్యము లేకపోయినది. వధూవరుల మాతాపితలకు సర్వస్వామ్యము చేఁజిక్కినది. "బ్రాహ్మణోమమదేవతా" యను సూక్తి సర్వవిధముల సార్థకమయినది. యంత్రగాని చేతంబడిన తోలుబొమ్మవలె బ్రాహ్మణాధీనమునంబడి రాజులు రాజ్యతంత్రము నిర్వర్తించిరి. ఆశ్రమపద్ధతి నశించినది. కాని వర్ణధర్మములు విచ్చలవిడి పెచ్చురేఁగినవి. బహుపతిత్వము మిక్కిలి గర్హ్యమైనస్థితికి వచ్చినది. బహుపత్నీత్వముకూడఁ గొంచె మించుమించుగా నాదశనే యనుభవించినది. కపోతమిథునధర్మమే యుచితమని ప్రజల మనంబున కెక్కినది. సురాపానము నీచముగనే చూడఁబడినది. భిన్నమతము లుత్పన్నమయి కొంతకాల మొకరికొకరు లోకరు త్తరించుకొనుట నిత్యకర్మమయినది. పూర్వమువలె భారతఖండమున కేతెంచిన విదేశీయులు కొందఱు సనాతన ధర్మావలంబకులై యిందె వసించిరి. మతముల పేరిటఁ గ్రూరకర్మంబులు విశంకటప్రచారముఁ గాంచినవి. కుమారిలభట్టు నిరంతర బౌద్ధహననమును సనాతన ధర్మముగా భావించెను. శంకరుఁడు కపటోపాయములచే బహుళసంఖ్యాకులయిన జైనులను బీఁచమడంచెను. రామాను

జుఁడు వైష్ణవేతరులను బెక్కుర నుక్కడంచెను.

వావివరుసలు మిగుల కట్టుదిట్టములకు లోఁబడెను. ఈ విషయమున శిష్టాచారము నతిక్రమించినవారలు కడుంగడు హేయముగా జూడఁబడుచుండిరి. ప్రజాసామాన్యము తమ ధర్మమునుగాని స్వత్వమునుగాని యెఱుంగఁజాలక శోచనీయ దశంబడి పొరలాడఁదొడంగెను. "విప్రన్న చెప్పినదే వేద" మయి బ్రాహ్మణవాక్యములే మణిమంత్రౌషధము లయినవి. ఈ దుస్థితి నూతకోలఁ జేసికొని విప్రులు ప్రజలయొక్క సూక్ష్మదేహమునే నశింపఁజేసిరి. దీనికై యవలంబింపఁబడిన మార్గములు పండితజనగర్హ్యములు. పౌరాణికులు ధర్మమును సామాన్యధర్మములనియు, విశేషధర్మము లనియు విభజించి లోకప్రతారకులైరి. విశేషధర్మములు బ్రాహ్మణేతరలోకమునుఁ బీల్చి, పిప్పిఁజేయుటకు నొడ్డిన యురులు. కాలక్రమమున నీ యురులే యొడ్డినవారి కుత్తుకలను నులిమివేయు కొఱముట్లయినవి. ఈ యవియే యార్యజాతి పతనహేతువైనవి. ఆర్యధర్మము తురకమసీదయినది. కరిమ్రింగిన వెలఁగపండయినది. మధురోగి శుష్కకళేబర మయినది. మతాంతరులచే గ్రసితమయినది. హిందువు నిలువుగ్రుడ్డున బాహ్యప్రపంచమును వీక్షింపఁదొడఁగెను; నిర్జీవప్రతిమ యయ్యెను; శుష్కవేదాంతము శరణముఁ బొందెను.

# వర్తమానము

విద్య సామాన్యమయినది. కులానుకూల ధర్మనిర్ణయముపై బ్రాహ్మణేతరలోకము దాడివెడలినది. ధర్మసంగ్రామమగుటచే విజయలక్ష్మి కరుణాపాంగ వీక్షణములు బ్రాహ్మణేతరలోకము పయిఁ బ్రసరించుచున్నవి. నిద్రావస్థ దొరలాడుచున్న బ్రాహ్మణేతరుఁడుత్థితుఁడై నడుము కట్టికొని రణరంగమున కుఱుకుచున్నాఁడు. అఱవదేశంబున "ద్రావిడ సంఘములు", తెలుఁగుదేశంబున "బ్రాహ్మణేతర సంఘంబులు", మహారాష్ట్రదేశంబున "సత్యశోధకపంథ", వంగదేశంబున కాయస్థుల తిరుగుబాటు, పాంచాలాదిరాష్ట్రంబుల 'ఆర్యసమాజము' 'హిందూమహాసభ' ఏకముఖంబునఁ బౌరాణికులు ప్రతిష్ఠించిన విశేషధర్మ నిర్మూలమునకై యత్నించుచున్నవి. ఇవి యన్నియుఁ బెక్కుశతాబ్దులనుండి శుష్కించి, శుష్కించి జీవచ్ఛవమై యున్న హిందూసంఘ శరీరమునకు జీవకళలు. ఇఁక హిందూసంఘము సర్వాంగ సుందరముగా జీవింపగలదు. మతాంతరులను, జాత్యంతరులను హిందూసంఘమున లయింపఁజేయుటచేతను, జండాలాది నిమ్నజాతులకు సత్వము లొసంగుటచేతను, మరల భారత ఖండంబున సర్వసౌభ్రాతృత్వము నెలకొల్పి దుండగిండ్రవాతంబడి మరణించిన శ్రద్ధానందస్వామి మృతజీవుఁ డయ్యెను.

వావివరుసలు సన్నగిల్లుచున్నవి. అజ్ఞానముతోఁ బాటు మూఢవిశ్వాసము మూలముడుంగుచున్నది. బ్రాహ్మణ కులమునకుఁగూడ వన్నె దేఁగలిగిన పండితులు, విద్వద్వంద్యులు బ్రాహ్మణేతర కులములయందుఁ బొడముటచే బ్రాహ్మణగౌరవము నిదాఘనదీ జలంబులంబలె నదృశ్యమగుటఁచే దదితర కులములకు సాంఘిక దాస్యవిముక్తి కలుగుచున్నది. బ్రాహ్మణపౌరోహిత్యము లేని వివాహములు వందలకొలంది జరుగుచున్నవి. స్త్రీ స్వాతంత్ర్య వాదులు బయలుదేరుచున్నారు. స్వాతంత్ర్య మలవడుచున్నది. వైవాహిక విషయములయం దిది తేటతెల్లమగుచున్నది. స్వైరవిహారముకూడ మెండగుచున్నది. పట్టణంబుల నాశ్రయించికొనియున్న యీ యవస్థ పల్లెలకుం బ్రాకుచున్నది. అసూర్యంపశ్యలగు సతీమణుల బిడ్డలు పట్టణములంజేరి నిర్వ్యాపారలై వీధులవెంటఁ దిరుగుట గానసగును. విశేష ధర్మాభిమానము ప్రజలలో నశించుటచేతను, ప్రభుసాహాయ్యములేని బ్రాహ్మణులు తద్ధర్మముల నాచరణకుఁ దేఁగాలకపోవుటచేతను, హెచ్చులొచ్చులు లేని న్యాయమ్యాసు సమవర్తి యయినది. మద్యపానము, కృతత్రేతాద్వాపర యుగంబులఁబోలె నన్నికులములలోనికిం బ్రవేశించుచున్నది. అప్పుడే కొన్ని కులములకు శిష్టాచారమయినది త్యజింపఁబడిన గోమాంసభక్షణము, పాశ్చాత్యసంసర్గచేఁ దాఁబేటి నడకతో విద్యావంతుల చేరువకుఁ జేరుచున్నది. ఐశ్వర్య

మదోన్మత్తులు, ధనలుబ్ధులు నగు కొందఱు వావివరుసలు లేక విహరించుచున్నారు. మతాంతర, జాత్యంతర వివాహములు కూడ సమారంభములగు చున్నవి. స్త్రీ పునర్వివాహములు దట్టమగుచున్నవి, మతవిషయమున నెల్లరకు సరిసమానము లగు హక్కులు కలుగుచున్నవి.

## కలియుగ మేది?

పౌరాణికులు వర్తమానకాలమును గలియుగ ప్రథమ పాదమనుచున్నారు. కాని నిజముగ నిది కలియుగ ప్రథమ పాదమేనా ? లేక సంధికాలమా ? ప్రస్తుతము విద్యమాన మగుచున్న లక్షణములఁగూర్చి యిట విపులముగాఁ జర్చించి పాఠకుల నిర్ణయమునకు వదలుచుంటిమి.

దుర్జ్ఞేయమైన భాషయందున్న కథలెల్లను నజ్ఞులకు శిరోధార్యములగు నన్న సంగతి లోకవిదితము. ఇది యెఱింగియే విప్రులు సంస్కృతము పవిత్రమగు భాషయనియు, అందలి వాక్యములు భగవదుక్తములనియు, వాని నితరభాషలోనికిఁ బరివర్తనముఁ జేసినయెడల, వానినంటియున్న పవిత్రత కలుషిత మగు నను నభిప్రాయము లోకమున వ్యాపింపఁజేసిరి. సంస్కృత భాషయందలి మంత్రములను దెనుఁగుభాషలోనికిఁ దెచ్చినయెడల సామాన్య జనంబునకు నవగాహమై యందలి నీతులు ధర్మములు సులభగ్రాహ్యములగును. మాననీయము లైనచో మన్నింపఁబడును. కానిచోఁ దిరస్కరింపఁబడును.

| కృతయుగము | త్రేతాయుగము | ద్వాపరయుగము | కలియుగము |
|---|---|---|---|
| 1. వివాహములు కాన | 1. వివాహము లాచరణ | వావివరుసలతోఁ బెం | పెండ్లిండ్లు మిగుల కట్టు |
| రావు. | లోనికి వచ్చుచున్నవి. | డ్లిండ్లు నిరాఘాటముగా | దిట్టములకుఁ జిక్కెను. |
| వావివరుసలక్కఱలేదు. | వావివరుసలు నియమ | జరుగుట ప్రారంభమై | వావివరుసలు లేని పెం |
| స్త్రీపురుషప్రభేదమొక్క | బద్ధము లగుచున్నవి. | నది. కుంతి కన్యాత్వము | డ్లిండ్లు నల్వురి నోటఁ |
| టియే పాటింపఁ బడినది. | (ఎ) దేవయాని తన జన | నఁ గర్ణునినిఁ గాంచినను, | బడుచుండెను. |
| (ఎ) బృహస్పతి సొంత | కుని శిష్యుడైన కచుని | ఇది తప్పను నభిప్రాయ | భర్తతోఁడిదే లోకమని |
| యన్నయగు రుచికుని | పెండ్లాడుమనిబలవంత | ము మోసులెత్తుటచేత | చెప్పి, మృతుఁడైన పతి |
| భార్యయైనమమతతో | పెట్టఁగా గురు పుత్రి | నే దూర్వాసుని వర | తోఁజితినెక్కి, సహగమ |
| రతిక్రీడలం దేలెను. | యని తిరస్కరించె. | మడ్డముగాఁ బెట్టవలసి | నముం జేసి, పేరంటాం |
| (బి) చంద్రుడు చదువు | (బి)త్రిశంకువువివాహిత | వచ్చినది. ద్రౌపది దేవి | డ్రును, సతులును నగుట |
| నేర్చికొనుటకై యొజ్జ | యైన యొక స్త్రీని బలా | బహుపతిత్వము శిష్టా | మిగుల గననయ్యె. |
| కడ కేగి గురుతల్పగుఁ | త్కారముగాఁ గొనివచ్చు | చార సమ్మతమని చెప్పు | మేధములన్నియునశించి |
| డయ్యెను. | టచేఁ దండ్రియైన త్ర | టకు వ్యాసభట్టారకుఁడు | నవి; సురాపానము కడు |
| (సి) సుదర్శనుఁడుసొంత | య్యారణ్యుఁడు కొడు | కావలసివచ్చెను. | నీచముగఁ జూడఁబడు |
| మనుమరాలి యందు | కును జండాలుఁడవు గ | గోమేధము నరమేధము | చుండెను. బ్రాగుఁబోతు |

| కృత యుగము | త్రేతా యుగము | ద్వాపర యుగము | కలి యుగము |
| --- | --- | --- | --- |
| సంతానముం బడసెను. (డి) ఆకూతీరుచి ప్రజాపతి సంతానమయిన యజ్ఞుఁడు దక్షిణ యను వారలు భార్యాభర్తలైరి.<br>II. ద్వాదశపుత్రులు.<br>(1)ఔరసుడు (2)క్షేత్రజుఁడు (3)దత్తుఁడు (4)కృత్రిముఁడు(5)గూఢోత్పన్నుఁడు(6)అపవిద్ధుఁడు (7) కానీనుఁడు (8) సహోఢజుఁడు (9) క్రీతుఁడు(10)పౌనర్భవుఁడు (11) స్వయందత్తుఁడు | మ్మని శపించెను.<br>(సి) సీతాదేవిని రావణుఁడు ప్రతారించిగొనిపోవుటచే లోకము దూషించినది.<br>(డి) నియోగమున్నది. మదయంతీ వసిష్ఠుల సమాగమము; కాని, యరుదు కాఁజొచ్చినది. సురాపానమున్నది. కాని శుక్రుఁడుపాపహేతువని శపించెను.<br>సత్యనిష్ఠ నశింపఁ జొచ్చినది. *తత్కారణముచేతనే కల్లల పుట్టయయిన | లున్న జాడ పొడకట్టదు. బలరాముఁడు శౌండుఁడు. అంతమాత్రముచేతనే యితని పూజ్యత తగ్గలేదు. సత్యశీలతకన్నఁ గార్యచతురతకు గౌరవమధికముగా నున్నది. క్షేత్రజుఁడు, కానీనుఁడు, ఇంకను ధర్మసంతానముగనే పరిగణింపఁ బడిరి. ఐనను పౌండ్రమహారాజు ధర్మవిరుద్ధము కాదని దీర్ఘోపన్యాసము చేయవలసివచ్చినది. ఇట్టి సంతానమునకు నచ్చ | కడ నన్నిదుర్గుణము లుండునని ప్రజలుతలంపసాగిరి. సత్యనిష్ఠకలవానినిన లౌకికుడని వెక్కిరించుట కలదు. ఔరసుఁడుదత్తుఁడు దక్కఁ దక్కినవారధమసంతానముగాఁ బరిగణింపఁ బడుటయే కాక హేయముగాఁ జూడఁబడుచుండిరి. బహుపతిత్వము లేదనియే చెప్పవచ్చును. బహుపత్నీత్వము మిగుల సకృత్తుగానున్నది. మాంసభక్షులున్ననుమాంసభక్షణము |

* భాగవతము

| కృత యుగము | త్రేతా యుగము | ద్వాపర యుగము | కలి యుగము |
| --- | --- | --- | --- |
| (12) పారశవుఁడు (13) శౌద్రుఁడు.<br>(ఎ) క్షేత్రజుఁ డనఁగా భర్త యిష్టముమీఁద అంకితనముఁ జేయఁగాఁ బుట్టిన బిడ్డఁడు.<br>(బి) గూఢోత్పన్నుఁడు; మగనికి దెలియకుండ అంకుమగనికిబుట్టినబిడ్డఁడు.<br>(సి) కానీనుఁడు; పెండ్లి కాకమునుపు అంకుమగనికిఁ బుట్టినవాఁడు.<br>(డి) సహోఢజుఁడు; గర్భిణితోఁ నుండఁగఁ బెండ్లియాడిన యా మెకుఁ | హరిశ్చంద్రునకు సత్యపరిపాలనవ్రత మంటఁగట్టి ప్రపంచమునకు నీతి బోధింప యత్నములు జరిగెను.<br>క్షేత్రజుఁడు, కానీనుఁడు గాఁగలపుత్రులు ధర్మసంతానముగనె తలంపఁబడిరి. | టచ్చట యెత్తిపొడుపుల ముడుపుకల్గుచునే యుండెను. కులమును బట్టి గౌరవాగౌరవములు వచ్చుటకార్శ్యము నొందఁజొచ్చెను. సంజయుఁడు, విదురుఁడు, ఉగ్రశ్రవసుల చరిత్రము సాక్షి.<br>నరమేధములు నరబలులుగా మారినవి. నరకాసురుఁడు 16000 రాచకన్నియలఁ జెఱనుంచుట. జడభరతుఁడు కాళికకు బలిగా తీసికొని పోఁబడెను. | పాపభూయిష్ఠమను నమ్మికయున్నది. పితృయజ్ఞముఖములయందు మాత్రమే మాంసభక్షణము శాస్త్రాంగీకృతమయినది. కులముంబట్టి బహుళముగా గౌరవాగౌరవములు చూపఁబడుచుండెను.<br>దేశమునందు శక్తిపూజా మిషచే నరబలులు జరుగుచున్నవి. |

బుట్టిన బిడ్డఁడు.
(ఇ) పౌనర్భవుఁడు; మా
ఱుమనువుఁ జేసికొన్న
యామెకు సంతకుముం
దుఁగల్గినబిడ్డఁడు. ఇంతకు
మిగిలిన జారత్వ మెుం
డుండుట సాధ్యపడునా?
III. గోమేధము నరమేధ
ముబహుళముగా నున్న
వి. IV. సురాపానము దో
షముగా నెంచఁబడ లేదు.
V. మనుజులుసత్యశీలురు

*

ఔరా! దీనింబట్టి విచారించినఁ గృతయుగమునందు ధర్మము నాల్గుపాదముల నడచునను మాటకు నర్థమేమో బోధపడదా! ఎట్టి నికృష్టకార్యములు చేసినను సల్పువారును బ్రోవయి ధర్మమని సిద్ధాంతీకరించిరన్నమాట.

కార్యకలాపమంతయు నీవిధముగ సంస్కరింపఁబడుట యుక్తి మోత్తమము. పూర్వమెుకప్పుడు అంగిలేయుల వివాహాది శుభకార్యముల సందర్భమునందు, అంత్యకర్మముల విష యమునను జెప్పఁబడు మంత్రములన్నియు 'లేటిన్' భాష యందుండెను. ప్రాకృత జనంబునకుఁ దన్మంత్రార్థము దురవ గాహముగా నుండుటచే ఇంగ్లీషుభాషకుఁ బరివర్తనముఁ జేయఁబడెను. తన్మూలముగఁ బ్రజలు తాము చెప్పునది యేమో, మంత్రార్థమేమో గ్రహింపఁగల్గిన వారైరి. భావ మెఱుంగక మంత్రోచ్చారణముఁ గావించు పక్షికన్న నిది యుత్తమము కాదా?

ప్రజలెంతదనుక భావము గుర్తెఱుగక, యర్థము గ్రహింపక, శబ్దజాలమునకు గౌరవము చూపింతురో, యంత దనుక పురోవృద్ధి పురాయింపదు. ఇన్నివేల సంవత్సరములు కడచన్నను ద్విజేతరులకు సామాన్యధర్మములతోఁ గాల క్షేపముఁ జేయు యోగ్యత కలుగనేరదయ్యెను. స్మృతు లుదారభావమును జూపింపఁజాలవయ్యెను. హిందూ ప్రభు వులు ధైర్యసాహసములు గొంటువడుటచే దాస్యనిగళ సంపా నితులై ప్రజాసామాన్యమునకు విముక్తిమార్గముఁ జూపింప లేకపోయిరి. ఇంతియేకాక యవరోధములు కల్పించిరి. తుదకు విదేశీయ ప్రభువుల కాలములో విముక్తిమార్గము లభించు చున్నది. ఈ పరిణామ మెంతచిత్రము! స్వదేశీప్రభువుల

కాలములో సమకూడని మహోపకారము విదేశీప్రభువుల కాలములోఁ దటస్థించినది.

## సూతపురాణరచనావశ్యకత యేమి ?

ప్రాకృత జనంబునకు వేదార్థము సులభైకవేద్యము కాదని యెఱింగి వైదికులును, నిష్కాములును, లోకసంసర్గ రహితులును, నిసర్గభూత దయాశీలురును నయిన ఋషి చంద్రులు నిర్వ్యాజ కరుణావిశేషంబున "స్త్రీశూద్ర ద్విజ బంధువు"లను ముక్తిమార్గముఁ జూపి తరింపఁ జేయుటకునై వేదార్థము నుటంకించి పురాణములు వ్రాసిరని యార్యోక్తి. ఈ యార్యోక్తియందు విశ్వాసముంచి మూఢలోకంబు పురాణము లార్షేయములనియుఁ దత్కారణమునఁ బూజ్యము లనియు దదంతర్గత ధర్మములు, నీతులు, కథలు శిరోధార్యము లనియు విశ్వసించు చున్నది. ఈ విశ్వాసమువలనఁ గలిగిన ప్రతిఫల మాత్మద్రోహముగాఁ బరిణమించుటఁజేసి, పురాణము లెంతవఱకుఁ బ్రతికూలములో, ఎంతవఱకు నీతిబాహ్యములో, యెంతవఱకుఁ బక్షపాతభూయిష్ఠములో మోడ్పుగన్నుతోనున్న విద్వల్లోకమునకుఁ జూపించు తలంపుతో సూతపురాణము రచింపఁబడినది. తత్కారణమున సూతపురాణము కారణజన్మ. భగవదవతారమని యెంచఁబడువారిం గూర్చియైనను, హేయభాజనమగు వర్ణనలుచేయుటకుఁ బురాణములయందుఁ గవిలేఖిని జంకలేదు. ఇందులకు నిదర్శనము

గా నొండుకథ నిట క్లుప్తీకరించి వ్రాసెదము—"తొల్లి తారకుండను దనుజుండు నిజభుజోర్జిత దుర్దమ విక్రమచాతురీవిభవంబున సర్వలోకములు నిర్జించి యింద్రాదులను నిండుదాసులఁగాఁ జేసికొని లోకము లేలుచుండెనఁట. ఈ దాడికి నోర్వలేక యింద్రాదులు కుట్రలుపన్ని విష్ణువుతో యోజింపఁగాఁ బురాణదంపతులగు నుమామహేశ్వరులకు జన్మించిన పుత్రుఁడొక్కఁడే తారకాసురుని జయింపనేర్చునని నొక్కిచెప్పెను. అందుపై దేవతలు గుసగుసలువోయి యెట్టులో మన్మథునిఁ బ్రేరేచి పురాణదంపతులకుఁ గామోద్రేకముఁ గల్పించి, క్రీడోన్ముఖులం జేసిరి. ఈ క్రీడకుఁ దుద మొదలు లేక పోయెను. విరోధునియింట నూడిగముఁ జేయుచున్న యింద్రుడు లాలస్యమునకుఁ దాళలేక యగ్నిదేవునిఁ బురాణదంపతు లేమిచేయుచున్నారో చూచిరమ్మని పంపిరి. అగ్నిభట్టారకుండును దొంగనడలచేఁ బోయి తొంగిచూడ నగ్నయై యున్న పార్వతీసతి ద్విగ్నయై మఱుగునకు నఱుగ వాచామగోచరుఁడైన మహేశ్వరునకు రేతఃపతనమయ్యెనఁట. ఎచ్చట? ఎదురుగ నిలిచియున్న యగ్నిభట్టారకుని నోటిలో. అప్పుడగ్నిదేవుఁడావఁ ద్రావినట్లయి, యేమిచేయుటకుఁ దోఁచక పరువుపరువుగ గంగానదికేఁబోయి ముఖప్రక్షాళనము గావించుకొన నారేతస్సు శరవణమునందుఁ బడెను. పడిన వెంటనే యందుండి యారుమొగములతోడను, బండ్రెండు చేతులతోడను గుమారస్వామి యవతరించి దేవసేనానియై తారకుని

వధించెనఁట.'' ఇయ్యది "స్త్రీశూద్ర ద్విజబంధువు" లకుఁ జెప్పఁబడిన కథ. స్త్రీల యుపయోగార్థమై వ్రాయఁదగిన కథ యేనా? ఇట్టికథను, ఈ జుగుప్సాకరమగు వర్ణనాంశమును విన్నవారికి మనశ్చాంచల్యము సంభవింపదా? కొందఱు మహానీయులు బయలుదేరి యిట్టికథలకు నంతరార్థము బోధింప సమకట్టుదురు. నిజముగ వంద్యమైనయర్థము, నీతిదాయకమయినవిషయమొక్కటియున్న, నిట్టిభాషలో నిట్టివర్ణనలతో నీకథ నేల చెప్పవలయును? మఱచితిమి. ఆర్షేయమగు గ్రంథమును నిట్లు చర్చింపఁదగదు. వాల్మీకి యంతవాఁడో, వ్యాసుని యంత వాఁడో వ్రాసిన గ్రంథములయందుఁ త్యాజ్యములగు సంశయములుండునా? తెలుఁగు దేశములోఁ బ్రచారమునందున్న చిత్రకథలు, యుక్తులు తెనాలిరామలింగనికి నంటఁ గట్టినట్లు, పూర్వమున్న గ్రంథములన్నియు వ్యాసుని మెడకుఁ దగిలించుట యాచారమైనది. పాఠకమహాశయా! వివేచనముతో గ్రంథ పరిశీలనము గావించుకొనుము.

ఇఁకఁ బరమకరుణాస్వభావుండయిన సూతర్షి చిరకాల జీవియగుటచే ద్వాపరయుగమునుండి పరమ తపోనిష్ఠాగరిష్ఠుండయి గంగాతీరముననుండి నేఁడీభారతలోకంబున జరుగుచున్న వంచనను, మోసమును సంపూర్ణముగా గ్రహించి, జాలిపడి లోకమును మనుమార్గమునందు నడిపించుటకై తలపోసి, శిష్య పరమాణులమైన మాయందలి దయాతిరేకముచే సత్యమును

బోధించి మమ్మీ యత్నమునకుఁ బురికొల్పెను. మేమును గుర్వాజ్ఞాబద్ధులమై గ్రంథరచనకు దొరకొంటిమి.

విప్రుఁడా! లోకపరివర్తనము గమనింపుము. ఆత్మరక్షణకయి యెట్టికట్టుదిట్టములు జరుగుచున్నవో పరికింపు. హిందూ సంఘమునందు నీ వొక్కఁడవే ప్రాజ్ఞుఁడవై యుండి యధికారము సాగించుకొనవలయునని యత్నించినచో, గొన్నినాళ్ళకయినను కులక్షయము, సంఘక్షయము కాకమానవు. ఇతర సంఘములు నిన్ను దిగమ్రింగక మానవు. జపాను దేశమునందలి 'సామోయ్' జాతి చూపిన యాత్మత్యాగములో శతాంశముఁ జూపింపలేవా ? ఆత్మత్యాగమే కాదు-ఆత్మరక్షణము. దీర్ఘదృష్టితో విచారింపుము. బ్రాహ్మణేతర విద్యార్థులను గొండపల్లెకుం గొంపోయి పరాభవించితినని కులుకుదువా ? దాని ప్రతిఫలమేమియో యాలోచించుకొనుము. బాలుర కోమల హృదయ క్షేత్రములయందు నెట్టి దుర్బీజములను నాటుచుంటివో తిలకింపుము. నీ బాగోగులనైన నీవేల చూచికొనవు? అకలంకుఁడును, నత్యధికపూర్వాచార పరాయణుఁడును నగు మాలవ్యాపండితుని నర్తనమునందుఁ గలిగిన పరివర్తనమునైన నేలకన్గొనవు ? దొంగవై హరించిన ప్రత్యేకస్వత్వములను సంఘమున కేల తిరిగి యర్పింపవు ? అర్పింపకున్న నెంతకాలము వానినిం బట్టికొని పెనఁగులాడగలవు ? ముమ్మాటికి నాలోచించుకొని కార్యోన్ముఖుఁడవు

కమ్మ. పరుషవాక్యములని మమ్మెంగినియకు. సత్య మెప్పు డును బరుషముగనే యుండునుగదా !

ప్రాకృతజనంబుమాట యెటులున్నను మద్విరచిత గ్రంథములయందు నిదివఱకు విద్వల్లోకంబు చూపిన యాదర మునే యీ గ్రంథము యెడలఁ జూపుటకుఁ బ్రార్థించుచుం టిమి. మా యభిప్రాయముతో నేకీభవింపకపోయినను విమర్శనార్థ మయినను గ్రంథమును బఠింతురుగాక.

ఇట్లు విద్వద్విధేయుఁడు,
కృ తి క ర్త.



# సూతపురాణము

## ప్రథమాశ్వాసము

### ఇష్టానిష్టదేవతాస్తుతి.

ఇల్లును వాకిలిం గలిగి యిద్దరో ముగ్గురో యాండ్రుగల్గి పైఁ
బిల్లలు జల్లలుం గలిగి వెక్కసమైన కుటుంబ భారమున్
వెల్లువ నీఁదలేక పలవించెడి దైవతకోటి నా మొఱల్
మెల్లఁగ నాలకించి లవలేశము ముక్తినొసంగ నేర్చునే ?

ఇల్లిల్లుఁ దిరిగెడి యిల్లాలి కోసమై
దైత్యారి యూరూరుఁ దరలుచుండఁ
పొట్టకూడును లేక కట్టగుడ్డయు లేక
త్రిపురారి ముష్టికై తిరుగుచుండ
పెండ్లి పేరంటంపుఁ బెద్దచిక్కులు లేని
క్రీస్తువు సిలువపైఁ ద్రెళ్ళుచుండ
క్రవ్వించి రేఁగు శాత్రవులఁ గాంచి మహమ్మ
దిరుగూరికి గుడార మెత్తుచుండ

వీరి పాల్పడి నే మొఱపెట్టుకొన్నఁ
జెంతకును జేరి నా గోడుఁ జెప్పికొన్న
నార్తురా? తీర్తురా? యడియాసగాక
యిట్టివారికి జోతలుపెట్టు టేల?

ఏది చరాచరంబయిన సృష్టికి సర్వము మూలకారణం
బేది మునీశ్వరప్రతతి కేని యగోచరమైన దొడ్డ వె
ల్గేది లయాంతమందయిన నించుక వైకృతమందకుండు, నే
తాదృశ నిత్య సత్య పరతత్త్వ మహత్త్వము నాశ్రయించెదన్

భారతభూతధాత్రితలభాగము సర్వము సొంత యిల్లుగా
నారసి సర్వభూతములయందు సమత్వము విజ్జి రాల్చి సే
వారమణీయ భూతదయ వర్ధిలఁ జేసి ప్రపంచమందుఁ బెం
పారిన బుద్ధదేవుని పదాబ్జము లాఁదలఁ దాల్చు టొప్పదే?

శివుని యాజ్ఞలేనిదె చలిచీమ యైనఁ
గుట్టఁబోదని బుధులాడు గుట్టెఱింగి
వలదు నాజోలికేమి రా వలదటంచు
శివునకును మ్రొక్కుఁ జెల్లింతుఁ జేతులెత్తి.

ముడుపుఁ గట్టినఁగాని సమ్మోదపడరు
వేఁట తలఁజూచి కాని మోమోటపడరు
పోఁతురాజాదు లే నెట్లు పూజ సేతు
లంచగొండితనమ్ము కాన్పించుచుండ?

విభుఁ డొకఁడు చేయునంత పై పెత్తనంబు !
కర్మ మొకఁడు సంసార చక్రంబుఁ ద్రిప్పు
నంట !! ద్వంద్వ ప్రభుత్వ మిం దమర లేదె ?
ఎంతకాలంబు సాఁగునో యిట్టిచిట్ట !

ప్రతిసర్గంబుఁ దృణీకరించి ముని విశ్వామిత్రుఁడున్ సృష్టికిఁ
బ్రతిసృష్టిం బొనరించెనందు రది యబ్రంబౌనె? విప్రుల్ ప్రజా
పతి నెమ్మోమును దండకేలు తొడలుం బాదంబులున్ బుద్ధిని
ష్పత్తిచేయోనిమయంబుఁ జేసిరను లోకోక్తిన్ విచారించినన్.

గుడులలోనికి దేవుని కొల్వఁగోఱక
నరుగుచున్న యద్విజుఁ గన్నుఁ దెఱచి చూచి
దేవుఁ డూరకుండును భూమిదేవుఁ డూర
కుండఁడు దన పుట్టి మునుఁగుచున్న మాడ్కి—.

దక్షిణాఫ్రికాయందు నిర్దయులు తెల్ల
వారు భారతీయులఁ బెట్టు పాట్లుఁగాంచి
గొల్లుమని యేడ్చు నెంతొ గగ్గోలుపడుచుఁ
బనవుచుండును నీనాఁటి బ్రాహ్మణుండు.

కాని తానుమాత్రమె యంటరాని వాండ్రు
ముట్టరా దూళ్ళను బ్రవేశ పెట్టరాదు,
పొమ్మనుచునుండు మాలల బోధపడదు
తండ్రి ! నేఁటి బ్రాహ్మణుని చిత్తప్రవృత్తి.

ఎన్ని పుట్టువుల్ దాల్చి నే నెత్తినానొ
యెఱుకలేక యున్న దదృష్ట గరిమచేత
నదియె కల్గినఁ దలిదండ్రు లందఱకును
పట్టిపోవుదు దండముల్ పెట్టలేక.

అలకలుదీర్చి కొంగొతన 'మాట్టె'యొనర్పఁగఁబోకుమంచు నా
యలుకలు దీర్చి చెప్పి మనసారఁగ సాఁకుచు బద్ధరాగులై
కలఁకలు లేక వర్తిలిన గణ్యుల నా తలిదండ్రులన్ దనూ
పులకలుగా నుతించెదను బుణ్యులఁ జల్లయ రామమాంబలన్

మాలదాసరినోట మహితభూసురునోట
నొకరీతి మాటాడి యొప్పినావు
మాలవాడల బాట మహితభూసురు పేట
నొకరీతిగఁ జిందుఁ ద్రొక్కినావు
మాలగేస్తుని యింట మహితభూసుచు నింట
నొకరీతిఁ బదముల నుంచినావు
మాలపెద్దల చెవి మహితభూసురు చెవి
నొకరీతి సామెత లూదినావు

కన్నబిడ్డలదెస నొక్క కనికరంబె
చూపి యెల్లవారికి దారి చూపినావు
తల్లి ! నీమాట, నీపాటఁ దలఁచుకొన్న
జలదరించుచు మేనెల్లఁ బులకరించు.

నవరసవేదియై తెలుఁగు నాటఁ దెలుంగుకవిత్వమర్మముల్
గవుసెనఁదీసి కన్పఱపఁ గల్గిన సత్కవిరాజు, రాజస
త్కవి యగు నన్నె చోడరసికప్రభు జాను తెనుంగు కబ్బపుం
జవు లెఱుఁగంగ సాధ్యమె రసజ్ఞులు ప్రాజ్ఞులు గానివారికిన్ ?

ఆయతరాజ్యవైభవము నంత త్యజించుచు సన్యసించి జా
తీయపుఁ దీరుతీయములు తెట్టలుగట్టఁ దెలుంగుకబ్బ మా
ప్యాయన మౌ విధంబుగను బల్కిన మా చినవేమరెడ్డినిన్
బాయక ప్రస్తుతించెదను బల్మరు భక్తి పురస్సరంబుగన్.

సాంద్రయశోవిశాలుఁడయి సత్కవితా విభవాభిరాముఁడై
యింద్రసమానుఁడై గణన కెక్కిన కృష్ణుఁడు పెంచినట్టి ని
స్తంద్రకవిత్వభూజ ఫలసారముఁ గ్రోలుచు శ్లేషచే హరి
శ్చంద్ర నలావనీపతుల సత్కథ వ్రాసినవాని నెన్నెదన్.

అంకిలిలేని కవిత్వము
జంకని సాహితిని జూపి సత్కవికోటిన్
సుంకం బడుగంగల మా
వేంకటకవిరాజు శక్తి వినుతి యొనర్తున్,

ఆదికవిచంద్రుఁ డనుచు, నన్నయ్యభట్టు
యాంధ్ర కవితా ప్రపంచస్వయంభు వనుచు
మించి నిర్ధారణముఁ జేయ నెంచికాదె
నిజ మెఱిఁగి కప్పిపుచ్చ యత్నింతు రిపుడు.

కోపులు పెట్టువాఁడ బుధకోటికిఁ గబ్బము మింటనుండి యొ
క్కూపున నేల నూఁకిపడ నోపదు, కాని క్రమక్రమంబుగా
నేపగుఁ గాన నన్నయ సృజించెను నాంధ్ర కవిత్వమన్న భా
షాపరిణామవేత్త లనిశమ్ము భృశమ్ముగ నమ్మ రెమ్మెయిన్.

పుట్టిన నాఁడే గంటముఁ
బట్టిన నాఁడే కవిత్వపట్టంబును జే
పట్టిన నాఁడే యెట్టులు
పట్టువడునో సమయబద్ధ పద్యము లల్లన్!

కావున-

తెలుఁగు కబ్బమేగతి నిగ్గుదేరెనో! క్ర
మ క్రమముగ నెట్టి పరిణామ దశఁగనెనో!
మానసించి శాఖాచంక్రమణముగా ని
చట వచింతు సత్కవిలోక సమ్మతముగ.

మోటుమానిసి నోట మోజుచిందులు ద్రొక్కి
పనితంపుఁ బాటలఁ బాడనేర్చి
జోలపాటలు నేర్చి యేలపాటలు నేర్చి
గొబ్బిళ్ళ పాటల గునుకు నేర్చి
తేవారములు నేర్చి ద్విపదలెన్నియొ నేర్చి
త్రిపద చొక్కపు నడతీరు నేర్చి
రగడ లెన్నియొ నేర్చి రహి నక్కరలు నేర్చి
జంగమకథ మేలుచాలు నేర్చి

చాలగీతముల్ నేర్చి సీసములు నేర్చి
వెండి బంగారు పద్దెముల్ వెండి నేర్చి
ప్రోడపిల్లయై పాతర లాడనేర్చెఁ
దెలుఁగు కబ్బపుఁ గన్నియ దెలివితోడ.

ఇంతియే కాని నన్నయ వింతగాఁగఁ
బుణికి గంటముఁ జేఁబట్టి కణత లదరఁ
గైతఁ బుట్టించెనను మాట కల్లమాట
బోధలేని కాకవులు చెప్పెదురు గాక.

పడుచుఁ దనముచేఁ దనయింటి పాటమాని
యిరుగువారి పాటలనేర్చి యెగిరిపడఁగఁ
జిందుసరిగాఁగఁ బడదయ్యె చిట్టచివర
కెరవుసొమ్ముల కాసింప ఇంతెకాదె.

నేఁటికీఁదాఁరిఁ బెఱవారి నీడఁజేరి
బ్రతుకఁగోరి తంద్రించెడు బ్రదికిచెడ్డ
వారి యగచాట్లు కాంచినవారలకట!
కంటఁదడి వెట్ట కుండఁగాఁ గలుగు టెట్లు?

పూర్వకవి సంప్రదాయమ్ము బుజ్జగించి
కుకవి నింద నొనర్చుట గొప్పయగు నె?
కుకవులుండుటచేత నే సుకవి చంద్ర
కీర్తిచంద్రికల్ దిశలెల్లఁ గెరలియాడు.

కలిగినదానిలో మనసుకల్గిన దానిని గైతచెప్ప వా
రలు కవిరాజులో! కుకవి రాజులో! భక్తి పురస్సరంబుగాఁ
బలుకు వెలందికిచ్చు నెడఁ బాపము! కాకవులంచు మాటికిన్
బలుకుచుదూరుటెల్లఁ దగవా? తెగవాగిన మెప్పుగల్గునే?

వ్రాయక పూర్వగాథలని ప్రత్న కవీంద్రులు నేఁటిదాఁక, రా
మాయణ భారతాది కృతులన్నియు వ్రాసిరి త్రిప్పిత్రిప్పి యే
దో యొక కబ్బమంచు దలఁకొక్కటి, యక్కట! నూతనాంశమే
దో యొకటేనియుం దెలుప నోపని గ్రంథసమూహ మేటికో!!

పాకమెట్లున్న నేమి సంబరము? కవుల
కుంగరొక్కొ- "లోకోభిన్నరుచి" యనంగ
రసిక శేఖరులగు నెల్లరకు రుచించు
కమ్మతనము నె చూపింతుఁ గైతలందు.

తాతముత్తాతలో కత్తిఁ జేతఁబట్టి
వాదరనుజూపి రిపుల లోఁబఱచుకొనిరి
కమ్మకత్తికిఁ బ్రతియయ్యెఁ గలము, కాని
కత్తిపోటును మీఱదో కలముపోటు,

పూర్వోక్తక్రమంబున నిష్టానిష్టదేవతాభిస్మరణాదులు గావించి, పదంపడినిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీసమేతసూతర్షి ప్రోక్తధర్మకథనా సంవిధానంబునకుపక్రమింపక పూర్వముదిక్ప్రదర్శనంబుగా మద్వంశావతారాభి వర్ణనంబుఁ గావించెద.

కలదొకఁ డంగలూర నెడి గ్రామము మా గుడివాడ సీమ లో
పల బహుపండిత ప్రకర భాసురమై కవిరాట్సమాజ సం
కలితమునై యనేక బుధకాండ విరాజిత మందిరాళియై
విలసిత కమ్మవంశ పరివేష్టితమై దివిముట్టి వెల్గుచున్

సంగీత నైపుణీ భంగికి నీయూరె
యావాసమన వెంకటాద్రి సాక్షి
సంస్కృత సాహితీ సంపత్తి కీ యూరె
దండనాఁ బురుషోత్తముండు సాక్షి
రమణీయకవి కీ గ్రామంబె మనికి నా
నుడికి గోపాల కృష్ణుండు సాక్షి
శతవధానవిధానచాతురి కీ యూరె
నిక్కయని వచింప నేనె సాక్షి

గణితశాస్త్రసూలంకష జ్ఞానమునకు
స్థాన మీయూరనంగ రత్నమ్మ సాక్షి
కమ్మవంశంబు ప్రతిభా ప్రగల్భమనుట
కింతమంది యంతర్వాణు లెల్ల సాక్షి

పండిత ప్రకాండ కవీశ బహుళ గాన
గణితశాస్త్రజ్ఞ పౌరాణిక ప్రధాన
వంతమై యిందు వెల్గొందు మంతు కెక్కు-
త్రిపుర నేన్యన్వవాయము దీర్ణ మహిమ.

శుంభద్గుణుఁడై సాత్త్వి
చ్ఛంభుఁడై యీ వంగడమున జన్మించె ననన్
శంభుఁడు కూటస్థుండై
యంభోనిధిఁ గల్పవృక్షమట్టుల వెలసెన్.

శాశ్వతశివాలయ ప్రతిష్ఠాత, యగ్ర
హారసంప్రదాత, విమల వారిపూర్ణ
తత తటాకనిర్మాత, యుద్యానవన వి
ధాత, మత్కులత్రాత, ముత్తాత తాత.

ఏతద్వంశంబునఁ గొంతకాలంబు గడవ—

గుణమణియై గ్రామణియై
మణియ లసత్కమ్మవంశ మండన చూడా
మణియై మార్గణ చింతా
మణియై యఘపంక గగనమణియై చెలఁగెన్

ఊరు నాడును గొండాడఁ బేరుమోసెఁ
బాటి వారలు లేరని పరులు పొగడఁ
బెత్తసముఁ జేసె ముత్తాత కత్తిదాఁచి
యట్టి మహనీయ కమ్మకులాబ్ధిశశికి.

గోపాలక విభవుండై
గోపాలకశక్తియుక్తి గుణలోలుండై
కాపేయవిహీనుండై
గోపాలుం డుదయమొందె గోపాలుండై.

ఇమ్మహనీయు గర్భమున నీడ్యతరోరుయశఃప్రభాఢ్యులై
కమ్మకులావతంసములు గల్గిరి నల్గురు వంశపావనుల్
కొమ్మలు మూఁగుచున్ సుజనకోటులు చాటువఁగట్టి మెచ్చ లో
పమ్మిసుమంత లేక పెఱవాఁప స్తుతింపఁ జరించి రందఱున్.

ఇందఱిలోఁ దృతీయ సుతుఁ డిద్ధపరాక్రమ లాంఛనుండు, సం
క్రందన తుల్యుఁ డార్తజనరక్షకుఁ డాశ్రిత పక్షపాతి, పే
రందిన బల్లిదుండు, చలమయ్య సమాఖ్యుఁడు రామమాంబనా
నందవతిన్ వివాహమున నవ్యవిలాసముతోడఁ గైకొనెన్.

ప్రేమమయాత్మ తా నడికిరేయయినన్ గుడువంగఁ బెట్టెడిన్
దామసమన్న లేదు తన దాయలనైనను గన్నతల్లిగా
నేమి వచించినన్ గసర దెన్నఁడు మాజననీమతల్లి సా
ధ్వీమణి ధర్మమూర్తి నెఱపి దివ్యపదంబును బొందె ధీరయై.

అమ్మకడగొట్టుబిడ్డఁడ నౌటచేత
నెంతమారాముఁ జేసిన నేవపడక
విడని గారాముతో నన్నుఁ బెంచె దాన
నమ్మమాట జ్ఞప్తికి వచ్చు నహరహంబు.

కోరమీసము మీఁదఁ గుడిచేయి, వైచిన
పరుల గుండియలు నీఱగుచు నుండు
కనుగొన లెఱ్ఱగాఁ గనుగొన నుంకింప
వైరిసమూహంబు వడఁకుచుండు

## ప్రథమాశ్వాసము

అభయహస్తంబిచ్చి యాదరించెద నన్న
జగములొక్కటియైన జంకకుండు
మడిమంచుపడియైన నుడివిన పనియెల్లఁ
దెగువమైఁ బట్టి సాధించుచుండు

రౌద్రరసమూర్తి శౌర్యసముద్రుఁ డద్రి
ధీరుఁ డక్షుద్రవితరణ దేవతాద్రు
మమ్ము విద్రావిత రిపుండు మహితభద్ర
మూర్తి మాతండ్రి చలమయ్య పుణ్యకీర్తి.

ప్రాణపంచకమ్ము నంతరాత్మయుఁ గూడ
నాత్మజాత్మజాతలైన భాతిఁ
బుత్ర పంచకమ్ము పుత్రికయొక్కర్తు
కాన్పుపంట యనగఁ గల్గి రందు.

సుకుమారకోమల సుకవితా జిష్ణుండు
గోపాలకృష్ణుండు కోవిదుండు
గురుకులసంవాస పరిగతదేవభా
షా పండితుండు నర్సయ్య ఘనుఁడు
సాధు సజ్జన సంఘసాంగత్య శీలుండు
శ్రీరామనామ సుశ్రీయుతుండు
శాలివాహనరాడ్విజయనాటక గ్రంథ
కర్త సుబ్రహ్మణ్య కవివరుండు

గురుజనపదాంబుజ నిబద్ధ పరమభక్తి
సురుచిరామల వృత్తి సంశుద్ధ చరిత
యతివమిన్న సీతారత్న మనఁగ నొప్పి
వెలసె విద్యాకుటుంబమై వినుతి కెక్కి.

పుత్రులలోనఁ గనిష్ఠుఁడ
మిత్రగణసమావృతుఁడ సమిద్ధపథుండన్
జిత్రప్రబంధ దక్షుఁడ
సూత్రించెద ధర్మకోటి సూతుని దయచే.

మహిళాధర్మవిశిష్ట వృత్తియయి కామ్యవ్రాత సంధాత్రియై
విహితాలాప కలాకలాపయయి సద్విద్యావతీభూషయై
రహిఁ జొప్పారిన పున్నమాంబ సుదతీప్రాలంబముక్తామణిన్
గృహిణింగాఁగొని సంతతింగని ముదం బిట్టింకఁగోల్పోయితిన్.

చెదరని ముంగురుల్ రసము చిప్పిలు తీయని తేటమాటలున్
వదలని ప్రేమబంధమును వల్లని చల్లని బుల్లి నవ్వులున్
గుదురని జంకుచూపు గమి గూపులు గల్గియు నా మనస్సులో
మెదలుచునుండెఁగా ప్రతినిమేషము మత్కులకాంత నేఁటికిన్.

ఉపక్రమణిక

కవుల స్వాతంత్ర్యమో! మంటఁ గలిసిపోయెఁ
బొట్టకూటికి వఱువట్లు పుట్టినపుడె
యడ్డమైన దేవ్రరుగొట్టు నాశ్రయించి
భయములేకుండఁ గవులెట్లు వ్రాయఁగలరు!

రప్పించి మెప్పుపై రత్నాంబరము లిచ్చు
నొసపరి దొరయైన మసఁగవలయు
అడిగించుకొనకుండ నగ్రహారములిచ్చు
నుర్వీశ్వరుండైన నొప్పవలయు
మదకరీంద్రము డిగ్గి యెదురేగుదెంచెడి
మండలేశ్వరుఁడైన నుండవలయు
తెలవారుటకుమున్న 'దినవెచ్చ' మంపించు
భూమీశ్వరుండైనఁ బొదలవలయు

దోయిలిడి పత్ర ఫల పుష్పతోయ మైన
నీయనేరని దేశమం దేవిధంబు
పుట్టఁగలరు స్వతంత్రులౌ 'దిట్టకవులు'?
లేరు లేరంచు గునిసిన లేచిరారు.

కొందఱు సత్యము మెత్తురు
కొంద అసత్యంబు మెచ్చుకొనుచుందు రిఁకన్
గొందఱు రెండున్ మెచ్చెద
రందఱి మెప్పింప సాధ్య మగునే నాకున్.

లోకులు దిట్టిన నిజమే
వాకొనఁగా గట్టిపట్టుఁ బట్టినవాఁడన్
లోకుల యిష్టానిష్టము
లా! కవిలోకంబుకలము నాఁకట్టంగన్

ధర్మమధర్మమంచుఁ బెఱదారులు ద్రొక్కుచు నాసలేక దు
ష్కర్మము లాచరించు కలికాలపుఁ బెద్దలఁగాంచి తప్పుఁడై
మర్మము విప్పిచెప్పి మనుమార్గమునన్ నడిపింపలోకమున్
నిర్మలుఁడైన సూతముని నీతులు పల్కెడు నాముఖంబునన్.

తేఁకువలేని నేనెటులఁ దిన్నని పల్కులు పల్కఁ బూనెదన్
లోకులు నన్నుఁగూర్చి తమలో నెటులాడిన నాడుకొందు రౌఁ
గాక గురూపదిష్టమగు కార్యము గావున సాహసించి య
స్తోకసుధీ ప్రభావుఁడగు సూతుఁడు చెప్పిన నేను వ్రాసెదన్.

ఓ జనులార ! నా మనవి యున్నది యొక్కటి నాలకింపుఁడీ
వ్యాజముతోఁ బురాణములు వ్రాసిరిపూర్వులు తద్విరుద్ధముల్
భ్రాజిలు నిందు సూతముని పల్కులు గావునఁ గాంచినంతనే
యోజనసేయమాని పరుషోక్తులకుం జొరవద్దు తొందరన్.

మనసునచ్చు నెడల మన్నింపఁగావచ్చు
మనసు నొచ్చునెడల మానవచ్చుఁ
గాని వివరమేమి కనకుండ వినకుండఁ
బరులఁ బ్రువ్వఁదిట్ట ఫలము కలదె ?

## కవి విచారము

చదివితి నేఁ బురాణముల సాంగముగా భయభక్తియుక్తులన్
జమవుపై కానియందుఁగలసందియముల్ సతతంబు హెచ్చుదున్
బొదలక చిత్తశాంతి పరిపూర్ణముగా భ్రమియింపుచుండ నా
మాదిమదినుండదయ్యెనొకమార్గమ యేనియుఁదోఁచదెమ్మెయిన్

పకలచే విజ్ఞానధురంధరుల మనిపించుకొను కొందఱు
మహనీయులం జేరి సందేహములఁ దీర్చికొననెంచి—

అనుమాన మిది యెట్టు లపనయింతువో యన్న
నపచారమని పల్కు నార్యుఁ డొకఁడు
సందేహ మీావంచ సంభవించె నటన్న
నపరాధ మని చెప్పు నార్యుఁ డొకఁడు
మలికితం బీగతి మలసె నా మతి నన్న
నది దోషమని యాఁడు నార్యుఁ డొకఁడు
విచికిత్స యీాయోజ విస్తరించె నటన్న
నహితాచరణమను నార్యు డొకఁడు.

శంకలను బాప నేరక మంకుతనముఁ
జూప నెవ్వఁడుఁ తలయూచుఁ జూచి చూచి ?
యుక్తి లేనిమాటకుఁ జెవి యొగ్గఁగలఁడె
పరుఁ డెవ్వండేని విస్రంభపరుఁడు దక్క ?

ఈ సంతాపభరంబునన్ జివికి రే లెంతేని నిద్రింపకే
నాసానంబడి కన్నవారల సదా యర్థించి ప్రశ్నింపుచున్
వీసం బేనియు లాభమందక తుదిన్ వేసారి వేసారులన్
నా సందేహ నివృత్తియందు మిగులన్ నైరాశ్యముం జెందితిన్.

పదంపడి కతిపయవాసరంబులుపోవఁ గొం డొకనాఁడు
తాంబూల చర్వణంబుఁ గావించుచుండ మెఱపు మెఱసిన

యొఱపున నొక్కయూహ నామనోగోచరంబగుడు మేను గరుపార నీవిధంబుగఁ దలంచితి—

పూతాత్ముండగు వ్యాసుఁ డేవిధముగా బోధించెఁ దచ్ఛిష్యుఁడై
సూతుం డేగతి నీ పురాణతతి సంశోధింప నెట్లాడె ! నే
రీతిన్ శౌనకుఁ డాదిసంయమివరుల్ పృచ్ఛింప నూఁకొట్టె ? రా
సూతుండుం జిరకాల జీవియటె! యా సుశ్లోకు దర్శించెదన్.

రంగత్తుంగతరంగ సంగమగతిన్ రంగారి శీతాద్రిరా
ట్ఛృంగాగ్రంబుఁ దొరంగి వంగవసుధన్ శృంగారముం గొల్పునా
గంగోత్సంగము నందు ఘోరతపముం గావించు సూతుం డటం
చుం గొండాడుచునుండు రాయమిని నెచ్చోఁ గాంచఁగా నయ్యెడిన్

అంచు వితర్కించి శయ్యాతలంబునఁ జేరి సుషుప్త్యవస్థ మైమఱచియుండ, వెన్నుఁ దట్టినట్టయిన నదరిపడి లేచి కట్టెదుట నున్న యద్భుత తేజోమయంబగు నొక్కయాకారంబు పలకించి తదేకధ్యానంబున నిరీక్షించుచుండ నా మహాతేజం బిట్టు మాటాడినట్టు విననయ్యె.

వత్సా ! యేటికి సంశయంపడఁగ ? నీ భావానురూపంబుగా
నుత్సాహంబునఁ గార్యమున్ నడపు నీ యుద్యోగమున్ నెగ్గనిన్
వాత్సల్యప్రతిభాప్రబోధమున సంభావించి సూతర్షి సం
విత్సంపన్నుని జేసి పంపు చనుమా విప్పారు నుత్కంఠతో

ఆతం డీతరి జహ్ను సు
తా తటినీ తటము నందుఁ దత్పరమతితో
నాతత తపముం జేసెదుఁ
బాతకపాతిత్యహరణ భాగ్యోదయుఁడై.

ఆతఁడు నీదు సంశయము లన్నిటిఁ దీర్చును దీర్చినంతనే
యాతనివద్దనుండి సెలవంది క్రమంబునఁ జాఁగి మ్రొక్కి యా
నీతులనెల్ల గ్రంథముగ నేర్పున నోర్పునఁగూర్పు దానఁ బ్ర
ఖ్యాతియుఁజిత్తశాంతియును గల్గును;గల్గును భుక్తిముక్తులున్.

పాలసులు కొందఱెల్లని పరిహసింపఁ
దలఁచు చుందురు దానిచేఁ దలఁగవలదు
నిజమెఱింగిన మనుజుండె నీతిపరుఁడు,
కాన రోమహర్షణిఁ బొడఁగాంచఁబొమ్ము.

అని యానతిచ్చి తిరోహితంబగుడు, రాత్రిశేషం బెట్టెట్టులో కడపి, సంభ్రమాకులుండనై—

తెల తెలవారకమునుపే
కలఁగిన మదితోడఁ గాల్యకరణీయంబుల్
పొలపొలచేసి పదంపడి
వెలలిటి నే విజయవాడ వీటికి నెలమిన్

## కవి ప్రయాణము

కెలన పెంపెక్కిన కృష్ణానదీ తోయ
ములయందు భక్తితో మునిఁగి మునిఁగి
కనక భూషాన్విత కనకదుర్గాదేవి
ముదముతో దర్శించి మ్రొక్కి మ్రొక్కి
ఆనకట్టను జేరి యతివిస్మయంపడి
యాంగిలేయులఁ గొనియాడి యాడి
సంకీర్ణముగనుండి సంకుల క్వణనముల్
సలుపు 'ఎంజిను'లను దలఁచి తలఁచి

సారిది కొండపై గీములఁ జూచి చూచి
సృష్టివైచిత్ర్యమునకు నచ్చెరువుపొంది
రేయి యచ్చోటనే పుచ్చి తేపకడనె
పయనమై పోయితిని రైలుబండి నెక్కి.

వాయుసమానవేగమునఁ బర్విడిపోయెడి రైలుబండిలోఁ
గాయము కందకుండ నెసకమ్మున నుండి బహిఃప్రదేశముల్
బాయక చూచుచున్న యెడఁ బాదపసంహతి భూమినుండి య
త్యాయతవేగమందుచు బయల్పడినట్టుగఁ దోఁచె బుద్ధికిన్.

హేలాదోహల చిత్తవృత్తిఁ జనుచో హేలాపురంబున్ బయిన్
గాలీఘట్టముఁ జూచినాఁడ వరుసన్ గల్యాణ యుక్తంబులై
వాలాయంబు తనర్చు జానపదముల్ ప్రాప్తింపఁ గన్గొంటి నీ
లీలన్ బైనముఁ జేసి మామక మనఃక్లేశంబు నాశంబుగన్

కతిపయ వాసరంబు లిటు కాలముఁబుచ్చుచుఁబోవనొక్కనాఁ
డతిరభసంబుతోఁడుతఁ బ్రయాగ ప్రయాగ యటన్న కేకలుఁ
శ్రుతిఁబడినంతనే యొడలి చోఁపుడు మాన్పఁ బ్రభాత సీత శా
శ్వత జలజాత జాత మృదు సౌరభ శీతల వాత పోతముల్

దిగుదిగుఁడని 'పోర్టరు'ల
ధ్వగులం దొరపెట్ట గట్టి వా యచ్చుపడఁ
దిగ తత్పరమతినై త
న్నగరమ్మునుజూచి వచ్చినాఁడను నాఁటఁ

అంత కూఁతవ్రేటుదూరంబుననుండి యభంగ భంగ శీకరోపేతం బయి, సౌగంధికాబ్జ మనోజ్ఞ మృదుమధుర పరిమళ సంవాసితంబై, మందంబై, నడయాడు సమీర 'కుమారునిచేఁ దైర్థికుల నర్ఘ్యపాద్యాది విధులం బూజింపించుచుఁ, గేళీలోలకలహంసీ కలకంఠ స్వరంబున నభ్యాగతుల నాహ్వానించుచు, నూర్మిమాలికా డోలికల నతిథిద్విజబాలికల సత్కరించు త్రిపథగాప్రవాద పవిత్రోదకంబుల నవగాహంబుఁజేయ బుద్ధిపొడముడు—

కైలాసశైల శృంగమునుండి గొల గొల
దిగుచుండు నెది హిందుదేశమునకు
వంగదేశామిత భాగ్యసంపద కేది
యాధారభూతమై యలరుచుండు

ఆదికాలమునుండి యార్యుల కెయ్యది
పరమ పవిత్రమై పరగుచుండు
పితృదేవతల కెల్లఁ బిండసంతతి నేది
కొనిపోయి 'యందిచ్చు' నను జగంబు

స్వచ్ఛ వాఃపూరవార పరిచార యగుచు
గాలిలు నే నది యట్టి గంగాభవానిఁ
బోయి దర్శించి హర్షించి మ్రొక్కినాఁడ
భవము సార్థకపడె నంచు భక్తితోడ.

అంగవారితము నేడదేరెఁ బధికాయాసంబు పోకారె, మైఁ
పొంగారెన్, మునిరాడ్విద్వృతిశ్ ద్విగుణీభూతంబుగాఁ గూరె, సు
న్గంగా నా తెలినీటి యందున బుబుతోత్పృష్ణలుం దీరె, హా!
గంగా స్నాన మహాత్వ మప్పుడుగనా కస్పట్టె నా బుద్ధికిన్.

అనంతరంబు జలంబులమధ్య నల్పాడి యచ్చోటువాసి
యుదన్ముఖంబుగాఁ గొంతదవ్వుఁ జనుడు—

మున్ను మాతారిన నెచ్చోట ముక్తికల్గు
నట్టి ఘోరాఘమర్షణ మైన భవ్య
జాహ్నవీ యమునా నదీ సంగమంబుఁ
గాంచినాఁడను గన్నుల కఱవుదీఱ.

భస్మ మలందిన పశుపతి యొడలిపైఁ
గృష్ణసర్పావళీ ఘృణుల యట్లు
శ్వేతవర్ణం బైన సీరి దేహంబుపై
నలరు కృష్ణోత్తరీయంబు నట్లు
ఆకాశవీథిపై నట్టిట్టు నెలకొన్న
స్వచ్ఛశరన్మేఘ సంఘమట్లు
పాల సంద్రము మీఁదఁ బవళించి యోగని
ద్రాస్థితిఁ గూర్కు మాధవుని యట్లు

గంగ కాళింది జలములు కలసి మెలసి
యా ప్రయాగ సమీపమునందు బహుళ
ఘన రభసమున నురుగులు కట్టుచుండఁ
బొంగి పొరలుచు ముందుకుఁ జెంగలించు.

సంగమస్నానమాడిన సద్దుచేసి
పూర్వసంచిత పాపంబు పోవుననుచు
బుటుకు బుటుకున జలములో మున్గినాఁడ
నలము నివముచే మేన్లు జలదరింప.

అంత నంతర్వాహినియైన సరస్వతీశైవలినిం గూర్చి కేలుమోడ్చి ప్రయాణోన్ముఖుండనై, తాపింఛతరుమండలీ రంధ్రచ్ఛాయానుషంగంబులైన కళిందాసుత తటంబులు వీక్షింపఁ గాంక్షించి ముందులకుఁ బోవ, శైశవంబునఁ జదివిన భాగ

వత్తాం తర్గతములయిన వాచామగోచరంబైన ధూర్తగోపా
లుని లీలావిలాసంబు లన్నియు నా మనోగోచరంబులయ్యె.

ఈ తీరమునఁగదా కృష్ణుండు గొల్లఁడై
మెలఁగుచు మందాల మేపినాఁడు
ఈ కూలమునఁగదా కృష్ణుండు రసికుఁడై
శారదరాసంబుఁ జల్పినాఁడు
ఈ గట్టుననెకదా కృష్ణుండు సుమనోజ్ఞ
వేణుగానంబుఁ గావించినాఁడు
ఈ యొడ్డుననెకదా కృష్ణుండు గోపికా
స్త్రీ మానధనము హరించినాఁడు

ఇచ్చటనెకదా కృష్ణుండు విచ్చలవిడి
సంచరించెడి శాత్రవ సంహతులను
గ్రాచి వ్రేపల్లె నిష్కంట కమ్ముగాఁగఁ
జేసినాఁ డతిదోస్సార చిత్రమహిమ.

అదె బృందావనవీధి యచ్చటనె యబ్జాక్షుండువంశంబుఁ గెం
పెదవిం జేరిచి చొక్కిపాడినది యాభీరాళి కన్మోడ్పఁగా
మొదవుల్ నిట్టకనిల్వ తాలు గరఁగన్ బ్రేమోదుల్ చిగుర్పంగ శా
రద రాత్రంబులు విశ్వమోహనముగా రాణింపఁ గోణాంగియై.

సరిక్రొత్తగానిడ్డ జాజి పూఁబొదరిళ్ళు
తీరైన పెళ్ళి పందిళ్లు గాఁగ
జలజల పైరాలు చక్కవిచ్చిన పూలు
పైఁ జల్లుకొను తలంబ్రాలు గాఁగ
కనరెక్కి గీర లేకయె పాడు కోయిల
కూజితంబులు మంత్ర కోటి గాఁగ
చెవులు పండువు గాఁగఁ జిల్క గోర్వంకలు
పాడు పాట నివాళి పాట గాఁగ

ఎబ్బె మెఱుఁగఁ జాలని గొల్ల గుబ్బెతలకు
సొక్కపొడి చల్లి తన నిగ్గు సోయగమున
మాటు పెళ్ళిళ్ళు చేసెడి మాయదారి
వింతచర్యలు నా మనోవీధి కెక్కె.

తృణగుల్మావృతకూలసాలముల సందీపించు కాళిందిలో
మణిరోచిష్మత నొప్పు కాళియ ఫణా మధ్యప్రదేశంబునన్
ఘృణిరంజన్మణి కింకిణుల్ మొఱయ శ్రీకృష్ణుండు నర్తించుచున్
ఫణినిన్ వేల్మిడిఁ ద్రోసిపుచ్చిన తదావాసస్థలం బిద్దియే.

కాలియందలి యందెలు గల్లు రనఁగఁ
జిందుఁ ద్రొక్కుచుఁ దనతల్లి చేతికోలఁ
గాంచి కల్లారి కన్నీరు కార్చు నట్టి
నవ్య నవనీత చోరుండు నాకుఁ దోఁచె.

సిల్లనగ్రోవి మేను మరపించెడు పాటలు పాడుచుండ, వ్రే
పల్లియ గొల్లపిల్లలు సెబాసని చిందులు ద్రొక్కుచుండ, మా
నల్లని దొంగ దొంగ నవునన్ గిలిగింతలుపెట్టి, గోపికా
పల్లవ పాణులం గలిసి పాడిన పూఁబొదరిండ్లఁ జూచితిన్.

రామునిగూడి గోపకులు రాఁ బశువర్గముతోఁ గిలారులై
యోమటిపంటికావడుల నొప్పుగఁ దాలిచి శైశవంబునన్
శ్యామల వర్ణుఁడైన జలజాక్షుఁడు ప్రొద్దులు పుచ్చినట్టి యా
యామున సైకతంబు లివియంచుఁ దలంచితి సంతసించితిన్.

క్షమతో నెఱ్ఱనియెండలో యమున 'దాఁకా' గోవులందోలి తా
యమునాతీర తమాలవృక్షముల ఛాయన్ నిల్చి కెంగేల వం
శముఁ గీలించుచుఁ బాటఁబాడుచును గోసంతానమున్ నీటికో
సము పోసియని కృష్ణ బేరజము నశ్రాంతంబు లోనెంచితిన్.

నిరంతర శ్రీకృష్ణపాదపాథోజాత ప్రక్షాళన పవిత్రికృతంబులగు నిర్మలోదకంబులఁ గృతస్నానుండనై వచ్చిన కార్యంబు వేగిరపెట్టుచుండ, వెండియు గంగాతీరంబుఁ జేరి సూతర్షి సందర్శనాభిలాషంబునఁ బోవఁదొడంగితి.

కాయలు దుంపలుం దినుచుఁ గష్టము లోర్చుచుఁ గొన్నిరోజులా
చాయనె పోవుచుండగఁ గృశత్వముఁ బొందె శరీర యష్టి, యే
మాయెనొ దార్ఢ్యమే నెఱుఁగ నైతిని, గాళ్లు వడంకసాఁగె, నా
కాయతి తోఁచదయ్యె నిఁక నట్టులె పోయితి సూఁగులాడుచున్.

దుర్భర నిదాఘసమయం బగుటయు, నడిమింటఁ జండాంశుండు నిప్పులం జెరుగుటయు, ఝురీసమానరయంబున ఘర్మజలంబు మైనుండి దిగజాఱుటయు, నడువనేరక యెట్టెట్టులో తడబడుచు, నడుగులిడుచు, మార్గము దుర్గమంబగుటఁ గార్యంబు దుస్సాధంబని, యెడదకుఁదోఁప, నున్న జవసత్వంబులు సంక్షీణింప, నెట్టకేలకు ఖిన్నుండనై పథిశ్రమంబున డస్సి నిట్టూర్పు పుచ్చుచుండ—

మంజు సౌరభసిక్త మంద మందానిల
సంచయ మెదురేగు దెంచె నంత
ఉత్సాహ రభసాంచ దుడ్డీన పరతంత్రి
పక్షి సంఘంబు కన్పట్టె నంత
వివిధ లతాగుల్మ వినరసమావృత
వృక్ష రాజములు గాన్పించె నంత
నానా శకుంత సంతాన సమాకుల
స్వనము లొక్కటిగ విన్పడియె నంత

నడచి పోవంగఁ గ్రమముగా నాకు నవుడు
చివురు జొంపములఁ గొమ్మల చెలువు నింప
గొనబు మీఱెడి లేమావి గున్న క్రిందఁ
బండితిని శైరవానంబుఁ బఱచి కొనుచు.

మృదులానిలోచ్ఛ్వాస మృగశాబలోలాక్షి
యలివేణి, శుకవాణి యబ్జపాణి
రంభోరువు పికస్వర మరాళగామిని
కోకిల సల్లాప కుందరదన
కాంచననాస పంకజవక్త్రబింబ బిం
బోష్ఠి లతాంగి నీలోత్పలాక్షి
స్తబకలికుచకుచ చంపకసౌగంధి
పున్నాగనతనాభి పువ్వుబోఁడి

యైన వనలక్ష్మి నవలక్ష్మి యగుచుఁ దనకుఁ
దాన సొబగుగాఁ దాళ వృంతములు దాల్చి
విసరుచుండంగ మెల మెల్ల విసివికొనక
పవ్వళించితి నలమటఁ బాపికొనఁగఁ

ఆదరించెడి వారొక రైన లేని
కాని పొలిమేర సీమ నేకాకి యగుచు
మేను మఱచి నిద్రించెడి వాని యూడి
గమ్ము చేయుట స్త్రీ స్వభావమ్ము కాదె!

పండుటాకుల సెజ్జ వసివాడు దేహంబు
కసుగంద నీకుండ నొసఁగుసుఖము
చెమట చిత్తడిఁ బుట్టు చిదచిద మాన్పుచుఁ
గొసరి వీచెడి గాలి యొసగు సుఖము

విన సొంపు మాటలఁ బిలిచి పాడెడు నట్టి
యున్మత్త శారిక లొసఁగు సుఖము
బీరెండ నీరెండఁ బెడఁద్రోసి నవకంపు
సహకార వృక్ష మొసంగు సుఖము

బడలికను బాపి యానంద పదవి నొసఁగఁ
బడిన కడగండ్ల మఱపింప భావి సుఖము
తలపులం బాఱ నొకరీతిఁ దనివిఁ జెంది
గాఢ సుప్తిని బొందితిఁ గన్ను మూసి.

పథికాయాసముచేత డస్సిన నన్నుఁ బాటించి లే గాడ్పుల
త్యధిక శ్రాంతతఁ బాపి నిద్రఁగనుమయ్యా! యంచు జోకొట్టఁగా
బృధులానందముతోడ మైమఱచి హాయిం జెంది నిద్రించితిన్
వ్యథవో, శాల రసాలసాల నిబిడవ్యాకీర్ణ సచ్ఛాయలో.

నెక్కొని యెంత కాలమిటు నిద్దురఁబోతినొ లేచి చూచుడున్
వక్క తపోధనుం డొకఁడు ప్రక్కను నిల్వఁగ సంభ్రమంబుతోఁ
గ్రక్కున లేచి యామునిని గాంచి నమస్కృతిఁ జేసి యాదరం
బెక్కుడుగాఁ దొడంగ మదభీష్టము దీరునటంచు నెంచితిన్.

శైశవము నుండి బాధించు సంశయముల
నెల్ల మూలముట్టుగఁ బాపి యిపుడు నన్ను
నుద్ధరింపంగ వచ్చిన సిద్ధుఁడనుచు
లోన తలపోసి యిట్లంటి వానితోడ:

అయ్యా! మీరెవ్వరు? నా
కుయ్యాలింపంగ నిచటకుం బ్రేముడితోఁ
జయ్యన వచ్చిన జడదా
ల్పయ్యల పౌరాణికేడ్యు లవుదురె? చెపుఁడీ.

అను నావిన్నపమాలకించి కరుణాయత్తైక చిత్తంబునన్
నను గన్నారఁగఁజూచి, చేనిమిరి సన్మానంబుతో, బాలకా!
చనదా క్షింతయుశంకసూతఋషిరాట్సాన్వంతఃబుసౌమ్యంబువ
చ్చినకార్యంబెఱిఁగింపుమాయనఘుడున్ జేదోడువాదోడగున్.

నిఖిల పురాణ వ్యాఖ్యాన విజ్ఞానసమేతుండయిన సూత
ర్షికి నేను బుత్రోపమానుండనైన బ్రియతమాంతేవాసిని.
నీవెవ్వండవు? ఏ కార్యార్థ మెటనుండి యిటకుఁ జనుదెంచి
తివి? వినదర్హంబేని విన్పింపు మనవుడు.

సదసద్వివేకులౌ శౌనకాదులు తొల్లి
ప్రశ్నింప సూత పౌరాణికుండు
కృపతోడఁ బదునెన్మిది పురాణముల నెల్ల
విన్పింప మునులెల్ల వినిరికాదె!
ఆ పురాణములందు దాపరించిన ధర్మ
సందేహములు నన్ను సంగ్రసింపఁ
బండితమ్మన్యులఁ బల్వుర నర్థించి
సంశయమ్ములఁ బాయఁ జాలనైతి

వానిఁ దొలఁగించుకొని నెంచి వచ్చినాఁడ
సూతు దర్శించు వాంఛమై శుభగచరిత !
గ్రామమో ! యంగలూరునేఁ గమ్మకులుఁడఁ
ద్రిపురనేని రామస్వామి దెల్పుచుంటి.

సన్నామముని మూర్ధన్యుని
సన్నిధికిం దోడుకొనుచుఁ జన వేఁడెద నా
విన్నప మాలించుఁడి యా
పన్నునిఁ గాపాడునట్టి పని మీదె కదా.

అనిన యనంతరమ్మున ప్రియమ్మున రమ్మని చెప్పి తోడుకోఁ
జనియెను దారిఁ జూపుచుఁ బ్రశస్తమనోహర సౌరభాఢ్య పు
ష్ప నివహా రంజ దత్యధిక వంజుల మంజుల కుంజ పుంజ సం
జనిత పథా వరోధ పరిసర్పిత ధామకు నొక్క సీమకున్.

నృత్యంబుచేఁ జొక్కు నీలకంఠములపైఁ
గోడె త్రాఁచులు నడయాడుచుండె
బాలెంత క్రోల్పులుల్ పాల్చేప బతిమాలి
యిఱ్ఱిపిల్లలకుఁ జన్నిచ్చుచుండె
కొదమ సింగపుఁ బిండు గున్న యేన్గుల నెక్కి
యట్టిట్టు పాతర లాడుచుండె
కాడు బిడాలముల్ బాడుగాఁ గాపాడ
నాఖువుల్ సింపిళ్ళ నాడుచుండె

వీని నన్నింటి సంతోష వినయపూర్ణుఁడయి
కాంచి సూతర్షి నిశ్చల ఘనతపః ప్ర
భావమునకు నబ్బురపాటుఁ బడుచు నప్పుడు
జటిలవరుతోడ నాడఁ జనినవాఁడు.

మారుతుఁ డట్టి పుష్పాడి దుమారము రేపఁగఁ గంటిలోనికన్
బోరునఁ జేర తచ్చవడి పుష్పమరందము మాని తుమ్మెదల్
మీఱిన దొడ్డ కిన్కను సమీరు హమీరు శపించుచుండె ఝుం
కార మిషంబుతో నతఁడు కంపిలి పోవఁగఁ జెట్లు సందుగన్.

కుఱుఁగలి కానలోన రవి గ్రుంకుచు నుండఁగ నెఱ్ఱచాయలున్
గుబురులు కట్టఁగా నిజము గొబ్బునఁ దోఁచక తచ్చపాటుతో
నెరగలియంచు భీతిపడి యేమియు నేరక కాకిమూఁకలున్
బరువడి 'కావు కావు' మని పాఱఁదొడంగెను మింట నొంటిగన్

సంజ నీరెండ పుష్ప మంజరుల నెల్లఁ
బొల్పు మీఱెసి మంకెన పూలపోల్పఁ
బర్ణ సంతతులను బల్లవములఁ జేసె
నేమి చెప్పుదు నా వనసీమ గోము.

కోఱఁకులకుఁ జన్న పూరేళ్లు గూండ్లువట్టి
జన్ని యావులు మందల కెన్నువట్టఁ
దొడరి పడమఱ యొఱ్ఱలు దోలువేళఁ
గడల ముఱిముఱి చీఁకట్లు గ్రమ్ము వేళ

ఇట్లభిరామంబయిన నావనసీమ దరియంజొచ్చి పోవునెడ—

పర్ణకుటీర మొండు సుమ భారపుటీరము మాటునుండి సం
పూర్ణముగాక కంటఁబడె ముందుగ సుస్వర సంయుతంబులై
కర్ణములం బడెన్ శుక పిక ప్రకర స్వనముల్ సదాపతత్
పర్ణ సమూహ సంకలిత పద్ధతిఁ బోవఁగఁబోవ నంతటన్.

యుగములనాఁ జేసి యుంచిన యాకులు
చివికి జీర్ణముగాఁగఁ జెదలువట్టి
ఆలనపాలన యదిలేమి ముంగిటఁ
గారాకు లిట్టట్టు కదలుచుండ
అదలించుటకు లేమి నడవిపందులు చొచ్చి
పెల్లగించుచు నుండఁ బెరటిచెట్లు
పైఁ బరామర్శించు వారలుండమిచేత
గోడల మన్నెల్లఁ గూలుచుండ
సారవంతములైన యోషధులు గల్గి
విరియఁ బూచిన తీపల విరివి గల్గి
భయము భక్తి గొల్పెడు నిట్టి పర్ణశాల
మునివాసయోగ్యంబగు దానిఁగంటి.

దట్టముగాఁ బెఱిగిన కస
విట్టట్టుగఁ ద్రోసిపుచ్చి యేర్పఱచిన పెన్
గుట్టల మెట్టెడి మార్గముఁ
బట్టి చనితిఁ బర్ణశాల వాకిలి కంతన్.

వడుగులు మూఁడు ప్రొద్దులను భక్తిని స్నానములాడుకొన్నెమ్మె
మడుగులలోనికిం దిగుచు మాటికి వచ్చుచుఁ బోవుచుండఁగా
నడుగుల జాడ లేటి యిసుకందున సైతము గానవచ్చె న
ప్పుడు పొడఁగట్టెఁగట్టెదుటఁబొంకముగా నొక పర్ణశాలయున్.

కల్మషాభావమైన గంగా స్రవంతి
యమల తోయంబునం దీదు లాడుచున్న
పలు తెఱంగుల రంగుల పులుఁగు వెలుఁగు
లాలకించితిఁ గర్ణపేయంబు గాఁగ.

పర్ణశాలముందు బాదరించెడు నట్టి
వేది మధ్యమందు వెల్గువాని
భస్మలిప్తదేహుఁ బద్మాసనస్థునిఁ
గాంచినాఁడ నతుల కౌతుకమున.

కాంచినయంత నామదికిఁ గల్గెను గట్టి ప్రశాంతి, బ్రహ్మతే
జోంచిత మౌని చంద్రవదనాబ్జ గళత్కరుణా ప్రసూన దృ
క్సంచయ మల్ల నా పయికిఁ జల్లఁగఁ బర్విన యంతమాత్ర యి
ట్లించుఁ దలంచితిన్ దుదకు నాత్రముతో మెయిపుల్కరింపఁగన్

కష్టము తీరునంచుఁ దమకంబున వాగ్మి, త్రికాలవేది, నా
కిష్టముఁగూర్ప జాలిన నిరీహుఁ డితండని విశ్వసించి, సం
తుష్టిని బొంది సూతముని సార్వహుఁడౌనని శ్రద్ధతోడ వి
స్పష్టముగాఁ బ్రణామమును జల్పితిఁ దుంపెసలారగ భక్తితో

శ్రద్ధాభక్తులఁ బాదపద్మముల మస్తంబుంచియున్నట్టి నన్ బుద్ధిక్షోభముఁ బొందకుండుమని సంబోధించి దీవించి నీ విద్యాశ్రీస్థలికిన్ మదర్థమయి యిట్లేతెంచు వృత్తాంతమున్ బుద్ధింజూచి గ్రహించితిన్ మునుపెయామూలంబుగానర్భకా!

వ్యాసభట్టారకుఁడు మున్న వచ్చి చెప్పె
శిష్యుఁ డొకఁడు విద్యార్థియై చేరఁగలఁడు
వాని ధర్మసందేహము ల్బాపి పంపు
మఖిల లోకైక కల్యాణ మగును దాన.

అంచు వచియించి నను గుస్తరించి నిమిరి
మేను నికటాసనస్థునిగా నొనర్చి
యింబు మీఱంగ శరదంబు దంబు డంబు
ననుకరించునట్టుల నిట్టు లనియె మౌని.

సవన దీక్షాతంత్ర సమయంబునందున
శౌనకాది మునీశ సంచయంబు
ప్రొద్దు రవ్వంతైనఁ బోకుండ ధర్మముల్
విన్పింపుమని నన్ను వేడుటయును
చిన్నతనంబున శిష్యుండనై వ్యాసు
సన్నిధిఁ జదివిన చదువులెల్ల
ధర్మ సంస్థాపనార్థము సంగ్రథించి పు
రాణ సమూహంబుఁ బ్రకట పఱచి

చెప్పితినటంచు. వంచకుల్ చెప్పుచుండఁ
జేరు మోసమటంచు భావింపలేక
నమ్మి చెడుచున్న వారు లోకమ్ము సందు
డానఁ గల్గఁగాఁ జొచ్చె సంతాపభరము.

ఎట్టులు నాపేరిట భువిఁ
బుట్టించు మహాపకారముం బాపుకొనన్
ధట్టుఁడ నాదునో యని మొ
ప్పట్టునఁ దలపోయుచుండుఁ బాయని చింతన్.

పుక్కిటి గాథల నన్నిటి
నొక్కటిగాఁ జేర్చిపెట్టి యుంచిన మాత్రన్
మిక్కిలి మతముం దెల్పెడి
చక్కటిగల గ్రంథమౌనె చర్చించినచో?

నాపేరన్ వెలయించి నామెడకు నంటన్ గట్టి తద్గ్రంథముల్
నాపై నేరము మోపఁగాఁ దలఁచియన్యాయంబు న్యాయంబుగాఁ
బాపంబున్ సుకృతంబు గాఁగ రచియింపంజాలినా రెవ్వరో!
నాపైఁ బెట్టినయట్టి యీ యగడు మాన్పంగాఁ బ్రయత్నించెదన్.

అనిన యనంతరంబు నే నిట్లని విన్నవించుకొంటి—

సకల పురాణముల్ చదివి సంగతులన్నియు నే గ్రహింపఁగా
వికలతఁ జెందె నా మనసు వేయి విధమ్ముల శ్రద్ధతో బుధ
ప్రకరము నడ్గి యందలి పరస్పరఘోరవిరుద్ధగాథలన్
నికరముగా గ్రహింపఁగను నేరకపోయితి మౌనిచంద్రమా!

అంబుధి సప్తకం బాపోశనముఁ జేసె
  నొక్కరుండని చెప్పు నొక్కకథను
సర్వభూచక్రంబుఁ జాపచుట్టఁగఁ జుట్టె
  నొక్కఁడుండని చెప్పు నొక్కకథను
సప్తాశ్వు జాయకై సాఁబట్టైను బట్టె
  యొక్కరుండని చెప్పు నొక్కకథను
కొండక్కై యెగిరెడి కొండతెక్కలు గూల్చె
  నొక్కరుండని చెప్పు నొక్కకథను
  క్రోతి కొండ్రముచ్చులకును గొండలకును
  మానవులు పుట్టిరని చెప్పు 'మాయమాట'
  లన్ని కథ లీ పురాణము లందె కలవు
  పిట్టకథలకు నివియెల్లఁ బుట్టినిండ్లు.

పాథోజనాభుండు భగవంతుఁ డొకచోట
  నొకచోట స్త్రైణశాపోపహతుఁడు
అళ్ళికాత్ముఁ డద్వితీయబ్రహ్మ మొకచోట
  నొకచోట ఋషిపత్నులకు విటుండు
అబ్జగర్భుండు స్వాయంభువా నొకచోట
  నొకచోట శత్రు పాదోపహతుఁడు
దేవకీపుత్రుఁ డింద్రియజేత యొకచోట
  నొకచోట జారహాళికి గురుండు

శుక పరబ్రహ్మ మొకచోట శుద్ధ జడుఁడు
వేఱె యొకచోట సంసారి బిడ్డతండ్రి
యన్ని కథలీ పురాణము లందె కలవు
పిట్టకథలకు నివియెల్లఁ బుట్టినిండ్లు.

ఒకయెడ గుణకర్మంబులె
ప్రకృతము వర్ణవ్యవస్థఁ బొల్పుచ్చెడి నే
యొకయెడ జన్మము మాత్రమె
ప్రకటపఱచుఁ బొమ్మనును బురాణము లనఘా !

వ్యాసుఁడె యీ పురాణముల వ్రాసిన నిట్టివి సంభవించునే?
వ్యాసుఁడువ్రాయలేదు ప్రతిభాఢ్యుఁడుసూతుఁడు చెప్పలేఁదికన్
మాసరమైన యీసుగల మానిసి మీరలు చెప్పినట్టుగా
వ్రాసెనటంచుఁ జెప్పెద రబద్ధమొ బద్ధమొ లోకు లిప్పుడున్

జాతి మాత్రోప జీవులు నీతి దప్పి
సద్దుఁ జేయక స్వోత్కర్షఁ జాటుకొఱకు
వ్రాసి రష్టాదశ పురాణవర్గమును వ
దంతి ప్రజలలో నొకటి యుత్పన్నమయ్యె.

కొందఱు ప్రక్షిప్తంబులఁ
బొందించి యనేకగతులఁ బులు మానిసులై
యిందనుక మోసపుచ్చిరి
యందఱు నిజమెఱుఁగరాని దయ్యె మహాత్మా !

ఒజ్జలు మీరుగదా మీ
యజ్జలపైఁ బడినవాఁడ నజ్జము గాఁగన్
ముజ్జగములయందలి వి
ద్వజ్జనము నుతించు ధర్మ పథమును జెపుఁడీ.

ఆగతా నాగత విదులరైన మీదు
దర్శనముఁ జేసి మీచేతఁ దథ్య మెఱిఁగి
యవల లోకమ్మునకుఁ దెల్పునట్టి వాంఛ
నరుగుదెంచితి నిటకుఁ గాఱడవిఁ దాటి.

అన్నంతనె నామాటలు
విన్నంతనె సంభ్రమంబు విఱ్కుచు నుండన్.
విన్ననువున ముని యనియెను
బన్నికతో సుప్రసన్న భావముతోడన్.

'ఓ'యన్న గంగలో నూయాల లూఁగెడి
కొదమ రాయంచ లూఁకొట్టుచుండ
సమిధలు గొని తేరఁ జనినచో వన్యమృ
గావళి తోడు నీడగుచునుండు
గానంబు సేయంగ గమకింప మైన గో
ర్వాంకలు నీ సహపాఠు లగును
నిదురించు నిను లేప నీడోద్భవ చయంబు
నీ వందిమాగధ నికర మగును.

చాల కటికనేలను తెల్లు చాప మీఁదఁ
గందమూలముల్ గుడిచి నిష్కామ వృత్తి
సుద్దులాడ నొక్కరి నైనఁ జూడకుండ
నెట్లు దినములు వేగింతు విచటనుండి?

గాంగసైకతమ్ముల మీఁదఁ గట్టినట్టి
పూరి యింటిలో నీవు కాపురము నిల్పి
చలికి గ్రొస్సి శుష్కోపవాసముల డస్సి
బ్రహ్మచర్యంబు నడప సాధ్యంబు కలదె?

నీవారి నుజ్జగించియు
నీవారాన్నంబుఁ గుడిచి నిల్తువె యిచ్చో?
నీవారిఁ ద్రావి నిత్యము
నీవారి మనంబు కుంద నిర్వసించుమటచే.

ఎంతకాల మిందు నేకతంబున నుండి
యధ్యయనముఁ జేయ ననువు పడునొ?
తామసింపకుండ ధర్మ సూత్రంబులు
తెలియఁబఱతుఁ దేట తెల్లముగను.

అనిన మత్సన్యస్తహస్తుండనై, నిస్తుల మహిమాభిరామయు, సమస్త వస్త్వంతర్యామయు నగు నాదిశక్తిం గూర్చి ప్రస్తుతించి వినమిత శిరస్కుండనై తత్పాదారవిందంబులదృష్టి నిబద్ధముఁ జేసి యీకరణి విన్నవించుకొంటిని—

# ప్రథమాశ్వాసము

గంగా పూత జలాభిషేకము నశోకస్రగ్విలాసంబునన్
భృంగీ గీత వినోదమున్ బికవచః పీయూష మాధుర్యమున్
శృంగారాబ్జ మయూఖ సద్ధరజినుల్ చెందమ్మి కొండావి మీ
సంగాతంబును మీ పొలంబుడుఁగ వాంఛాసిద్ధి చేకూరునే?

పరమపావన గాంగ పాథస్సమూహంబు
పుష్కరిణీకూప పుష్కరంబు
కలకంఠ శారికా కాకలీ రావంబు
కర్ణ పుటో దీర్ణ కలకలంబు
పైకొను పుష్పాళ్ళ వలిగాడ్పు తెమ్మెరల్
తీరని పెడగబ్బు మారుతంబు
త్రోటిపోటుల గాట్ల దొరగిల్లిన పండ్లు
కొంటె జబ్బులు దెచ్చు వంటకములు

సరిసమానములొక్కొ! యే సరణి నేని
యెఱిఁగి యెఱిఁగి నేనేల యసేతు సేతు?
నడవిలోనున్న మునిపల్లె విడచిపెట్టి
పొట్టకూటికిఁ గోరాడు పట్టణంబు.

ముక్తిదాయకులైన మిమ్ములను బాసి
నవ్య విజ్ఞాన సంపాదనమ్ము రోసి
యే యొడాటమ్మునందు నేనేమి చేసి
యెఱుఁగ నేర్తు ధర్మమ్ముల నెనని డాసి?

కావునఁ గృత్రిమ సౌఖ్య ప్రపూర్ణంబయిన లోకంబుఁ గంటగించెద. అఖిలజంతుసామాన్యములయిన యీసుఖంబు లభిలషించెద—

గురుకులవాసక్లేశము
నరుదారఁగ ననుభవించి హైనను సరిహో
నెఱి కత్తిమీఁది సాముగ
జరుపంగలవాఁడ బ్రహ్మచర్యవ్రతమున్.

కావున—

ఎంతకాలంబు మీరు నన్నిచట నుండు
మనుచు నాకు వెట్టెదరొ నే నంతకాల
మిచట నావక పదములే యేదు గడగఁ
గొలిచి సేవించువాఁడనో గురువరేణ్య!

సర్వ పౌరాణ సందేహ సంచయంబుఁ
దీర్చి నన్ను విద్యా సముదీర్ణుగాఁగఁ
జేయు నందాఁక నిందె వసింతు నయ్య
శిష్య పరమాణువుగ నన్నుఁ జేసికొన్న.

చిటిపొటి మాటలతో ము
చ్చట చెప్పుటతోఁ జదువులు చదివించెదవీ యా
విటతట యొజ్జలఁ గొలిచితి
నెటువలె మిము నుజ్జగింతు నేనని చెప్పన్

సూతముని కంఠీరవుండు సముత్కంఠఁ దెల్పుకంఠస్వరంబుతో—

పాత్ర మెఱింగి దానము ధ్రువంబుగఁ జేయుట పాడియంచు స
చ్ఛాత్రునికోసరంబు నలుచక్కులు చూచితి రేపు మాపులుఁ
జిత్రముగాఁగ నా తలపు సిద్ధిని బొందెను నేఁటితోడ నే
యాత్రము లేక ధర్మముల నన్నిటిఁ జెప్పెద నాలకింపుమా.

శిష్యకోటి వాంఛా ఫల సిద్ధిఁ జేయు
టెల్ల నాచార్యధర్మమా టెఱుఁగనోక్కా!
నీ యభీష్టము లెల్ల విన్పించు నెడల
నెఱుకగలవారిమాటల నెఱుఁగ జేతు.

అయిన నిప్పుడు ప్రదోషకాలం బాసన్నంబగుచున్నది. సంధ్యావందనాదులు నిర్వర్తించి, నిదురింపుము. రేపు సావధానంబుగా విషయచర్చఁ గావింపవచ్చునననిన, నమస్కారం బాచరించి సెలవంది, కాల్యకరణీయంబులఁ దీర్చికొని, ఫలభక్షణంబు సలిపి, యథోచితంబుగా వేదికామధ్యంబుననున్న దర్భసంస్తరణంబున, శయించి సుఖనిద్రపోయితి—

మధురపేశలసౌరభ మహిత గాంగ
పుండరీకపరాగ సంపూర్ణ మంద
సుప్రభాత వాయువులు వీచోపు లిడుచు
మేలుకొల్పంగ మెలమెల్ల మేలుకొంటి.

సంధ్యావందనాదులు నిర్వర్తించి జగదుపకారశీలియు, నిష్ఠురతపోశాలియు నగు సూతమహాముని సందర్శించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనుమతిని సనిూపంబునఁ గూర్చున్న నన్నుఁ జూచి, విస్ఫారితమోముతోఁ గరుణార్ద్రింబులగు చూడ్కులు నిగుడించుచు నీసరణి నానతిచ్చె—

వేసవి వెట్టనున్ సరకు సేట్టక యొట్టోణ్ణో జ్ఞానతృష్ణచే
గాసిలి కాశిదేశమని కంకక కొంకక వచ్చితీవు నా
కోసము,సంశయంబులను గొబ్బునఁ దెల్పుము,తీర్చువాఁడ మా
వ్యాస గురూపదిష్టమగు భాతి నటంచు వచించె సూతుఁడున్.

నాస్తుడు సంస్కృతం బతి సనాతనదైవతభాషయంట, భూ
దేవతలంట తాము తమదే యట దాయముగార టీ పాపల్
కావున సద్ద్విజుల్ చదువఁగా నరకంబు లభించునంట యే
డ్డీ విధి విప్రులెల్ల వచియింతురు వింతురు ధర్మపద్ధతుల్.

చదువఁగరాదో యద్విజులు సంస్కృతభాష వివేచనంబుతోఁ!
జదివినవాని నెల్లను ద్విజన్ములకున్ వినిపింపరాదో! యి
య్యది పొనరించినన్ నరక మందునఁ గూలి నశింపఁ దప్పదో!
విశదముగాఁగఁ జెప్పుఁడు వివేకులు మీరలటన్న సూతుఁడున్,

కార్యాకార్యవివక్షనుం దెలిసియుం గాలుష్యముం దూఁటఁగా
ధైర్యస్థైర్యములేక ధర్మముల నుద్ఘాటింతురే! భూసురుల్
మర్యాదన్ దిగద్రావి యీసరణి రామస్వామి! చిత్రంబహో!
యార్యావర్తముపుణ్యభూమియగుటె కట్టా! యేమికానున్నదో!!

భవితవ్యంబును గూరిచి
పొవలి పొవలి పెద్దప్రొద్దుఁ బుచ్చఁగ నేలా?
ప్రవచించెద నా యెఱిఁగిన
ప్రవిమల వేదోక్త ధర్మ పద్ధతి వినుమా !

ఈ సంప్రశ్నము సత్రయాగమున మున్నే వచ్చె నానాఁడు మా
ఱూసాడంగనులేక శౌనకుఁడు తా యోజించి యోజించి సం
త్రాసంబుంగొనిమోద్పుకన్నుగవతో ధ్యానింప విచ్చేయుచున్
వ్యాసర్షీంద్రుఁడు ధర్మనిర్ణయము నొప్పన్ జేసె నిష్పక్షుఁడై.

వ్యాసశౌనకసంవాదరూపంబయిన యేతదుపాఖ్యానంబు సర్వప్రాణిమోదంబు, నఘాపనోదంబు, నగుటంజేసి విన్పింతు నాలింపుము. దాన నీ సంశయంబు దీరు.

వ్యా స శౌ న క సం వా ద ము.

నైమిశమందుఁ దొల్లి యతినాథులు పావన సత్రయాగమున్
నేమము తోడఁ జేయఁగ మునిప్రవరుండును నిర్జితేంద్రియ
గ్రాముఁడు నైన శౌనకుని రమ్మని పిల్వఁగఁ జూడఁబోవుచున్
మామక పర్ణశాలకయి నన్ గొనిపోవఁగ వచ్చి యిట్లనెన్.

సూతా! సంయములెల్ల నైమిశవనక్షోణీ తలంబందు వి
ఖ్యాతోదంచిత సత్రయాగ మిపుడే కావింపనున్నారు, మ
చ్చేతః ప్రీతిగ రమ్ము పోవుదము విచ్చేయంగ నున్నారఁటే
పూతాత్మల్ ఋషిపుంగవుల్ త్రిజగతీపుణ్యాత్ము లెందెందఱో

పెద్దలసేవఁ జేయు తలపెప్పుడ నీ తలఁగల్గుఁ గాన నొం
డుద్దియు లేనివారు చనుచుండిరి యాడకు వారివద్దనున్
బుద్ధులు సేర్వవచ్చు మనపుట్టువు సార్థకమౌను, లెమ్ము వే
ఱెద్దియుఁబల్కకించు వచియింపఁగ వల్లె యటంచు సేనునుఁ.

పుణ్యుఁడు శౌనకుండు పరిపూత చరిత్రుఁడు వెంటరాఁగఁ గా
రుణ్యముతోడ బాటల నెఱుంగుటఁ జొచ్చితి నీలకంఠ లా
వణ్యము, సౌరభప్రసవపణ్య మగణ్యము నైమిశాఖ్య కా
రణ్యావరేణ్యమున్ మునిశరణ్యము కోర్కెలు సందడింపఁగన్

పొదుపుగుబ్బలిమీఁదఁ బొడతేర జాబిల్లి
పండువెన్నెల కాయుచుండె నపుడు
పండు వెన్నెలఁజూచి పగలంచు భ్రమియించి
పరభృతానీకంబు పాడ సాఁగె
పరభృతగానంబు పమ్మంగఁ బలవించి
బ్రహ్మచారి యులికి పడుచునుండె
బ్రహ్మచారిని జూచి బైరాగులెందఱో
ముసి ముసి నవ్వులో మున్గియుండ

మమ్ముఁ జూచి చూడకముందె మౌనివరులు
చేరి కుశల సంప్రశ్నముల్ సేసి పిదప
స్థండిలంబునఁగోరి కూర్చుండఁబెట్టి
యుబుసుపోకకు మాటాడు చుండిరంత.

అడవి పూలగబ్బు నపహరించి భరించి
కుంటినడకతోడఁ గొంటె గాలి
యొడలికెక్కి ప్రాకి పొడుగు గడ్డము లూఁచు
చుండ నిట్లుపల్కె నొక్క తపసి.

కథకుఁ డొక్కఁడు చెప్పు సత్కథలఁ జెప్ప
వలయుఁ గావున నిపుడొక్క ప్రథిత యశుని
నిర్ధరించి పౌరాణిక నిఖిలగాథ
లాలకింప స్వశ్శ్రేయసమగు నఁటన్న

శౌనక యతి మూర్ధన్యుఁడు
మానిత మహనీయ సూక్తి మాధుర్యముతోఁ
దా నీగతి వచియించెను
మానివరేణ్యులకు ధర్మమార్గముఁ దెలుపన్.

సూతుఁడు జ్ఞానయోగపరిశోధిత దివ్యమనోంబుజాత వి
ఖ్యాతుఁడు ధర్మశాస్త్రతతి గర్భరహస్య విశిష్ట తత్వ ని
ష్ణాతుఁడుగల్గనొండొకనిసాయము హేయముగాకయున్నె? యో
పూతచరిత్రులార ! మన పుణ్యముచే నతఁడుండె నిచ్చటన్.

చదివినవాఁడు శాస్త్రములు సర్వము, బెద్దలయందు భక్తిచే
మెదలినవాఁడు నెల్లపు డనేయగుణాఢ్యుఁడు శీలవృత్తముల్
పొదలినవాఁడు ప్రల్లదనమున్ మెఱమెచ్చులు లేనివాఁడు, మె
ప్పొదవినవాఁడితండొకరుఁ డొప్పును సత్కథకుండు నౌటకున్

అను నీ శౌనకవాక్యము లాలించి నైసర్గికనిష్కపట
వాక్పారుష్యంబున దుర్వాసుండుపాలంభనంబుగా నిట్లనియె—

సభికులా! వేదవేత్తలు ద్విజన్ములు, భాషయు! సంస్కృతం బనే
కభవహారాఢ్యనైమిశము కాఁగలక్షేత్రము, కాలమన్నవో
శుభతరసత్రయాగ మెటు సూతుఁడు నిర్మలధర్మవైదుషీ
విభవముగల్గియున్నను, వివేకము కల్గిన నప్పుఁడయ్యెడున్ ?

ద్విజులసేవించి కఱదలు తెలియవచ్చు
ద్విజులఁ బూజించి స్వర్గమే తేరవచ్చుఁ
గాని యద్విజుల్ ద్విజులకెం దేని ధర్మ
మర్మము లుపదేశింప సంభావ్య మగునె ?

సృష్టిలోఁ దొలుదొల్త నేభాష భగవతి
వాణికి జిలిబిలి పల్కులయ్యె
ఆ బాలగోపాల మమరులేభాషలో
దేవాదిదేవు స్తుతించుచుండ్రు

మనముందునేగిన ముని ముముక్షువులెందు
"నేతి నేతి" యని యూహించినారు
వేదవేదాంగము లాదినారాయణుం
డే భాషలోఁ జెప్పి ఋషుల కిచ్చె

ఇట్టి సంపూజ్యభాషయం దెట్టు సాహ
సింపఁగలఁడు? సూతుఁ డుపన్యసింపఁ దనకు
లేశమగు నధికారంబు లేదటంచు
నెఱిఁగియుండియు శౌనకా! యెఱుఁగఁబల్కు.

ఈ సూక్తిసమాకర్ణనంబునఁ గొందఱు వాచంయములు విషాదచిత్తులై దిక్కులుచూడఁ దొడంగిరి. మఱికొందఱు పుల్లవడినమోములతో నావంకఁ జూడ్కులు ప్రసరింపఁజేసిరి. ఇంకఁ గొందఱు విహ్వలస్వాంతులై, యేమిచెప్పుటకుఁ దోఁచక యెవ్వరేమిచెప్పెదురో యని వేచియుండిరి. అంత శౌనకుండు పిడుగడచినట్లై, కొంతవడికిఁ దెప్పిరిలి సదస్యుల యాస్యబింబముల దృష్టి నిబద్ధముంజేసి రాల్పడు నీరెలుంగుతో—

వేదవ్యాసఋషీంద్రుఁ డెన్నఁడు చతుర్వేదోక్త ధర్మంబులున్
వేదాంగంబులు సంస్కృతంబున సదా విన్పించె సూతర్షికిన్
నాదంబేటికి? నాఁడె యద్విజులు నేర్వన్ నేర్ప గీర్వాణ భా
షాదోషజ్ఞతఁ బొంద నప్పు లయి రీ సందేహ మిం కేటికిన్?

కావున సందియుంపఁబడెడి కారణమేదియుఁ గల్గదైన నీ
భావము నమ్మకున్న యెడ వ్యాసుఁడు వేదవిభాగకర్తయే
యీవల కేగుదెంచి మన యెల్లర ముం దిదమిత్థమంచు సా
ఖ్యావహమంచు ధర్మగతి యంచు వచింపఁ దలంగనేటికిన్?

బాదరాయణుఁ డొక్కఁడే వేదవేత్త
యర్హుఁ డతఁ డొక్కఁడే సంశయంబుఁ దీర్పఁ
బహులు రవ్వంత చాల రీపని కటంచు
సరవిఁ గన్గవ యరమోడ్చి సంస్మరింప.

శీతవాతాతప జాత బాధలు లేని
మెఱుఁగు టొడలు మిఱు మిట్లు గొల్ప
మొలచుట్టి రాఁజుట్టి మెలివెట్టి దోఁపిన
డంబైన కృష్ణాజినంబు మెఱయ
భాగీరథీ దివ్య వారి ప్రపూర్ణ క
మండు లెడమప్రక్క మక్కళింప
యోగదీక్షావేళ నుపయోగపడెడి త్రి
దండంబు కుడిచేతఁ ద్రస్తరింప

పర్వతేంద్రుని దెసనుండి వచ్చు ఘాటి
జడలు గట్టిన వెండ్రుకల్ కదలఁ బాఱ
వ్యాసభగవానుఁ డింతలో వాయుగతిని
నుట్టిపడ్డట్టులయ్యె మా కట్టెదుటను.

ఎక్కడ హిమవత్పర్వత
మెక్కడ నైమిశము గడియ యేగక మున్నె
చెక్కుచెమర్పదహో! యా
చక్కికి నే తెంచె సిద్ధ సంకల్పుఁ డగున్.

బ్రహ్మ తేజంబు వదనబింబంబు నందు
నృత్యమాడుచు జగము మోహింపఁ జేయ
సంయములు లేచి కడు సంతసంబుతో "న
మోనమ" యటంచుఁ బల్కఁగ మోడ్పు కేల

మమ్ముల నట్టెచూచి యభిమానము రాగము త్రుళ్ళుచుండఁగా
ముమ్మరమైన వత్సలత మోమెసలారఁగఁ గూరుచుండుఁడీ
యుష్మలికమ్ముఁ బొందకుఁడి యోరిమి వేటుఁడియంచుమాదు తే
మమ్ము నెఱింగి సంతసిలి మన్ననతో నిటుపల్కెఁ బిమ్మటన్.

శౌనకా! నీవు మమ్మెద సంస్మరించి
నంతనే బుద్ధిగోచర మయ్యె మాకు
సర్వవృత్తంబు; నీదు సంశయముఁ దీర్ప
బుజు పథమ్మని దుర్వాసుఁ డెలమిఁ జెందు.

ఆలింపుము నా సూక్తులు
దూలింపుము తప్పకుండ దుష్కృత్యములన్
పాలింపుము ధర్మంబుల
గాలించియెఱుంగు శౌనకా! కర్మములన్.

దుర్వాసోముని! వినవో
గర్వారంభంబుడించి కడు శ్రద్ధమెయిన్
పూర్వాపర విషయంబుల
సర్వము చర్చించి ధర్మ సంగతి వినుతున్.

పతితపావన భాష గీర్వాణభాష
యంచు నెంచుచుంటిమి కాదె? యందుచేతఁ
బతితులకుఁ గల్గు నక్కఱ పాఱఁజూడ
నన్యులకుఁ గల్గునో కాక రన్యంతమైన?

పామరులై ద్విజేతరులు వర్తిలుచుండిరి గాన సంస్కృతం
బేమి జిఘృక్షునైనఁ బఠియింపఁగరాదని వక్కణించుచోఁ
బామకులం దరింపఁగల పాటవమబ్బుని భాషయేల? త
న్నామ విచారమేల? యవధానముతోఁ దలపోసి చూడుమా!

కరము పవిత్రవంతమగు గాంగజలంబుల ముట్టినంతనే
పరమదురాత్మఘోరతర పాపముకూడ నశించు నాగతిన్
సరబడితో ద్విజేతరులు సంస్కృతభాషను నభ్యసించినన్
దరణవిధానముం గలుగు ధర్మసమాదరణైక పద్ధతిన్.

ప్రాణి యొక్కఁడు సంసార బంధముక్తిఁ
గాంచు నెడల భాషా పరిజ్ఞానమునను
దెలిసియుండియు నయ్యది తెలుపకున్న
మనుజుఁడెందు నిషిద్ధ వర్తనుఁడు కాఁడె?

మఱియు జాతిద్విజుం డద్విజుని ముఖంబున ధర్మంబు లెఱుంగుటశిష్టాచారవిరుద్ధమందురో! ధర్మ ప్రతిబద్ధమందురో!! వేదప్రతిషిద్ధమందురో!!! గ్రహింప నయితికానిదయ్యె. అయి నను శిష్టాచారంబుఁ దెల్పెద నాకర్ణింపుము—

మగనాలో ర్తు కృపాకటాక్షమున సంభావించి తత్త్వార్థ మం
పఁగ విప్రోత్తముఁడయ్యెఁ గౌశికుఁడు ధర్మవ్యాధునింజేరి బో
యగ దా యంచుఁ దలంప కా మహితు వేదార్థావబోధంబునన్
విగతాఘుండగు టెల్ల మీ రెఱుఁగరే వేదాంతపారంగతుల్.

తదుపాఖ్యానంబు నామూలంబుగా వర్ణించెద నాలింపుఁడు—

కౌశికనామ భూసురుఁ డొకం డతి ఘోర తపో విశేషసం
వేశుఁడు యోగనిష్ఠ వట వృక్షము క్రిందఁ దపించుచుండ శా
ఖాశిఖరంబునంగల బకంబు శిరంబున విష్ఠవైవ నా
క్రోశముతోఁ గనుంగొనినఁ గొక్కెర యుక్కఱి నేలపైఁబడెన్.

పడిన ముదికొంగఁ గని జాలిపడి యతండు
లిప్పదిగనాడి దిగ్గున లేచి చనియె
నుంఛవృత్తిని జీవించుచుండు వాఁడు
నాటుపల్లెకు భిక్షాటనము కొఱకు.

అరిగి యిటులొక్కయిల్లాలివు టాలి యింటి
ముంగిటను నిల్చి యూరకే కొంగ ద్రుంగె
ననుచు నుడ్డుకుడిచి యుని యాడియాడి
కొనకు "భవతి భిక్షామ్ దేహి" యనుచుఁ బిలిచె.

పిలిచిన పిల్పు తత్క్షణమ వీనులలోఁ బడినంతమాత్రనే
మెలత పతివ్రతామణి యమేయచరిత్ర పవిత్రశీల ని
ర్మల సుగుణాభిరామ గరిమంబగు భక్తిని భిక్షుగొంచు రాఁ
దలపఁగ నింటికప్పుడు పథశ్రమతో దయితుండు వచ్చినన్.

చెమటబట్టఁబట్టి చిదచిదలాడంగ
నడచివచ్చినారె నాథ యిపుడు ?
శ్రమము పోవ నట్టి జలకంబులాడఁగా
రండి రండి యంచు రమణి యపుడు

చల్లనినీరు తోడి పతి స్నానముఁ జేసియు సేద దేరఁగాఁ
దెల్లమడుంగు దువ్వలువఁ దెచ్చి ధరింపఁగ నిచ్చి భోజనం
బల్లన పెట్టి ముచ్చటలనాడి పరుండఁగఁబెట్టి నిద్రఁబోఁ
జల్లఁగ లేచి భిక్షుఁగొని సాధ్వివతంసము వచ్చె సంతటన్

మొలకనవ్వులతో వచ్చు ముగుదఁగాంచి
యడగియుండని కినుకచే సాదుఁ గఱచి
కన్నుగవ కొనల్ గెంపారఁ గౌశికుండు
కర్కశస్వరమునఁ బల్కెఁ గంఠమెత్తి.

ఇంటి ముంగిట బ్రాహ్మణు నిట్టు నిలువఁ
బెట్టి పనిపాటలను దలపెట్టి యిట్టి
యాగడంబేల చేసితివమ్మ నీవు !
కొఱవిచేతను తల గోఁకికొనినమాడ్కి.

అలిగినేని విప్రుఁ డంబుధి జలమెల్లఁ
బుడిసిలింపఁగలఁడు గడియలోన
వానిఁ జెనకి యెవఁడు బ్రదికిపోయిన వాఁడు
సమయకుండ మూఁడు జగములందు.

అనిన నమ్మహాపతివ్రత మందహాసంబు మోమునఁ గొంక వింతశృంగారంబుఁ దెచ్చుచుండ నా బాపని కాకమాటలకుఁ జీకాకువడక—

కొక్కెర రెట్టవై చెనని కోపదురత్యయ దుష్టబుద్ధిచేఁ
బొక్కిపడంగఁ జేసితివి పోరచిగాదె భవత్తపంబు? నీ
కెక్కడి బ్రాహ్మణత్వము? మఱెక్కడి సద్గతి? యోర్పు లేనివాఁ
డక్కట! బ్రాహ్మణుండగునె? యార్యులు విన్న హసింపకుందురే?

శమదమంబులు లేక విజ్ఞాన ధనము
లేక సమదర్శికత్వంబు లేక యూరఁ
కొట్టు బ్రాహ్మణుఁడంచు గీపెట్టినంత
మాత్ర వచ్చునే బ్రాహ్మంబు? చిత్రమిదియు!

విప్రుఁ డగ్గిన లోకముల్ భీతిపడుట
నేను జక్క గ్రహించితిఁ గాని నీదు
కోప తీవ్రాగ్నికీలలు కొంగఁ జెఱచుఁ
జెఱపలేవు పాతివ్రత్య శీలవతుల—

అనుచు సాకూత సస్మితాననముతోడ
మర్మభేదకముగ నామె మాటలాడ
ధారణీసురుఁ డుబ్బఱాతఁ దటమటించి
యావఁ ద్రావినట్లగుచు నిట్లాడెఁ దుదకు:

తల్లి యెఱుంగకాడితిని, ధన్యవు, సైపుము నాదు తప్పు, నీ
యుల్లమునందుఁ జాల దయయుంచుము, దుర్లభయోగదృష్టిచే
నెల్ల గ్రహించి మించితివి, యేగతి నీకది లభ్యమయ్యె! నీ
వల్ల నెఱుంగఁగోరెదను వాకొనుమమ్మ యటంచు వేడినన్.

పతియే దైవమటంచు నమ్మి కొలువన్ ప్రాప్తించె నీ యోగమీ
వతికోపంబునఁ గొంగఁ జంపి యిటు భిక్షార్థంబునై రాఁగ మ
త్పతి యే తేరఁగఁ బూజలన్ సలిపి నీ భైక్ష్యంబుఁ గైకొంచు వ
చ్చితి రోషించితి వందుచేత నిదియా చెప్పంగదే ధర్మమున్?

ఎట్టి తపమొనరించిన నేమిఫలము?
బ్రాహ్మణత్వము నీకుఁ జేపడఁగలేదు
వినుమిచటను ధర్మవ్యాధుఁ డనెడి బోయ
కలఁడు వానిచే ధర్మముల్ దెలిసికొనుము.

అనినఁ గౌశికుండు కటకటంబడి నన్ను, బ్రాహ్మణోత్తముని, బోయకుశిష్యునిగాఁ బంపెదవె తల్లి యన నా నాతిరత్నము-

పుట్టువుచేతబోయయతిపూజ్యుఁడు బ్రాహ్మణుఁడయ్యె గర్మమున్
బట్టి వివేకి యంత నెఱవాది యొకండిలఁ గల్గఁబోవఁడీ
పట్టుల నీవు నిక్కముగ బాపఁడవౌటకుఁ గోరుదేని నీ
కట్టిడి యేలచేసెదవు? గ్రక్కునఁ బోఁగదె వానియొద్దకున్.

కౌశికమానిచంద్ర! యపకర్ష ఘటిల్లదు నీకు మాఘకా
దేశము విన్న; నాతఁ డుపదేశ మొసర్చుచు ధర్మముల్ పవి
త్రాశయుఁడౌటచేత వెనుకాడఁడు నమ్ముము, పక్షపాత మే
కోశమునందు లేదతని కోసము పోయిన గౌరవంబగున్.

అన విని కౌశికుండు మఱిమాటాడ వెఱచి యాపతివత్నీ రత్నంబుచే నామంత్రణంబు వడసి ధర్మవ్యాధుని గృహంబునకుఁ బోవ—

చీకులు వ్రేలఁగట్టుటను జీగిలిమాగిలియైన యంగడిన్
లోకులు మాంసమున్ విలువ లోపలికిం జనుదెంచి మూఁగఁ జీ
కాకును బొందకుండ నెసకమ్మున సంజుడు నమ్ముచున్న లో
కైకగుణోత్తరుఁ బ్రథితుఁ గన్గొని కౌశికుఁ డబ్బురంబుతోన్.

హింసాబహు ఘోరంబగు
మాంసంబును నమ్మ వృత్తి మానని పీనిన్
సంసేవించిన నేగతి
సంసారవిముక్తిఁ బొంద సాధ్యంబగునో!

అని సంశయగ్రస్తంబగు మనంబుతోఁ గొంతవడి వితర్కించి. యమ్మహాపతివ్రత వాక్యంబులు తిరస్కరింపనోడి ధర్మశీలుండగు ధర్మవ్యాధునిం జేరి వినయంబున—

నళినదళాక్షి పంపఁగ సనాతన ధర్మజిఘృక్షచే మిమున్
గలిసికొనంగ వచ్చితిని గావున మీరు విశిష్టధర్మవి
జ్ఞులు ననుఁ బాఱఁజూచి పరిశుద్ధమనస్కత ధర్మసూక్ష్మముల్
దెలిపిన వెంట నే నెఱిఁగి దివ్యపదంబును బొందవచ్చితిన్.

అని యిట్లు విన్నవింప ధర్మవ్యాధుండు సెలవులనుండి తొంగిచూచు మందహాసంబుతో నిట్లనియె—

పరిభవబుద్ధి నీవు బహు పాతకజమందున నున్న కొక్కెరన్
మరణముపాలుసేయుటయు, మానినితో వివదించి కోపివై
పరుసని మాటలాడుటయుఁ బాసలు వాపుకొనంగ వచ్చు టే
నెఱిఁగినవాఁడఁగాన వచియింపఁగ నద్దిక నీయుదంతమున్.

ధర్మవ్యాధుని దివ్యజ్ఞానమునకు విస్మయంపడి కౌశికుండేన పడక మనఃపూర్వకముగా సేవించి, యా మహనీయునిచే బోధితుండయి ధర్మంబులనెల్ల నెఱింగి, కృతకృత్యుండయి కాలానుసరణంబుగఁ గాలగోచరుండై ముక్తిపదంబు నొందెను.

బోయయు జామయు గురులై
మాయురె! యొకవిప్రు ధర్మ మార్గానుగతున్
జేయుట యెఱిఁగియు మీరిటు
పాయని సందేహమేల పడఁగా వలసెన్.

జ్ఞానులమంచు లోఁదలఁచి గర్వపడంగను మేలుగల్గ ద
జ్ఞానులఁ జూచి యేవపడఁ గార్యము కల్గదు జ్ఞానులెప్పు డ
జ్ఞానుల చెంతఁ జేరి యిదికా దిదియౌనని నచ్చఁజెప్పి సు
జ్ఞానులఁ జేయు టే విధియకార్యమయౌను మఱొండుచేసినన్.

గావున సజ్ఞులం బిలిచి కమ్మని నీతులు చెప్పమాని పైఁ
గా వివరంబుగల్గిన యొకండెవఁడేనియుఁ బజ్జఁజేరనే
త్రోవనౌ సాఁకుఁజెప్పి పెడత్రోవలఁబెట్టి కలంచుటెల్ల దు
ర్భావము, సెప్పనేల! యిది రాక్షస లక్షణమౌను శౌనకా!

ఇది భావించియె సూతునిం జిఱుతనాఁడే చేరఁగాఁదీసి యీ
చదువుల్ చెప్పుచు ధర్మముల్ స్మృతిరహస్యంబుల్ శ్రుతిజ్ఞానమున్
విదితాచార విశేషముం దెలిపి ధీ విస్తారునిం జేసి యొ
ప్పిదముం జూపితి మెల్లవారలకు సంప్రీతాంత రంగంబుతోన్.

అతని యవ్యాజ భక్తిచే నలరినాము
అతని శుశ్రూషచే మోద మందినాము
అస్మాఁ డాతఁడు మీ సత్రయాగమందుఁ
గథకుఁ డౌటకు నబ్బాట కల్గరాదు.

గీర్వాణభాషయం దం
తర్వాణులు మెచ్చుకొనెడి నైపుణ్యముతోఁ
సర్వము నాచేఁ దెలిసియు
గర్వింపఁడు చిత్తశుద్ధిఁ గలవాఁ డగుటన్.

ధర్మబద్ధముకాని చందమును జెప్ప
వేదసారంబుఁ దరచి చెప్పితిని దీని,
మల్లగుల్లము మానుమో మహానిచంద్రి!
పిదపకాలంబు వచ్చుచున్నది మఱింత.

సంతోషంబగు నిచ్చటన్ నిలువ మీజన్మంబుకై కాని మా
కెంతే నీయెడ నిల్వరా దుదయ మందే సేతు బంధంబునన్
సంతల్ దీరఁగఁ గ్రుంకఁగావలయుఁ గాసన్ బోధను·చ్చోట నం
చంత్స్థానముఁ బొందె వ్యాసఋషిరాట్ట్రాశ్చర్యధుర్యంబుగన్.

దుర్వాసుం డటుమీఁదనన్నుఁ గని సంతోషంబునన్ వ్యాసుఁడున్
సర్వాంగీణముగాఁగఁ జెప్పి మము నిస్సందేహులం జేసె నిం
కర్వాచీనులు మోదమంద భవదీయాలాప మాలించుచున్
బూర్వాచారవిదగ్ధులం దెలుపు సంపూర్ణ ప్రబోధంబునన్

ధర్మాధర్మములు నే
నిర్మలమతిఁ దెలిసికొనఁగ నిష్ఠురపరీక్షన్
ధర్మం బిప్పుడు దెలిసితి
నర్మిలి క్షమియింపుమయ్య! యాదరబుద్ధిన్.

కథకుఁడవై మాకు మనో
రథములు వెసఁదీరు విధము ప్రథితమనీషన్
వ్యథ లుడుగు విధముగా మధు
మథనుని కథఁ జెప్పుమనుచు మఱిమఱిపల్కన్.

అంత సత్రియాగమునందు నఖిలమౌని
వరులమ్రోలను గీర్వాణ భాషయందుఁ
బొగడినాఁడను భగవంతు నిగమవేద్యు
ఘనుని యఘమర్షణములైన కథల నెల్ల.

ఎవని ముఖాబ్జనిర్గళితమేని సుభాషిత మైన యట్టిచోఁ
బ్రివిమలభక్తిఁ గైకొనుట పాడి యెఱుంగుము, ఘోరపంక సం
భవమగు పద్మ మౌఁదలను బండితకోటి ధరింపుచుండ దే!
తవులదు ధర్మపీడ యవధానముతో నిటు లాచరించినన్.

ఇంతియె కాక మఱొండు సంగతిఁ జెప్పెద, సావధా
నంబుతో వినుము—

తెలియదె నీకు మీ తెలుఁగు దేశమునన్ బ్రిభవించి భక్తిసం
కలిత మహానుభావుఁడయి కాలిన గోపన విప్రజాతుఁడై
వెలసినమాట! యాతఁడు పవిత్రుడు మ్లేచ్ఛుఁడు నౌ కబీరుచేఁ
తెలియఁడె భక్తియోగము సుధీజన సన్నుత మోక్షపద్ధతిన్.

మ్లేచ్ఛసేవ నధర్మంబు లేనియెడల
నద్విజముఖంబునను ధర్మ మాలకింప
దోషమెట్లగు? నివి ధర్మ దూరులాడు
నట్టి వేద నిషిద్ధ వాక్యములు గావె?

కన్నదానిని గురులచే విన్నదాని
నేను వచియించితిని గాదె యిపుడు సిరిసి
వ్యాస శౌనక సంవాద మైన కథను
దీరెనే సంశయంబులు? తెల్పుమన్న.

అరఁటి పండు విప్పి యఱచేత నిడినట్లు
తెల్పినపుడు నాకుఁ దెలియకున్నె?
ధర్మశాస్త్రములును, దదరిహస్యములును
వేయుమాటలేల! వినుతశీల.

పలుమఱు విప్పిచెప్పితిరి వ్యాసుఁడు చెప్పిన పూర్వకాలమున్
గలిగిన కొన్నిధర్మములు గౌరవ బుద్ధిని వింటిఁగాని యీ
కలియుగమందు మే మిపుడు కల్గిన హేతువుఁ బట్టి మీరలున్
గలియుగ ధర్మముల్ నుడువఁ గాఁదగు సారెకు దేశికేశ్వరా.

నావిని సూతుఁ డిట్లనె, సనాతన ధర్మము లార్యధర్మముల్
గావున నెట్లు మార్పడును? కాలము కల్పము లేని మార్పులఁగా
లేవు సనాతనంబయి చలింపక సుస్థిరమౌటచేత నే
యీ వసుధాస్థలిన్ వినుతి కెక్కెను నాదిక ధర్మ మెంతయున్.

అరసిచూడఁ గృతయుగంబ యైనఁ దేత
యైన నేమి! ద్వాపరయుగ మైన నేమి?
కలియయిన నేమి? ధర్మ మొక్కటియె చుమ్ము
తారు మారగుచుండిన ధర్మమౌనె?

కర్మభ్రష్టునకైనన్
గర్మఠునకునైన ధర్మగతి యొక్కటియే
ధర్మము మారదు, కాలము
ధర్మమ్మును మార్చుననుట ధార్ష్ట్యము చుమిన్మా.

చిత్రవిచిత్రముగాఁ గృ
త త్రేతా ద్వాపర యుగ ధర్మంబులు దా
మై తుళ్ళుచు వచ్చుననుట
విత్రపులనునట్టి సూక్తి విధమిది కుత్తా!

ధర్మ మెప్పుడు నాల్గు పాదముల నడచు
నది కృతయుగంబు, త్రేత మూఁడైన, ద్వాప
రంబు రెండు, కలియొక చరణము, మైన
ధర్మవిచ్యుతిని యుగ భేదమగునన్న.

తెలిసీ తెలియక పలికెదఁ
దెలిపితి రే సంస్కృతంబు తీరౌకకొంతన్
దెలుఁగు విషయమ్ము నాకుం
దెలుపంగావలయుఁ దేట తెల్లమ్ముగ్గాఁగన్.

అన్యభాషను గడిదొంగ మైమె పఠించి
యందుఁ జేసుపత్రిష్ఠలఁ బొంవి పిదప
కుమయును నౌదార్యమును లేక శంక లేక
"అప్పకవి" వల్కెఁ దెలుఁగు కావ్యముల నిట్లు.

''ఉపమగల్గిన శయ్యల నొప్పియున్న
సంఘిభవుని కావ్యంబు గ్రాహ్యంబుకాదు''
పొమ్మనియె నౌర! యేమి చెప్పఁదురు మీర
లప్పకవి వాక్యములఁ గూర్చి యతనిఁ గూర్చి.

అంతట నిర్భరకరుణాగర్భంబులగు సూక్తుల—

మానిని వచించెను నెఱిఁగిన
దానిన్ వచియింపకున్న ధర్మధ్వంసం
బౌను కుమారా! నేఁడీ
మానవలోకంబు దురభిమతహితమగుటన్.

అప్పకవి పల్కులకు నేల యాగ్రహంబు?
పరులఁ దెగడువాఁ డెప్పుడు పలువ యగును
నేది యెట్లున్న ధర్మంబు నెఱుఁగఁగోరి
యడిగితివిగానఁ జెప్పెద నాలకింపు.

చదువులు చదివినవాఁడటె
చదువుటయేకాక శాస్త్ర సంశోధనమున్
బదిలముగఁ జేసెనటె యా
చదువుల ఫలితంబె యింత చక్కఁగ నుండెన్.

చదువులు గాల్పనే జగతి సత్యము శౌచము వృత్తశీలముల్
గుదురకయున్న వో మనుజ కోటికి? కూటికి నెన్నఁడేనియున్
జదివినవారు తొల్లి మన నాఁడులఁగల్గిరె? పొట్టకూటికై
చదివినయట్టి యప్పకవి సత్తము చిత్తముఁ కెట్టులుండెడిన్?

ఎఱుఁగవే పరశ్రీయాసహిష్ణు భావ
బంధురత నిట్టి గోముఖ వ్యాఘ్రవితతి
పుట్టుచుండు నప్పుడపుడు భూమిమీఁద
నీతిపేరిటఁ బ్రజకు దుర్నీతిఁ గఱప!

పరుల ప్రతిభఁ జూచి ప్రమఁజూచి ప్రథఁజూచి
కావ్యపటిమఁ జూచి కన్నుఁగుట్టి
యంఘ్రిభవుని కావ్య మగ్రాహ్య మని గొణ్గె
నప్పకవివరుండు తప్పుమాట.

గొణిగెనుగాని దొంగయయి గొణ్గిన నెంటనె రామరాజభూ
షణకవిసార్వభౌముని లసత్కృతినుండి గ్రహించె పద్యమున్
గణగణ మ్రోగు గంటమును గైకొనివ్రాయుటొ కెత్తు, పిమ్మటన్
మిణుకక దాని నిల్పుకొని నెగ్గుటొ కెత్తుగదా కుమారకా!

ఇంతియేకాని నిజముగాఁ గృతులయందుఁ
గుటిలబుద్ధి వీడితుఁడౌచుఁ గులముఁ బట్టి
గ్రాహ్య మగ్రాహ్య మనుచు నిర్ణయముఁజేయు
వానికెట్టి ప్రాయశ్చిత్తమైన లేదు.

పరిశీలించినఁ గావ్యరాజికి గుణప్రాశస్త్యముం బట్టియే
గురుభావంబు పొసంగు, నేల కులముం గోత్రంబు లెక్కింప? ఒ
క్కరుఁడైనన్ గవి భారతంబుబలె నొక్కండైనఁ దిక్కన్న యు
త్తరరామాయణముం బఠించునొకో! యీతార్కాణముం జాలదే!

అతి సుకుమార సౌరభ సమన్విత పేశల పుష్పమంజరీ
వితతినిగాంచి వెగ్గలపు వేడుకఁ బొందక తోటమాలి పం
డితవరుఁడైన బ్రాహ్మణుఁడు నిక్కముకాదని బైసిలిమాలి దు
ష్కృతమతిఁ ద్రోసిపుత్తునని తిత్తులువత్తైడు మూరుఁడుండునే!

అనిన యనంతరంబు జ్ఞానతృష్ణావిక్ష్యమానమానసుం
డనై వక్ష్యమాణంబుగా సూతమునీంద్రుని బ్రశ్నించితిని—

తెనుఁగును మ్లేచ్ఛభాషయని తిట్టి, శపించి, లిఖించి గ్రంథముల్
వినుకలిలేక యాంధ్రులను మ్లేచ్ఛులటంచును దూరనాడుచుఁ
గనుకనివాదులాడెడి జనంబుల కెట్టిగతుల్ లభించునో!
మునివర చెప్పుఁడయ్యనయమున్ మనుమార్గముదప్పకుండఁగన్

కన్న తెల్గుభాస గాసటబీసట
మాకు సంస్కృతంబె మాతృభాష
యని మృషోక్తులాడు నవనీసురులు తెల్గు
భాసఁ దెలిసి చదువఁ బాడియౌన!

చదివిన దోషంబగునే!

చదువంగారాని చదువు సాహసవృత్తిన్
జదివిన వారికి నిష్కృతి
పొదలునె యేమైనఁ జెప్పు పుణ్యచరిత్రా!

అన విని సూతమౌని తుణ మర్ధనిమీలిత నేత్రపద్ముఁడై
యని యెనునన్నుఁజూచియనయంబు తెనుంగునమాటలాడుచున్
దెనుఁగుఁ బఠింపుచున్ దెనుఁగు దేశమునం బ్రభవించి యెవ్వఁడీ
తెనుఁగుఁ దెనుంగువారలను దిట్టునొ నిష్కృతిలేదు వానికిన్.

మఱియు—

అరయఁ ద్రికాలవేదులయి నట్టి మునీశశిఖామణుల్ ధరా
మరులు పఠింపఁగూడదు సుమా! తెలుఁగంచును దొల్లి చెప్పిపో
యిరి యిదియాలకింప డెవఁడేని పఠించినవాఁడు ఘోరమౌ
నిరయమునందు యాతనల నింపిరివందురు వేయివర్షముల్

నిరయ మనుభవించి మరలి యామీఁదను
హీనజన్మ మెత్తి యెడలి యెడలి
మనుజుఁడగుచుఁ దుదకు మహిమీఁదఁ బుట్టును
వేదవాక్యమిదియు వినుము కుజ్జ!

దీనికి దార్కాణంబుగాఁ జిన్ని యుపాఖ్యానంబుఁ జెప్పెద నాకర్ణింపుము—.

కబీరుదాసుని పూర్వజన్మ వృత్తాంతము.

సప్తఋష్యాశ్రమ స్థలి నంటి యే నది
పాఱుచుండెడు నేడు పాయలగుచు
దక్షిణాపథ మెల్లఁ దరియింప నేనదిఁ
గొని తెచ్చె గౌతమ మునివిభుండు

నాదారుదైతుల కేదారభూములు
ఫలియించు నేనదీ వారిచేత
గంగానదీకల్ప గళితాఘయా దేన
వేంగిదేశంబెల్ల వృద్ధిఁగాంచె

అట్టి గోదావరీ నదీ ప్రాంతభూమి
నలరుచుండు ద్రాక్షారామ మందు వెలసెఁ
దెలుఁగువారింటి వేలుపీ దేవుఁడనఁగ
భీమనాథుండు నైరి దృగ్భిముఁడగుచు.

ఆపురి దేవశర్మయను నట్టి మహాత్ముఁడు భూసురుండు వి
ద్యాపరిపూర్ణుఁడొక్కరుఁ డుదారుఁడు వాసముఁజేయువానికిన్
బాపలు లేని పెద్ద వలవంత గుదింప యథోచితంబుగా
శాపలు మోద మొంద భయభక్తినొనర్చియనేక యజ్ఞముల్.

బుడుతఁ డొకఁడైన లేకున్నఁ బుట్టు గతులు
వాయు నా పితరులకు నివాప జలము
చుళుకమేనియు నిచ్చెడి చొప్పు లేదు
పుణ్యమిటు పాశాలెనని లోఁ బొగులుచుండ.

ఓ మెదు నోముపంటయన నొక్క కుమారుఁడు దేవశర్మకున్
మోమునఁ దెల్వివార గృహమున్ వికసింపఁగ సంభవించెఁ ద
ద్గ్రామనివాసులెల్ల నుడికారముతో మన దేవశర్మకున్
బూమెలపుట్ట పుట్టెనని పొంగి చెలంగి మెలఁగుచుండఁగన్.

శాస్త్రులనెల్ల రాఁబిలిచి శ్రద్ధను జాత సుకర్మముల్ యథా
శాస్త్రముగాఁగఁజేసి విలసన్నవ సౌరభ చందనాగరుల్
వస్త్రములిచ్చిపంపి బుధవర్యుఁడు పెద్దలయాజ్ఞచొప్పునన్
శాస్త్రి యటంచుఁ బేరిడెఁ బ్రశస్తకలాకుశలత్వ బుద్ధిచే.

జనకుఁడదె చేతిమీఁదుగా సాఁకుచున్నఁ
బూటకొకరీతి నిగ్గులపుట్ట యగుచుఁ
గూర్చుతల్లికి గారాల కూచి యగుచుఁ
బుటమరించెను మనశాస్త్రి పోసరించి.

బాల్యము చన్నయంత కులపద్ధతి శాస్త్రిని విద్యలందుఁ గౌ
శల్యమునుం గడింప గురు సన్నిధి కంపెను దేవశర్మ చా
పల్యము లేక శాస్త్రి చదువంగఁ బ్రయత్నముఁజేసి భావనై
ర్మల్యముతో సదా గురుపరంపరఁగొల్చుచునొక్కభాతిగన్.

అరువదినాలుగు కళలను
గురుముఖమున నేర్చి చదివి కూలంకష సు
స్థిరపాండిత్య ప్రతిభా
పరిణత చిత్తాబ్జుఁడగుచుఁ బాలుఁడు వెలఁగెన్,

గానకోవిదుఁడా శాస్త్రి కంఠమెత్తి
సామగానంబుఁ జేసినఁ జవలనుండి
తుంబురుఁడె తంబురటువైచి త్రుళ్ళిపడుచు
వీనుదోయిని నిక్కించి వినుచునుండు.

తర్క-వేదాంత ధర్మశాస్త్రముల నెల్లఁ
జతురమతితోడఁ గడముట్టఁ జదివినాఁడు
సంస్కృతంబునఁ జదువని చదువెలేదు
సుంతయేనియు గర్వింపఁ డింతచదివి.

కొంతకాలంబిటుచన్న యనంతరంబు—

చెట్టుచెడుకాలమున కొఱ్ఱు పుట్టుచుండుఁ
గుక్క-మూతిపిందియ లన్న ఫక్కిఁ బడుచు
శాస్త్రికారాటములు హెచ్చె సర్వభాష
లందుఁ బండితుండనెడి పేరందు కొఱకు.

కేరి తనతండ్రిమాటలఁ గేలిచేసి
తెలుఁగుబాసను జదువఁగాఁ దెగువచేసె
నడుముగట్టెను దాఁ బదినాళ్ళలోన
చదివి నైచెడఁ దెలుఁగంచు నెదురులేక.

అనవిని దేవశర్మయిటు లాడె విపర్యయ మేలచేసెదో ?
తనయ! వివేకవంతుఁడవు ధర్మువు పీసరఁ బుచ్చఁబోకు, మే
లెనయదు తెల్గుబాస మన మెన్నొతరంబులు ముట్టలేదు ము
ట్టినయెడఁ గీడుమూడునని దెప్పరమానని చెప్పిరార్యులుఁ.

కలఁగి దనతండ్రి పల్కిన పలుకులెల్లఁ
గంటిఱెప్పల తుదలనే గెంటివైచి
తన మనోనిశ్చయము మానమున నె తెల్పె
దిట్టయై శాస్త్రి నిర్వాత దీపమట్లు.

కడచెనో! లేదో! వత్సర మొకండు స్వయంకృషి చేసి దీక్షతో
ముదుఁగక తెల్గుబాసఁ గడముట్ట గ్రహించెను గుట్టుమట్టులున్
బడసె యశంబు పేర్పడిన పండితకోటియు మాఁగువారఁగా
బుదుతనుగూర్చితంద్రిమదిఁబొందుచునుండఁగ మోదఖేదముల్

ఈద్యతర ప్రభావమున నెన్ని గ్రహించిన నేమి ? ధర్మపున్
బిడ్యము లేక యే తలఁగఁ బెట్టినదాని ఫలంబుగా మనో
జాడ్యము మోసులెత్తె నిఁక శాస్త్రి విడాకుల నిచ్చె బుద్ధికిన్
బాడ్యమిఁగానరాని 'నెలబాలుడు' గన్పడకున్నె యావలన్ ?

సొబగున్ రూపముగాజువార మొగమున్ సొంపార నైవర్ణ్యమున్
నిబిడంబై యెసలార, సర్వసుకలా నిష్ణాతుఁడైనట్టి బా
డబుస్వాస్థ్యం బుబలాటమై తిబిరియై డక్కై సదా తిమ్మరియై
గుబులై గింగిరులై చనెన్ జివరకున్ గోరాడు పెన్మార్తియై.

కౌమరు ప్రాయంపుఁ బ్రేమంపుఁ గొడుకుకట్టి
కట్టి తనమందె యిటులౌటకుం జలించి
క్రమ్మ కన్నీరు బొటబొట కారుచుండ
దిగులు పడుచు శుష్కించెను దేవశర్మ.

ధర్మవ్యతికరణమ్మున
నిర్మలమతియైన శాస్త్రి నెంజిలిచేతన్
దుర్మరణంబందెను బ్రా
క్కర్మముఁ దప్పింప నెవరు కర్తలు ధరలో ?

పెద్దల మాటలన్ వినినఁ బెద్దరికంబిదె వచ్చుఁ బుత్రకా !
వద్దు పఠింపఁగాఁ దెలుఁగుబాస నటంచును దండ్రిచెప్పఁగా
నద్దములోని నీడకు భయంపడువాఁడనె ? యంచు మొండి దై
గ్రద్దరియై పొకాలెను గకావికలై జనకుండు కుందఁగన్.

పండితుఁడైన బ్రాహ్మణుఁడు పాదలిఁ ద్రోవను బోనివాఁడు ధీ
మండలి మండనుండు మను మార్గము దప్పిన కారణంబునన్
గొండొకకాలమున్ నరక కూపము నందు వసించి శేషమున్
వెండియు భూమిపై ననుభవింపఁగ జన్మ పరంపరావళిన్.

రంగశాయికివిందు. శ్రీరంగమందు
జన్మమెత్తెను నొక్క యాసామి యింట
గంగికుక్షికి వత్సమై కడకు శాస్త్రి
ప్రాగ్భవ విశేష పుణ్య సంపాదనమున.

తల్లి చనుబాలు నొకపూటఁ ద్రావి గడ్డి
పోఁచ యొకఁడైన ముట్టక పొక్కి పొక్కి
పొదుగు దుఃఖంబుచేఁ దల్లి పొదుఁగు మాని
తుదకు నుసురుసురనుచును దొరఁగె నుసురు.

తొరఁగిన వెంటనే యొడలు దొడ్డ గుణంబుల పట్టుగొమ్మదై
సురుచిర రూపసంపదల శోభిలి శుభ్రగుణాలవాలుఁడై
గురుతర రామభక్తి పరిగుంభిత చిత్త సరోజుఁడై గుణో
త్తరుఁడయి దేశికేంద్రుఁడయి తాఁ బ్రభవించెఁ గబీరునాముఁడై

పుట్టిననాఁటను గోలెను
బట్టిన శ్రీరామభక్తి పరతంత్రుండై
గొట్టినఁ దిట్టిన మెట్టిన
నెట్టినఁ దానేమి యనక నిర్మోహుండై

గతజన్మంబునఁ దండ్రి చెప్పిననుడుల్ కైకోక సంసార దు
ర్గతి బంధంబులఁ జిక్కుటం దెలిసి పూర్వజ్ఞాన సంపత్తి, సం
తత భద్రాచల రామచంద్ర చరణ ధ్యానంబుచే యోగియై
గతమోహుండయి సంచరించె నపవర్గ ప్రాప్తి జిజ్ఞాసుఁడై.

తెలుఁగునాఁడు నిరీహతోఁ దిరిగి తిరిగి
బ్రాహ్మణుండగు గోపన్న భక్తియోగ
ము నుపదేశించి రామదాసుని నొనర్చి
లోక సంసర్గమును మాని లోఁ దలంచి.

గేహము లేకపోయిన నకించనుఁడై యొకచోటనేని గో
దోహనకాలమైనఁ దన త్రోవను నిల్వఁగఁబోక కర్మసం
దోహముఁ బాసి యన్యజన దుర్లభ మోక్షపదంబుఁ బొందె వ్యా
మోహము లేని సజ్జనులు ముక్తిపదంబును బొందు టబ్రమే?

ఇట్లు శేషకర్మఫలంబు నెల్ల ననుభ
వించి మృతజీవుఁ డయ్యె గబీరుదాసు
మారు మూలలఁగూడ నీ పేరుఁ దెలియుఁ
దెల్గువాఁడవు నీకిది తెలియదొక్కొ!

ఎంత నిస్సంగుఁడైనను నెంత జ్ఞాని
యైన నెంత సాధుచరిత్రుఁడైన నరుఁడు
భక్తికర్ముఁడైననుగాని ముక్తిఁగనఁడు
త్రిజగములను నీ మాటకుఁ దిరుగు లేదు.

సూతుండిట్లు కరుణావిశేషంబునను, శిష్యవాత్సల్యంబు నను ధర్మంబుల విస్పష్టంబుగా బోధించి పదంపడి శేషధర్మంబులనెల్ల జేపు విన్పింతునన్న వల్లెయని భక్తిపూర్వక ప్రణామంబు లాచరించి కాల్యంబులఁ దీర్చికొనఁ బనివినితిని.

ప్రథమాశ్వాసము సమాప్తము



సూతమహర్షి స్వర్గలోక ప్రయాణము

గంగావతరణము

త్రివిష్టప సందర్శనము

నందనోద్యానము

నారద సూతర్షి సంవాదము

వేల్పుల వలస

ద్రావిడయోధుల మంతనము

శూద్రులు, శూద్ర శబ్ద వ్యుత్పత్తి

అసురుల వలస

ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జన్మవృత్తాంతము

# నెనరు

వేఁగుఁబోకనే పద్మముల్ విచ్చుచుండుఁ
గమ్మనెత్తావి విరఁజిమ్ము కాంక్షతోడ
నడుగఁబడకుండఁ బాంధుల యలపుఁబాప
నెట్టివాఁడైన నీమర్మ మెఱుఁగఁగలఁడె ?

# ఫ ల శ్రు తి

సూతప్రోక్త పురాణసంహితను సంశుద్ధాంత రంగంబుతోఁ
బ్రాతస్స్నాయములం బఠించునెడలన్ బ్రహ్మాయురారోగ్యముల్
భూతప్రీతియుఁ జిత్తశుద్ధియుఁ దమోలుంటాక వైరాగ్యమున్
నీతిప్రోత వివేచనంబు గలుగున్ నిత్యంబు సత్యంబుగన్.

# సూతపురాణము

## ద్వితీయాశ్వాసము

### జోతలు

మలమలమాడు పొట్ట, తెగమాసినబట్ట, కలంతపెట్టఁగా
విలవిలయేడ్చుచున్న నిఱుపేదకు జాలినిఁ జూపకుండ, ను
త్తలపడిపోయి జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బెట్టి నిచ్చెడి ప్రబుద్ధవదాన్యుల నిచ్చ మెచ్చెదన్.

చేసిన దోస మీశ్వరుని చింతనచే నశియించునన్న వి
శ్వాసము కల్గి రేఁబవలు, పాప మొనర్చుచుఁ దీరినప్పుడే
దో సమయంబునం గలముఁ దొందరగాఁగొని రామకోటినిన్
వ్రాసెడి భక్తకోటి పదపంకజముల్ శరణంబు వేఁడెదన్.

కామపరీతబుద్ధి గుణకర్మపరీక్షను మాని బ్రాహ్మణ
స్వాములఁ జేసి కొందఱిని భానిసలం బొనరించి కొందఱిన్
బూమెలు చెప్పి యీ భరతభూమిఁ గలంచెడి వర్తమాన హిం
దూమత సంప్రదాయమును దోసిలియొగ్గి భజింతు నిచ్చలున్.

పొచ్చెములేని మిండతలపొత్తయిసన్ బహుపాప మంచు వా
క్రుచ్చుచు నాలిక్రుచ్చులయి కొక్కిరి వేలుపు నాగవాస మం
దిచ్చెడి కమ్మతావిగల యెంగిలి భాగల మీఁది పేర్మిచేఁ
గ్రచ్చఱ యజ్ఞముల్ సలుపు బ్రాహ్మణదీక్షితులన్ స్మరించెదన్.

మఱచితిఁ దొల్లి పూర్వకవి మాన్యుల నెంచుచు మక్కిలీనుఁడౌ
బిరుదుమగండు సాయనము వేంకటనాథనృసింహచంద్రము సం
స్మరణ మొనర్పనైతిని ప్రమాదవశంబునఁ గాన నిప్పుడా
కొఱతను దీర్చికొంటి, నిదిగో! కుసుమాంజలి యొత్తి వానికిన్.

మాతృభాషవలని మమకారమునఁ జేసి
తెలుఁగు బాసఁ జదివి "దేశికవిత"
నుపుల కూర్ప నేర్చు నోరూపనస్ట్రాగాఁ
బలుక నేర్చినార తెలుఁగుకవులు.

## కథాప్రారంభము

ప్రథమాశ్వాసంబును నే
గ్రథియించితి సూతమౌని కరుణారస దృ
క్పథగమనుఁడనై యావలి
కథావిధానంబుఁ శౌనకా ! విను, వినుతున్.

అరుణోదయాత్పూర్వ మంబరంబున భార
త పతత్రి వేఁగు గీతములు పాడ
కలకలారావ సంకలన సంకులముగా
గ్రుడ్డుపుట్టువులెల్ల గూండ్లు వీడ
సౌగంధికాఘ్రాత జాతసౌరభసిక్త
మందానిలంబట్టె మలసియాడ
పుండరీకశరాసుతండంబు హాయిగా
గుఱ్ఱుపెట్టఁగ గొండ గుహలనీడ

నేఁగుజామున నే లేచి జాగులేక
జాహ్నవీ తోయములయందు స్నానమాడి
జపముఁగావించి సూతర్షి సాధుమూర్తి
మరలి నాతోడఁ దనయాశ్రమంబుఁ జేరి.

చీఁకటిగాన్గ చెట్టుకడఁ జింపిరి యూకుల చాఁపమీఁదఁ బుం
స్కోకిల కాకలీధ్వనులు శ్రోత్రపుటంబుల విందుఁ గూర్పఁగా
వ్యాకులపాటులేని హృదయమ్మున నమ్మని గూర్చుచుండి నా
కైకనుదోయి ద్రిప్ప సరిగా నుపవిష్టుండ నైన వెంటనే.

శేషధర్మమ్ములను వచించెద నటంచుఁ
జెప్పితివి నిన్న పుత్రకా! చెప్పుమోయి
నీ యెఱుంగవలసినట్టి నిఖిలమైన
ధర్మసూక్ష్మముల్ పెద్దలఁ దలఁచి యనిన.

పిమ్మట గురు గురుభక్తిని
నమ్మని మూర్ధన్యనాస నౌదల నిడుచున్
బన్మొరపాటును విడచి క్ర
మమ్మునఁ బల్కితిని వక్ష్యమాణ విధమునన్.

కంతముఁ జించుకొంచు సరిగా వినుచో నజచేతిలోన నై
కుంతముఁ జూపఁగాగలవు కొన్నిపురాణములంచుఁ జాల ను
త్కంఠతఁ గొందఱాడెదరు తథ్యము నా కెఱిఁగింపుమయ్య ని
ష్కుంఠచరిత్ర! మీకు బుధకోటి గరాగరి చెప్పినట్లుగన్.

సర్వసంగపరిత్యాగ సాధుమూర్తు
లైన మీకు మోమోటమి యనుట లేదు
కాన దూరుపోగడ్తలన్ గణుతిసేయ
కున్నదున్నట్టుగాఁ జెప్పుఁడో యతీంద్ర!

## ద్వితీయాశ్వాసము

దేవతాలోక మెదిక్కున వెలుఁగొందు?
కాలమానం బెట్టు గడలునందు?
దేవతలెవ్వారు? దేవేంద్రుఁ డెట్టిఁడు?
తన్మూర్తి యేరీతిఁ దనరుచుండు?
దేవేంద్రుఁ డొందుచేఁ ద్రిభువన సామ్రాజ్య
పట్టభద్రుండ నెడి ప్రణుతిఁ గాంచె?
దేవలోకమునందు దేవతాళికి నెట్టి
శీలవృత్తంబులు చెలఁగుచుండు?

అమరపరిపంథు లేభాతి నసురులైరి?
పుణ్యజనులైరి? రాక్షసమూర్తులైరి?
దేవయోనులకును భారతీయులకును
గాంగ నేమైన యున్నదే? సంగరహిత?

అనిన యంత పౌరాణికప్రకాండుఁడు, ప్రహృష్టాంతరంగుండై మున్నొక యప్పుడు స్వానుభవంబున నెఱిఁగిన సమాచారంబు సాంగంబుగా విన్పింతు వినుమని యిట్లు చెప్పఁదొడంగె

### సూతమహర్షి స్వర్గలోక ప్రయాణము

దారుకావని నున్న తాపసశ్రేష్ఠులఁ
బొడఁగాంచ నొకనాఁడు బుద్ధిపుట్టి
యోగబలంబుచే నుప్పొంగి నింగికిఁ
గనుఱెప్ప పాటులోఁ జనఁగ నచట

బ్రహ్మర్షి సంఘంబు బహుళసంఖ్యాకమై
వాదోపవాదముల్ ప్రస్తరించి
సర్వశాస్త్రంబుల జర్చించుచుండెను
నిరుపమానాతి పాండిత్యగరిమ

సభికులెల్ల బ్రహ్మానంద రసప్రవిష్టు
లగుచు నాలించుచుండి శౌనకాగస్త్యులై
సంత బ్రహ్మవాదులఁ జేరి యభినుతించి
తత్సభాస్థలిఁ గూర్చున్న తత్క్షణమున

దేవతలనుగూర్చి దేవలోకముఁగూర్చి
చర్చ తీవ్రముగను సాఁగఁజొచ్చె
సంయమీంద్రు లెల్ల సంశయగ్రస్తులై
యూఁగకున్న మీఁద నాగిపోక.

వివదించిరి సంయములు ప
లువు రొగి త్రిదివమ్ము దేవలోకం బనుచున్
బ్రవచించిరి "టిబెటే" యని
త్రివిష్టపం బగునటంచు దేవమునీంద్రుల్.

హిమవత్ భూధ్రము కైలా
సమహీధ్రము నుత్తరించి చనఁగఁ "టిబెట్" ని
క్కము కన్పట్టు ననుచు సం
యమివర్యులు కొంతమంది యని రొకనినాఁడున్.

క్రొందళు మరుభూమి కవలఁ
జెందిన దేశం బని తెగఁజెప్పిరి తుదకున్
సందడి బుట్టెను సభలోఁ
గ్రందుగ నలుమూలల 'నవ్వఁ గా ద'ను నుడులన్.

వారి వారించి మెలపుతో. వాలఖిల్య
సంయమీంద్రులు నావంకఁ జక్కఁజూచి
''కాయసిద్ధియు దివ్య సంకల్పసిద్ధి
కలుగువాఁడవు నీవేగి తెలిసిరమ్ము.

హిమవంతంబును దాఁటి మానవుల కెంతే వాసయోగ్యంబు కా
ని మహీభాగముఁజూచి మంచుపడు ఆనేలన్ విలోకించి వే
గమ యచ్చో వసియించు పంచజనులన్ గన్నార వీక్షించి సం
యమి లోకంబున కెల్లఁ దెల్పుమ''ని సంభావించి వాక్రువ్వఁగన్.

విని వెంటనె వింటి కెగసి
ఘనాఘనసమూహమధ్యగతుఁడ నగుచు బో
తిని మౌనీశ్వరు లాహా
యని దిక్కులుచూడ నుత్తరాభిముఖుఁడనై.

నదులు నల్లని త్రాచు లనంగఁదోఁచె
మలలు పిల్లల బొమ్మరిండ్లమాడ్కిఁ దోఁచె
గగనవీథిని వాయువేగంబుతోడఁ
బఱచుచుండఁగ నాకు విభ్రమము గదురె.

పచ్చనిపఠాంబట్టు పఱపువైచినరీతిఁ
బసరుఁగ్రొక్కాడి లతాప్రతతి యుండ
వెలిమబ్బుఁ దెగఁజించి తెలినీరు గొని త్రేవ
సన్నని శృంగరాజమ్ము లుండ
ఏకోసఁ గనరాని యెనలేని మందు నూ
కులు వేరు వెల్లంకు లలమియుండ
పిల్లికరూనల నైనఁ బెంపఁజాలిన సిరు
గొని కొండవాగులు చనుచునుండ

వెండిపూతఁ బూసినభాతి వెలుఁగుచుండఁ
గొఱలి కనులకు మిఱుమిట్లు గొలుపుచుండఁ
దోఁచు శృంగముల్ కంటఁ గందోయినిండ
మన్చు వారికిఁ బెనుదండ మంచుకొండ.

చదలదాఁకు ద్రుమాని మొదలు కుడులు పోదల
ఐదలు తుమ్మెదల రొదలు కదలు సదులు
విదులు క్రొందావి విరుగుత్తి పదులు పొదలు
మొదలు తుదలేని ముదిగొండ మొదలుగంటి.

గోలాంగూల లులాయ సూకర తరక్షు వ్యాళ శుండాల శా
ర్దూల న్యంకు హరీంద్ర సాలముఖ జంతుప్రాప్త హింతాల త
క్కోల వ్యాఘ్ర తమాల తాళ వివిధ క్షోణీజసంతాన మా
భీలంబై కనుపట్టెఁదుంగ హిమవద్భూమాంటపేర్భాటమున్.

# ద్వితీయాశ్వాసము

అంత నేనంతసాహసంబున, నెడతెగని మంచుబొట్టు దుమారంబు కన్గప్పుచున్నను, జుఱుకు చుఱుకునఁ దేలుగుట్టిన చందాన వడిగండ్లొడలికి నొప్పిగలిగించుచున్నను సరకుసేయక

తారాపథ గమనుఁడనై
యారూఢగతిం జనంగ నట పైపై నీ
హారావనీధ్రశృంగము
దారికి నడ్డంబయగుచుఁ దానరికట్టన్.

మిక్కిలి యక్కజపాటున
దిక్కులు పరికించుచుండ దీవ్యచ్ఛోభా
ధిక్కృత మందరయగు గిరి
యొక్కటి కన్పట్టె ముందు నుచ్చంబగుచున్,

నాలో నాలోచింపఁగఁ
గైలాసము మాట నాకు జ్ఞప్తికిరాఁగా
నైశమ నేలకు డిగ్గుచు
నాలోఁదచ్ఛైల విభవమరయుచు నటుపై.

చూచితిఁ గందళీపిహిత సుందర కందర మందిరావళుల్
చూచితి మాతులుంగతతి లుంగ లవంగలతాకుసుంగముల్
చూచితి నంబరావరణచుంబిధరాధర తుంగ శృంగముల్
చూచితి సిద్ధమౌనిజన శుద్ధ సమిద్ధకుటీర పద్ధతుల్

## ద్వితీయాశ్వాసము

పరిశుద్ధతోయమయమై
పఱపగు సమ్మంచుకొండ ప్రస్థముమీఁదన్
దొరలితొరఁ మందాకిని
పరిపాటిన్ వచ్చివచ్చి బయలంబడఁగా.

ముంగలఁ గైలాసశిఖరి
ముంగిట గండోపలములు మునికొనియుండన్
లింగాకృతితో సయ్యవి
గంగాస్రోతోనిపాత కషితము లయ్యెన్.

లింగాకారము తోఁడనున్న శిలలన్ లీలావిలాసార్థమై
నింగిన్ వచ్చెడి వేల్పుకన్నెలు సదానిఃఖేదులై సట్టి ని
స్నాంగుల్ దివ్యతపోధనుల్ గొలుతు రశ్రాంతంబు సద్భక్తితో
గంగా భంగజలాభిషేకమనుచున్ గౌతూహలప్రక్రియన్.

తత్కారణమున నేత
తత్కీలముమీఁద శిస్రుఁడు కూర్చుండి మహా
పత్కాలమ్మున నిజ భ
క్తోత్కరమును బ్రోచునంచు రుడుగక పెద్దల్.

మతిమాలిన కవిచంద్రులు
గతిమాలిన వారలగుచుఁ గడుకక యెవరో
బతిమాలిన నల్లిరి సి
బ్బితిమాలిన కత యిది యితివృత్తముగాఁగన్.

ఈ చిత్రకథం జెప్పెదఁ
బ్రాచీన కవీంద్రకోటి పల్కినరీతిన్
"దూచా"లు తప్పకుండఁగ
నీ చిత్తాబ్జమునఁజేర్చి నిజముం గనుమా.

## గంగావతరణము

ఉగ్రమయూఖ సత్కులసముద్భవుఁడై సగర క్షితీంద్రుఁడ
వ్యగ్ర సమగ్రజాగ్రదసి పాటితవైరినృపుండు, నిగ్రహా
నుగ్రహ శక్తిశాలి, యపనోదిత పాపచయుండు తొల్లి ప్ర
త్యగ్రయశస్వియై భరత ధారుణినేలె సనాతనంబుగన్.

సగరనృపాలమౌళి భుజసాహుఁడుదారుఁడు వైరివీర వా
రగుకు చమూప్రణాశన పరాక్రమ భద్రగశ్లాకుశీలవ్రుం
డగణితవైభవోన్నతిని నాప్తవచోగతి నశ్వమేధముల్
సుగతులఁ గోరిచేయుటకుఁ జొచ్చెను ముప్పిరి గొన్న వేడ్కతో

క్రించుదనమ్మునన్ రిపులు రేఁగి తిరస్కృతిఁ జూపకుండ లా
గెంచి సమస్త శత్రు పృథివీశ్వర సీమల సంచరింపఁగా
బంచెను దివ్యలక్షణ విభాసిత జాతి తురంగరత్నమున్
మంచిముహూర్తమందుబుధమండలి మెచ్చఁగశాస్త్రసమ్మతిన్

## ద్వితీయాశ్వాసము

విడిచిపుచ్చిన తేజి విశ్వంభరాస్థలి
ఖురపుటంబులచేతఁ గొట్టికొట్టి
ధారావిశేషంబు దైవార నుప్పొంగి
నింగి మీఁదికిదాఁటిఁ జెంగలిడుచు
హయపాలకులు దిగ్భ్రమాయత్త చిత్తులై
తేజి యీఁగడ సుంత తెలియలేక
వెనువెంటఁ బోయెడి వెఱ నెఱుంగఁగలేక
తేజి నిల్పఁగలేక తెగవులేక

పుడమిపతికి నివేదింప వెడలిపోయి
యజ్ఞదీక్షితుఁడైన ధరాధినేత
సగర సార్వభౌముని జేరి సంగతులను
విన్నవింప నాలించి పృథ్వీవరుండు—

అఱువదివేల పుత్రకుల నందఱఁబిల్చి తురంగరత్నముల్
సురపురినున్నఁ దెండు మదశోభితులై రిపులెవ్వరేనియున్
బోరిఁబోరి నష్టువచ్చునెడ బోరలుచీల్చుచు సూర్యవంశపుం
బరువు ప్రతిష్ఠ నిల్పి గరువంబును జూపుఁడటంచుఁ బంపఁగన్

ఉత్సాహపూర్ణులై యుద్భటారభటులై
యుద్వేగవంతులై యోర్పులేక
సగరావనీభర్త సంజాతులెల్లరు
వార్యంబు నెమకంగ బయలుదేరి.

కావునఁ గుతలం బెట్టెటొ
ఏవేగన్ గ్రొచ్చి త్రవ్వి ద్రవ్వి చక్రంబున్
బావఁగఁ గొట్టి హయంబున్
భూవరసుతు లీయవలయుఁ బోఁడిమి ననఁగన్.

అగునగు నంచు రాకొమరు లప్పుడె కొఱముట్లు తెచ్చి వా
రిగినెపు శక్తిసంపద సహస్రశిలుం ధర గ్రొచ్చి గ్రొచ్చి యే
పగిదినినైన ఘోటకముఁ బట్టి నృపాలవతంసు యజ్ఞమున్
ముగిసెడునట్లు చేయుటకుఁ బూనిరి త్రొవ్వి తదేకచిత్తులై.

బొఱియలు పెట్టి త్రొల్లిఁగొని భూమిని ద్రవ్వఁగ బాతిలోపలన్
ఎరిలెడి కప్పురీతి నొకనైపున గోచరమయ్యె మునుఁగలన్
దురగ మొకండు మౌనికులభూర్వహుఁడౌ కపిలుండు ధారుణీ
శ్వరతనుజాతులందఱును బాపురె! బాపురె! యంచునార్చుచున్

గికురించి మసల నీ ఘో
టకముం గొని తెచ్చి యిచ్చుటన్ జప మనుచున్
ముకుమూసికొనియె వీఁడని
యెకసక్కెము లాడుచుండ ఋషిచంద్రుండున్.

తపమును బాసి కోప పరితాప పరాభవతప్త చిత్తుఁడై
నృప యనుమాట రోసి తమకించి శపింపఁ గషాయతాత్ముఁడై
నృపులుల దిక్కు చూచునెడ సార విహీన విపన్న దేహులై
కపిలుని కంటి మంటఁబడి క్రాఁగిరి, బూడిదయైరి వెంటనే.

సగరుం డీ వృత్తాంత మె
ఱిఁగి వేగులవారివలనఁ బ్రియపౌత్రకునిన్
సుగుణాఢ్యు నంశుమంతుఁ డు
రగముం గొని తేరఁ బంపెఁ బ్రతలంబునకున్.

అంశుమంతుండు మతిమంతుఁ డగుటచేతఁ
జేతమున సంభ్రమంబును జెందకుండఁ
గపిలు సన్నిధిఁ జేరి నిష్కపటబుద్ధి
మ్రొక్కి, వచ్చిన కార్యంబు వక్కణింప.

అక్కటికంబుతోఁ గపిలుఁ డప్పుడు నొక్కి వచించె "నీపితల్ చక్కటిఁదప్పి సాధుల నెలార్చుచు బూడిద బొక్కణంబులై ప్రక్కిరి, నీవు మమ్ము బతిమాలఁగ వచ్చితి వందుచేత మీ జక్కిని నీవు తీసికొని సాఁగుము మీ సరపాలు వీటికిన్.

"బూది రాసులై పడిన మీ పూర్వులకును
గతులు కల్పింప నెంచుచోఁ గష్టమనక
మింటియేఱును గొని తెచ్చి మిడుకకుండ
దడుపు"మని యంశుమంతుతో నుడివి పంప.

అంశుమంతుఁ డంతట కపిలమహాముని యామంత్రణంబు వడసి యజ్ఞాశ్వంబును గైకొని, యజ్ఞదీక్షితుఁడయిన తాతకు సమర్పింప యజ్ఞంబు పరిసమాప్తిఁగావించి సగర సార్వభౌముండు కాలానుసరణంబుగా, దివంగతుఁ డైన నఖిలభూజన

# ద్వితీయాశ్వాసము

మనఃప్రియంబుగాఁ బట్టాభిషిక్తుండై, తాతలు సుగతిహీను
లగుటకు నతిదుఃఖితుఁడై

ప్రథితగుణుఁ డంశుమంతుఁ డత్యధిక భక్తిఁ
దాతలకు సద్గతులు గూర్ప దైత్యవైరిఁ
గూర్చి ఘోరతపముఁ జేసి కొట్టకొనకుఁ
జేయునది లేక ముక్తిని జెందెనంత.

అంశుమంతుని పౌత్రకుఁడౌ భగీర
థుండు నిష్ఠాగరిష్ఠుఁడై దొడ్డతపముఁ
గాలి బొటనవ్రేలిపై గాలిఁ దినుచుఁ
జేసి గంగాశివులను మెచ్చింప నపుడు—

కపిలత్తి మ్రోఁగుచు నొడలెఱుంగక గంగ
చిడిముడిపాటుతో మిడిసిపడుచు
సుడిగుండములతోడ శూన్యంబులోనుండి
నుచ్చిళ్ళుగ్రక్కుచు నులిసి నులిసి
శివ జటాజూటంబుఁ జేరి యందుండి బ్ర
హ్మావర్తదేశంబునందుఁ జొచ్చి
త్రోవఁజూప భగీరథుని వెంటఁ గ్రేళ్లుఱు
కుచు సాఁగి దేశముల్ కొన్ని కడచి

సగరవసుమతీశ్వర తనూజాతచయము
గ్రొచ్చి త్రవ్విన బొరియలగుండఁ బోయి
బూదిరాసులఁ దిన్నఁగాఁ బొడిచి తడిసి
గతులు కల్పించెనంత దుష్టాత్ముల కంట.

ఏతన్మూలంబున మందాకిని, భాగీరథీనామంబున జగద్విశ్రావంబుఁగాంచి, పతితపావనియను వాసిఁగాంచెనంట.

బొరియలేడుపెట్టి భూమండలముఁ ద్రవ్వి
గంగనీరుఁదెచ్చి కడుపునింప
జలధులేడుగల్గె సగర భూజానికి
ముందులేదహో! సముద్రచయము.

సప్తసముద్ర సంతతి విశాల మపార మగాధమై పరివ్యాప్తముగాన నెట్టిలోక వాహిని నీరము నింపుసంచు సంతృప్తులుగాక కొందఱాక తీయనఁ బల్కెడ రంతెకాని పర్యాప్తముగాఁగ రేయింబవ లప్పుల నింపిన నిండెనుండునే?

వెగ్గలపుఁ బట్టుదల నొక్క వగ్గుతపసి
పుక్కిటనుబట్టి తిన్నగాఁ బుక్కిలింపఁ
జాలని జలంబుఁ గూలంకషామతల్లి
యొకటి గొని తెచ్చి యొకచోట నుంపలేద?

## ద్వితీయాశ్వాసము

గగనంబులోనుండి గంగమ్మ శివుమస్త
మున దూఁకె ననుమాట ములుచమాట
అతి తపోనియతిచే నల భగీరథుఁడు గం
గను దెచ్చె ననుమాట కల్లమాట
గంగాజలంబుచేఁ గంధి నిండింపఁగా
బడియె సుమ్మనుమాట బడుగుమాట
శైవ జటాజూట సక్తయై తిరుగాడె
వేల యేండ్లనుమాట వెఱ్ఱిమాట
సగరసుత భస్మరాసుల సరవి దడిపి
స్వర్గమునకంపె ననుమాట వట్టిమాట
టక్కునేర్పడి కవుల గంటాల వ్రాఁత
కాదనఁగరాదు ప్రాచీన కవులుగాన.

గంగామూల మెఱుంగఁగోరి సగరాత్మనేతృ పౌత్రుండు వే
గంగాకూలముఁ బట్టిపోయి తుదకుం గార్యంబు సాధింప శీ
ర్ణాంగుండై మరణించెఁ గత్కథను బర్యాలించి తత్పుత్రుఁడు
త్తుంగఖ్యాతిని బొందెఁ బటినపనిన్ దుర్వారుఁడై తీర్చుచున్.

గంగాతటినీమూలము
సాంగముగ నెఱిఁగి భగీరథాఖ్యుఁడు పృథుకీ
ర్తింగనె భాగీరథియని
గంగాశైవలిని దాన గణుతికి నెక్కెన్.

గురుతర హిమవద్ధరణీ
ధరపరిసరము త్తరించి తత్పరమతితోఁ
మరుభూములఁ గని మరలితి
సురకరువలి చుట్టుముట్టి సుడివడి పెట్టన్.

మంచుగప్పిన మరుభూమి మండలంబు
మీఁదఁ బడి యేటవాలుగా మిహిరకిరణ
పాళి కన్ను చెదరునట్లు ప్రతిఫలించి
యినుమడించి విస్వీథికి నెగయుచుండె.

అరుదగు గుట్టమిట్టలను సన్నిటఁ జూచుచుఁ బోయి పోయి యు
త్తరకురుభూములం గడచి దవ్వులనున్న త్రివిష్టపంబు సం
బరపడి చూచి యాపొలము పచ్చికబీళ్ళను దోఁట దొడ్లకున్
వరుసగఁ గాంచి యట్టె నిలువంబడిపోతి భ్రమాకులుండనై.

విపుల సరోవరంబొకఁడు వీక్షణమాలిక కస్తురాఁగ నే
నపుడు తలంచినాఁడ నిదియాఁగదమానసమంచు భంగముల్
తపతపమంచుఁ గూలములఁ దాఁకుచుఁ బైఁబడుచుండ నింతలో
రెపరెపమంచు లేచిచనె ఆప్పున మింటికి రాజహంసలున్.

బంగరు పూఁతఁబూసిన విభాతిని దోఁచెడి తమ్మితూండ్లతోఁ
దొంగలి తోకలం దెగడి మూకొనివచ్చెడి కమ్మతావులున్
రంగరు వన్నె చిన్నె గల రంగుపులుంగుల నంగికూయి యు
ప్పొంగఁగఁ జేసె నన్నుఁ బరిపూర్ణరసానుభవంబుఁ గూర్చుచున్.

ఏమియు దూరభారమని యెంచక నేను త్రివిష్టపంబుఁ గ
న్గొ మదిఁ బట్టుపట్టి యిదిగో! యదిగో!! యని పోయి పోయి బి
డ్డా! మిహిరుండు కన్పడనియట్టి పొలంబుల దాఁటిపోయి యా
యామడ లుత్తరించి మఱి యామడ లెన్నియొ సాగి నిల్వఁగా.

దూదిపింజలరీతి దులదుల పడసాఁగెఁ
బై నుండి హైమంబు పట్టపగలె
పూగుత్తులను భ్రాంతి పుట్టఁగా మిక్కిలి
కసిదీర వడిగండ్లు విసరికొట్ట
మిట్టమధ్యాహ్నంబె మిథునముల్ చెలఁగేగి
చెట్టుచెట్లలఁగుట్టు చేరసాఁగె
కనుఱెప్పపాటులో గలిసిన మిథునమ్ము
లప్పుడే తారుమా రగుచునుండె

చేతులును గాళ్లు క్రొవ్వలి చేతసప్పుఁ
గొంకరలు పోవఁజొచ్చెను గొలఁది గొలఁది
వింతదేశంబు దీనిలో వేగుబెట్టు
లనుచు నాందోళితస్వాంతుఁ డైతి నేను.

పాలు సెలయేళ్ళ నీరి తుంపరలతోడ
విరుల క్రొందావి విరఁజిమ్ము తరులనీడ
సురల యాచారములనెల్లఁ జూడఁగోరి
యెదురుచూచుచు నిలుచున్న యంతలోన.

## ద్వితీయాశ్వాసము

### త్రివిష్టప సందర్శనం

లెంకలు వంకల నిలఁబడి
యంకిలిమాన్పఁగ స్ఫురత్సుమాంచద్ధాళీ
పంకిల ఘంటాపథమున
బంకేజాతాస్యయోర్తు వచ్చుచునుండన్.

అంగజాలల నెవ్వరీ యోఁడుపడుచు
తెల్పుఁడంచును నేను ప్రార్థించినంత
వారు తెల్పిరి యూర్వశీభామ యీమె
యధిక లావణ్యసీమ, వేశ్యాలలామ.

ఎదురులేనట్టి నెఱజాణ యెమ్మెలాఁడి
యీమె వాంఛితార్థంబు లీడేర్పకున్న
దిట్టు. దినకుండఁ బోవలే రెట్టివారు
మాటిసంగ యాయమ యంచు మాటఁదెల్ప,

దడదడలాడె గుండెలు యదాయదలై మునుదొంగ ప్రొద్దునన్
విడివడిపోయి పైకొనఁగ వెంపరలాడుచుఁ జేర నర్జునుం
డొడబడకుండినం గినిసి యుంకి, నపుంసకుఁ జేసె నీమె నేఁ
డుడుగునె యొంటి నగ్గనిన నుక్కిరి బిక్కిరిచేసి చంపదే.

బండవానిచేతి చిటేలు బదరు వేల్పు
టాలి కీల్జడ ప్రేటు పెఠేలుమనఁగ
సొమ్మసిలకుండఁ గన్నీరు గ్రమ్మకుండ
నొంటిప్రాణంబుతోనైన నుండుటరిది.

### ద్వితీయాశ్వాసము

సభ్రవీథీ విటంకంబు నందనుగు వి
మానములు సౌధములఁదాకి మరలు మంచు
నాపురీ సంస్థితులను గన్నారఁజూడ
మేఘమండలమందున్న మెలపుదోఁచు.

నేనంతట నెమ్మదిగా నడుగులు లెక్కించుకొనుచు ముందులకుఁ బోవంబోవ___

నగ్నలై రాగ నిర్మగ్నలై చదలేటి
యందున జలకంబు లాడువారి
జున్నను తేంట్లతో జూజంబులాడుచు
హరిచందనము క్రింద నొరగువారి
కోఁకను కొంగ్రొత్త కోడెగాండ్రనుజూచి
వాలారుచూపులఁ బట్టువారి
మేలువారలఁగూడి మిన్నేటి యిసుక తి
న్నెలను వెన్నెలరేల మెలఁగువారి

గంగగట్టునఁ గడిమిడి గట్టి నేల
నీరములపొంత తమయంత గూరుచుండి
చిత్తరువు వ్రాయు బిత్తరి చేడియలను
నిర్వైర పడిపోయితి నిదానించి చూచి.

## ద్వితీయాశ్వాసము

విష్టపత్రియమందు విజ్ఞుఁ డెవ్వండేని
తపము సల్పుచునున్నఁ దల్లడిలును
తనకొంప గూలిపోయినరీతి నాహార
పానీయములు మాని పల్లటిలును
అసహాయస్థుఁడై భీతుఁడై ప్రతీకారంబుఁ
బొనరింపఁజాలు నిబ్బరము లేక
మంత్రతంత్రంబుల మాఱుఁగన జపరాంత్రి
మాలిమితో బతిమాలి, యింటి

పట్టాసం బదినాల్గని పట్టమనుచుఁ
గుడిచి కూర్చుండనీయఁడీ కుత్సితుండు
రేయిఁ బవ లెల్ల లోకముల్ ద్రిమ్మరంగఁ
జెప్పి పంపించుఁ దననూట చెల్లుననుచు.

ఆఁడు కడుపునఁ బుట్టినవాఁడు కాఁడొ
ఆఁడువారల యగచాట్లు నాలకించి
యాదరింపఁడు, స్వర్గంబునందునున్న
వేల్పు సానులగతు లిట్లు వేగుచుండె.

అంచు రోషించి మంత్రరుద్ధభుజంగమువోలె, నాభుజంగి
చేయునది లేక నిట్టూర్పు విడచి—

## ద్వితీయాశ్వాసము

చక్కని రాచబాటఁబడి సాఁగుచుఁబోవ నశోకవృక్షముల్
చిక్కని పూవుఁదేనియలు చింది పయిఁబడఁగార్చు చుండఁగా
మక్కని జంపుజొంపముల మాటున దాఁగిన పూవుగుత్తులున్
జిక్కణమైన రీతి విరఁజిమ్ముచునుండెను గమ్మతావులున్.

చల్లని మ్రాఁకుల నీడను
పల్లాడుచునుండ మార్గమధ్యమునందున్
తెల్లని యుడుపుల దొడిగిన
గల్లంతులమారి జాణ గకవిక నవ్వన్.

వలిపంపుఁ జీరఁగట్టియుఁ
గలపంబునుబూసి కర్ణికారపుఁ జెవులన్
నెలయఁగ సొగసుగ నిల్చిరి
వలభీపార్శ్వంబులందుఁ బల్లవపాణుల్.

కలకల నవ్వుచు దిశలన్
గలకలమను నెమ్మొగంబు కాంతులు పర్వన్
గలకంఠస్వరములతోఁ
గలవాణులు పాడుచుండఁగా విని యంతన్.

రాచబాటను విడనాడి ప్రక్కనున్న
చంద్రకాంతశిలాచయస్థగితమైన
వీథిఁబడి పోవుచుండఁ ద్రివిష్టపమునఁ
గానరాని విస్తారముల్ గానిపించె.

# ద్వితీయాశ్వాసము

అంత నా గబ్బుగొట్టుటచే నుక్కిరిబిక్కిరియైనటులుండి యేమియుఁ దోఁచక, నే నిటునటు పోయి పోయి, కొలువ్రఁ దీర్చియున్న వేలుపు సురతాణిహజారముం జేరి, మణిమయ పట్టభంగమ్ముల భంగమ్ము నందక దౌవారికులం ద్రోసికొని, నిండోలగంబుఁజొచ్చి విలోకించుడు—

ప్రాచీనబర్హి విలసత్
ప్రాచీ దిక్పాలకుండు తగఁ గూర్చుండెన్
బ్రాచీస బర్హిపీఠిని
వాచంయమి గణము కొల్వఁ బ్రాభవ మొప్పన్.

మోళికట్టెడువాని మోచేయికడనుండు
కోలెమ్ము కొంకపక్కి గునిసియాడ
దనుజుం డొనర్చిన దండచే మచ్చలు
పునుఁగు పూఁతలలోనఁ బొనుఁగుపడఁగ
జారుచుండిన యొాడు సవరించుకొని తుంబు
రుండు పాటలు పాడి యొప్పచుండ
తెలగంటిబోటులు తెలచిన కనులతో
వింజామరలుపట్టి వీచుచుండ
రాజసంబు దీపింపగా భ్రాజమాన
విమల చింతామణీ భద్రపీఠమందు
నంగజాలలు సందడి నాఁగుచుండఁ
గొలువుఁదీర్చి మహేంద్రుండు కూరుచుండె.

భోగములాసఁజేసి చనిపోయినపిమ్మట వానిఁ బొందఁగా
యాగము లాచరించిన ధరామర దీక్షితకోటి పుంగలన్
గాగర గొంగుదాఁకినటు గంతులు వైచెడి స్వర్గ వారకాం
తా గజదంత దంతురిత తాండవకేళిని గంటి మచ్చటన్.

తెలుగంటి దొరనుఁ జూచినఁ
దిరముగ సందేహ మొండు దీరెను నాకున్
తెరఁ దీసినభాతిగ నా
తెరఁగును విన్పింతుఁ జేటతెల్లముగాఁగన్.

పాత్రిచీస బర్హినా వన్నెవాసికి నెక్కి-
దేవతాపతి దేశ దేశములను
"పాత్రిచీసబర్హి" శబ్దమ్ము జానుతెనుంగు
బాసయందున నెనసు బాత్రఁత నెమిలి
చిత్రచిత్రంబుగాఁ జిత్రింపఁబడియుండు
వేలకన్నులు బర్హిపింఛమందు
వేఁ గన్ను లుండెను వేల్పు టలికమేన
నన్న వదంతిని సందేహాన

నకట శబ్దార్థమునుబట్టి యంతరించె॥
గాపురుష యోగ్యమైనట్టి కథ యొకండు
వేయి గన్నులు నాకు గన్పింపలేదు
పాడలుమాత్రము గన్పించె నొడలినిండ.

పౌరాణిక గాథా ప్రబంధసిబద్ధములగుచున యిట్టి కథలు పెక్కులుగలవు. వానిలోఁ గొన్నింటి నిట వివరింతు, దత్తావధానుండవై యాకర్ణింపుము. ఆకర్ణించిన పిమ్మట సత్యంబు బోధపడఁగలదు—

ధరణీంద్రుఁడైనట్టి దశరథున కరదం
 బులు పది గలవంచుఁ బలుకునటుల
దైత్యేశుఁడైనట్టి దశకంఠునకుఁ గంఠ
 ములు పది కలవంచుఁ బలుకునటుల
దితిజసేనానియౌ త్రిశిరునకును మూఁడు
 తలలు గలవటంచుఁ బలుకునటుల
ఋషిపుత్రుఁడైనట్టి ఋష్యశృంగున కొక్క
 మనుబోతు కొమ్మునందె ననెడునటుల

 వినుము ప్రాచీనబర్హికి వేయిగనులు
 కలవని పురాణములు పల్కెఁ గంఠమెత్తి
 వేయికన్నులు నాకుఁ గన్పింపలేదు
 పొడలుమాత్రము కన్పించె నొడలినిండ.

మాండవ్యముని లోకమాన్యుండు మాండూక
 మునకు జన్మించినాఁ డనెడిరీతి
సుశ్లోక చరితుండు శుకయోగి శుకిగర్భ
 మున సంభవించినాఁ డనెడిరీతి

మానితల్లజుండైన శౌనకబ్రహ్మర్షి
శునిగర్భమునఁ గల్గె ననెడురీతి
అఖిలాస్త్రసంవేదియైన యశ్వత్థామ
యశ్వమునకుఁ బుట్టె ననెడిరీతి

వినుము ప్రాచీనబర్హికి వేయిగనులు
కలవని పురాణములు పల్కుఁ గాని మెత్తి
వేయికన్నులు నాకుఁ గన్పింపలేదు
పొడలుమాత్రము గన్పించె నొడలినిండ.

అప్పుడు త్రిదివలోకేశ్వరుని సన్నిధి సంతర్వాణి వ్యాయంబునకుఁ బ్రచండవాదంబు ప్రవర్తిల్లుచుండెను. ఎవ్వరని యచటి వారి నడుగ దేవగురుండగు బృహస్పతియు, స్మృతిరచయిత యగు మనువని నా కెఱింగించిరి. నేనును వాదంబేమియో, యెట్లు ముగియునో యని వేడుకపడి చూచుచుండ, దేవగురుం డావేశముతో మనువు నుపలక్షించి యిట్లు ప్రశ్నించెను— .

ఊరక యుండలేక యెటులో స్మృతియొకండు లిఖించెనన్నచోఁ
జేసుప్రతిష్ఠ వచ్చునను వెంపర వేడుక వ్రాసితో కటా ! మీ
భారతవర్షమందుఁ దలవంపులుగల్గఁగఁ బంచితాలికిన్
దీరని హైమనస్యము గదించుచుఁ దప్పిజ కెల్లకాలముల్.

## ద్వితీయాశ్వాసము

జాతులఁబట్టి మేము స్మృతిసంహితలన్ రచియింపలేదిటన్
జాతులఁబట్టి తప్పులు విచారణఁజేయము శిక్షచెప్పఁగన్
జాతులఁబట్టి ధర్మము ప్రచారముసేయము బందుకట్టి నీ
భూత దయాగుణంబునకు మోదము నందితిఁ జెప్పనేటికిన్ !

అజ్ఞాను లొనరించు నపరాధములకెల్ల
నతిమాత్ర శిక్షలు న్యాయమయ్య ?
జ్ఞాను లొనర్చు దోషముల కన్నింటికి
నామమాత్రపు శిక్ష న్యాయమయ్య ?
ఒకరీతి నేరంబునకుఁ బెక్కురకముల
దండనల్ విధియింప ధర్మమయ్య !
భరతవర్షమునందుఁ బ్రజలకు ధర్మైక్య
సంచారమును మాన్పఁ గాడియయ్య ?

ఆంధ్రులను మ్లేచ్ఛజాతులయందుఁ జేర్చి
వ్రాసిపెట్టితివిదియేమి పాపమయ్య ?
ఆంధ్రజాతి గూరిచి యెట్టి యానుపాను
తెలియకుండంగ స్మృతి నేల పలికితయ్య ?

వానవంగుళ్ళకోర్చి రేఁ బవలు ఱెప్ప
వాల్ప కూడిగం బొనరించు ప్రాతలకును
బ్రాత, యెంగిలి, పొల్లును బ్రతిఫలంబ
టంచుఁ జెప్పితి విదియెట్టి న్యాయమయ్య ?

భద్రముఁ గూర్పఁగాఁ బ్రజను వ్రాసితి నీస్మృతి నందు వయ్యయో!
శూద్రునకున్ ధనం బనురక్తిఁ బడున్ జగమెల్లనంచు నే
మాద్రి రచించితో మనుజమాత్రుఁడు కాఁడొకొ శూద్రుఁ డక్కటా!
శూద్రుఁడవీవొ! లేక మరి శూద్రుఁడవో! చెప్పు మునీంద్రసన్నిధిన్,

ఒక్కటి యడిగెదఁ జెప్పుము
యొక్కటి ''శూద్రంగొంకార గోద్గాస్య'' మటంచు
చెక్కరణీ స్మృతి వ్రాసితి
నక్కటికము నీకు సుంతైనను గలదే?

కటికవానికిఁ గల్గు నక్కటికమైనఁ
గానరాదు నీయెడల మహానుభావ!
ఋషివి యెట్లైతి వేగతి స్మృతిని వ్రాసి
ధర్మనిర్ణయమ్మును జేయఁ దగితి వయ్య?

గరుడ గంధర్వ కిన్నర కింపురుషముఖ్య
నానాప్రథిత దేవయోనివితతి
జాత్యంతరు లనేక శతవర్షములనుండి
యిందొక్కచో వసియింపలేదె?
పక్షపాత విశిష్ట శాస్త్రస్మృతుల మేము
రచియించినారమే క్రమముఁదప్పి?
ఐకమత్యముతోడ నన్నదమ్ముల రీతిఁ
జరియింపలేదె పొచ్చెంబులేక

ప్రజలయం దెచ్చులోచ్చులు వర్ధిలంగ
స్మృతులు వ్రాయించు భూపతుల్ స్మృతులువ్రాయు
పండితావళియున్న భూమండలంబె
యదుపులేనట్టి మ్లేచ్ఛ రాజ్యంబు సుమ్ము.

ప్రజల సమదృష్టితోఁజూచి రాష్ట్రమందు
నీతిబాధలు లేకుండ నీతిగల్గి
ప్రజలఁబ్రోచుట రాజధర్మంబు కాని
పక్షపాతంబుఁ జూపింపఁ బాడియౌనె!

ఈ సూటిపోటు మాటలకు మను వులికిపడి క్షణకాలం బాగి యీ విధంబుగాఁ జెప్పఁదొడంగె—

అప్రతిమాన బుద్ధిధనులై స్మృతికులం దలకిందుసేయు మా విప్రులు కొందఱట్టె పలవించి కడున్ బలవంతపెట్టఁగా నప్రతిభుండనై జడుఁడనై స్మృతి వ్రాసితి సర్వ క్షమింపుఁడీ క్షిప్రగతిన్ బ్రమాదపడి చేసినకార్యముగాన గిప్పతీ!

అనుమాట లాలకించుచు
ననిమిషగురుఁ డంతఁ బల్కె నాత్రముతోడన్
వినుమని శ్రద్ధాభక్తుల
మనువు సమాలింపనుండె మక్కువతోడన్

కల్లోలితసముఁ బూనకు
మిల్లిదిగో! దివ్యదృష్టి నిచ్చెద నీకున్
మెల్లన భారతదేశం
బెల్లన్ గనుగొమ్ము నిన్ను నేమను కొనునో.

నేనును భారతదేశకష్టగాథాప్రపంచమంతయు నెఱింగినవాఁడ నగుటచేతను, మనువు బృహస్పతివాక్యంబులు పూర్వపక్షంబు సేయనేరక డిల్లపడియుండుటచేతను సభనుండి గోసి మగిడివచ్చుచు స్వర్లోకంబు వీక్షింప బయలుదేర—

హిమవాలుకాఝరీతటి
సుమనస్స్త్రీ మిళిత లలిత శుభ్రామృతగంగా
శమితాధ్వీరు శ్రమగా
ప్రమదోద్యానంబునుండి పాఱుచునుండెన్.

ఆ సెలయేళ్ళ గట్టుకడ యంచుల వెంబడి సాఁగిపోవఁగా నానవయోనులైన వివిధాగమతండము జాగరూకులై కాసెలబిగ్గఁగట్టి మడిఁ గట్టుచుఁ బాదులుత్రవ్వి నీరమున్ దోసెలఁబోసి పెంచు పూవుఁదోఁటల కాపరిమూకఁ జూచితిన్.

నందనోద్యానము

నందనముఁ జూచు కోర్కులు సందడింపఁ
బారిజాత పరిమళంబు దారిఁజూపఁ
గమ్మతావుల గొజ్జంగి కాల్వ దాఁటి
నందనోద్యాన వనసీమయందుఁ జొచ్చి.

# ద్వితీయాశ్వాసము

ఒకవంక వీక్షింప నుత్ఫుల్లసౌవర్ణ
        పంకజాత పరాగ పంకిలంబు
ఒకచాయఁ గనుగొన్న శుకశారికానీక
        కోకిల కాకలీ కూజితంబు
ఒకత్రోవఁ బొడగన్న వికచమందార పు
        ష్ప మరంద గురు ఝరీ ప్లావితంబు
ఒకకోనఁ బరికింప నురువేపథుఃగ్లాని
        సంహారకసమీర చాలితంబు

        మధురవేణు వీణాగాన మండితంబు
        స్వైరకేళీ సహారిణీ సంకులంబు
        విటవిటీ నటీనట పరివేష్టితంబు
        నందనోద్యాన మానంద మందిరంబు.

తడవ్రలనాఁటనుండియును దాపసవృత్తిని బూనియున్న నా
కడవులె యాటపట్టులయినందునఁ దన్మృగపక్షిజాతులం
దుడుగని నేస్తముంగలిగి యుండుటచేతను సంభ్రమంబునన్
వెడలితి నందనోపవనవీథులు చూడఁగ నాల్గుమూలలన్.

అంతట నాగుబ్బగాఁ బెతిగిన పూఁబొదరిండ్లు, పూఁబొదరిండ్లనుండి, పూఁదేనె దిగఁద్రావి మత్తిల్లి వెలువడు తేఁటిపౌఁజు, తేఁటిపౌఁజు రొద కులికిపడు బిత్తరికన్నెలు, కన్నెల

నెన్నాఁడు గోవాంద్రునుగల్గి నిత్యకల్యాణము పచ్చతోరణమై
వెలుంగుచుండ నే నిటునటు తిలకించుచుండ—

కొమ్ములేన్గొక పొదరిల్లుఁ గ్రుమ్మివైవ
సంగమొలతో సురాంగన యంగవైచె
సంగదట్టము విడివడ్డ సంగరాగ
మంగహారముచేఁ జాలనంగవింప.

గుబ్బలిమాటునన్ సురలకోసము పెట్టిన యొక్క యంగడిన్
గబ్బలికన్నె చెన్నుఁగని క్రై వణఁకన్ సుర చింది ముంగిటన్
జొబ్బిలఁ ద్రాగుఁబోతు లటసోలుచుఁ దూలుచునుండ దారి పె
న్నుబ్బలియైన నందనము నొక్కెడఁగంటిని తెచ్చపాటుతో.

జారుసిగలోన గేదంగిసరులు తురిమి
జారుపయ్యెంటలోన మందార ముంచి
నీటుతో నెలకట్టుపై నిక్కినడువఁ
జారణీస్త్రీ యొకత కాలుజారిపడియె.

తీఁగ తూఁగుటుయ్యాలలోఁ ఊఁగబోఁడిఁ
గూడి జోడుగ నొక వేల్పుకోడెకాఁడు
కౌఁగిలింతల పొంగులోఁ గాలుజారఁ
గేకిసల్ గొట్ట నెడకాంద్రు క్రిందఁ బడియె.

పన్నీటి యేటిమీఁదను
బ్రన్నని యొక్క దొన్నె పైభాగమునన్
గన్నులు మూయని కన్నియ
కన్నంగవమూయు కోడెకానిం గంటిన్.

పారిజాత సంతాన పుష్పముల నేరి
తెచ్చి మేలి గేదఁగులతోఁ దెప్పఁగట్టి
పజ్జఁ బాఱాడు గొజ్జంగి వాక విడిచి
తెప్పమీఁద నచ్చరలేమ తేలిపోయె.

కాతరభావ మేమియును గప్పడనీక యథేప్సితంబుగాఁ
గేతకి కుంజపుంజముల క్రేవల నావల సంచరింపుచున్
జేతులు చేతులుం గలిపి చిక్కురు బొక్కురుగాఁగ స్త్రీలతోఁ
బాతరలాడుచున్న మగవారలఁ గాంచితి నాఁకతోఁటలో.

కామశాస్త్ర నిష్ణాతల గబ్బితనము
కళలుజార్చెడి నొక్క పక్షంబునందె
షోడశకలానిధినిబోని ప్రోడ కౌర !
వేల్పు జవరాండ్ర పొలయల్క బేరజంబు.

విరుల తేనెసోనలు వెల్లివిరియుచుండ
కరుల మదధారలోడికల్ గట్టుచుండ
భ్రమరకాంతలు నివ్వాళిఁ బాడుచుండ
నవ్యవైఖరిఁ బొడకట్టె నందనంబు.

నెల్ల గౌరుఁ జూచి నెల్ల జక్కినిజూచి
కల్ప పంచకంబుఁ గనులఁజూచి
నందనోపవనము నాల్గుమూలలుఁజూచి
వేల్పుపౌఁజుఁజూచి వెడలుచుంటి.

ఇంతలోఁ బడమటిదిక్కునకుఁ బ్రొద్దువాలఁగై వ్రాలుటయుఁ, బెద్దతడవు విరామంబులేక నలుదిక్కులు మల్లాడుటయు, విపరీతంబులు పెక్కుఁజూచి మనంబు చెదరుటయుఁ, జేయునదిలేక—

కొంచెము విశ్రామంబును
గాంచఁదలఁచి యొక్క చెట్టుకడ కేగంగాఁ
బొంచి లతాంగి యొకత నా
వంచకురా నామెతోడఁ బల్కెతి నిటులన్.

ఇందఱు యువతీ యువకులు
క్రిందుగ నున్నట్టిచోటఁ గన్పించ రహో!
చిందులు తెగఁద్రొక్కెడి కసి
గందులు వచియింపుమమ్మ కారణ మన్నన్.

స్వైరవిహార నిష్ఠమెయి సర్వదిగంతర దివ్యదేశ సంచారముఁజేయు మాకు గ్రహచారము చాలక సంతుగల్గినన్ వారలనెల్ల గన్న మగవారికి నిత్తుము కాని పెంచు నాచారములేదు స్వర్గమున సత్యముఁ జెప్పితినంచు నామెయున్.

## ద్వితీయాశ్వాసము

ఆలకింపుము స్వర్లోకమందునున్న
మానినులయందుఁ బెండ్లిండ్లు లేనికార
ణమున మరులెత్తి మర్త్యలోకము, దేశ
దేశముల పయింబడి వారు తిరుగుచుండ్రు.

మగనాండ్రిచ్చట నుండరు
మగనాండ్రన్నన్ దెలియదు మాబోఁటులకున్
మగవాండ్ర మనుచు మాపై
మగబీరముఁ జూపరారు మా మగవారల్.

అని నిష్కపటంబుగా వచియింప స్వర్గలోకనాగరికంబునకు నాలో నే నేవపడి, యేమిచేయుటకుఁ దోఁచక, మెల్లన లేచి, ప్రక్కకొదిగిపోవుచుండ సురాంగన నన్నుఁజూచి కేరింతలాడ నిట్లు దలపోయఁదొడంగితి-

కల్లునిచ్చెడి చెట్లకుఁగల్లు గౌర
వంబు పెఱవానికిని లేదు, వజ్రిమ్రోల
గజ్జెకట్టెడి భోగంపుగరితకున్న
పలుకుబడి కానరాదెట్టివారి కిందు

ఇండ్లో యున్నవి కాని పెండ్లిండ్లు లేవు
ఆండ్రో యున్నారు కాని యిల్లాండ్రు లేరు
బాగు ! శివ ! శివా !! యిది వట్టి భోగభూమి
యుండరాదిందు మావంటి యోగులకును.

మిన్నేటిగట్టుపై మిడుకుదునందునా
        కొంచెకన్నియ లీతగొట్టుచోటు
నందనోద్యానంబునందుందు నందునా
        గోవాండ్రి గమిగుంపు గూడుచోటు
షాన్నారి షాదరిండ్లఁ బన్నుందునందునా
        కాముకీ కాముకుల్ గలియుచోటు
కొండనెత్తము లెక్కి కూర్చుందునందునా
        చోరవతోఁ బ్రోయాండ్రు తిరుగుచోటు
    కానమిటఁ జాటుచోటొక్క జేనెఁడైన
    మాని జనవాస యోగ్యమౌదాని నకట !
    బాగు! శివ! శివా!!! యిది వట్టి భోగభూమి
    యుండరాదిందు మావంటి యోగులకును.

'అని తలంచుచుఁ జేతికందు దూరంబులోనున్న పరిష్కృత నిష్కుటంబును జేరి, కృష్ణాజినంబు సెజ్జగాఁజేసికొని నాఁటిప్రొద్దెల్లఁ జూచినవింతవింతసంగతులనుగూర్చివిచారించుకొనుచు, నిదురంబోయి, సర్వభూతమనఃప్రియంబగు నుషఃకాలంబుననే లేచి యమరనదికింజని కాల్యంబులఁ దీర్చికొని, చల్లనినీటస్నానం బాడి, మెల్లని పరిమళవాయువులచే సేదఁదేరి, కక్షపాలనున్న భస్మంబునుదీసి, యనన్యమనస్కుండనై, మైనలందికొని చూచుడు భస్మలేపనంబు, పుష్పాడిపూఁతయయ్యె.

నేను దిగులుపడి, నాకంబు విటవిటీ భోగ్యంబుకాని, మానిజన వాసయోగ్యంబుకాదని యెంచి వైళమ భరతఖండంబునకు రాఁ బ్రయాణోన్ముఖుండ నగుటయు—

భస్మలిప్తంబైన బడుగు దేహపుకాంతి
        మంచుకొండలమంచు సంచుమించ

మధుర వీణాగాన మహిమంబు గంధర్వ
        యువతీజనంబును నుదుటపఱప

ద్రుతతరంబైనట్టి గతి చాకచక్యంబు
        కాయసిద్ధిని జాటఁ గల్గుచుండ

సంస్కృతవైయాఘ్ర చర్మసంత్యాగంబు
        నిస్సంగతత్వంబు నెఱపుచుండ

        త్రిభువనవిహారి నారద దేవమౌని
        సంగరహితుండు. శుద్ధాంతరంగమూర్తి
        మోముపై మందహాసంబు మోసులెత్తఁ
        దత్క్షణంబ నాముంగలఁ బ్రత్యక్షమయ్యె.

వయోవృద్ధుండును, గుణప్రవృద్ధుండును, ప్రబుద్ధుండును, సంకల్పసిద్ధుండును, అనుకంపాబద్ధుండును నగు వీణావాదన విశారదుం డగు నారదునకు నమస్కారముఁజేసి, నా వచ్చిన కార్యంబు విన్నింప, నారదుం డర్ధనిమీలితాక్షుండై యిట్లనియె—

## నారద సూతర్షి సంవాదము

అదె! కంటివె! మందాకిని
యిదె! త్రిదివక్షోణి వీరలెల్లరు సురల
ల్లదె! నందన వనవాటిక
యిదె స్వర్గమని బలుకఁబడియెఁ బురాణములన్.

పక్ష్మముల్ కుఱుచలై పనుపడఁ బరులకు
గనుఱెప్పలార్పుట గానరామి

ఇవముచే రేఁ బవలివతళించుటచేతఁ
జెమట చిత్తడి దరిఁజేరరామి

కూటియెద్దడి మాన్పుకొాఱకునై పడుపాట్లు
ముసలితనంబును మూలఁద్రోయ

దృఢగాత్రులగుటచే మృతినొందునందాఁక
వార్ధక్యపదవి చేపడమిచేత

ననిమిషులనంగ నస్వేదులనఁగ నిర్జ
రు లనఁగఁ ద్రిదశులన యోగరూఢికెక్కి
స్వర్గలోకౌకులు పురాణచయమునందు
వాసికెక్కిరి సర్వప్రపంచములను.

ఇంతియె కాక త్రివిష్టపశబ్దార్థముంబట్టి యింద్రుఁడు ముజ్జగంబుల దొరయని ప్రసిద్ధి వడసెఁగాని బాహుబలంబుచే లోకత్రయంబును జయించికాదు—

అనవిని నేనిటు వాకొని
తిని : నారదమౌని ! భారతీయులకును స్వ
ర్గ నివాసులకును నేస్తం
బును జుట్టఱికమును రాకపోకలు గలవే !

ఓ త్రికాలజ్ఞ ! ధర్మసంయుక్తచరిత !!
అరసి వచియుంపుడీ, సురశబ్దార్థమేమొ !
ఎటుల సురలైరొ నాకౌకులెల్లఁ దొల్లి !!
యాతుధానులెల్లైరొ సురారులెల్ల !!!

అనుకుల నెడి నామంబెటు
లసురవిరోధిచయమునకు లభియించెను దా
పసవర ! పుణ్యజనులు రా
క్షసులన నుతికెక్కి రేమికతమునఁ జెపుఁడీ.

అంత దేవర్షిచంద్రుఁడయిన నారదుండు తెలివివాఱిన మోముతో నన్నుఁదిలకించి సాభిప్రాయంబగు మందహాసంబుఁ జేసి యిట్లనియె.

బహుళనృశంసుఁడై పరమ పాపపరుండయి పాకవైరి దు
స్సహమగు బ్రహ్మహత్యనెఱి నబ్బి పదచ్యుతుఁడైన దేవతల్
"నహినహి దేవలోకమున నాయకుఁడౌటకు నర్హుఁ"డంచొగిన్
నహుషుని దోడితెచ్చి సురనాథుని జేయుట నీవెఱుంగవే.

కౌమరుప్రాయమునాఁడు కుంతి భోజునిపుత్రి
సూర్యోపగూహన సుఖము కనదె?
పుత్రార్థి మాద్రి యశ్వులఁబొంది రహి నొక్క
పర్యాయమె కవలఁ బడయలేదె?
మేనకా కనకాంగి మౌని విశ్వామిత్రు
నెట్టన గిరిగీసి నిల్పలేదె?
పుంజకస్థల యొడల్ పులకరింపఁ బురూర
వుని గూడి ప్రొద్దులు పుచ్చలేదె?
దశరథుండును ముచికుంద ధరణివిభుఁడు
దిక్కుమాలిన దేవతల్ దేవురింప
వచ్చి బాసటలై నిలువంగలేదె?
పాంగెమున్నదే యని యేల ప్రశ్నఁజేయ?

సురయనంగ మద్యంబు తత్సురనుద్రావి
వినుతి కెక్కిరి సురలను పేరిచేత
సురను నొక్కనాఁడేని మూచూడకున్న
కారణముచే నసురులైరి కడమవారు.

ఆర్తరక్షాపరాయణు లవుటచేత
వాసిఁ గాంచిరి రాక్షసప్రవరు లనఁగ
యాతనా ప్రాణివితతిఁ గావాడుకతన
యాతుధాను లనంగఁ బ్రఖ్యాతిఁ గనిరి.

## ద్వితీయాశ్వాసము

అటమటింప్రజను దుండగీం బ్రవాచరించు
ధర్మపీడలు దప్పించి ధర్మపరుఁ
బ్రోచువారు గావున నైరి పుణ్యపురుషు
లనుచు నారదుం బాడినయంత నేను.

తెల్లంబోయి పౌరాణికగాథలందు రాక్షసులం గూర్చి కర్ణకఠోరంబులగు కథలు కలవవియెట్లన్న-

క్రూర సమీకరంగమునఁ గూడి చలంబున దేవదానవుల్
పోర జయాభిలాషులయి పోయి పరాజితులైరి దైత్యు ల
వ్వారినిగూర్చి దేవతలు వారిక వ్రాసిరబద్ధ సంగతుల్
గారనిచేయలేని యొక కార్యము కల్గునె లోకమందునన్.

గెల్పోటముల నొకరూపునఁ జూచిన
వృత్రాసురుఁడు తత్త్వవేత్త కాఁడె?
రణనీతిబద్ధుఁడై ప్రాణముల్ వాసిన
స్వర్ణనేత్రుఁడు నీతిశాలి కాఁడె?
కాపట్య మెఱిఁగియుఁ గాశ్యపి నిచ్చిన
బలిదైత్యుఁడు వదాన్యవరుఁడు కాఁడె?
సమధీత వేదవిజ్ఞానధనుండైన
విశ్వరూపుఁడు వేదవేత్త కాఁడె?

న్యాయమగునె వైతండికు లాడుమాట
పాటిసేయుట నీవంటి పండితునకు ?
పక్షపాత భూయిష్ఠమా పాఠములను
వ్రాసిపెట్టెను దేవతా వందికోటి.

అనినయనంతరమునారదమహామునీంద్రుకడ సెలవంది, మనోవేగంబున భాగీరథిందాఁటి, కైలాసంబు త్తరించి, హిమవంతంబు నతిక్రమించి, భారతవర్షంబుఁజొచ్చి, నాకై యెదురు చూచుచున్న వాలఖిల్యాదులకు సర్వంబునివేదించి, యామంత్రణంబు వడసి, యతిజవంబున నా యీ యాశ్రమంబును జేరి యథాస్థితిగా భగవత్కాలక్షేపముం జేయుచుంటినని చెప్పి పిమ్మటి కథ వచియింప నుపక్రమించె.

వేల్పుల వలన

కాలము మంచిదై విరివిగాఁ దెగఁబండిన పంటపైరులే
చాలవు పొట్టకూటికయి స్వర్గమునందు వసించువారికిన్
నాలుగు రెండుమాసములు నాతముకూడ లభింప దాపయిన్
గాలియు నాలి చేపడదు కొంచెముసైతము చెప్పనేటికిన్.

ఈతిబాధలు గల్గుచో నింక నేమి
కలదు! నల్లవో! గ్రుక్కెఁడు గంజికైన
బొక్కెఁడన్నమైనను బుట్టఁబోవ దందు
నిట్టినాశికయుం దొక్కయోఁడు నందు.

వేసిన పైరెల్ల మోసులెత్తకమున్నె
　　సంగోరు తినివేసె జట్టిమిడుత
ఏండాదిపొడవున నివతళింపంగ భూమి
　　విఱివడ్డ సాంబాలు సుఱిసిపోయె
ముక్కారుపంటలు మ్రక్కిపోవంగ నిల్లు
　　పట్టెఁడు నన్నమైనఁ బుట్టదయ్యె
వలిచుట్టఁబెట్టంగ వడగండ్ల కడగండ్లఁ
　　గడుపు కక్కూర్తియుఁ గడవదయ్యెఁ

ప్రజల కన్నపానీయముల్ వట్టిపోయెఁ
గంటికిని గూర్కు కఱవయ్యెఁ గానికాల
మఱుగుదేరంగఁ గటకటా! యమరపురిని
దుర్భరంబైన దుర్భిక్ష తొడరినపుడు

కాపులు పడిగాపు లగుచుఁ
గూపెట్టుచు ఱేని కొలువుకూటముఁ జొరఁగా
నేపనికై వచ్చితిరని
కాపులఁ బ్రశ్నింపఁ డెంత గామిడి యతఁడో.

ఎత్తికోళ్ళకు కనికరం బెనయ లేదు
మొత్తుకోళ్ళకు మది జాలిఁ బొందలేదు
వేడికోళ్ళకు దయ యుద్భవింపలేదు
ముజ్జగంబుల దొర యెంత ములుచవాఁడొ.

పలుకరింపని దూరవంకఁ బాఱఁజూచి
మూతి బిగఁబట్టి లోలోన రోఁతపుట్ట
నాదరింపని జేని రాజ్యంబుఁ దొలఁగి
వలసపోవుటే మిగుల సంభావ్యమనుచు.

స్వేచ్ఛఁజేని దివాణంబు విడచిపెట్టి
నెట్టఁ దెఱగంటి మూఁకలబంటు లపుడె
గుసగుసలుపోయి యొకచోటఁ గూడి మాడి
పస్తుఁబట్టిరి యొటకేని వలసపోవ.

అంత దేవతానీకమ్మునందుఁ గొన్ని
తెగ లయోనిజప్రభృతులు తెగువఁజేసి
యిల్లు వాకిళ్లు తెగనమ్మి గొల్లుమనుచు
పసవి యొకసారి నాకంబువంకఁ జూచి.

తరతరంబులనుండి తనివోవఁగాఁజేయు
సురనిచ్చు చెట్లను సురుగుటెట్లు?
బెదరించి యందందు బెల్లించుకొని తెచ్చు
హవ్యకవ్యములం బోనాడుటెట్లు?
మున్నూట యర్వది ప్రొద్దుల ముఱిపించు
వెల్లాటకత్తెల వీడుటెట్లు?
మందయానలతోడ మందాకిని మునింగి
విహరించుకోర్కెల విడచుటెట్లు?

## ద్వితీయాశ్వాసము

పండు వెన్నెల మాపులఁ గాయుటెట్లు?
గండుకోయిల పాటలఁ గడచుటెట్లు?
అనుచుఁ గన్నీటిజాలుతో వెనుకతిరిగి
వ్రేలుకావెడి మోముతో వెడలనెంచి.

మూటలు ముల్లెలుఁ దలల మోపి భరంబునఁ దొట్రుపాటుతో
దోఁటలుదొడ్లనున్ వదలి త్రొక్కిసలాడుచు నందఱేకమై
బాటలఁబట్టి పేరలపువాయఁగఁ బాటలుచొక్కి పాడుచున్
బూఁటలు రోజులున్ నడచిపోయిరి కొండల నేటవాలుగా.

అమరనది దాఁటి ముదిగొండ నవతరించి
కొండ ఆటునటు పరికించి కొట్టకొనకు
భరతవర్షంబు వీక్షించి పట్టపవలె
మెట్టి రాంగిలేయులఁబోలెఁ బొట్టకొఱకు.

భరతవర్షంబుఁ జొరక యసురు లయోని
జప్రముఖ దేవయోనులు కీ.ప్రగతిని
పశ్చిమాశాభిముఖముగాఁ బైనమైరి
కొల్లగొట్టంగ దేశంబు కొల్లయనుచు.

సింధు గంగానదీ పుణ్యజీవనములఁ
బూఁచికాచిన తరులతాపుంజములను
గలయఁ బరికింప మిఱుమిట్లుగొలుప నందె
నెలవు లేర్పఱచికొనంగ నిశ్చయించి.

పరమబుభుక్షచే నవసి భారతభూమిని జొచ్చి పిమ్మటన్
సురలను తొంటిపేర్కొంచి నూత్నసమాఖ్యను నార్యనామమున్
బిరిగొను వేడ్కఁదాల్చి పిరిపికును మాని క్రమక్రమంబుగా
గురుతర కాయకష్టములకుం దలలొగ్గుచుఁ గీర్తికాములై.

చిదుగు కంపలనెల్లఁ బొదువ్రుగా నొకచోటఁ
బెచ్చుగాఁబెట్టి కార్చిచ్చుఁబెట్టి
పొడవుగాఁ బెరిఁగిన నిడుదచెట్టులనెల్ల
గొడ్డళ్ళచేఁ బడఁగొట్టివైచి
ఎండకన్నెఱుఁగక యివతళించెడు నేల
పై నున్న ంగారముల్ పాయఁద్రోసి
గుట్టమెట్టలుగాఁగ బిట్టుఁగా బడియున్న
పలుగుఱా లన్నింటిఁ దొలఁగఁబుచ్చి

భరత భూమండలంబును వాసయోగ్య
మైనదానిగా నొనరించి యచ్చటచట
నార్యు లగ్రహారంబుల నవతరింపఁ
జేయ సమకట్టి యద్భుతానేయశక్తి.

జాంగలముల లాంగలములఁ జక్కఁజేసి
యెక్కలిని మిక్కిలి వసించు నిక్కఁజేసి
యార్యకౌమారవర్గంబు కార్యనిరతిఁ
గాత్రగడ్డతోఁ బల్లెలఁ గట్టిరంత.

## ద్వితీయాశ్వాసము

చిరి తామర కొలనువలెన్
బరిమితిలేకుండ వాసు వర్ధిలుచుండన్
సిరిసంపత్తులతోడన్
జెలవారికిఁ గన్నుఁగుట్టె జెడిదంబగుచున్.

గండాడుక్రోల్పులుల్ గండరించెడిచోటఁ
గోరాడు నేనుఁగుల్ గూడుచోట

బుసకొట్టు నాగముల్ మసకలాడెడిచోట
గర్జిల్లు సింహముల్ కవియుచోట

ఱంకిల్లి వృషభముల్ అంకెనై చెడిచోట
మంపిల్లి తోడేళ్లు మరగుచోట

కారుదున్నలుకూడి కసవుమేసెడిచోట
కారుమబ్బులు తొంగి కలియుచోట

తిండికై వాల్మీకంబులు తిరుగుచోట
వత్సములును బాలురును మహోత్సవమునఁ
బందెములు పైచికొని క్రేళ్ళు వారుచుండ
నూరువల్లెలు తలయెత్తి నొక్కటొకటి.

అంతకంతకు నీరీతి నార్యసమితి
వర్ధిలఁ గులము పెద్దలు భావిగతులఁ
గాంచుకట్టులఁ జర్చించి బంధుకట్టి
గట్టిదిట్టముల్ చేయుట కర్జమనుచు.

పాత్రులను బిలిచి బ్రహ్మ
క్షత్రియవైశ్యులని యార్యసంఘంబును వ
ర్ణత్రయముగ విభజించుచు
సూత్రించిరి ధర్మకోటి సూరులదయచే.

నిత్యనైమిత్తిక నియమంబులను దీర్చి
భగవంతుఁ బూజింప బ్రాహ్మణులను

ఖడ్గధారలచేతఁ గంపకోటలఁగట్టి
కాపాడఁ బల్లెల క్షత్రియులను

వాణిజ్య గోపరిపాలన కృషులచే
బండారములనింప వైశ్యవరుల

నియమించి వేర్వేఱ నిర్దిష్ట కార్యముల్
జాగరూకతతోడ జరుపుచుండఁ

గూటియెద్దడిలేకుండఁ గొన్ని నాళ్లు
సకల సౌభాగ్యగరిమచే సాఁగ "మూఁడు
పూవు లాఱు కాయ"లనిన పొల్కి నెగడెఁ
జూచువారికి నోడలెల్ల సొక్కుపుట్ట.

బ్రాహ్మణుండు వేదపాఠంబు సేయంగ
క్షత్రియుండు రిపులఁ జక్కఁబఱప
వైశ్యవరుఁడు కృషియు వాణిజ్యమును జేయ
నార్యసమితి యొసఁగె ననుదినంబు.

## ద్వితీయాశ్వాసము

పుట్టి పెరుగుచున్న బొట్టియలకు నెల్ల
నూత్న శౌర్యపటిమ నూరిపోసి
కుబుసమూడ్చినట్టి కోడెత్రాచులఁ జేసి
పెంచినారు కులము పెద్దలెల్ల.

మాంత్రికులు విప్రవరు లప్రమత్తులగుచుఁ
జెడని తంత్రంబుఁ జక్కఁగా నడుపుచుండఁ
జుట్టుప్రక్కల పాలమొల్లఁ జుట్టఁబెట్టి
కైవశముఁ జేసికొనినారు క్షత్రవరులు.

దేశం బీవిధముగ నై
దేశిక వీరభటులకు నధీనమయిన, నా
క్రోశముతోఁ బరికించి స్వ
దేశజు లారాటపడుచుఁ దికమక లగుచున్.

### ద్రావిడ యోధుల మంతనము

రచ్చమ్రానుక్రింద ద్రావిడమన్నీలు
రెడ్డిగములు వైచి గద్దెదేరి
రెడ్డిగములఁ బిల్చి యొడ్డోలగంబుండి
మాటలాడి రిట్లు మంతనమున.

వింటిమె వింతలు? నిజముగఁ
గంటిమె యెపుడేని యిట్టి కార్యమ్ములఁ? కూ
ర్చుంటిమె చేతులు ముడుచుక?
బంటులమని ప్రల్లదీండ్రు పగ్గెలు కొట్టన్.

బొల్లి మొగముమీఁదను నిల్పిబొట్టుఁబెట్టి
రాలుచెప్పుల కెల్లను గేలుమోడ్చి
గంద్రగోళంబుఁ గావించు కల్లరీండ్ర
దౌష్ట్యమును మాన్పకుండుట ధర్మ మగునె?

దేశము మనయదికాదో!
దేశోద్ధరణంబు భాగధేయముకాదో!!
దేశవినాశకులగు నై
దేశిక హననంబు మన యదృష్టముకాదో!!!

అవిసి తేనెలుచిల్కు నమృతకల్పములైన
పండ్లనిచ్చెడి వృక్షపంక్తిగల్గి
తమయంతనే క్షీరధారలు గురియించు
పొదుగులుండిన యాల కదుపుగల్గి
తావుల్ గుబుల్కొను పూవుఁదీవెల కప్ప
డంబుల పొదరిండ్ల డంబుగల్గి
తలఁచి నాఁగేటికఱ్ఱు దాఁకకుండఁగఁ బండు
బలముగ్గన మంచి పొలముగల్గి

య్యెల్లకాలంబు పోషించె నింతదనుక
"నడుగనిదె యన్నమును బెట్ట దమ్మ" యైన
ననెడి సామెత వ్యర్థమై చనఁగ నిట్టి
మాతృదేశంబు మన మెట్టు మఱవవచ్చు?

కూళలు రేఁగి యాకరణిఁ గూడని కార్యము లాచరించుచుం
బాలలు బాలురన్ బెదరి పాఱఁగ బొబ్బలు పెట్టిపెట్టి గ
గ్గోలొనరించి దేశమును కొద్దియొ గొప్పయొ యాక్రమింప నీ
పోలిక నూరకుంట మనభోంట్లకు ధర్మమె? రాజకర్మమే?

నదురు బెదురు లేని నాయకు లెందఱో
సొంత నాడు కొఱకు వంతదక్కి
క్రేటుపడ్డపులుల విధముగాఁ బోరాడ
నేర్చువారు కలరు నిశ్చయముగ.

ఇప్పుడో మన మెల్లరమును
జప్పడముగాకుండ వైరి సైన్యముమీఁదఁ
గుప్పించి దూఁకి పొడుచుట
దప్పని పని వేఱె లేదు ధర్మంబన్నన్.

అంపకోలలు పొదినుండి యవలఁబడెను
పదనుచురకత్తు లొరనుండి బయటఁబడెను
మన్ను మిన్నును గానక మన్నెదొరలు
సింగినాద మూఁదుచుఁ గూచి నేసి రపుడు.

రక్తము వాఁగులై దెసలఁ ఠంయిని బారకమున్న క్రూరమై
నక్తములెల్ల రోదన పినద్ధములై గనరాకమున్న యీ
దృక్తతి పోకమున్న మన దేశము ముష్కర శత్రుకోటికిన్
భుక్తమయానే! యేమియయిపోయెనునీనుభటాలియంతయున్?

ఓసరిలకుండఁ బ్రాణంబు లొడ్డియైనఁ
బీన్గుపెంటలుగాకుండఁ బృథివియెల్ల
మనము స్వాధీనపఱతుమే మార్తురకును ?
సనిసమాత్రిన సైనిక లదరిపడుచు.

కోలాహలముఁ జేయుచు, "శత్రులసదమదించు టొండె ప్రాణంబులను వీడుటొండె" సంభవించుననుచు బంతంబులాడి కొనుచుఁ దమతమ మనికిపట్టులకుంజని, సమధిక సమరోత్సాహంబునఁ గట్టాయితులై—

పంబిన కోపవేగమున వైరుల యుక్కడగింప తీవ్రరో
షంబున బారు టీలిలును జోళులు కత్తికటారి పిండు వి
ల్లంబులుదాల్చి యొక్కమొగి నందఱు మచ్చరమూనిసింహనా
దంబులుచేయుచున్ సమర ధాత్రికిఁ జేరఁగ గుంపు గుంపులై.

వింటికొప్పుమీఁద వీరరక్తముఁజల్లి
పలుకవాలునకును బలులువెట్టి
మూఁగదేవరలకు మ్రొక్కుబడులుదీర్చి
పైనమైరి రిపుల బారిసమర.

అంతకుమున్నె రిపు వృ
త్తాంతమెఱిఁగి యార్యులు బహు దర్పముతో ని
శ్చింతమెయిన్ సాయుధులై
పంతముతో వచ్చినారు బవరము సేయన్

ఒంటరులై సరిసరులై
బంటులు చెలరేఁగి యుభయ పక్షములందున్
గెంటింపఁబడుచు గెంటుచు
బంటింపక వారనేక భంగులఁ బోరన్.

గండరగండలై పిఱికి కండ యొకించుక లేక చండదో
ర్దండగదాప్రహారముల దండు పయింబడి పోరుచుండఁగా
నేండులుపూండులున్ గడచె నింతియ కాని జయంబు మాత్రమున్
రెండుకుదుళ్ళ వారిని వరింపక పోయె నిఁకేమి చెప్పెదన్

అంత భటులెల్ల జర్జరితాంగులగుచుఁ
గాందిశీకులై తాత్కాలికంబు గాఁగ
గలను జాలించి రంతియే కాని పిదపఁ
బెనఁగులాటను క్షణమైన వీడరైరి.

ఓహరి సాహరి పెనఁగియు
మోహరములుదీర్చి యుద్ధభూమి వడంకన్
బాహాబాహిని బోరియు
నోహటిలెను ద్రావిడ సుభటోత్కరమెల్లన్.

వీఁగిన ద్రావిడసైన్యము
బాగుగ వీక్షించి యార్యవాహిను లెంతో
వేగమ కన్నాడెను నీ
యాగముఁ బరికించి దేశమంతయు బెదరన్.

పిల్లలు ప్రౌఢలెల్లఁగలసి
యల్లో నేరేళ్ళనాఁడి యరిగెడిభాతిన్
జెల్లాచెదరై ద్రావిడు
లల్లాఁరి చెట్టుకొక్కరై యడవులలో.

ఒంజలిచేత ద్రావిడులు యుద్ధము మాని విషాదచిత్తులై
వింజముదాఁటి కారు టడవిన్ దలదాఁచుకొనంగఁజొచ్చుచున్
నంజల దొంగదాఁకలను జాటున మాటున దక్షిణాశకున్
గొంజక క్రొత్తనాడికలకుం జని నిల్చిరి యచ్చటచ్చటన్.

చెంచులుమాత్రమ్ము వింజపు
టంచుల విడిపోవలేక యటనే తగుఁ బో
షించుకొనుచు డాగి రయో!
పెంచిన దేశంబు విడచిపెట్టఁగఁ దలనే?

మాన్యతరమైన దేశాభిమానగరిమ
పచ్చినెత్తురుఁ ద్రావెడి పగఱనడుమ
నుసురు లఱచేత నిడికొని మసలుచుండు
చెంచుపాళలఁజూచి గ్రహించవలయు.

నేఁడును వింధ్యపర్వతపు నెత్తములందునఁ జెంచువారు మ
ల్లాడుచుఁ గానసౌదురు, ప్రయత్నము లేకయె చింకిగుడ్డలుఙ్
వాఁడిశరంబులుఙ్ బలుకవాలును దాలిచి భీకరంబుగా
గూడెము వీడి, తేనియలకోసము చెట్టులనెక్కి దిగ్గుచుఙ్.

శూద్రులు; శూద్రశబ్దవ్యుత్పత్తి

ద్రావిడయోధులీగతిఁ బరాజితులై చన నార్యసైనికుల్!
త్రోవల నడ్డగించి పెఱతోయచుఁవారలనెల్లఁ బట్టి త
జ్జీవములన్ హరించుచు విశృంఖలులై విహరించి రక్కటా
కేవల దుష్టబుద్ధిఁ దమకించి త్యజించి సమీకసర్మమున్.

పాఱుఁబోతులుఁ బందలు బడుగువారు
బవరమున వికలాంగులై పడినవారు
చేతఁబడఁ బాయకట్టులఁ జేర్చిపెట్టి
రార్యు లానందరసమగ్నులగుచుఁ బిదప.

సందియమందక కుందక
యందుంచిన భటులనెల్ల నావేశముతోఁ
బందెలలోఁ బడఁగొట్టియుఁ
గుందింపఁగ మొదలుపెట్టి కుత్సితులగుచున్.

బానసీంద్రుగాఁ గొందఱు బానిసీంద్రు
గాఁగఁ గొందఱు నియమించి కాడుచేసి
కలుషితాజ్ఞాన గాఢాంధకారమునను
ముంప యత్నముల్ చేసిరి తెంపుతోడ.

కులపతియైన వసిష్ఠుఁడు
కులుకుచు శాస్త్రపులు గోడుఁ గుడుచుటచేతన్
దలపోసి పోసి యీ గతిఁ
బలికెను దనవారితోడ వజ్జరి యగుచున్.

చేతఁబడినారు పగవారు చేతఁదక్కి-
వారి జీవముల్ గొనుటకొండె వదలుటొండె
వెట్టిపనియైన మెడకంటఁగట్టుటొండె
మనము నిశ్చయించుట పాడి యనుచుఁ బలుక.

పడుచుమగవాండ్రు "తమచేతఁ బడిన రిపుల
విడువ ధర్మంబుగాదం"చు నుడువుచుండఁ
దలలునెఱసిన మంత్రవాదు లిటులనిరి
భావి కలగతులనెల్లఁ బారఁజూచి:

మన కగ్గమైరంచు మార్తుర పరికాండ్రఁ
దల కోసివైచుచో దారుణముగఁ
బగతు రింకను బరాపంచలైపోలేదు
మనపైకి రావచ్చు మాపొ రేపొ

## ద్వితీయాశ్వాసము

మనమిప్పు డొనరించు మారణకర్మంబు
విన్నవా రొడలిపైఁ బ్రీతిఁ దొరఁగి
దగదీరఁ గ్రొన్నెత్రుఁ దెగఁద్రావు కత్తుల
వ్రేటులాడరె మన చేటుమూడ

వారు సామాన్యులా? వీరభటులు కారె?
మన మెఱుంగమే వారి సంహననశక్తి
మంత్ర తంత్రంబులను బిల్కుమార్పవలయుఁ
గాని వేఱుమార్గము కొఱగా దటన్న.

అగునగు ననుచు వసిష్ఠుఁడు
పగఱఁ బరిసిపుచ్చవలయు బహుతంత్రములన్
బిగిగలుగు రాజనీతిని
వెగటించు మఱొండు కార్యవిధిచే ననుచున్.

నూతనవైఖరిన్ మిగుల నూతనధర్మము లుగ్గడింపఁగా
నాత్మరి బ్రాహ్మణోత్తముల నందఱికిం బిలిపించి చెప్పఁగా
నాతత శేముషీ విభవ మచ్చుపడన్ దలలూచి వారలున్
గైతవబుద్ధి మాటుపడఁగాఁ దెగవ్రాసిరి ధర్మసూత్రముల్.

నల్లని ద్రావిడచర్మము
తెల్లఁ తమనేను సోఁకఁ దెగమాయునటం
చుల్లఱములాడి ద్రావిడ
వల్లభులనుగూడఁ దాఁకవలదని రార్యుల్.

తమజాతిలోనఁ గలిసినఁ
దమవర్ణము మాసిపోవుఁ దప్పక యనుచున్
దమకక ద్రావిడజనులను
దమజాతిని జేర్పరైరి తగవని యార్యుల్,

ద్రావిడులలోనఁ బెద్దల
రావించి మఱొక్కనాఁడు బుచ్చుకొఁదగునై
నీవిధము వసిష్ఠుఁడని యోఁ
దీవరమును మాటుపుచ్చి తీయనినుడులన్.

మీకున్న యింటిపేరులు
కోకొల్ల వినుటకు సొంపుఁ గూర్పవు పైఁగా
మాకున్ జ్ఞాపకముండవు
మీకిత్తుము మంచిపేరు మే మొకటనుచున్.

పగఱ యింటివరవడంబు వలనఁ గల్గు
దైహికము మానసికమైన దారుణార్తి
గ్రుంగుచుండుటఁ దలపోసి గ్రొవ్వుచేత
శూద్రులను పేరుపెట్టిరి శుద్ధశఠులు,

బొత్తిగఁ దాల్మిలేక పౌరపొచ్చము లెవ్వియు మానలేక య
త్యున్నతమజాతి సంజనితు లుండిరి ద్రావిడసంఘమందు నాఁ
జిత్రమునందు నొక్కరుఁడు చింతిలకుండఁగ శూద్రులంచు దు
ర్వృత్తిసమగ్నులై వ్యవహరించిరి దూరముఁజూడకుండగన్.

మానవజాతియన్న యభిమానము లేకసమానమైన దు
ర్మానము నూని ద్రావిడుల మానము నెల్ల హరించుకోర్కెనై
మానమునందు సుంత యనుమానము లేకవమానమున్ సదా
మానక హీనమానవ సమానముగాఁ జరియించిరార్యులున్.

ఎన్నిగతులను వీరానో యన్నిగతుల
మతముపేరిట దుస్తంత్ర మంత్రములను
బ్రథితమొనరించి జేసిరి ద్రావిడులను
వినుము వివరింతు నవియెల్ల విశదముగను.

తిరుమంత్రముఁ జెప్పెదమని
తిరుమంత్రముఁ జెప్పినారు తిన్నగఁ జెవిలో
ధరణీసురులకు మ్రొక్కినఁ
బరమపదము వచ్చునంచుఁ బరలోకమునన్.

చదువులు నేర్పుచో మిగుల జ్ఞానముకల్గి వివేచనంబునున్
గదురును దాననయ్యదియె కల్గినఁ దాము వచించు నీతి నం
పద తల కెక్కఁ బోదనుచు బ్రాహ్మణవర్యులు ద్రావిడావళిన్
జదువఁగ రాదటంచు మతశాస్త్రములన్ లిఖియించిరెన్నియో.

చిఱుతనాఁటనుండియును సంస్కృతముఁ జదివి
నంతఁ దమగుట్టు బయలౌ నటంచు నెంచి
"చదువరాద"ని చెప్పిరి సంస్కృతంబు
నగిరొ పంచాక్షరీమంత్ర మయ్యెఁదుదకు.

అన్యులెవరేని సేయఁగీ యాగడంబు
నేది యిట్టిదికలదె సృష్ట్యాదినుండి?
భాషఁగఱచుటకొక్క స్వత్వంబువలెనె?
చదువు జిజ్ఞాసకల్గినఁ జదువరాదొ!

"నీతిశాస్త్రంబులఁ బఠించి నిగ్గుదీసి
మేముచెప్ప మీ రాలింప మేలుకల్గుఁ
జదువ నష్టకష్టంబులు సంభవించు"
ననుచు మాన్పించిరట్టె విద్యానురక్తి.

ద్రావిడకన్యల నార్యులు
వావిరి చేఁబట్ట ధర్మపద్ధతి యయ్యెన్
గేవలఁ మార్యులకన్నెల
ద్రావిడులు వివాహమాడఁ దప్పైపోయెన్.

సాఁగుచుండె నేఁడిట్టి యాచారమింకఁ
గేరళమునందు మిగులఁ గేకిసలతోడ
వెక్కసంబుగ నంబూద్రి విప్రులందు
ననుచితంబన్న వారొక్కరైన లేరు.

ఇచ్చి పుచ్చుకొనుట కల్గెనేని తుల్య
భావ మేర్పడు సు మ్మిరువాఁగులందు
ననుచు నీయ మానుచుఁ బుచ్చుకొనుట యొకటె
మహితధర్మ మనిరి నేఁటి మాధ్వులట్ల.

గుడులలోనికిఁ బోవుటఁ గూడదనిరి
బడులలోనికిఁ బోవుట పాపమనిరి
మడులఁ గట్టుకొను టధర్మమార్గమనిరి
చటుల దుస్తంత్ర నైదగ్ధ్యసార మార !

ప్రజల నపలపింపఁగఁ గైతవంబుచేత
స్మృతుల వ్రాయించినారు పండితులచేత
ద్రావిడులు మ్లేచ్ఛజాతివారలని; కలదె
పాపపరిహార మిటువంటి వంచకులకు ?

చింతాలేశము లేకయె
యంతఃకరణప్రవృత్తి నావల నిడుచున్
సంతోషముతోఁ దెగఁబడి
యెంతెంతలు చేసినార లేమివచింతున్ !

ఈవగఁగుత్సితాత్ములయి యెంతయు ద్రావిడమానసంబునున్
నోవఁగఁజేసి యార్యులు మనోరథసిద్ధిని బొందలేక తా
మేవగనేని తంత్రము వహించుచు వారల స్థూలదేహముల్
బోవఁగఁజేయఁగా మనసుపుట్టినఁ బట్టనిగట్టి కిన్కతో.

ఆర్యనవోఢలంగొని యనార్యులు పెండిలియాడ వర్ణసాం
కర్యముకల్గి యున్నతి గకావికలౌనని దూరదృష్టిచే
నార్యసభాపతుల్ స్మృతులయందున వ్రాసిరి ద్రావిడాళి త
త్కార్య మొనర్చినన్ గఠిన దండనలం బొరిపుత్తుమం చొగిన్.



ఒక్కయధర్మమున్ సలుపకుండఁ బరాస్తిని గోరకుండఁ గొం
డొక్కవిధంబునన్ జెమటయోడ్చి ధనంబును గూడఁబెట్ట నా
జొక్కము ద్రావిడప్రజకు మ్రుచ్చిలియో బలవంతపెట్టియో
దక్కకయుండఁ జేయుటయె ధర్మమటంచు వచించిరార్యులున్.

అంగడ చిచ్చునార్చుకొనసైన ననార్యులు పట్టెఁడేనియున్
బొంగలి ముట్టగూడ దొకపూటయుఁ జక్కనిబట్టకట్ట రా
దెంగిలికూడు సాపడియె యెప్పుడు తప్పక వెట్టిఁజేయుచున్
గింగిరిపాతఁ గట్టుకొని కిట్టుటె ధర్మమటందు రార్యులున్.

జాత్యభిమాన దుర్విషయసక్త మనంబునఁ గ్రూరకర్ములై
సత్యము ధర్మమున్ వదలి శత్రుల రాయుటె కర్జమంచుఁ గా
ఠిత్యము మాటఁగట్టికొని త్రిక్కక యార్యులు మంత్రతంత్రజా
గ్గత్య నిమగ్నులై తలపరానివి కానివి చేసిరెన్నియో !

కొమరుంబ్రాయపు కండకావరమునన్ గోవాంఛ్రు దుర్ధర్షులై
భ్రమచే ద్రావిడకన్యకానివహ లావణ్యంబునంబొక్కి డం
బముతోడన్ జెఱపట్టినన్ స్మృతులహో ! పట్లస్తమాలైన ధ
ర్మముకాదంచును జెప్పనేరవుకదా ! మర్యాదబద్ధంబులై.

ఎల్లర దొడ్ల పెంట భుజియించెడి జంతువులెన్నియేని న
ట్టిల్లును జొచ్చుచున్న నెవ రేమనరార్యులు, కాని జంకుతో
మెల్లఁగ ద్రావిడుల్ గడప మెట్టినమాత్ర కసాయిత్రాత్తులై
గొల్లునఁ దిట్టిపోసెదరు కూడదటంచు వచించు నేస్మృతుల్ ?

కోయ నయితికాని తీయ మామిడిపండ్లఁ
జేతికందిచ్చెడి చెట్లనడుమ
జడివానకైనను దడియకుండఁగనుంచు
ముంగిళ్లుగల్గిన పొద రిండ్లనడుమ
మోరలుపైకెత్తి పుల్లాపుపెయ్యలు
క్రేళ్లువారెడి పచ్చి బీళ్లనడుమ
ఎండకారునకైన నెండిపోవని తేట
కొండప్రవంతలకొండ కోననడుమ

విపులక్రొందావిఁ జిల్కు పయ్యెరలుగ్రోలఁ
బాఱుటాకులపాక లేర్పఱచికొనుచుఁ
నందుఁ దలదాఁచికొను ద్రావిడాళి నెల్ల
వానరులటంచు నార్యులు వదలినారు.

గడుసు రాయబారములెట్లు నడపఁగలరు?
కడలి కానకట్టల నెట్లు కట్టఁగలరు?
కాసెపని నేర్చి యిండ్లెట్లు కట్టఁగలరు?
వానరులెట్లైన ద్రావిడ ప్రజలు చెపుమ.

అగ్నిసాక్షి ప్రమాణంబు లాచరించి
వ్రేల్ముడిచి పరుల్ తప్పఁ జూపింపరాని
రీతిగా నెట్టివారు వర్తింపఁగలరు?
వానరులెట్లైన ద్రావిడ ప్రజలు చెపుమ!

ఎదురు చెప్పఁగ నేర్చువా రెదుటలేమి
బెదరు నదురు లేకుండ ద్రావిడులఁగూర్చి
నీచ వాక్యంబులను వ్రాయ నేర్చినారు
బడుగు పెద్దలు గంటంబు పదనుచేడఁగ.

కాత్రేయలందఁగా బురుషకారము వ్యర్థమయైన ధైర్యముం
జారఁగనీక ద్రావిడులు సాధుమృగంబులపోల్కి నెట్టి ధి
క్కారమునైన నెట్టి యపకారమునైన సహించి నీరసా
కారముతోడ నుండిరి వికారములేకిటు లుత్తరంబునన్.

భగ్నమనోరథులై యు
ద్విగ్న మనస్కులయి ద్రవిడ వీరవరేణ్యుల్
భుగ్నులయి దాస్యపంకని
మగ్నులగుచు నుండిరి యవమానతమములై.

మంచికాలంబునకు వేచి పొంచి పొంచి
యార్య మందిరంబులయందు నణఁగి మణఁగి
చివికిపోయిన మనసుతో నవసి నవసి
యుత్తరాదిని ద్రావిడు లున్నయంత.

దక్షిణభూమికిం జనిన ద్రావిడు లద్భుత శక్తిమంతులై
దీక్షవహించి దానిని స్వదేశముగాఁ దలపోసి దక్షులై
యాక్షితి నిండ్లుగట్టుకొని యందె వసించి క్రమక్రమంబుగా
నక్షయమైన వైభవము నందిరి వందురు మాని యందఱున్.

## ద్వితీయాశ్వాసము

పంటకాల్వ లయ్యెను గొండవాగులెల్లఁ
బంటపొలము లయ్యెను జౌటిపడియ లెల్లఁ
బంటపైరులు తలయెత్తె గంటలోనఁ
బంటకాపు చల్లనిచేయి పడినమాత్రి.

దక్షిణ దిగ్భాగమున సు
శిక్షితులై ద్రావిడకుల శేఖరతతి ధ
ర్మక్షయ మెది లేకుండఁగ
రక్షింపుచు బీదసాద రైతుల నెల్లన్.

రాజ్యములం గడించి సమరస్థలి శత్రులఁ బిల్కుమార్చి త
ద్రాజ్యములన్ హరించకయె రాజ్యములన్ దొలిరాజులేల సా
మ్రాజ్య పదాధి రూఢులయి ద్రావిడ భూపతివర్గ మెంతయో
ప్రాజ్యముగాఁగ నేలి జనరంజనఁజేసెను దక్షిణంబునన్.

బూవము బంతిపెట్టి రిపు భూభుజ సంతతికిన్ సరస్వతీ
దేవికి నాట్యరంగముగ దేశమునుం బొనరించి లక్ష్మికిన్
స్థావర మొక్క టేర్పఱచి చక్కఁగ సర్వకళుబ్వికీర్ణ తే
జోవిభవంబుచేతఁ బరిశుద్ధులు సిద్ధులునైరి భూవరుల్.

భారతయుద్ధమందుఁ గురుపాండవ సైన్యము రాజ్యకాంక్షచేఁ
బోరఁగ నిల్వఁగా సమరభూమి పరాజిత వైరివీర పృ
థ్వీ రమణుండు పాండ్యుఁ డతిధీరుఁడు ద్రావిడ భూమిభర్త శూ
రారికులంబు నెల్లఁ దెగటార్పఁడె ధర్మజ పక్షపాతియై.

వింధ్యదక్షిణభాగవిశ్వంభరను నొక్క-
గొడుగుక్రిందికిఁదెచ్చి విడిచినారు

కాకిచే గబురంపి కప్పముల్ దెప్పించి
కొన్ని వైరి కభయంబుఁ గూర్చినారు

దానధర్మశ్రేణి యూనంబుగాకుండ
బండారముల వెల్లిపఱచినారు

దండెత్తివచ్చిన మండలేశులనెల్లఁ
బూరిమేసెడిదాఁకఁ బొడిచినారు.

సరిగఁ బాలించి దుష్టశిక్షణము శిష్ట
రక్షణముఁజేసిరి ప్రజానురంజకముగ
రాజమాత్రులే ద్రావిడప్రభువులెల్ల
నిఖిలలోకైక కల్యాణ నిలయులైరి.

క్రమముగా వంశపారంపర్యముగవచ్చు
నాచారములను గాపాడినారు

ఉత్పన్నదశఁ బొందకుండ నెల్లప్పుడు
శృంగారకళలఁ బోషించినారు

కాటకంబులనెల్ల బూటకంబులుచేసి
సీమలన్నింటి రక్షించినారు

దొంగదొడ్డకీకండ్రఁ దూలించి రాష్ట్రంబు
లెద్దడిలేకుండ దిద్దినారు

ఆలగోలును గగ్గోలు బాలగోలు
కంటఁబడకుండ భూములఁ గాచినారు
రాజమాత్రులే ద్రావిడ ప్రభువులెల్ల
నిఖిలలోకైక కల్యాణ నిలయులైరి.

అన్నమో రామచంద్రా! యంచు నార్పాట
పడి యంగలార్చెడి వారులేరు

చినిఁగిపోయిన చీరచెఱఁగొక్కటియు లేక
ప్రాతకై యర్థించు వారులేరు

దినవెచ్చమునకునై దేవులాడుచును గ
వ్వయుఁగూడ యాచించు వారులేరు

చేసాచి యడిగిన నీ లేదు పొమ్మంచు
బదరించి మాటాడు వారులేరు

ద్రవిడరాష్ట్రములందెల్ల నవిటి చవిటి
కూని గ్రుడ్డివారొకరైనఁ గానరారు
రాజమాత్రులే ద్రావిడ ప్రభువులెల్ల
నిఖిలలోకైక కల్యాణ నిలయులైరి.

గుడులఁ గట్టించి గోపుర కోటితోడ
మంచి మడిమాన్యములు సమర్పించి యధిక
దైవభక్తిఁ జూపించిరి దేవళముల
ద్రవిణమంతయు వెచ్చించి ద్రవిడనృపులు,

బాటసారులు నిలువంగ బాటకడల
వేసి పెంచిన తోఁటలు విసుఁగులేక
నీడనిచ్చుచునున్నవి నేఁడుకూడ
"వనము తోఁటలు" దక్షిణా పథమునందు.

కాలవశంబునన్ ద్రవిడ ఖండము సర్వము ఛిన్నభిన్నమై
వ్రీలిన భిన్నరాష్ట్రములు భిన్నకులంబులు నుద్భవించెఁ ద
న్మూలమునన్ బురాతన సమున్నతి కోల్పడిపోయి పిమ్మటన్
జాలఁ గృశించెఁ గందువడె శాత్రవులుం దలయెత్త వెండియున్.

అబ్బురపు కాలవైపరీత్యంబుచేత
రాష్ట్రములు చీలిపోయిన రాజులెల్లఁ
జెదరి నలుదిక్కులకు నేగి చిన్న చిన్న
సీమలార్జించి దొరలైరి సేఁగిలేక.

దేశకాల పాత్రంబులవలనఁ గల్గిన పెక్కు మార్పులచే నాయా సీమలకునేగిన ద్రావిడులు, నూతనాచారంబులు పట్టు వడుటచే భిన్ననామరూపంబులందాల్చి విజృంభించి, పదంపడి దక్షిణాపథమును మరల దక్కఁలుఁజేసికొని, వివిధ రాజవంశం బుల పేరిట, నిష్కంటకంబుగా మహావైభవముతోఁ బరిపాలిం చిరి. కాలాంతర రూపంబునఁ గల్గిన యీ పరిణామదశను నాను పూర్వికగ వర్ణించుట సుకరంబుగా దయినను, నానేర్చినకొలఁది పెద్దలవలన యెఱింగిన కొలఁది యెఱింగింతు నాలింపుము,

ద్రావిడులు విజ్ఞోఢై తమిళులు, తెలుఁగులు, కన్నడులు, మలయాళులు మొదలగు జాతులుగఁ జీలి, దక్షిణాపథంబు నాల్గుచెఱఁగుల నాక్రమించి, వెవ్వేరు నాగరికతయు భాషయుఁ బ్రతిభయుఁ గలుగఁ గట్టుమాఱఁ జిరకాలం బరిష్టంబు లేకుండ నేలుచుండ—

ఐక్యముతోడఁ బంచజను లందఱు హాయిగనుండఁ జోళ చా
ళుక్యముఖాది భూమిపతులున్ భువినేలిరి కొంతకాలమే
జోక్యముకల్గనీక గుణశోభితులై నయపక్షపాతికిన్
శక్యముకాని యట్టిపని సంభవమానె జగత్త్రియంబునన్:

వారు కాలగోచరులైరి వారిపిదప
దేశ మల్లకల్లోలమై దిక్కులేమిఁ
గాఱుచీకట్లు దిశలెల్లఁ గ్రమ్మికొనఁగఁ
బ్రజలు కళవళించి రుపద్రవములచేత.

తమిళ కేరళ తులువ రాష్ట్రముల పూర్వ
పుణ్య పరిపాకమునఁ జేసి పోసరించి
రచట నాయర్లు వెళ్ళాలు సతుల శౌర్య
విదిత కీర్తి భాసితులైన మొదలియార్లు.

తెలుఁగుదేశంబునందు దేదీప్యమాన
శక్తి రాజ్యంబుఁ జేసిరి సారభుజులు
వెలమ మన్నీలు రెడ్డి హంవీరవరులు
కాపు సరదార్లు నాయకుల్ కమ్మదొరలు

విక్రమావష్టంభ విభవాతిరేకులై
విదళించి కొట్టిరి వెలమదొరలు
సమర శౌర్యాటోప చండ ప్రచండులై
క్రొవ్వించి నెట్టిరి కమ్మదొరలు
నిర్ణిద్ర దోస్సార నిర్భిన్న వైరులై
రెట్టించి మెట్టిరి రెడ్డిదొరలు
వైరి భీకర ఖడ్గపాండితీదక్షులై
కదియించి దట్టిరి కాపుదొరలు

శాత్రవానీక మీరీతి సమసిపోవ
దుర్భరావగ్రహ విపత్తి తొలఁగిపోవఁ
బ్రజలు బ్రదికిరి తస్కరభయము లేక
తెలుఁగుదొరలేలు మాగాని పొలములందు

వర్తమానంబునను గూడఁ గీర్తిధనులు
వెల్గుచున్నారు పైవారు తెల్గుదేశ
మందుఁ బెట్టి పోషించెడు నట్టిశక్తి
నంగరంగ వైభవముల నంగవించి.

ఒక్కగతి పులి మేకయు నొక్కతేవు
నందు నీరుఁ ద్రావెడునట్టు లధికశక్తి
న్యాయభావంబుతో దక్షిణాపథంబు
నెల్ల ద్రావిడరాజన్యు లేలుచుండ.

ఉత్తరంబున నార్యు లుద్వృత్తినపుడు
చతురుపాయంబులఁ బ్రయోగచతురులగుచు
శత్రుకాండీరులనునెల్ల సదమదించి
దక్షిణాపథమ్ము జయింపఁ దలఁచి తలఁచి.

సర్వతంత్ర స్వతంత్రుండు శ్రద్ధదానుఁ
డింగితజ్ఞుండు వేద వేదాంగవేది
యగు నగస్త్యుని బిలిపించి యప్పుడపుడె
చెప్పిరిటు పల్కు నయగార మొప్పుచుండ.

తెక్కలి నిన్న మొన్న పరదేశమునుండి బిరానవచ్చినా
మెక్కడఁజూచినన్ రిపు లదేపనిగా మనచుట్టుమూఁగి త్రా
ముక్కడగింపనుండి రెటులో యొకదారిని నుత్తరాదినిన్
గక్కసపెట్టి వైరులను గాపురముంటిమి కత్తిబల్మిచే.

మనచే నోడింపఁబడిన
మన వైరులు దక్షిణమున మసలుచునుండన్
మన కబ్బఁగలదె క్షేమము
మనఁగలమే చిక్కులేక మనమిచ్చోటన్.

శత్రుపరిశేష మెటువంటి సాహసునకుఁ
బ్రాణహానికరంబని రాజనీతి
కోవిదులు పల్కుచుందురు గుని యకుండఁ
గాన మనమది పాటింపఁ గర్జమౌను

కతిపయ శిష్యులుం గొలువఁగాఁ బయనంబయి యిట్లై వింధ్యప
ర్వత వనభూములం గడచి ద్రావిడదేశముఁ జొచ్చి యచ్చటన్
బ్రతివసథంబునన్ విడిసి వారలకుం దలలోని నాల్కనై
మతమును బోధసేయు మిష మర్మముతో నటియించి శిష్యులన్.

భేదోపాయముచేతన్
భేదముపుట్టించి మిగుల భేదజ్ఞుఁడనై
వాదులతో మూదలతోఁ
గాదనకొప్పించి తీర్పఁగదె మన పనులన్.

ప్రజ్ఞచేత దివ్యమగు సుపజ్ఞచేత
లోకవృత్తం బెఱుఁగజాలు మీకు ధర్మ
ములుపదేశించు పాటివారలము కాము
గాని చెప్పుచుంటిమియని యైన వినుఁడు.

బెరసిమాటాడఁ బోకు మీ పరులతోడ
నరసిసాగింపు తంత్ర మాదరముతోడ
మురిసి కిటు కేమి చెప్పకు మొరులతోడ
నిరిసియైనఁ బట్టినపట్టు నెల్లఁదీర్పు.

దేశకాలపాత్రంబుల దీర్ఘదృష్టి
నఖముఖంబులఁ బరికించి నిఖిలగతుల
విప్రకారంబుఁ దగనైఁచి వేచియుండి
మంచికాలంబున విరోధి నొంచవలయు.

ఎట్టులనేని సంఘహితమే పరమార్థమటంచు నెంచి యి
ప్పట్టున గట్టిపట్టుదలఁ బైకొని మేలొనరింపు దాన నీ
పుట్టువు సార్థకంబగును బొద్దులుపుచ్చఁగవచ్చు హాయిగా
రట్టడిలేని రాష్ట్రముల నంపిలుచుండఁగఁ బిన్నపాపలున్.

•

అని యీరీతిఁ జదువు సాములు నేర్చిన కులము సాములు నచ్చఁజెప్పి, మున్నడి దీవించి, యగస్త్యునిఁ బ్రయాణోన్ముఖుం జేయ నతండును వల్లెయని, నైజమ శిష్యపరివృతుండై, యత్యుత్సాహంబునఁ బయనంబై, వింధ్యపర్వతంబు నిర్గమించి, తద్దక్షిణదిశాభాగ పరివ్యాప్తంబగు కీకారణ్యంబుఁ బ్రవేశించి, వాసయోగ్యంబులగు పొలముల నెమకి, జలతృణ కాష్ఠ ఫలవృక్ష సమృద్ధంబగు ప్రదేశంబులయందు మునిపల్లెలు గట్టుకొని, జన్నితొట్టుపట్టుల నేర్పఱచికొని, వెడ్డకులగు శిష్యులంగూర్చికొని, ద్రావిడ జనపదంబులకుఁబంపి, విచ్చలవిడి వేదాంతంబు బోధింపించి, పూర్వాచారంబులఁ దెగడి, వెగటు పుట్టించి, తర్కపాండితీ మహిమంబు వెలయ, వితండవాదంబుఁ గావించి, పూర్వాపరసందర్భముల మఱపించి, ద్రావిడ సంఘంబునుండి జాతిద్రోహుల సృష్టించి, వెరయించి, కొంత దనుక సఫలీకృత మనోరథుఁడై, యువ్విళ్ళూరుచుఁ గులుకుచుఁ గొండొకనాఁడు, తమకించి యిట్లు విచారింప దొడంగెను: "స్వార్థపరులై, సంఘద్రోహమునకు వెఱవక, జాతి వైరంబు దిగఁద్రావి, విడివడి, యార్యసంఘదాసానుదాసులై

జోహారులు చేయుచున్న ద్రావిడమాత్రులకు, నైహికవాంఛా సంతృప్తిఁ జేయంజాలు విడిముడి యిచ్చినంగాని, కులగౌర వంబు నొసంగినఁగాని, యార్యసంసర్గంబు నైహికాముష్మిక ఫలదాయకంబని, విశ్వాసంబుఁ గల్పించినంగాని, వీరార్య విజృంభణంబునకుఁ గొఱముట్టులు కానేరరు, కావునఁ దత్క్షణమ సమాధానపఱచుట సమీచీనంబని, నిర్ధారించి—

కులము లేనట్టివారికిఁ గులమునిచ్చి
పేరు లేనట్టివారికిఁ బేరునిచ్చి
సొమ్ము లేనట్టివారికి సొమ్ములిచ్చి
పనిని సాగించెను గుల నాపకులఁ జేసి.

ద్రావిడసంఘముఁ వదలి తక్కుచు వచ్చినవారి నెల్లరన్
బ్రోవుగఁ జేసి మాట పయిపూఁత మెఱుంగులుదోఁప నార్య ధ
ర్మావళి నాచరించునెడ నైహికసౌఖ్యములబ్బుఁ బిమ్మటన్
దేవపదంబుఁ బొంది కడతేరఁగవచ్చునటంచుఁ జెప్పుచున్.

కులగోత్రములఁ గొన్ని క్రొత్తగాఁ బుట్టించి
విప్రులటంచును బేరుపెట్టి
తమ తాత ముత్తాత తండ్రులు వీరికి
గోత్రపురుషులంచు గొణిగిచెప్పి

తమతో సమానపదవి నిచ్చితిమటంచు
కపటగౌరవ మింత గానుపించి
క్రమముగా భోజన ప్రతిభోజనంబుల
నిప్పించి మర్యాద నేర్పఱించి
ద్రావిడులపల్లెలకుఁబోయి తప్పకుండ
బైసి విడనాడి వారితో భాసలాడి
మనకుఁ గింకరులనుజేయుఁ డనుచు దెల్పి
తెలివితేటలతోఁ బనిదీర్పుఁ డనుచు.

అగస్త్య సంయమీంద్రుండు సమాధానవాక్యంబులఁ గార్యగతి నిరూపించి చెప్ప, యుగపల్లబ్ధ గౌరవ సంజాత సంరంభంబున నగస్త్యప్రశిష్యులం గూడి యభినవబ్రాహ్మణులు చెలరేఁగి ప్రవర్తించి కొంతకాలంబుచనుడు ద్రావిడుల పాయ కట్టులకుం జని—

"గంగ"గుడులు మాని కట్టుఁడీమీరు సీ
తారాములకు నేలి దద్దళములు
"పోతురాజా"దుల ముందు చిందులుమాని
పట్టుఁడీ భద్రుని పళ్ళెరంబు
"గొంతెమ్మ"దేవర కొలుపుమాని కొలువుఁ
డీ బ్రహ్మవిష్ణు మహేశ్వరులను
మాత "పోలేరమ్మ" జాతరలుమాని
సలుపుఁడీ బలులతో జన్నములను

గొఱ్ఱెలను మేఁకలను గొంతుఁ గోయమాని
గొంతుఁగోయుఁడీ గోవులఁ గుఱ్ఱములను
సంశయింపంగ మీకేల సత్య మిదిగో!
చచ్చిపోయినపిదప మోక్షంబువచ్చు.

జంటితేనె పూఁదేనియల్ జుఱ్ఱమాని
జుఱ్ఱుఁడీ మీరు కడుపాఱ సోమరసము
నప్సరఃకామినీ మధురాధరమ్ముఁ
బానమును జేయు యోగ్యత పట్టఁగలదు.

అబ్బురపాటు పాటిలఁగ నందఱు నీగతి వేడబంబుతో
నిబ్బరమైన పట్టుదల నెక్కొన నచ్చఁగఁజెప్పి మైకమున్
బ్రబ్బఁగఁజేసి ద్రావిడుల వంచనఁజేయుచు నార్యకింకరుల్
దబ్బరలాడి యాడి తమదారికిఁ ద్రిప్పిరి కొంతమందినిన్.

పిమ్మట నార్యకింకరు లుపజాపకులై పుటమరించి నిక్కి-నీల్గుచు విఱ్ఱవీగుచుఁ గ్రిందుమీదెఱుంగక, స్వజాతినిధిఃకరించి స్వజాతీయుల మూఢులని తలపోయసాఁగి క్రమక్రమంబుగా-

మాతృ భాషాభిమానంబు మఱచిపోయి
యన్యభాషయనెడి పైసిమైన లేక
సంస్కృతంబును శ్రద్ధగాఁ జదువసాఁగి
యీసడించిరి సొంత బాస నకట,

## ద్వితీయాశ్వాసము

ప్రాచీనాచారములు స
మీచీనము గాదటంచు మిక్కిలి కినుకన్
వాచాలత్వముతోఁ బూ
ర్వాచారంబులఁ ద్యజించి రార్యానుచరుల్.

భేదభావంబు లీరీతి విస్తరించి
యార్యకింకరు లధిక గర్వాఢ్యులగుచు
మచ్చరం బంతకంతకుఁ బెచ్చుపెరుఁగ
నుద్దవిడి వేరుశాఖయైయుండి పిదప.

ద్రావిడ ప్రజావళియెల్లఁ దమకుఁ గైవ
సంబు కాకపోయెనను క్రోధంబుచేతఁ
గలియుగంబునఁ బరికింపఁ గలవు రెండె
వర్ణము లటంచు నార్యులు నిర్ణయించి.

బ్రాహ్మణులును శూద్రులును మాత్రంబె కలరు
క్షత్రియులు వైశ్యులును లేరు కలియుగమ్మ
నందు నంచు సిద్ధాంతవాక్యములు వ్రాసి
పెట్టిపోయిరి స్మృతులు ద్రావిడులకొఱకు.

మాయావాదము నిల్వదు
మాయావుల మంత్ర తంత్ర మహిమం బిదిగో!
పాయఁగఁ జొచ్చెను మాయో
పాయము లెన్నటికినైన బయలం బడవే!

స్మృతులనుచు మఱియుఁ బురాణవితతి యనుచుఁ
ముక్తినీఁజాలు గ్రంథ సమూహ మనుచుఁ
గల్ల కపటం బెఱుంగని సల్లవారు
నెమ్మనమ్ముల గట్టిగా నమ్మి చెడిరి.

వినుము కుమార! నీకు వినిపించెద సర్వము భావిసంగతుల్
కనుకనిచేత నింకఁ జిరకాలము ద్రావిడభూమి యీగతిన్
బనపదు పూర్వకాల పరిభావము నీఁగుసుమా! ప్రబోధముం
గని యెసరేఁగి ద్రావిడులుఁగాంచెద రర్హపదంబుఁజెప్పితిన్.

సేతువుఁదొట్టి వింధ్యగిరి సీమలదాఁక వసించు ద్రావిడ
వ్రాతము కన్నువిప్పి యొకపారి కనుంగొని యాత్మదుస్స్థితిన్
దీతువుపిట్టవోలె నిగ దించెడి జాల్ముల ద్రుళ్ళువాపి రుం
ద్రాతత పూర్వవైభవ సమన్వితులై యురళింతు రెంతయుఁ

జూఁకఁ బదిబదారేండ్లుగ డాకమున్న
నూత్నభావోదయముగల్గి నూతన ప్ర
బోధమునుగల్గి ద్రావిడుల్ పూర్ణ గౌర
వంబుఁ బొందఁగలరు నిక్కువంబుగాఁగ.

అ సు రు ల వ ల న

అని వచియించి, సూతమహర్షి నాచే నర్థింపఁబడి
యవలి కథాప్రపంచమును వినిపింప సమారంభించి –

అసురులు ప్రాణగొడ్డమగు నాఁకటి చిచ్చునకోర్వలేక నీ
రసపడి యెట్టకేని పరరాష్ట్ర పరంపరఁజూచి పోరిచికో
ససువులఁ బశ్చిమాభిముఖులై చని కాననసీమలందు దు
ర్వ్యసనములందుఁ జిక్కక ప్రవాసముఁజేసిరి సంతసంబుతో.

కాయకష్టంబులకునోర్చి గహనభూమి
శరభ సింహశార్దూలాది జంతువితతిఁ
జంపి వాసయోగ్యంబుగా సవదరించి
కాపురంబుండిరచట సౌఖ్యంబుతోడ.

కొంప గోడిగల గడించి కుములుడించి
పొట్టకూడు మరియుఁ గట్టు బట్టగల్గి
పిల్ల జెల్లలతోడ వర్ధిల్లినార
లసురసింహులందందుఁ గాఱడవులందు.

అసురులిదె నేఁటి పారశీ కార్యులైరి
యసురసంతతి పారశీలైరి నిజము
పారశీకమయ్యె నసుర వాసభూమి
తికమకలు లేక చర్చింపఁ దెలియఁగలదు.

అసురవితానముంగలిసి యచ్చటఁ గాపురముండఁబోక యా
దెసలను వీడుచున్ యవలి దేశముఁబోయి సదా యయోనిజుల్
పసగల దేశముల్ గమిచి పట్టి సుఖోన్నతిఁ బొంది నేఁటికిన్
వసతుల నేర్పఱించికొని వాసముఁ జేతురు పేరు పెంపుమై.

వారిపేర నచ్చటినాఁడు వన్నెకెక్కె-
వారిపేర నచ్చటి వార్ధి వాసికెక్కె-
నేఁటికినిగూడ వారి యనింద్యకీర్తి
యాదిశాభూమిఁ దాండవం బాడుచుండె.

ఆర్యసైన్యభవంబునుగాంచి యసురవర్యు
లీసుతో వారిపైకి దండెత్తివచ్చి
తుముల సమరంబుఁ గావించి తుట్టతుదకు
నాశమంచి రార్యావర్త దేశమందు.

ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జన్మ వృత్తాంతము

ఈ సందర్భమునఁ జిత్రమగు నొండుపాఖ్యానంబుఁ దెలిపెద నాకర్ణింపుము. ఎఱుంగుదువుకదా, వ్యాసభట్టారకుండు లిఖయించిన పంచవేదంబన నెగడు మహాభారతమునందు, బంచపాండవుల యర్ధాంగియైన కృష్ణయుఁ దత్సోదరుఁడగు ధృష్టద్యుమ్నుండును నయోనిసంభవులని వర్ణింపఁబడుట, లోకప్రతారణార్థంబు కల్పింపఁబడిన యేతద్విషయముంగూర్చి సాకల్యంబుగా సత్యంబుఁ దేటపఱతు.-

ఆలమునందు శౌర్య మడియాలముగా విహరించు వీరపాం
చాలకుమారసింహ గురుచాప సముజ్ఝిత శింజినీధ్వనుల్
జోలలు పాడుచుండఁగ సుషుప్తినిబొందుచునుండు ధారణీ
పాలవతంసుఁడౌ ద్రుపదభాను డొకండు కలండు వెల్గుచున్.

పిన్ననాఁడితండు క్షత్రియకులోచిత ధర్మంబగు విలువిద్యను నేర్వ మునులాశ్రమంబులకుంజని యందు విలువిద్యఁ గఱచుచుండ, భారద్వాజుఁడగు ద్రోణుండు సహపాఠియై తనతో మెలంగుచుండఁ గొండొక్కనాఁడు ద్రోణునిం జేరంజీరి "నెచ్చెలీ! మా పాంచాల దేశంబునకు నభిషిక్తుండనై నేను రాజ్యంబుఁ జేయునప్పుడు నీవట కరుదెంచిన నో నిన్నుమన్నించి నీ యభీప్సితంబుల నీడేర్తు"నని ముట్టఁబలికి విద్యాభ్యాసంబుఁ బరిసమాప్తిఁ గావించుకొని మగిడి పాంచాల దేశంబుఁ జేరి రాజ్యంబుఁ జేయుచుండ, ద్రోణాచార్యుండు కుటుంబభారంబుచేఁ గ్రుంగఁబడి, ద్రుపదుని వీడుచొచ్చి తన్నెఱింగించికొని తత్సన్నిధానంబున నిలువంబడి, చిన్ననాఁటిమాటలు జ్ఞప్తికిఁ దెచ్చి తా వచ్చినపని వినిపించిన, ద్రుపదుండు –

ఓరకంటను బొడఁగాంచి యూరకుండి
యాప్తులనుగూడి పాచికలాడుచుండి
మాటలాడమి గిజ్జున మగిడి ద్రోణుఁ
డచ్చటనుబాసి వెడలి దురాగ్రహమున.

తిన్నగ హస్తినాపురము తెన్నునఁబోయి సురాపగాసుతున్
గ్రన్ననఁ గాంచివచ్చిన ప్రకారము సర్వముఁ దెల్పి వానిచే
మన్ననలందుచుణ్ గురుకుమారులకున్ దగురీతి నొజ్జయై
యన్నము సుంతలేక ధనురాగమమెల్లను నేర్పి పిమ్మటన్.

గురుదక్షిణగా భారత
నరపాలకుఁ గట్టి తెచ్చి నాకొసఁగుఁడి యో
ధరణీశతనయులారా!
యనుమాటలే కంచు ద్రోణుఁ డాడినయంతన్.

ఉరు గర్జాపరిపూర్ణ దిక్తటుఁడునై యుద్యోగసంరంభుఁడై
నరసింహాకృతి దివ్య ఘోర విలసన్నారాచతూణీరుఁడై
నరుఁడుగ్రోద్ధతిఁ బార్షతుఁబొడిచి విన్నాణంబుతోఁ దెచ్చి భూ
సుర పాదంబుల వ్రాలఁబెట్టఁ బరితుష్టుండై యతం డిట్లనెన్.

వీ రెవ్వరు ద్రుపద ధరా
వరులా! యిట్లేల వచ్చిపడినారలు భూ
సుర పదములపై? తగునే
మఱి? యం చుడికించి పెక్కుమాటలచేతన్.

విడిచిపుచ్చినఁ బాంచాల విభుఁడు మాన
ధనుఁడు రాజలోకమునందుఁ దనకు సంభ
వించినట్టి పరాభవ మెంచి క్రోధ
తప్తచిత్తుఁడై పగ నీగ దారిలేక.

తండ్రిఋణము దీర్పఁ దగిన సూనుఁడులేమిఁ
దనకుఁ గడిమిలేమిఁ దలఁచి తలఁచి
ననట మిగులఁజెంది పగఁబట్టియున్నట్టి
త్రాచుపామువోలెఁ దల్లడిలుచు.

బిడ్డలుసూడుఁ దీర్పఁగల వీకులు గల్గమిఁ దాల్మిలేక యే
యడ్డము వచ్చినప్పటికినైనఁ గదించి నితాంతశక్తి నే
నడ్డను నేనియుం దగిన బిడ్డలఁబొందెడి నిశ్చయంబుతో
నెడ్డఁదలంచి మంచితఱి యెప్పుడువచ్చునొయంచు నుండఁగన్.

ఉత్తర కురుభూములలో
నుత్తర దిగ్భాగమం దయోనిజ తండ్రిం
బత్తరిఁ గాపురముండిన
వృత్తాంతం బెఱిఁగి చరుల వెంటనె పంపన్.

యాజోపయాజులను ముని
రాజుల యుపదేశమంది రహిఁ శాశ్వత పృ
థ్వీజాని యానఁ దలనిడి
జాజరతో వారు పనిని సాధింపంగన్.

వేగులవాం డా)వీటికి
వేగమ చని యందుఁగల్గు బిడ్డలనెల్లన్
బాగుగఁ గనిపెట్టుచు నా
భాగమ్మున వేచియుండ బహు నైపుణితో.

పొంగారెడి లావణ్యము
బంగారముఁ బోని మేనివన్నియ మిగులన్
రంగారెడి సౌష్ఠవమును
సింగారము గల్గియున్న శిశువులనెల్లన్.

కాంచి, హర్షించి, యేలిక మనోరథం బీడేర్పఁజాలుదు
మని యెంచి, పొంచియుండ నొక్కరేయి—

తెల్లని వెన్నెల గాయఁగఁ
జల్లని పయ్యెరలుదోలు సమయమునందున్
సల్లాపించుచు వచ్చిరి
పిల్లలు కవ లారుబైట విహరింపంగన్.

మూఁడుబారలవిల్లు మూపుపై నానించి
పొదినిండ బాణముల్ పదిలపఱచి

కైజారు మొలధట్టి గట్టిగానిఱికించి
బారు టీటెను బ్రక్కజారవిడచి

గొనబుగాఁ దలమీఁదఁ గుల్లాయి సవరించి
మైయెల్ల గోపించు మఱువుఁదొడిగి

చికిలిజేసినకత్తి చేతిలో ధరియించి
బొబ్బరించెడి గవ్వజబ్బఁ దాల్చి

గున్నయేనుఁగు మఱపించు గునుకునడల
మొలకలెత్తెడి చిఱునవ్వు మోముఁగప్పఁ
బదిపదారేండ్లు గడచన్న బాలకుండు
శౌర్య సౌందర్యరాశి యచ్చటకువచ్చె.

మసక నైఃచాయ దెసలెల్ల మసరుచుండఁ
గసటు లేని లావణ్యంబు గంతులిడఁగ
ముద్దు మాటలు గట్టెడి ముద్దరాలు
బాలయొక్కర్తు నీటితో బయలు దేర.

ఇదె యదనని తలపోసి దుర్
పద భూపతి చారపాళి పతిగోసవాఁడన్
గడసి పయింబడి పట్టుక
పదపదమని పైనమయ్యెఁ బాషతుకడకున్.

వచ్చిన చారులు ముర్చిమిఁ
దెచ్చిన బిడ్డలను గలక దేరిన మదితోఁ
జెచ్చెరఁ గనుగొని, పసదన
మిచ్చి యవలకంపి వారి నెల్లరఁ బిదపన్.

పట్టరానట్టి సంతోష భావమునను
ముద్దు పసిబిడ్డ లిద్దరి మోముఁగాంచి
యేమిచేయంగఁ జేయాడ కేకతంబ
మిగుల యోజించి, యోజించి మెలపుతోడ.

శిష్టులఁగూడి మంతనముఁ జేసి, పరాకిసుమంత లేక సం
తుష్టినిబొంది యంత తమ తోయమువారికిఁ జెప్పి పుత్రికా
మేష్టి నొనర్చి బిడ్డలను నెట్టులొ కాంచెదనంచుఁ గార్య సం
సృష్టమనంబునన్ బలికి చెచ్చెర దీక్షితుఁడై పునీతుఁడై.

హోతలు ఋక్కులం జదువు చుండఁగ మిక్కిలి శ్రద్ధతోడ ను
ద్గాతలు సామవేదమును గానము సేయ మనోహరంబుగా
ప్రీతిగ యాజ్ఞికుల్ సకల వస్తువులన్ సమకూర్చుచుండఁ బ్రి
ఖ్యాతిగ యజ్ఞగుండ సముఖంబున భూమిపుఁడుండి దేవితో.

సమిధలను వేసి యజ్ఞ గుండమున మిన్నుల
నాజ్యమును బోసి యగ్ని చల్లారకుండ
వ్రేల్చుచుండెను ద్రుపద పృథ్వీవరుండు
భార్యతోఁ బాటు పరవశత్వమునఁ జేసి.

యజ్ఞధూమంబు దిశలెల్ల నావరింప
యజ్ఞగుండంబు మంటతో నావళింప.
చెవులు చిల్లులుపడుచుండఁ జెప్పఁదొడఁగి
రఖిలమంత్రంబు లొప్పగా నచటి మునులు.

ముగిసీ ముగియకమును పే
బగబగ సవనాగ్ని యన్నివైపులఁ బర్వెన్
సెగచే మొగములు మొగిడెన్
బొగచేఁ బ్రజ కన్నుదోయి మూఁతలుపడియెన్.

కన్నుగవవిప్పి కనుగొన్న క్షణమునందె
మెఱుఁగు టొడలితో జన్నంపు టరుగుకడను
బాలుఁడొక్కండు ముఱిపెంపు బాల యొక్తు
నిలిచియుండిరి మిఱుమిట్లు గొలుపునట్లు.

ద్రుపదరాజన్యవంశంబు దొట్టుటకును
నగ్నిగుండంబులో నిప్పు డవతరింపఁ
జేసె నీయమళంబును సృష్టికర్త
యనుచుఁ దడబాటు లేకుండ ననిరి మునులు.

ద్రుపదధరాధినేత పరితోషవశంవదుఁడై వినీతుఁడై
విపుల తపోధనుల్ మిగులఁ బ్రేమను దీవనలిచ్చి పంపఁగా
నపుడె శిశుద్వయంబును బ్రియంబునఁదోడ్కొని ప్రోలుచొచ్చి మో
హపరవశత్వభావమున నన్నియు నేమఱిపోయె నక్కటా!

యజ్ఞవేదికామధ్యమం దవతరించి
నందున నయోనిజులు కసిగందులనుచుఁ
జాటెఁ బాంచాల మెల్లను మాటుఁబెట్టి
వారి యన్వయంబుఁ దెలియఁబఱచకుండ.

కృష్ణ యనుపేర బాల వర్ధిష్ణయగుచుఁ
బాండవేయుల యుమ్మడిభార్యయయ్యెఁ
బాండవ పృతనాధీశుఁడై బాలకుండు
వినుతికెక్కె ధృష్టద్యుమ్నుఁ డనెడిపేర.

పుట్టుపూర్వంబు లజ్ఞాతంబులగుటంజేసి, కాలవశంబున నయోనిజుఁడనెడి పేరు విలుప్తంబగుడు, ధృష్టద్యుమ్నుఁడు పాంచాలుండయ్యెఁ గృష్ణయుఁ బాంచాలియయ్యె. ఇదియ సురాసురాయోనిజుల పూర్వవృత్తంబు. విస్తరించి యెఱింగిం

చితికదా ! మునిమాపగుచున్నది. బిడ్డా ! యీ గోష్ఠిఁజా లించి కాల్యంబులఁ దీర్చికొని, గంగమడువునకుఁ బోదము'' అని వాక్రువ్వ వెంటనే నేను గట్టాయితంబుకాగా బయలుదేరి పోయితిమి.



ఈ కథ వ్రాసిన విన్నను
వాకొన్నను బాడిపంట పరువముసుబ్బున్
తేకువ జోకయుఁ బ్రబ్బున్
బ్రాకటముగ లిబ్బులుబ్బుఁ బైరములబ్బున్.

ద్వితీయాశ్వాసము సమాప్తము

శ్రీ రామకృష్ణా ప్రింటింగ్ వర్క్స్, విజయవాడ-2.



తొలిపలుకులు:

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, ద్రావిడులు, దక్షిణాపథము, ఆర్యమంత్రాంగము, రణనీతి, రాముఁడు, రావణుఁడు.

మొత్తుకోళ్ళు

యథార్థ ప్రహ్లాద చరిత్రము

యథార్థ రామాయణము



# తొలిపలుకులు

"ఆర్యస్త్రైవర్ణికః" యని పూర్వులు నిరాఘాటంబుగ వాకొనియున్నారు. దీని యర్థమేమి? ద్విజులని నేఁడు వ్యవహరింపఁబడుచున్న మూఁడుకులములవారే యార్యలోకంబునకుఁ జెందినవారని పూర్వుల యభిప్రాయము. అయినచో శూద్రులని కలగూరగంపగా వర్తమానంబున వ్యవహరింపఁబడుచున్న నాల్గవజాతివారి యుపపత్తియేమి? ఎవ్వరువీరు? చిరకాలము నుండి సామాన్యస్వత్వదూరులయి వీరు నీచదశం బొరలాడుటకుఁ గారణమేమి? స్మృతులయందుఁ జెప్పఁబడిన వీరి జన్మకథనము నిజమయినదేనా? నిజముగ స్మృతులు వీరికొసంగిన స్థానమేనా వ్యావహారికమునందుఁ జెల్లినది, చెల్లుచుండినది? స్మృతివాక్యములకు నాచారమునకు భేదమెట్లు తటస్థించినది? స్మార్తధర్మవిరుద్ధముగ దక్షిణాపథమున వీరికిఁ బ్రజాపాలనము, సేనాపతిత్వము, మంత్రిత్వ మెట్లు లభించినది? ఈ యంశముల నన్నింటిని గూలంకషముగను, నిష్పాక్షికముగను, సవితర్కముగను జర్చించుట మా విధియని నమ్మి యిప్పుడిద్దాని కుపక్రమించుచుంటిమి.

ఉపర్యుదాహృతమగు లోకోక్తినిబట్టి శూద్రశబ్దవాచ్యులయిన మానవులు 'ఆర్యులు' కాక 'అనార్యుల'ని మాత్రము స్పష్టముగఁ దేలుచున్నది. అయినచో నీయనార్య

లెవ్వరు ? శాఖోపశాఖాసమన్వితమయిన ద్రావిడలోకంబు నకుఁ జెందినవారు. వీరార్యజైత్రయాత్రకుఁ బూర్వమునుండి యీ దేశంబున వసించుచున్నవారు. విదేశీయులు, విజాతీయు లయిన యార్యులు తమదేశంబునకు వలసవచ్చినపుడు, మోహరించి, యుద్ధారంబులొడ్డి యొుఱగడ్డములం ద్రొక్కి, పెక్కుశతాబ్దులు హోరాహోరిం బోరి, పోరి, యార్యుల తెక్కలి త్రోవలను నరికట్ట నడుముకట్టి వసుంధరాభాగమును, గవోష్ణ రక్తధారాపరిప్లుతమును జేసిన మహావీరులు. దైవోపహతు లయి వెడ్డరులగు నార్యుల కుతంత్రంబులకును, నవినీతికిం జిక్కి పరాభూతులయి వీరుత్తరాపథమునుండి వెనుకకు మరల వలసినవారైరి. వెనుదిరిగిన ద్రావిడలోకంబు నందలి క్షత గాత్రులను, వికలాంగులను, బందీలుగాఁబట్టి యార్యులు వారలను దాసీసేంద్రను జేసికొనిరి; లోఁబడిన ద్రావిడులను గట్టు దిట్టములలో నుంచి, యెన్నఁడెట్టి తిరుగుఁబాటు జరుగకుండుటకునై, స్మృతులు రచియించి, వీరికి ధర్మోపదేశంబుఁ గావించిరి. సర్వస్వత్వములకు దూరగులం జేసి, కొంచెమించుమించుగా సంఘబహిష్కృతులనుగాఁ జేసిరి. వీరికిఁ ద్రైవర్ణిక శుశ్రూషయే విధివిహితమనిరి. ఇస్తువును గడించుటకు హక్కు లేదనిరి. గడించిన యిస్తువేదయిన నున్న యెడల బ్రాహ్మణుల పరముఁ గావింపమనిరి. వీరికడ ధనమున్న యెడల రాజు బలాత్కారముగానైన లాగికొనుట ధర్మమనిరి. ఇవియుత్తరాపథమున నున్న ద్రావిడుల స్థితిగతులు.

ఇది యిటులుండ నార్యులయందలి మూఁడు వర్ణముల వారికి స్వత్వములయందు నీషద్వ్యత్యాసమైనను గల్గుటకుఁ కారణమేమియో యోజింతము. దీనిని బరిపూర్ణముగా గ్రహించుటకు మూలసూత్ర మొక్కటియున్నది. అది యేదంటిరేని, వివరించెద మాలింపుఁడు. స్మృతికర్తలు పెద్దలు నీ మూఁడు భాగములయందలి మానవులకు శరీరవర్ణము (అనఁగా నొడలిరంగు) మూఁడు రకములుగ నుండునని వాకొనిరి. ఒక్కజాతియందే దేహచ్ఛాయయందు నీ భేదము కల్గుటకుఁ గారణమేమి ? నిజముగ నాయా భాగములవార లాయా వర్ణములఁ గలిగియే యున్నారా ? దీనికిని జాతివిభాగమునకును, స్వత్వనిర్ణయమునకును, సంబంధమేమయిన నున్నదా ? మీమాంసఁ జేసి పరిశీలింతము.

మా యభిప్రాయమున నాయా విభాగములకుఁ జెప్పఁబడిన దేహచ్ఛాయకును, స్వత్వనిర్ణయమునకును గావలసినంత సంబంధమున్నది. శీతోష్ణ పరిస్థితులవల్ల దేహచ్ఛాయ మాఱు ననుట యెల్ల రెఱిఁగినదియే. అతిశీతల దేశవాసులు తెల్లగను, నత్యుష్ణదేశవాసులు నల్లగనుందురు. ఈ కారణముచే శీతల దేశ వాసులగు నార్యులు తెల్లగను, నుష్ణదేశవాసులగు ద్రావిడులు నల్లగనుండిరి. ఇందు సృష్టివైచిత్ర్య మేమియు లేదు. హిమాలయోపరిభాగమందున్న కైలాసమందు వసించిన శివుఁడు తెల్లనివాఁడని పురాణములయందు వర్ణింప

బడెను. శ్వేతాంగులయిన యార్యులయందు వర్ణవిభేదమెట్లు సంభవించినది? సంభవింపనియెడల నీ దిగువఁ జెప్పఁబడు నార్యనిర్ణయమునకు నర్థమేమి? బ్రాహ్మణులు శ్వేతాంగులనియు స్మృతికర్తలు నిర్ణయించిరి. దీనికర్థమేమి? వివరింతుము. శ్రద్ధగా నాలింపుఁడు.

ఆర్యులు శ్వేతాంగులు; ద్రావిడులు కాలాంగులు. వీరిరువురి రక్తసాంకర్యముచేఁ గలిగిన ప్రసవముయొక్క దేహచ్ఛాయ రకరకంబులుగ నుండును. అనఁగాఁ దెలుపుగాక, నలుపుగాక, తెలుపు నలుపు నడుమనున్న రంగులన్నియు నప్పుడప్పుడు బిడ్డల శరీరమునందు గన్పట్టుచుండును. ఈ కారణముచేతనే యార్యులయందు వర్ణవిభాగ మేర్పడవలసి వచ్చెను. ఈ వర్ణవిభాగముతో హక్కులయందుఁ దారతమ్యముకూడ నవసరమయ్యెను. అంతియకాని కొందఱాధునికు లాడునట్లు సంఘశ్రేయస్సుకొఱకుఁ, గార్యవిభాగము చేయఁబడినది యని చెప్పుమాట నిరర్థకము, నిర్మూలము, నిరాధారము. పైన వాకొనఁబడిన గుప్తభావమును వ్యక్తీకరించుటకొఱకే, దీనికి వర్ణవిభాగమని పేరిడఁబడెను. వర్ణమనఁగా దేహముయొక్క రంగు. రంగునుబట్టి యేర్పడిన విభాగమని యనుమానరహితముగ స్పష్టమగుటలేదా? వైతండికులకు నేమి చెప్పఁగలము? ఎట్లు నచ్చఁజెప్పఁగలము? స్వాత్మభేద మెట్లువచ్చెనో క్రింద విపులీకరింతుము.

## బ్రాహ్మణులు శ్వేతాంగులు

బ్రాహ్మణవర్ణము తెల్లనిది. అనఁగా నార్యుల దేహచ్ఛాయ యెట్టిదో, బ్రాహ్మణుల దేహచ్ఛాయకూడ నట్టిది. దీనింబట్టిచూడ బ్రాహ్మణజాతియందు సాంకర్యములేదని ధ్రువంబగుచున్నది. సంకరులుకాక యార్యత్వము మూర్తీభవించినట్లుండిన బ్రాహ్మణు లార్యులయందుఁ బరిశుద్ధులుగను, బరిపూతులుగను నెన్నఁబడిరి. మహమ్మదీయ రక్తసాంకర్యము లేని చిత్తూరు రాణావంశమున కున్న గౌరవ మితర రాజపుత్ర కుటుంబములకున్నదా? ఇది యట్టిది. ఈ కారణముచేతనే యార్యసంఘము బ్రాహ్మణులకు "దాసోహమ్మ"నినది. సంఘమును శాసించి నడుపుటకు వీరికే యధికారము కల్గినది. దోషాదోష నిరూపణము వీరి హస్తగతమయినది. విప్రన్న చెప్పినదే వేదమయినది. స్థిరచరరూపకమైన యిస్తువును గడించుట వీరి విధకాదు; కాని దానిని బరిపాలించుటకుఁ బంచి పెట్టుటకు సర్వాధికారమున్నది. ఈ పద్ధతిమాత్ర మద్భుత మేధావి శేష నిష్పన్నము. గడించలేకపోయితిమే యను బెంగ యక్కఱలేదు. ఇంటిలోఁ బ్రాయి రాజుటలేదే యను విచార మక్కఱలేదు. రెడ్డిగము తీయనక్కఱలేదు. ఏ దినమున కా దినము వలయు పదార్థములతో వీరియింటిని సంఘమంతయు నోలలాడించును. అవురా! తొల్లి బ్రాహ్మణుఁడు సంఘశ్రేయస్సు కొఱకై యెట్టి దుర్భరకష్టములను బొందెనో చూచితిరా!

## క్షత్రియులు రక్తాంగులు

అత్యధికాంశ మార్యరక్తము, స్వల్పాతిస్వల్పాంశము ద్రావిడరక్తము కల్గియుండుకతన నీవర్ణమేర్పడును. ఇందు చేతనే బ్రాహ్మణుల కున్న యధికారములో లవలేశము తక్కఁ దక్కిన యధికారమంతయు క్షత్రియులకుఁ గలదు. యజనయాజనాధ్యయనాధ్యాపక దానప్రతిగ్రహములలో నొక్క ప్రతిగ్రహముదక్క క్షత్రియునకు సర్వాధికార మున్నది.

## వైశ్యులు పీతాంగులు

క్షత్రియులకన్న నెక్కువ రక్తసాంకర్యము కలవారు. అనఁగా నెక్కువ ద్రావిడరక్తమున్నవారు. ఇందుచేతనే పీత వర్ణము వచ్చినది. వీరి యధికారము సంకుచితమైనది. షట్కర్మములలో యాజనాధ్యాపక ప్రతిగ్రహములకు వీరి కధికారము లేదు. ఇంతకన్నను నెక్కువ ద్రావిడ రక్తమున్నవారెల్లరు ద్రావిడులుగనె పరిగణింపఁబడిరి. ఇచ్చట నొక్కటి విచారింపవలయును. పుట్టిన బిడ్డయొక్క జాతి నిర్ణయింపవలసి వచ్చినప్పుడు బీజక్షేత్రములయందు బీజమునకే నాఁడెక్కువ ప్రాధాన్య మీయఁబడినది. పల్లెదానియందుఁ బరాశరునికిఁ బుట్టినబిడ్డ తండ్రినిబట్టి బ్రాహ్మణుఁడయ్యెను. చండాల స్త్రీయుండైన యరుంధతి (అక్షమాల) యందుఁబుట్టిన శక్తిమహా

ముని తండ్రినిఁబట్టి బ్రాహ్మణుఁడయ్యెను. నాఁడు నేఁడు వోలె క్షేత్రప్రధానముగాక బీజప్రధానముగా నుండె. పెండ్లి పేరంటములేని ఋషులు పెక్కురు ఇంగ్లీషు భాషలోని లోకోక్తిఁబోలె Sowing of wild oats నిరాఘాటముగ జరిపిరి. ఇందుచేతనే పెక్కువాంతర జాతు లేర్పడుటకు వీరు గారణభూతులైరి.

## ద్రావిడులు కాలాంగులు

ఆర్యులచే నోడింపఁబడిన ద్రావిడులకు బానిసతనము తక్క వేఱే యిస్తువు లేకపోయినది. పరువు ప్రతిష్ఠలు మటు మాయమయ్యెను. ఆర్యులు మహాహంకారముతో ద్రావిడులతోఁ బొత్తు నిచ్చగింపక, మిగులఁ దిరస్కారమును జూపించిరి. చెప్పరాని కట్టుదిట్టము లేర్పఱచి ద్రావిడులను దూర దూరముగా నుంచిరి. కట్టుదిట్టములదాఁటి యేర్పడ్డ వివాహముల వలనఁ గల్గిన సంతానమును, హీనజాతులను గొన్నింటిని సృష్టించి, వానిలోనికిం ద్రోసివుచ్చిరి. ఈ జాతులకు సుగతులు లేవని చెప్పిరి. ఇది యార్యావర్తనమునందలి కథ.

## ద క్షి ణా ప థ ము

దక్షిణాపథమున వైశ్యులనఁబడు కోమటులెన్నఁడు కర్షకులుగాఁగాని గోపకులుగాఁగాని లేరు. ఎన్నఁడు పీతవర్ణులుగాఁ గూడ నున్నట్టు కన్పట్టదు. కాలము, కమ్మ, రెడ్డి మొదలగు

వారు సేవావృత్తియందు లేరు. స్మృతులు చెప్పిన ''సచ్ఛూద్రా గోపనాపితౌ'' అను ననుశాసనము ద్రావిడలోక మెప్పుడు నెఱుంగదు. నాపితులను (మంగలులను) దాకిన స్నానము చేయకుండుట సంప్రదాయ విరుద్ధము. ఇంతియ కాక మృతాశౌచములయందు స్మృతి నియమములకు మిగుల విరుద్ధములయిన యాచారములు స్మార్తశూద్రులనఁబడు వెలమ కమ్మ రెడ్డి జాతులయందు సుప్రసిద్ధములు. ఇందు చేతనే స్మృత్యధికారము దక్షిణాపథమునం దెన్నఁడు ప్రచారమునుఁ గాంచ లేదని చెప్పుచుంటిమి. గౌతమ ధర్మసూత్రములు మొదలు పరాశరస్మృతివఱకుఁ గల స్మృతులయందు నెచ్చటను జెంచుజాతి దక్క ద్రావిడజాతులు పేర్కొనఁబడి యుండలేదు. మనుస్మృతియందు మాత్ర మాంధ్రులు మ్లేచ్ఛులుగాఁ బరిగణింపఁబడి గ్రామబహిష్కృతులయిరి. ఈ 'ఆంధ్రులు' తెలుఁగువారు కారు. ఆంధ్రుల మాతృభాష ప్రాకృతము. తెలుఁగువారి మాతృభాష తెలుఁగు. ఆంధ్రభాషాలిపి నాగరలిపిని బోలియుండును. వైయాకరణులు తెలుఁగును వికృతియనిరి. ఇది ప్రమాదజనితము. సంస్కృత మెట్టిదో తెలుఁగుగూడ నట్టిదే. అనగా సంస్కృత మెంత స్వతంత్రభాషయో, తెలుఁగుకూడ నంత స్వతంత్రభాష. ఇంతియె కాని తెలుఁగు సంస్కృతభాషావికృతి కాదు. కాల వశంబునఁ బెక్కు సంస్కృతభాషాపదములు, ప్రాకృతభాషా పదములు, సంస్కృతమున ద్రావిడశబ్దములు చొరినట్టే,

తెలుఁగునం బ్రవేశించి కొంతవఱకు వికారరూపము గల్గించిన మాట వాస్తవము. ఈ వికారరూపమే కొందఱనభిజ్ఞులను దెలుఁగు సంస్కృతభాషాజన్యమనియు, వికృతియనియు ననిపించినది; యనిపించుచున్నది. క్రీస్తుశకమునకుఁ బూర్వము "ఆంధ్రులు" తెలుఁగుదేశమును జయించి, రాజ్యముచేసి, కాలచోదితులయి రాజ్యమును గోల్పోయి, తెలుఁగువారి యందు లీనమైపోయిరి. ఇందుచేతనే యాంధ్రుల దేహచ్ఛాయ రకరకంబుగ నుండును. బాపన వెల్లరంగు మొదలు కారునలుపు రంగువఱకు గల రంగులుగల్గి యాంధ్రుల దేహచ్ఛాయ యొప్పుచుండును. ఘూర్జరదేశము మొదలు తెలుఁగు నాఁటివఱకు నాంధ్రుల శిలాశాసనములు ప్రాకృతభాషలోను, బ్రాకృతలిపిలోను నచ్చటచ్చటఁ గనపట్టుచున్నవి. నాఁట నుండియు నేఁటిదనుక "ఆంధ్రశబ్దము" తెలుఁగు శబ్దమునకుఁ బర్యాయపద మైపోయినది. నేఁటికిది చరిత్రాంశ మైనది. భేదము పాటింపఁదగినది కాదు.

ఆర్యులు బహుశ్రద్ధతో, దూరదృష్టితో ద్రావిడులతో వివాహసంబంధము నిషేధించిరి. అందు ముఖ్యముగా నార్యస్త్రీలకును ద్రావిడ పురుషులకును జరుగు పెండ్లిండ్లు పాపహేతువని శాసించిరి. ఏతత్సంతానమును సంఘబహిష్కృతులనుగాఁ జేయుటకై చండాలాది జాతులను సృష్టించి యందుఁజేర్చిరి. కాని యార్యపురుషులకును ద్రావిడ స్త్రీల

కును వివాహములు సంపూర్ణముగా నిషేధింపఁబడినట్లు తోఁచదు. మునివర్యుఁడయిన వసిష్ఠుడు, చండాలినియైన యక్షమాలను వివాహమాఁడెను. ఈ వివాహ మార్యజన దూషితము కాలేదు. ఇట్టి వివాహములచేతనే వర్ణభేద మేర్పడుచుండును. అమెరికా దేశమునందు 'అమెరికను-నీగ్రో' యనులోమ విలోమ వివాహప్రతిఫలముగా నిట్టి వర్ణభేదముగల మానవులు పెక్కురు దృష్టింబడుచుందురు. ద్రావిడుఁ డార్యస్త్రీతో వ్యభిచరించినయెడల విధింపఁబడు శిక్ష ప్రాజ్ఞలోకమునకుఁ గంపము గల్గింపక మానదు. ఆర్య ద్రావిడులు సమాన నింద్యులయినప్పుడు విధింపఁబడెడి శిక్ష యందుఁ దారతమ్యము చాలఁగలదు. ఋషులనుగూడ జాత్య హంకారము, జాతివైరము ధర్మదూరగులను జేయుట సంతాప కరము. మూఁడు నాలుగువేల సంవత్సరములనాఁ డార్యా వర్తమునఁ బ్రదర్శింపఁబడ్డ నాటకమే యీనాఁడు 'అమెరికా' దేశమునఁ బ్రదర్శింపఁబడుచున్నది. నాఁటి యార్యావర్తము నేఁటి యమెరికా యైనది. మూఁడు నాలుగువేల సంవత్సర ములు కడచన్నను నార్యమంత్రాంగమునం దేమాత్రము మార్పు గానరాదు. హిందువార్యుల స్మృతులను బరీక్షించి, అమెరికనులు నీగ్రోలయెడఁ జూపు దుస్సహ ప్రవర్తనమును బరిశీలించినయెడల నేమాత్ర భేదము గన్పట్టక యచ్చుపస గ్రుద్దినట్లుండును; దేశకాలపాత్రముల వలనఁ గల్గిన యీ మద్భేదము మాత్రమే లోచనగోచరమగును. ఆర్యావర్తమున

ద్రావిడులు పరాజితులయినను రాజ్యములు కొన్ని యట్టే నిలిచియున్నవి. బాహుశాలురగు ద్రావిడహంవీరులు దక్షిణా పథమునం దార్యులను గాలుపెట్టకుండ దోర్బలమునుజూపి తఱుముచునే యుండిరి. అమెరికాయందున్న నీగ్రోలు బాని సలుగాఁ బోయి, యమెరికనుల కరుణాకటాక్షముచే నెట్టులో స్వాతంత్ర్యమును గడించినవారగుటచేతను, నీగ్రోరాజులు లేమిచేతను, అమెరికనులను మాఱొడ్డఁగల పోటరుల లేమి చేతను "అమెరికను" ఆర్యుల నిరంకుశాధికారము శతాధి కముగా విశంకటముగా సాఁగుచున్నది. హింద్వార్యులు కొన్ని నియమము లేర్పఱచికొని మృషావిచారణనైనను సల్పి ద్రావిడులకుఁ గఠినదండనల విధించిరి. అనఁగా నేదోయొక గతి శాసనబద్ధులై యుండినట్లు నటించిరి. ఇఁక అమెరికనులో విచ్చలవిడి చెలరేఁగి దోషియని చెప్పంబడునీగ్రోను, విచా రణలేకయే, దోషము నిర్ధారణచేయకయే, యే చెట్టునకో, యే యురికంబమునకో వ్రేలాడఁ గట్టుదురు. నీగ్రోల దురవస్థఁ జూడ, న్యాయస్థానములేదు. రక్షకభటులులేరు. దైవ మంత కన్నను ముందే లేఁడు. దారిని బోవువారెల్లరు రివాల్వరుతో నొకటి రెండుగుండ్లను నా నిర్భాగ్యుని జీవచ్ఛవంబు దూసి పోవ వదలుచుందురు. సంవత్సరంబున కిట్టి దుర్మరణములు పెక్కులు వాటిల్లుచుండును. దీనినె 'Lynching' అందురు. ఇట్టిమానవపిశాచులను ప్రభుత్వమైనను శిక్షించుటలేదు. పరస్పరాంగీకారముతోనైన నీగ్రో పురుషుఁడు అమెరికను

శ్వేతాంగితో వ్యభిచరించిన, Lynching జరుగుచుండును. కాని బలవంతముగా నమెరికను పురుషుఁడు నీగ్రోస్త్రీతో వ్యభిచరించిన, విచారణ లేదు. శిక్ష లేదు. భగవంతుడు నిష్పక్షపాతియఁట. సర్వాంతర్యామియఁట. ప్రతిఫలము లేకుండ నిట్టి ఘాతుకకృత్యములు నిరంతరాయముగా వందలకొలంది యేండ్లేల సాఁగుచుండెనో యెవ్వని కెఱుక ? దక్షిణాఫ్రికా యందునను గొంచెము భేదముతో నిట్టి విషమపరిస్థితులే తెల్ల నల్ల జాతులమధ్య సాఁగుచున్నవి.

## ఆర్యమంత్రాంగము

ఆర్యులు కార్యసాఫల్యమునకుఁగాను నెట్టి కొఱముట్టులనైన నుపయోగింప వెనుదీయనివారు. పెక్కుమారులు స్త్రీల నుపయోగించి కార్యము నెఱవేర్చికొనిరి. కాని తఱచు ద్రావిడ రాజ్యములను బదభ్రష్టులను జేయుట యందుఁ గుటుంబ కలహంబులను గల్పించియు, రాజద్రోహులను సృష్టించియుఁ గార్యంబుల నెగ్గించుకొనుచు వచ్చిరి. సుగ్రీవునిఁ జేపట్టి, వాలిని సంహరించి, వానర రాజ్యంబును సామంతంబుగాఁ జేసికొనిరి. వేరిమిచేఁ బ్రహ్లాదునిఁ జీలఁదీసి, హిరణ్యకశిపుని మడియించి, ప్రహ్లాదుని నామమాత్ర రాజును జేసి, తద్రాజ్యమునఁ బలుకుబడి సంపాదించుకొనిరి. రాజ్యతృష్ణఁ గల్పించి విభీషణుని దగ్గరకుఁదీసి రావణునిఁగూల్చి లంకారాజ్యమును హరించిరి. సత్యనిరతుండును ధర్మరతుం

డును నైన బలిచక్రవర్తిని, జారుండును భ్రాతృహంతకుఁడు నగు దేవేంద్రునికై మాయోపాయంబునఁ దెగటార్చిరి. ఆర్యులు కర్జముఁ దీర్చికొనుట కెట్టి హేయభాజనములగు ధర్మపీడలుచేయఁ గొంకరో యీ క్రింది కథఁజదివిన బోధ పడకపోదు. వైరిజన దుర్భేదమగు కోటనుఁగట్టికొని త్రిపురాసురులు నిశ్చింతగా రాజ్యము చేయుచుండిరి. ఆర్యులు వారల నొంచనేరక, వారివైభవము కన్నుఁగుట్ట శాంతిలేకయుండిరి. త్రిపురాసురపత్నులు మహాపతివ్రతలు; ధర్మపరాయణలు. ఎన్నివిధములఁ బ్రయత్నించినను, నార్యుల వేగుపనివల్ల లాభము చేకూరదయ్యె. దాన నార్యులు కలుషితహృదయులై బుద్ధుని (శాక్యమునికాదు) త్రిపురాసురుల భార్యలంజేరి, వారిని ధర్మచ్యుతలంజేసి, వారివల్ల రహస్యములను దెలిసికొని రమ్మని ప్రేరేఁచి యంపిరి. బుద్ధుఁడెన్నిదినములో వేచి వేచి, యెట్టులో వారల నేకాంతముగఁ గలిసికొని, పాషండమతము బోధించి, వేదబాహ్యులనుజేసి, లోఁబఱచికొని, గుట్టుఁబేడు చేసి మగిడివచ్చెను. అటుపై నార్యులు దండెత్తి త్రిపురంబులను ముట్టడించి కీలెఱింగినవారగుటచే నశ్రమంబున త్రిపురాసురుల నోడించిపుచ్చి, వారి పట్టణంబులఁ ధ్వంసముఁజేసి జిల్లేడువిత్తనముల వెదఁజల్లిరి. భగవంతుఁ డార్యుల యేటికోళ్ళు, మొత్తుకోళ్ళంగీకరించి బుద్ధుఁడై యీ యకార్యమును జేసెనఁట. ఈయన యెట్టిభగవంతుఁడో తెలియరాదు.

# రణనీతి

శ్రీరాముఁడు వాలిం జూచి బెగ్గిల్లి, ప్రాణంబు తెగిరి పోవ నొంటి ప్రాణంబుతోఁ, జెట్టుమాటున డాఁగి, యొక్క యమోఘశరంబుఁ దొడిగి, యొంటివానిని, దమ్మునితో నైమఱచి యొక్కటి కయ్యంబుఁ జేయువానిని, జంకుగొంకు మాలి చంపెను. కట్టకడపటి యుద్ధంబున రావణునితోఁ బోరి పోరి, డస్సి వస్సి, యధర్మంబని యెఱింగియుఁ, దన్నాభీ కమలంబున నమృతంబున్నదని సాఁకు గల్పించి, శ్రీరాముఁడు రావణుని బొడ్డుపైఁగొట్టి మడియించెను. సత్యైకనిరతుఁడును నిష్కపటియు నగు ♦ బలిచక్రవర్తి తాఁకోర్వఁజాలక వరం బను మిషచే నొక్క 'పొట్టిలింగణా'చే నెత్తిపైఁ గాలు వెట్టించి పాతాళంబునకు దిగఁద్రొక్కించిరి. భీమార్జునకృష్ణు లేకమై, రాత్రిపూట, శివపూజానిమగ్నుండయిన జరాసంధుని నొంటివానిని, నిరాయుధుని మడియించిరి. ఇట్టి వెన్నియో

---

♦ బలిచక్రవర్తి మలయాళదేశమునకుఁ బ్రభువు. నేఁడుకూడ మలయాళీలు 'ఓనమ్' పండుగ యని యొక్క పెద్దపండుగఁ జేతురు. అది బలిచక్రవర్తి దేశమును సుభిక్షముగాఁ బరిపాలనఁ జేసినందులకుఁ గృతజ్ఞతాసూచకమని యందురు. పండుగదినములలో దేశమంతయు నిత్యకల్యాణము పచ్చతోరణముగా నుండును. పండుగదినములలో బలిచక్రవర్తి యేఁడాదికి నొక్కతూరి తనదేశమును జూచిపోవుటకు వచ్చునని మలయాళీల మూఢవిశ్వాసము.

నిదర్శనములు చూపవచ్చును. ఇఁక రామాయణ కథానాయ కులం గూర్చి కొంత చర్చింతము.

## రాముఁడు

పితృవాక్య పరిపాలకుండనియు, నేకపత్నీ వ్రతుండనియుఁ బూర్వు లుగ్గడించిరి. రావణుండు లోకకంటకుండనియు, నాతని జంపెఁ గావున నవతారపురుషుడనియుఁ గొనియాడిరి.

### పితృవాక్యపరిపాలకుండేనా ?

కృతజ్ఞతాపూర్వకంబుగా నిచ్చిన వరద్వయంబున నేకాంగియై రాముఁడు పదునాలుగేండ్లు వనవాసంబుఁ జేయుట, భరతుండు పట్టాభిషిక్తుండగుట యభిలషించి కైక దశరథుని యర్థించెను. దశరథుండును. పిడుగడచినట్లై యగును, గాదని చెప్పకుండఁ జింతావేగమున నోడలు తెలి యక నోటికొలంది కైకను దిట్టి, తిట్టి విసంజ్ఞుఁడై పడిపో యెను. రాముఁడు చనుదెంచి సర్వంబును గైకేయి ముఖం బున నెఱింగి వనవాసంబునకుఁ బయనమయ్యెను. అనుయాయి యయిన లక్ష్మణుండు రాకమానని చెప్ప, అర్ధాంగియయిన సీత తన్నుఁ గొనిపోవఁగంటి నీటితో బతిమాల, శ్రీరాముండు వెంటనే యిరువురితోడను బయనించెను. దశరథుండు శ్రీరా మునకు నేమియుం జెప్పలేదు. కైక యొక్కఁతినే యడవికిఁ బొమ్మనియె. ఇరువురితోఁ గలసి శ్రీరాముఁ డడవికిఁ

బోయెను. మేనమామ యింటినుండి పితృమరణవార్త విని భరతుండు సాకేతంబునకు వచ్చి, తల్లివలన సర్వోదంతంబెఱింగి, యచట నిలువ నొల్లక, చిత్రకూటంబుననున్న శ్రీరాముని కడకు వచ్చి సాకేతంబునకుఁ దిరిగివచ్చి, పట్టాభిషేకంబుఁ జేసికొమ్మని నొక్కి-నొక్కి- వేఁడెను. శ్రీరాముండు కారణాంతరములచే సమ్మతిలేనివాఁడై, రాజ్యంబు తన చేతినుండి జారి పోకుండ నుంప నిశ్చయించినవాఁడై, వెఱ్ఱిభరతునకు నచ్చఁ జెప్పి, తనకుఁ బ్రీతిగాఁ దన పాదుకాద్వయము వానికి నిచ్చి పంపెను. శ్రీరాముని యీ కార్యముచే భరతుఁడు సాకేత సింహాసన మెక్క-లేదు; తానొంటిగా నరణ్యమునకుఁ బోయి యుండలేదు. దశరథుడు కైకకు నిచ్చిన రెండువరము లీవిధముగా శ్రీరాముఁడు తీర్చెను. శ్రీరాముఁడు పితృవాక్యపరిపాలన మిషచే ద్రావిడలోకంబును జయించి, రాజ్యవిస్తృతిఁ జేసికొనుటకు దక్షిణాపథమునకు వచ్చెను గాని వేఱొండుకాదు.

నిష్కా-రణముగ మునులయెదుట రాక్షసవధ చేసెదనని శపథములు పల్కి-న రామునిఁజూచి, సీత భయపడి యేల యిట్టి శపథమును జేసితిరని శ్రీరాముని బ్రశ్నింప సీతతో నిట్లు చెప్పెను: * "ఏను కైకేయీ వరవ్యాజంబున వనంబునకుఁ జనుదెంచితిని".

* గోపీనాధరామాయణము, మొదటి సంపుటము 40 వ పేజి.

## ఏకపత్నీవ్రతుఁడేనా ?

బహుభార్యాత్వము నాఁడు పండితసంభావితము కాక పోయెను. బహుభార్యాత్వము ముందటితరముతోడనే ముగిసిపోయెను. లక్ష్మణ భరత శత్రుఘ్నులుకూడ నేకపత్నీ వ్రతులే. ఔరా! రాముఁడు భగవదవతారము. సీతామహాదేవి యాయన యర్థాంగి. సీతతో సమానమగు దాంపత్య సౌఖ్య మనుభవించిన వారెవ్వరున్నా రీప్రపంచమందు? పెండ్లియయినదిగోలె శ్రీరాముఁడు ప్రతినిమిషమును నామె యీలువును శంకించుచునేయుండెను. రామునకు మనశ్శాంతి యెన్నఁడున్నట్టు తోఁచదు. పైకిమాత్రము శంకించుచున్నట్టు కన్పట్టక యే చాకలిమీఁదనో, యే పామరలోకముమీఁదనో నెపమువైచి, నిందమోపి, యది నిజముకాదని ఋజువుచేయు భారము సీత నెత్తిపైఁ బెట్టుచుండును. ఔరౌరా! యిదియా యేకపత్నీవ్రతుని లక్షణము? సీత లంకలో నగ్నిపరీక్ష యొనర్చి, తన పాతివ్రత్యమునుగూర్చి తనకును, నెల్లలోకమునకు శంకానివృత్తిఁ జేసెను. ఇంతటితోఁ బరీక్ష ముగియలేదు. శంకనివృత్తి కాలేదు. శ్రీరాముఁడు నిండుచూలాలిని మోసగించి, కారడవిలో వదలిపెట్టించెను. ఈకార్యముఁ బచ్చినెత్తురు త్రావు కటికవాఁడయినఁ జేయ సాహసించునా? ఎట్టులో యడవిలోనున్న మున్యాశ్రమమునుండి సీతాదేవి, యయోధ్యకుఁ గొనిరాఁబడెను. శ్రీరామచంద్రు సమ్ముఖంబున నుంపఁ

బడెను. మరల నెప్పటిపాట యే. అనుమానము వదలింపుమని శ్రీరాముఁడు సీతను గోరెను. సీత మనస్సు చివుక్కుమని యెను. నిరంతరము సంశయాత్ముఁడగు భర్తతోఁ గాపురముఁ జేయ రోసి, యేవపడి, సభాముఖంబునఁ బెక్కువేలమంది చూచుచుండ భూవివరంబునఁ బ్రవేశించి యాత్మహత్యఁ గావించుకొనియెను. ఈకథ శ్రీరామచంద్రుని యేకపత్నీవ్రత మెట్టిదో నిత్యము చాటుచుండును. సీతమ్మ చెఱల కెవ్వరు మూలహేతువు !

లోకకంటకుండయిన రావణుని సంహరించుటకు భగవంతుఁ డీరూపమున భూమిపై నవతార మెత్తెనఁట ! నిజమే. ఎత్తునుగాక! ఆర్యలోకంబునకు రావణుండు కంటకుండు. రక్షో (ద్రా)విడ) లోకమునకుఁ రాముండు కంటకుండు. వీరిలో నెవ్వరు ధర్మపరులని యెవ్వరు నిర్ణయింపఁ గలరు ! ఔరంగజేబు హిందూలోకంబునకుఁ గంటకుండు. ఛత్రపతి శివాజి మహామ్మదీయలోకంబునకుఁ గంటకుండు. రావణుఁడు సర్వలోకకంటకుం డనుట వితండవాదము. విజ్ఞు లొప్పుకొనరు. రావణుని ధ్వజపటంబుక్రింద ద్రావిడలోకంబు కడుపులో చల్ల కదలకుండ కాలక్షేపముఁ జేసెను. లంకారాజ్యము సమస్తైశ్వర్యంబులతోడను దులదూఁగుచుండెను. ఆర్యు లెఱుంగని యాకాశవిమానముల నిర్మించు నైపుణ్యము ద్రావిడశిల్పు లెఱుఁగుదురు. ఒక్క యాకాశవిమానములే కాదు; ద్రావిడ

శిల్పు లాకాశ పట్టణంబులఁ గూడ నిర్మించిరి. సౌంభకము నిదర్శనము. ఆర్యకవులు కూడ నసఁగా మునులు కూడఁ గొంతవఱకు రాముని నిజతత్త్వ మెఱుంగుదురు. ఎఱింగియే శ్రీరాముని మాయామానుషవిగ్రహుఁడనిరి. అనఁగా తెలివి తేటలు లేని మానవుఁడని యర్థము. రాముఁడు మునులనుండి పంచాంగము వినువాఁడేకాని యొరులకుఁ బంచాంగము గఱపఁజాలినవాఁడు కాఁడు.

## రావణుఁడు దశగ్రీవుఁడేనా?

రావణునకుఁ బదికంఠము లున్నవాయను సంశయంబును బెక్కురు వాదోపవాదములుగాఁ జర్చించి యున్నారు. కొందఱిది యసంభవమనియు, నైజవిరుద్ధమనియుఁ జెప్పుచున్నారు. కాని యీప్రవాదమేల బయలు వెడలినదో చెప్పఁజాలకున్నారు. ఇటీవలి కూలంకషపరిశోధనచే రావణుఁడు కోయదొరయనియు, లంకావాసులు కోయలనియుఁ దేలినది. రావణుని మాతృభాషయగు కోయభాషఁ బరిశీలించినయెడల సంస్కృత శబ్దములని భ్రమపడుచున్న కొన్ని శబ్దములకు, సంస్కృతమున సరియైన యర్థముఁ జెప్పఁజాలని కొన్ని శబ్దములకుఁ జక్కని యర్థములు స్పష్టపడుచున్నవి. అట్టి శబ్దములఁ గొన్నింటిని నిట వివరించెదము.

## రావణుఁడు.

ఈ శబ్దమునకు సంస్కృతమున బొబ్బపెట్టువాఁడని యర్థము చెప్పఁబడుచున్నది. అనఁగా రావణుఁడు పుట్టినప్పుడో తరువాతనో పెద్ద బొబ్బలు పెట్టెనఁట. ఇఁకఁ గోయభాషయం దేమి యర్థమున్నదో చూతము.

రావణ = రావ + అన; కోయభాషయందు 'రవ' అనఁగా నేడ్పుట.

| కోయభాష | తెలుఁగు | కన్నడము |
|---|---|---|
| రవ | రవ్వ | రావ |

రవయనుమాట రావయయ్యెను. దీనియర్థమేమన నితరులను నేడ్పించుటయందు మిగుల పరాక్రమము కల వాఁడు. అన యనునది, పుంలింగద్యోతకము. రావ + అన = రావన; ఇతరులను నేడ్పించుటయందు నతి పరాక్రమము కలవాఁడని యర్థము.

## దశగ్రీవుఁడు

సంస్కృతమున నీశబ్దమునకుఁ బదికంఠములు కలవాఁడని యర్థము చెప్పబడుచున్నది.

కోయభాషలో 'దసగీవ' యను మాట కలదు. దస యనఁగా బాధ; గీవ యనఁగఁ గలుగఁజేయుట. దసగీవ యనఁగా బాధను గలుగఁజేయువాఁడు. గీవ శబ్దము ప్రేర

ర్థములో నుపయోగింపఁబడుచుండును. ఈ దశగీవ శబ్దము దశగ్రీవర్థయినది; పదిమెడల యర్థమును గడించినది.

దశాస్యుఁడు.

పదిమొగములు కలవాఁడని యర్థము.

కోయభాషలో, దస + అసి; దస అనఁగా బాధ; అసి పుంలింగద్యోతకము; బాధను జేయువాఁడని తేలుచున్నది. దస + అసి = దసాసి, దశాసి = దశాస్యః = దశాస్యుఁడు.

## రక్షస్సులు - రాక్షసులు.

సంస్కృతభాషయందు వీనికి సరిపడు నర్థములు లేవు. అందుచే వెవ్వేరు నైఘంటికులు వెవ్వేరర్థములను జెప్పుచున్నారు.

| కోయభాష | తెలుఁగు | కన్నడము |
|---|---|---|
| రాకు | రక్కు | రాక |
| గందరగోళముచేయుట. | గిల్లుట. | బాధించుట. |

రాక + అసి = రాకాసి; రక్కు + అసి = రక్కసి.

ఈ రెండుశబ్దములను సంస్కృతముగా మార్చి రాక్షసులుగాను రక్షస్సులుగాను జేసిరి.

రావణునకుఁ బదికంఠములు గాని, పది మొగంబులు గాని యెట్లు వచ్చెనో, పై శబ్దార్థములను బట్టి స్పష్టముగా బోధపడఁగలదని యూహించుచుంటిమి. పదిమొగములు,

పదికంఠము లున్నవానికి, నిరువదిచేతులను గవ్రులేల సృష్టించఁ గూడదు ? సృష్టించుట సహజమేయని మే మభిప్రాయపడు చుంటిమి.

## కోయలు రాక్షసులేనా ?

రక్షోరాక్షసశబ్దములకు నాద్యప్రకృతులై రక్కసి రాకాసి శబ్దములకును, రామాయణములోఁ జెప్పఁబడిన, రావణపక్షయోధుల పేరులకుఁ జాలవఱకు నన(గా రావణ, దశాస్య, దశగ్రీవ, శూర్పణఖ ప్రభృతినామములకును, సరియైన యర్థములు కోయభాషలోఁ గన్పట్టుచున్నవి. కోయలు యుద్ధమునకుఁ బోవునపుడు శాత్రవభయంకరముగాఁ బొడగట్టుటకునై కృత్రిమ వికృతముఖాచ్ఛాదనములు ధరించు నాచారము కలదు. రామాయణములో వర్ణితములయిన రాక్షస వికారరూపములకు నిదియే కారణము. రావణుఁడు కోయవారలను గ్రమశిక్షితులనుగాఁ జేసి, ధర్మమార్గముఁ ద్రొక్కించి యుచ్ఛస్థానమునకుఁ దీసికొనివచ్చెను. ఈ యుచ్ఛదశ ప్రేళ్లుపాఱి నిలువఁద్రొక్కుకొనుటకుఁ జిరకాలము వీలు చిక్కలేదు. రావణవధముతోఁ దజ్జాతిపతనము తటస్థించినది; కుంభకర్ణుఁడైన విభీషణున కిది పట్టలేదు; కాన నాగరిక ప్రపంచమునఁ గోయలు పూర్వస్థానమునకుఁ బోయిరి. అరేబియా దేశమునందు మహమ్మదు జన్మించి, దేశద్రిమ్మరులుగ నున్న యరబ్బులను మిగుల నుచ్ఛస్థానమునకుం గొంపోయెను.

నేఁడు తిరిగి యరబ్బులు పూర్వస్థానమునుం జేరిరి. ఇట్టిస్థితిరనే లంకారాజ్యమున సంభవించినది యని తలంతుము. ఇతర జాతులు కోయలను, రక్కసులనియు, రాకాసులనియుఁ బిల్చుచుండవచ్చును. ఆర్యు లీదేశమునకు వచ్చినప్పు డీ పేరులు చెప్పఁలంబడినంత యా శబ్దములను సంస్కృతీకరించి, రక్షోరాక్షసులుగాఁ జేసిరి. ఇందనుక నెవ్వరు విమర్శకదృష్టితో నుపలక్షింపక, తత్కారణమునఁ బ్రాముఖ్యత నీయకయున్న కాకాసురవధ రామాయణ యుద్ధమునకు మూలబీజము కాక పోయినను, మిగుల దోహదముఁ జేసెనని వచింప గడుంగడు విస్మితి జనింపకపోదు. ఆర్యులకు గోవులెంత పూజనీయము లగునో, కోయలకుననేల ద్రావిడులకు వాయసములంత పూజనీయములుగాఁ బరిగణింపఁ బడుచుండెను. ద్రావిడ లోకంబునందు నేఁటికిని సంత్యేష్టియందుఁ బితరులు వాయస రూపంబున నుందురను మూఢవిశ్వాసముతోఁ బిండప్రదానముఁ బొనరించుచుందురు. శ్రీరాముఁ డీసంగతి మూల ముట్టుగ నెఱింగియే, హిందువులతోఁ బోరాటమునకుం మహమ్మదీయులు గోవధఁ జేయునట్లు, ద్రావిడులతో గల హింపనెంచి, కాకమునుజంపి ద్రావిడ క్రోధాగ్నిని రగులు కొల్పెను—కాకినిజంపిన రాముఁడు కాకాసురుని జంపెననియు, నది సీత స్తనచేలాంచలమును దొలఁగించి, చంచూపుటముతోఁ బొలింప్లఁ బొడిచెననియుఁ గట్టుకథ గల్పించి వాల్మీకి యార్య ప్రపంచమునందుఁ గీర్తిఁగాంచెను.

## రావణుఁడు

వేదవేత్త, బ్రహ్మజ్ఞాని, మహాభక్తుఁడు, మహావీరుఁడు, సుందరాకారుఁడు, అతులరాజనీతిజ్ఞుఁడు, మహాకవి, భాతృప్రియుఁడు, జాత్యుద్ధారకుఁడు, వివేకి, తెలుఁగు వైయాకరణుఁడు.

వేదవేత్త—శంబుకవధ పీఠికలోఁ జర్చించియుంటిమి. రావణ భట్టీయ మిందులకు నిదర్శనము.

బ్రహ్మజ్ఞాని—రావణవధచే రాముని బ్రహ్మహత్యా పాతకము పీడించుటయే నిదర్శనము.

మహాభక్తుఁడు—నవకోటి శివాలయార్చకుఁడని లోక మెఱుంగును. శిరంబు నుపాయనంబుగా శంకరుని కర్పించిన భక్తుఁడు.

మహావీరుఁడు—ఇందులకు రామాయణము సాక్షి. నూతేండ్లు దాఁటినవాఁడయ్యు, నేడహోరాత్రములు విరామము లేకుండ, యౌవనగర్వితుఁడైన రామునితో మహాయుద్ధముఁ గావించెను.

సుందరాకారుఁడు—రామాయణములోని హనుమద్వచనముసాక్షి.

రాజనీతిజ్ఞుఁడు—యుద్ధకాండములో వాల్మీకిమహాని యీయన రాజనీతిని గూర్చి చెప్పిన పల్కులే సాక్షి.

* మహాకవి—రావణ భుజంగప్రయాతములు, పంచ చామరములను పేరుతోఁ గొన్ని శ్లోకము లింకను బ్రచార ములో నున్నవి. శివదర్శనకాలమున వీరశైవు లీ భుజంగ ప్రయాతపంచచామరములతోడనే భుజంగభూషణునికిఁ జామ రములు వేయుదురు.

భ్రాతృప్రియుఁడు— రాజద్రోహియైన విభీషణుఁడు, రాజ్యతృష్ణచే జాతివిరోధియైన రాముని పాదపద్మములను బట్టె

---

* రావణకృత శివతాండవస్తోత్రమ్.

జటాకటాహసంభ్రమ భ్రమన్నిలింప నిర్ఝరీ
విలోలవీచివల్లరీ విరాజమానమూర్ధని
ధగద్ధగద్ధగజ్జ్వలల్లలాట పట్టపావకే
కిశోర చంద్రశేఖరే రతిః ప్రతిక్షణం మమ ॥ ౧

ధరాధరేంద్రనందినీవిలాసబంధు బంధుర
స్ఫురద్దిగంత సంతతిప్రమోదమానమానసే
కృపాకటాక్షధోరణీ నిరుద్ధదుర్ధరాపది
క్వచిచ్చిదంబరే మనోవినోదమేతువస్తుని ॥ ౨

జటాభుజంగపింగల స్ఫురత్ఫణామణి ప్రభా
కదంబ కుంకుమద్రవప్రలిప్త దిగ్వధూముఖే
మదాంధ సింధుర స్ఫురత్త్వగు త్తరీయ మేదురే
మనోవినోద మద్భుతంబిభర్తుభూతభర్తరి ॥ ౩

సహస్రలోచన ప్రభృత్యశేషలేఖశేఖర
ప్రసూనధూళిధోరణీవిధూసరాంఘ్రిపీఠభూః
భుజంగరాజమాలయా నిబద్ధజాటజూటకః
శ్రియైచిరాయజాయతాం చకోరబంధు శేఖరః ॥ ౪

శత్రుస్కంధావారమును జేరినను లంకలోనున్న యాతని కుటుంబమును (భార్యయగు సరమను, బుత్రియగు త్రిజటను) పల్లెత్తు మాటయైన ననకుండఁ గాపాడెను. ఈ భాతృప్రేమయే వీనిని

---

లలాటచత్వర జ్వలద్ధనంజయ స్ఫులింగభా
నిపీతపంచసాయకం నమన్నిలింపనాయకమ్
సుధామయూఖలేఖయా విరాజమాన శేఖరం
మహాకపాలిసంపదే శిరోజటాలమస్తునః ॥ ౫

కరాలభాలపట్టికా ధగద్ధగద్ధగజ్జ్వల
ద్ధనంజయాధరీకృత ప్రచండపంచసాయకే
ధరాధరేంద్రనందినీకుచాగ్రచిత్రపత్రక
ప్రకల్పనైక శిల్పినిత్రిలోచనే మతిర్మమ ॥ ౬

నవీనమేఘమండలీ నిరుద్ధదుర్ధరస్ఫుర
త్కుహూనిశీధినీతమః ప్రబంధబంధుకంధరః
నిలింప నిర్ఝరీధర స్తనోతుకృత్తిసింధురః
కలానిధానబంధురః శ్రియంజగద్ధురంధరః ॥ ౭

ప్రఫుల్లనీలపంకజ ప్రపంచకాలిమచ్ఛటా
విడంబికంఠకంధరారుచి ప్రబంధకంధరమ్
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదాంధకచ్ఛిదం తమంతకచ్ఛిదంభజే ॥ ౮

అగర్వసర్వమంగలా కలాకదంబమంజరీ
రసప్రవాహమాధురీ విజృంభణామధువ్రతమ్
స్మరాంతకంపురాంతకం భవాంతకం మఖాంతకం
గజాంతకాంధకాంతకం తమంతకాంతకంభజే ॥ ౯

గూఁకటివ్రేళ్ళతోఁ బెకల్చి పారవేసెను. సరమ యంగదునకుఁ బాతాళహోమముఁ జేయుచున్న రావణుని జూపించెను. లంకలోని గుప్తికర్మమును సీత కెఱింగించెను. విభీషణుని

---

జయత్వదభ్రవిభ్రమభ్రమద్భుజంగ మస్ఫుర
ద్ధగద్ధగద్వినిర్గమత్కరాళ ఫాలహవ్యవాట్
ధిమిద్ధిమిద్ధిమిధ్వనన్మృదంగతుంగ మంగళ
ధ్వనిక్రమప్రవర్తిత ప్రచండతాండవః శివః ॥ ౧౦

దృషద్విచిత్రతల్పయోర్భుజంగ మౌక్తిక స్రజో
ర్గరిష్ఠరత్నలోష్ఠయోః సుహృద్విపక్షపక్షయోః
తృణారవింద చక్షుషోః ప్రజా మహీమహేంద్రయోః
సమం ప్రవర్తయన్మనః కదాసదాశివంభజే ॥ ౧౧

కదానిలింపనిర్ఝరీనికుంజ కోటరేవ స
న్విముక్తదుర్మతిః సదాశిరఃస్థమంజలింవహన్
విముక్తలోలలోచనా లలామఫాలలగ్నకః
శివేతిమంత్ర ముచ్చరన్కదా సుఖీభవామ్యహమ్ ॥ ౧౨

ఇమం హినిత్య మేవముక్త ముత్త మోత్తమం స్తవం
పఠన్స్మరన్బ్రువన్నరో విశుద్ధిమేతిసంతతమ్
హరేగురౌ సభక్తిమాశు యాతినాన్యథాగతిం
విమోహనంహిదేహినాంతు శంకరస్యచింతనమ్ ॥ ౧౩

పూజావసానసమయే దశవక్త్రగీతం
యఃశంభుపూజనమిదం పఠతిప్రదోషే
తస్యస్థిరాంరథగజేంద్రతురంగయుక్తాం
లక్ష్మీంసదైవ సుముఖీంప్రదదాతిశంభుః ॥ ౧౪

కూతురగు త్రిజట యెప్పటికప్పుడే లంక గుట్టెల్ల సీత చెవిం బడవేసెను. పర్యవసానము రావణపరాజయము, లంకాపురీ నాశనము, విభీషణుని పట్టాభిషేకము.

వివేకి—రావణుఁడు బ్రిహ్మచే వరంబుల నొంది పరివారంబుతో విశ్రివసుని యాశ్రమభూములయం దుండఁగా, మాతామహుండైన సుమాలి కుమారుండయిన ప్రహస్తాదులతో నచ్చోటకు విచ్చేసి, కారణజన్ముండవని రావణునిఁ బ్రబోధించి, నీతు లనేకంబులఁ జెప్పి సవతి యన్నయగు కుబేరుని లంకనుండి పారఁదోలి, లంకారాజ్యమును స్వైవశముఁ జేసికొమ్మని చెప్ప రావణుఁడు జెప్పినమాట లాలింపుఁడు.

* "దశకంఠుండను, నీనుడి యథార్థంబైనచో నెంత బాలిశుఁడైనన్ నయమేది యగ్రజుని బల్మిన్ద్రోచి దుర్వృత్తిఁ దద్వశమా నిల్లెటు లాక్రమించు మతిలేవా! యిండ్లు పెద్దల్ భవాదృశులేయిట్లన నస్మదాదులకు బుద్ధిస్థైర్యమున్ గల్గునే!"

పెద్దకాలము ప్రాతపగలంగూర్చి, రాక్షసాన్వయముం బొందిన కడగండ్లఁగూర్చియు నెట్లు లంకరాక్షసుల కొంకియో దానింగూర్చియు, మాతామహుండు చెప్పినంగాని లంకాపహరణంబునకు నీకొనఁడయ్యె.

ప్రథమాంధ్ర వైయాకరణుఁడు - రావణకారికలు లక్షణ గ్రంథములయందు నుదాహరణములుగా నీయఁబడి

* కంకంటి పాపరాజు, 'ఉత్తర రామాయణము' ద్వితీయాశ్వాసము, 226 వ పద్యము

యచ్చటచ్చటఁ బొడఁగట్టుచుండును.

కారణజన్ముఁడు, జాత్యుద్ధారకుఁడు—.

మాలి, సుమాలి, మాల్యవంతుఁడు నను మువ్వురు రాక్షస నాయకులు లంకాపురిని నివాసముగాఁ జేసికొని సురలపై దండెత్తి పెక్కుమారులు, వారల నోడిచిపుచ్చి, పరాభూతులం జేసిరి. ఈ నిరంతర పరాభవముచే దేవతలు విషణ్ణులై, విష్ణువుని బ్రార్థింప నాతండును నడుముగట్టికొని దేవతలపక్షమై పోరికి నడచివచ్చెను. ఇరువాగులవారికి, హోరాహోరి పోరు ఘోరంబయ్యె. తుదకు నీ దారుణ సంగ్రామంబున రాక్షసులు పరాజితులయిరి. మాలి వీరశయనంబు నందెను. చేయునదిలేక సుమాలి మాల్యవంతులు సకుటుంబ సపరివారముగా లంకనుడించి రసాతలంబున కేగిరి. అందుండియు వారు సుఖమెఱుంగరైరి, కేలు కంటఁ గూర్కెఱుంగరైరి. పరాజయ చింతాశల్యముచే నవసి, నవసి, యెట్లులనేనియు విరోధులం దునుమాడ మార్గముల నెమకుచుండిరి. సుమాలి కుమార్తెయయిన కైకసి, రూపలావణ్యముల కలదానిని, జాత్యభిమానపూర్ణహృదయయగు దానిని, ద్రావిడ సంప్రదాయమును సంపూర్ణముగ నెఱింగినదానిని ద్రావిడాచారముల నెల్ల మిగుల నేర్పుతోఁ దలకెక్కించుకొనిన దానిని మహాతేజోవంతుఁడగు వీరాధివీరున కిచ్చి జాత్యుద్ధారకుని బుట్టించి, తన్మూలమున జాత్యవమానంబును దుడిచివేయవలయునని, సుమాలి మాల్యవంతులు తలపోయు

చుండిరి. వరునికొఱకు దేశదేశముల గాలించిరి. తుదకుఁ దమకూఁతురునకు విశ్రవసుఁడు తగినవాఁడని నిశ్చయించిరి. సాలంకృతముగాఁ గైకసిని విశ్రవసునికిఁ గన్యాదానముఁ జేసిరి. జాత్యుద్ధారకుండయిన పుత్రుని బొందుటకయి ఋషిని భయభక్తులతో సేవింప, తంద్రులు కైకసికి బోధించి పంపిరి. కొన్ని నాళ్ళకు కైకసి గర్భవతియై రూపలావణ్యములు గలవానిని, తేజఓజములు కలవానిని తొలుచూలునఁ గాంచెను. ఇతఁడే దశకంఠుఁడు. సుమాలి మాల్యవంతులు మనుమని జూచి యుప్పొంగిపోయిరి. నేఁటి కవమానమును గడవ సమర్థుల మైతి మనుకొనిరి. పెంచిరి, పెద్దనుజేసిరి. విద్యాబుద్ధులు చెప్పించిరి. నీతిశాస్త్ర పారంగతుని జేసిరి. రణకోవిదుని జేసిరి. జాత్యభిమానము నుగ్గుబాలతోడనే రంగరించి పోసిరి. చెవి నిల్లుఁగట్టుకొని నిత్యము జాతికిఁగల్గిన యవమానమును జాటి చెప్పిరి. పర్యవసానమితఁడు లోకజేతయై, యక్షులందోలి లంకను స్వాధీనముఁ జేసికొని, కుల కలంకమును దొలఁగించి, జాతిగౌరవమును గాపాడెను. తాతల యభీష్టమును సంపూర్ణముగాఁ దీర్చెను. పతనముఁజెందిన స్వజాతి నుద్ధరించి సర్వలోకములను దనకీర్తిచే నింపివైచెను.

రావణ కుంభకర్ణ విభీషణుల కళత్రములఁ గూర్చి యొకటి రెండుమాటలు చెప్పవలసి యున్నది. రావణుని యర్ధాంగి మండోదరి యసురశిల్పియగు మయుని కుమార్తె. మయునకు నచ్చరలేమయగు హేమయను నామెయందు

జనియించెను. అందుచే నీమెయందు సమగ్రద్రావిడత్వము చూపట్టదయ్యెను. భర్తయగు రావణునకు సంధియని యెన్ని మారులో నీతులు చెప్పుచు సమర పరాఙ్ముఖునిఁ జేయఁ బ్రయత్నించెను. వినివిని దశకంఠుఁడు "నీ మఱఁదలి బన్నమే గణిని మానిని యీగుదు సంధిచేసినన్" అని యామె మాటలం బెడచెవింబెట్టెను. కుంభకర్ణుఁడు వజ్రజ్వాలయను నామెను బెండ్లియాడెను. ఈమె వదాన్యశిరోమణియగు బలిచక్రవర్తి కూతురుబిడ్డ. అందుచే జాత్యభిమానమున కునికిపట్టై, భర్తకు నీతియను నెపమున నెన్నఁడు నడ్డము చెప్పియుండలేదు.

విభీషణుఁడు సరమయను నామెను వివాహ మయ్యెను. ఈమె గంధర్వస్త్రీ; అందుచే ద్రావిడ జాత్యభిమానము నంతయు లేక భర్తను రాజద్రోహునిం జేసి, యింటిగుట్టు విరోధులకుం దెలియఁజేసి సర్వనాశనముఁ జేసెను. సరమచే విభీషణుని కుటుంబమంతయు రాజ్యతృష్ణాపీడితమును, రాజద్రోహపూరితమునై లంకను రామునకుఁ గట్టఁబెట్టి, జాతిద్రోహముఁ గావించెను. ద్రావిడజాతి యేదుర్గతిపాలయినను సరకుసేయక తన భర్తను రాజును జేయుట యొక్కటియే యామె మనస్సునం దుంచుకొని మిగుల హేయమగు కార్యముఁ జేసెను. వంశపారంపర్యముగా వచ్చు పక్షపాత కథలను వదలి కొంచెము విమర్శనదృష్టిని గలిగించికొని యీ పీఠిక జాగరూకులై చదువఁ జదువరులను మరిమరి ప్రార్థించుచు ముగించుచుంటిమి.

# సూతపురాణము

## తృతీయాశ్వాసము

### యథార్థ ప్రహ్లాద చరిత్రము

#### ముత్తుకోళ్ళు

ఒకరుఁడు ‘వేదమే’ భగవదుక్తమటంచు నుపన్యసించు నిం
కొకరుఁడు ‘బైబిలే’ భగవదుక్తమటంచును వక్కణించు, వే
ఱొకరుఁడుమా ‘ఖొరాన్’ భగవదుక్తమటంచును వాదులాడు, నీ
తికమక లేల పెట్టెదవు! తెల్పఁగరాదె నిజంబు నీశ్వరా.

మతమని వంకఁబెట్టి కను మాలవు గట్టుప కాసులెందఱో
కుతుకలఁ బట్టి కోసికొనఁ గూడదటంచును బుద్ధిచెప్పి ఖం
డితముగ వారివారి యవినీతుల మానిపి యేల సాధులన్
బ్రతుకఁగనీవు దేవ! యొక వారముపాటయినన్ బ్రశాంతిగా.

తగవు నెఱింగి పల్కని యదంతరులన్ సృజియింపనేల ముం
దుగ? సృజియించినావుసరె తోఁచియొ తోఁచకొ దేనిఁగోరి ఈ
జగమున వారినే కొలము సాములఁజేసితి! వింకమీఁద నే
పగిదిని నీ ప్రపంచ పరిపాలన సాఁగునొ నేను జూచెదన్.

ఉల్లము విప్పిచెప్పఁ బుయి లోడుచు నేర్పునఁగప్పిపుచ్చి యే
కల్లలొ నచ్చఁజెప్పి యొడికంబున లోకము మోసపుచ్చి కో
ళ్లొల్లఁగ సంతసించు నడి గొట్టుల భారతభూమి కేటికై
యిల్లడఁబెట్టినావొ జగదీశ్వర లేవొకొ యిట్టిదేశముల్.

చదివితిఁ బుణ్యభూమియని శాస్త్రములన్ మనభారతంబు నేఁ
డది విపరీతమై జనుల కందఱికిన్ బొడఁగట్టుచుండె నే
లిదముగ, సత్యశౌచములు లేవు దయారతి లేదు ధర్మ సం
పదయును లేదు, ఘోరకలిమాయు రె! ఈగతి యేమి యీశ్వరా.

కథా ప్రారంభము

యతివరు దయ నాశ్వాస
ద్వితయంబు రచించి మరి తృతీయాశ్వాసం
బతిదక్షత వ్రాయఁగఁ బూ
నితి రసభరితముగ నిపుడు నేఁ బాఠకుఁడా.

ఉడికీ యుడకని దుంపల
ముడిగూరల తిండిచేత మొట్ట మొదట నే
బడలుచు సడలుచు నెటులో
కడపుచు నందుండఁ గొంత కాలము చనుచో.

ఓరుగాలి విసరు టుయ్యాలలోఁ గూలి
యత్తమిల్లు నాకుఁ గ్రొత్త చేసె
గాలి నీరుకూడఁ గడకు సరిపడక
జలుబుచేసి మేను పులకరించె.

వచ్చిన పులకర మట్టటె
విచ్చలవిడి పెచ్చుపెఱిగి వేదన పెట్టన్
నొచ్చె శరీరంబెంతయొ
చచ్చిన చావయ్యెఁ జిక్కి సగమైపోతిన్.

జ్వరము నయముగాదన్న సంశయముగల్గ
సచివ బాంధవ వ్రాతంబు జన్మభూమి
కన్నులం గట్టినట్లైనఁ గలఁతఁజెంది
బ్రతికియున్నాఁడ నెట్లొ ధైర్యంబుతోడ.

తుదకొక మాపునన్ జ్వరము తొందర ! గందరగోళమైననుఁ
వదలక ధైర్య మొక్కఁడనె ప్రక్కపయిం బొరలాడి యాడి నే
మెదలక కన్ను మూసితిని మిక్కిలి చెమ్మటఁబట్టె నింతలోఁ
బదముల చప్పుడైనఁదడబాటు మెయిం గనువిచ్చి చూచుడున్

గురువయ్యండగు సూతుఁడు
బిరబిర నా ప్రక్కకడకు విచ్చేసి ననున్
బరికించి పాఱఁ జూచుచుఁ
జరచర మరలి చనె నొక్క క్షణకాలమునన్.

అడుగులు మెల్లఁగానిడుచు నప్పుడు సూతమహర్షి వచ్చి నా
కడ కిదిగో! గ్రహింపుము సుఖంబగునంచు వచించుచుండఁగా
బుడిసిలి నిండియున్న రసమున్ జుళుకంబునఁబట్టి వెంటనే
గడగడ త్రావివైచితిని, గట్టునఁ ద్రేపితిఁ, దృప్తిఁజెందితిన్.

తీసివేసినట్టు దిగజారిపోయెను
గలవరంబు పోవఁ బులకరంబు;
బడలి సొక్కుపోవ నుప్పొంగి పోయితి
నలఁత లేక మనసు కలఁత లేక.

అంత నా ముఖలక్షణంబులఁ జూచి పరితుష్టుండై సూతమహర్షి నాతోఁ జెప్పకుండఁదిరోహితుండయ్యె. నేనును సెజ్జపైఁ బరుండి యిటునటు పడి కుతపకాలంబు చనుడు, లేచి యడుగులు తడఁబడుచుండ మెల్లఁగ మద్గురుసన్నిధికిం జన, నా మహాఋషియుండు ప్రీతి తొలకాడ సముచిత ప్రకారంబునఁ జూచి "కుమారా! యిట్లేలవచ్చితివి? తొందఱపని యేమియు లేదుకదా! అనామయుండవైతివికదే!" యన నూఁకొట్టి "మహాత్మా! కథాశేషంబు విన నిచ్ఛపొడమి యిచ్చటికి వచ్చితి. బడలిక తీరెఁగావున నాకు నావలికథ విన్పింపవే" యనుచు "ఆర్యులు కేకత్తి మంత్ర తంత్ర ప్రయోగంబుల ద్రావిడులను బరాభూతులం జేసి, యేకరణి నవల రాజ్య తంత్రంబు విస్తరిల్లఁజేసి, యెట్టుల దాసావిడుల యాయురారో గ్యైశ్వర్యంబులఁ జూఱఁగొనిరో చెప్పవే" యనుడు వల్లెయని సూతుండు విస్తరించి చెప్ప ననువుకాదు; ఆర్య మంత్రాంగంబు స్పష్టపఱపంజాలు నొండు రెండు పూర్వకథలం జెప్పెద సావధాన మనస్కుండవై యాలింపుము :

కుమారా! త్రివిష్టపంబున మహేంద్రుం డొక్క నాఁడు పేరోలగంబుండి, దౌవారికులు కలకలంబు నాపుచుండ, వలసపోయిన తమవారి యోగక్షేమంబు లరసి, తద్దురవస్థ తెలిసికొని, రక్తసంబంధంబుచేఁ గల్గిన సంతాపంబువలన విహ్వలచిత్తుండై, కంటనీరు కంటఁ గ్రుక్కికొనుచు, ద్రావిడ రాజ కంఠీరవుల దోర్దర్పంబునకు నోసరిల్లి మాఱుమూలల మూడింటి యడంగియున్న యార్యులఁ దలంచి చింతించి, యేవడువుననైనను వారలకుఁ దోడ్పడుట యుచితంబని నిశ్చయించి, రణపటిష్ఠులయిన ద్రావిడమల్లులతోఁ బోరాడుట రాజనీతి కాదని వేఱుపాయంబునకునై నెమకుచు, వేగులపనికై పోయివచ్చిన వేగరులంగాంచి, 'కార్యంబు తెఱంగు విన్పింపుఁ' డన వారు జోహారులొనరించి యిట్లని చెప్పఁదొడంగిరి :

కొందఱు ద్రావిడుల్ కలుపుగోలుతనంబుఁ దొలంగినంతటన్
జిందఱ వందఱై కడిమి చేవయు లావును దూలి భ్రష్టులై
కుందుచుఁ బూర్వవైభవముఁ గోల్పడి డీల్పడినట్టి దైన్యమున్
బొందికతో హిరణ్యకశిపుండు గ్రహించి కుశాగ్రబుద్ధితోఁ.

ద్రావిడదేశమందుఁగల రాజుల నెల్లరఁ జేరఁదీసి సం
భావనఁ జేసి కర్జము సమస్తము తప్పక నచ్చఁజెప్పి లో
లోవసివాడు ప్రాతపగలుం దొలగించి మహాభిమానులం
ద్రోవకుఁ దెచ్చి నేర్పున విరోధుల గుండెలు జల్దరింపగన్.

పోటరియా హిరణ్యకశిపుండిటు ద్రావిడ సార్వభౌముఁడై
యేటును బాటునుం దెలిసి యిక్కువ లారసి జాగరూకుఁడై
కోటలువఁగట్టి ద్రావిడులకుం దలకట్టయి రేఁబవళ్ళు పో
రాటముఁ జేయఁబూని తన రాణువతోఁ గనిపెట్టియుండఁగన్

త్రిభువననాథా! దేశము
సుభిక్షముగ నుండెఁ బ్రజలు శోభాయుతులై
విభవాస్పదులై యుండిరి
ప్రభుభక్తి హిరణ్యకశిపు రాజేంద్రునెడన్.

మాంసపంకిలములౌ మఖశాలలును లేవు
భగవంతునకు జంతు బలులు లేవు
ఇంకిపోయెడునట్టి యేరువాఁకలు లేవు
సివమెత్తి కాయని చెట్లు లేవు
విసరికొట్టెడునట్టి వేడిగాడ్పులు లేవు
పండకుండెడి చౌటి పడెలు లేవు
మూఁడువానలు లేక పాడైన నెల లేదు
ఋతుధర్మ మెఱుఁగని యేడు లేదు

లేశమైనను బ్రజలకు లేమి లేదు
దొంగ తోఁడుబోఁతుల పౌజు దొడ్డ లేదు
ప్రథిత వీరాగ్రగణ్య హిరణ్యకశిపు
ధారణీ పాలకుండేలు ద్రవిడసీమ.

చిచ్చునైనను బిడికిలించెదమటంచుఁ
బోటుమాటలాడెద రందుఁ బోటుమగలు
డెప్పరము సుమ్ము వారితోఁ డీకొనంగఁ
బ్రాణభయ మింత లేని గరాసులగుట.

శోణితధారలం బుడమి జొబ్బిలఁజేయుచు గడ్డిపోచఁగాఁ
బ్రాణములిచ్చియైనసరె రాజును రాజ్యముఁ బ్రోవఁగాఁదను
త్రాణము బాణముల్ దొనలు దాలిచి కేకిసలాడుచున్ సదా
రాణువ నిల్చియుండు సమరక్షితి రక్షితజన్మదేశమై.

అని వచియింప నీగతి బృహస్పతి దిగ్గున లేచి మార్తురన్
మనము స్వశక్తి గెల్తుమనుమాట యటుంచుఁడు, రాజనీతిచే
ననువుపడం గుటుంబ కలహంబునకుం బురికొల్పి యెట్టులో
పనివడి వైరులన్ మునుము పటి వధించుట లెస్స కర్జమా.

గృహకల్లోలముచే వి
గ్రహముం గల్పించి యల్ల కల్లోలముగా
సహిత ప్రభువీరుల ని
గ్రహింపఁగావలయు నిష్ఠురంబనకుండన్.

ప్రణిధు లీమాట లాలించి పల్కిరిట్లు:
దేవ! మన్నించి యొకమాటఁ దెలియఁబఱప
ననుమతించిన విన్నవింతు మంతు దెలిసి
యెట్టి కార్యమైనను దలపెట్టఁదగును.

## తృతీయాశ్వాసము

హిరణ్యకశిపునకు, రణదక్షుండయిన హిరణ్యాక్షుండను సోదరుండొకండు కలండు. అతం డద్వితీయ బలపరాక్రమముచే నయోమయగదామాత్రద్వితీయుండై, దుష్టశిక్షణార్థంబు శిష్టరక్షణార్థంబు దక్షిణాపథంబెల్ల ముప్పొద్దులఁ గ్రిమ్మరుచుండుఁ, దత్కారణంబుననే తద్రాజ్యం బుపద్రవంబులకుఁ దొలంగి వర్ధిల్లుచుండు.

ద్రవిడరాజ్యస్థాపన విభూతి కీతని
    పొంగారు పోడిమి పుట్టకీటు
జాత్యభిమానైక సంపత్తునకు వీని
    కలిసిగొట్టుతనంబు కాణయాచి
పగ్గెలాడెడునట్టి పల్లదీండ్రకు వీని
    గొట్టుతనంబు వాకట్టుమందు
అడిగొట్టు మూఁక యాగడ మడంపఁగ వీని
    ఱాఁగతనంబు దురాయికట్టు

బిరుదుమగఁ డిట్టి జగదేక వీరు నొంటి
కొమ్ముపందిఁ బైకుసికొల్పి ఘోరకాన
నాంతరమ్మున నాజెట్టి యాదమఱచి
మసల మొనమొన్న మనవారు మన్నిగొనిరి.

ఈ కథ సర్వముం దెలిసి యించుక సేపు విషాదచిత్తుఁడై
శోకముఁ బెట్టుచుం దుదకు శూరుఁడుగావున దుఃఖమంతయున్
బోకడఁ బెట్టి ఘోరతపముం బొనరించి వరంబులందుచున్
గూఁకటివ్రేళ్ళతో రిపులఁ గూల్పఁగఁ బోయెఁ బ్రభుండు కానకున్

మొదలిటి నేరమా వలసపోవుట కానక జన్మభూమినిన్
వదలుచు నందుపై సమర పండితులున్న విరోధిదేశమం
దొదిగి తమంతటన్ నిలిచియుండుట రెండవ నేరమైననున్
సదమదమాపఁ జాడి మన జ్ఞాతులుగావున వారు దేవరా!

ఏపనిఁ జేయనెంచిన నిదే సమయంబిది తప్పిపోయినన్
జేపడఁ బోవదింక మన జీవితకాలమునందుఁ గాన దే
వా! పొరపాటులేక మన యార్యులప్రాణము నాచికోలునుం
గాపుఁడి వారలెట్లయిన భారతదేశము వీడకుండఁగన్.

మున్నెన్నఁడో చూఁజాయఁగ
విన్నాఁడ హిరణ్యకశిపు పృథ్వీశున కు
త్పన్నుఁడు దొలికాన్పున ను
త్పన్నుఁ డగునటంచు గొప్ప దైవజ్ఞులచే.

నిండుచూలాలు తద్గృహిణీలలామ
యొంటిపాటున నున్నది యింటిలోనఁ
గంటవత్తిడికొని తన యింటివేల్పు
మాపురేపులు పూజించి మరుగుచుండె.

ఈ వచనము లాలించిన
దైవతగురుఁ డిట్టుపల్కెఁ దత్సభలోనన్
నీవిరిఁ బుట్టిన వీవలి
వీవఁగ వజ్జరితనంబు పెంపెసలారన్.

కావున నింద్రుం డిప్పుడె
ద్రావిడ దేశంబుఁజొచ్చి తత్ప్రభ్విని లీ
లావతి వెలార్చి గోవును
బ్రావఁగఁ జెఱఁబట్టినట్టు పట్టఁగవలయున్.

నారదుఁ డేడకో చనుచు నాఁడు హఠాత్తుగ దారిలోపలన్
వారిని నిర్వురం గలిసి వారని యచ్చెరువంది యిందు రేఁ
గారణముం గనుంగొని యకార్యమటంచును బుద్ధిచెప్పి యా
వారిజపత్రనేత్రిఁగొని పర్ణకుటీరముఁ జేరుగావుతన్.

చేరి మిక్కిలి గారాబంబున నాలీలావతింజూచుచు
మచ్చికచేసికొని సానునయవాక్యంబుల,

ఎల్లదారివిడులకు నింటివేల్పైనట్టి
శివుమీఁదఁ గలభక్తి చెదరునట్టు
ఎన్నాళ్ళనుంచియో యేతెంచు నాచార
ములమీఁదఁ గలరక్తి తొలఁగునట్టు

తాతముత్తాతల తండ్రులపైఁ గల్గు
తఱుఁగని గురుభక్తి తఱుఁగునట్లు
పిలుపుతో నూకొట్టు విశ్రుత దేశాభి
మానంబు క్రమముగా మాయునట్లు

కట్టుకథ లెన్నొ పుట్టించి గడుసురీతిఁ
జెలియ చెవినిల్లుఁ గట్టుక చెప్పిచెప్పి
మలచి గర్భస్థపిండంబు మార్చివైచి
యెట్టయిన నింటిలోఁ బోరు పెట్టవలయు.

మందు మాఁకులచేఁ గాని, మంత్రతంత్ర
ముల వలనఁగాని, మంచి మాటలనునాడి
కాని, యేపాట్లచేనైనఁ గాని యామె
మనము స్వాధీనమును జేసికొనఁగవలయు.

అప్పుడుగాని ద్రావిడ ధరాధిపరాష్ట్ర విభూతియెల్లఁ గ
న్గప్పినమాత్ర ధ్వంసమయి నాశముగాదు మఱొండు త్రోవనా
కిప్పుడు గానరాదు విబుధేశ్వర ! జాగిఁక సేయరాదహో !
చప్పునఁ బైనమై వెడలి చక్కఁగ నీపని చక్కఁబెట్టుమా.

నారదుని మీఁదఁబెట్టిన భార మతఁడె
తీర్చుఁ దీర్పరిగాన సందియమువలదు
భరతవర్షమందలి మన వారలెల్ల
హాయిగా నిద్రపోవుదు రంచుఁజెప్ప.

గుర్వాజ్ఞాబద్ధుండై దేవేంద్రుఁ డుత్కంఠతోఁ గొలువు చాలించి యుల్లాసంబుతో మాతలివంకఁ గ్రేగంటఁ జూడ—

సారథియై మాతలి తన
తేరాయత్తంబుచేసి తెచ్చి విడువఁగా
నారోహించి మహేంద్రుఁడు
వీరావేశంబుతోడ వెడలెఁ బురంబున్.

ఎఱిఁగిన తెన్నులంబడి యదేపనిగా రథ మద్వితీయమై
పరుగునఁ బోవుచుండ నతి భాసురమై తనరారెఁ గేతనాం
బర మొగి సంబరంబునను మావులు చెమ్మటఁ దొప్పదోఁగినన్
బరుగిః పోవుచున్ భరతవర్షముఁ జొచ్చె మహేంద్రుఁ డాదటన్

తోడరి హుటాహుటిన్ రథముఁ దోలఁగ మాతలి దక్షిణాపథం
బొడయఁడు లేని చొప్పుఁగని హుంకృతి జేయుచుఁ బోవుచున్న తన్
పొడఁగని సైన్యముల్ బెదరిపోవ మదంబున గావుపట్టుతోఁ
గడపక యింద్రుఁ డొక్క క్షణకాలముకూడఁ బురంబుఁ జేరుచున్

సడిచప్పుడు గాకుండఁగ
విడివడి యతఃపురముఁ బ్రవేశించుచు దా
విడభూవరు నర్ధాంగిని
బొడమిన కిను కాపలేక పొగరెగఁదట్టన్.

అదలించియు విదలించియు
బెదరించియుఁ గొంతసేపు వీరమ్మన్యుం
డదనని ముందలఁ బట్టఁగ
వదలించుకొనంగలేక వాపోవంగన్.

సరకుసేయక పుచ్చడీకతనంబుఁ ద్రోసిపుచ్చి, యిందుఱిందు జాలిలేక, చెఱఁబట్టి కొంపోవుచుండ, మహాసాధ్వియుఁ బతివ్రతారత్నంబును నగు లీలావతీదేవి లజ్జావతి యయ్యుఁ గురరియుంబోలె గోడుగోడునఁ దనగోడునకై శోకించుచుఁ బోవుచుండ—

దేవర్షి నారదుఁ డపుడు
త్రోవకు నడ్డంబు వచ్చి తొందరఁగా వా
క్ప్రావీణ్యముతో నాదర
భావముతో నుక్కివుఁడయి భాషించె నిటుల్.

ఏమీ! చిత్రం బిందా!
యేమిది! లీలావతిసతి యెవరనుకొని నీ
వీమెయిఁ జెఱఁ బట్టితివో
దీమసమున నిట్టివి తెగతెంపులు తగునే?

ఆమె ద్రవిడరాజేంద్రు నర్ధాంగలక్ష్మి
నిందుచూలాలు మనము మన్నింపవలయు
విడువు విడువుము మారుమాట నుడువకుండఁ
గీడుమూఁడు నీ దేవేరి వీకకున్న.

పొడవడగింపఁగల్గు నినుఁ బోలెడి వీరులు వేయిమంది దుం దుడుకున నెత్తివచ్చినను దోర్బలభీముఁడు దావిడేంద్రుఁ డొక్కఁడు మగబీరమున్ గడిమి కల్గిన పోటరి వాని దేవి ని ప్పుడు చెఱఁ బట్టినన్ సుఖిసి పోదువు నా పలు కాలకింపుమీ.

మొదలె సత్వసంపన్నుఁడు పిదప ఘోర
తపముఁ జేసి వచ్చుచునుండె దర్పఘనుఁడు
దైవసాహాయ్యమును బొంది తప్పకుండఁ
జెనకఁబోక స్వాంతని సాధ్వి జెనఁటి వగుచు.

ఈమాట లాలించి మహేంద్రుఁడు తాఁ జేసిన కార్యంబునకు లజ్జించినవాఁడుంబోలె నటించుచు నా సాధ్వీ వతంసంబునుడించి, నారదునివద్ద సెలవుం బుచ్చికొని మగుడ, నారదుఁడు లీలావతీదేవి నుద్దేశించి యాదరంబున,

అల్లదె! పర్ణకుటీరము
తల్లీ! యిక్కడకుఁ జాల దగ్గర నుండెన్
మెల్లఁగఁ బోదము రమ్మా!
యుల్లాసముతోడ నందు నుండఁగవచ్చున్.

పోతుటీఁ గైనఁ జొరరాదు పుండలించి
నేను గీసిన గిరి దాఁటి నెగ్గరాదు
పుణ్యవతి నీవు కాలంబుఁ బుచ్చవచ్చు
భర్త వచ్చునందాఁక నీ పర్ణశాల.

మణిమంతౌషధ శక్తిన్
గుణమణి ! నీభర్త నిచటకుం దెచ్చెద నే
నణిమాదిసిద్ధు లిచ్చెద
నణుమాత్రము నీకు సందియము వలదమ్మా !

అని కపటోపాయంబున
వినయం బుట్టిపడఁ జెప్పి విబుధర్షి వెసన్
గొనిచనెఁ గాంతామణిన్
దన పర్ణకుటీరమునకు దగ్గరదారిన్.

విలక్షణలక్షితంబయి, లీలావతీదేవి కందోయికి విస్మయ జనకంబుగా నున్న యేతత్పర్ణశాల నుపలక్షించి, సంశయ గ్రస్తయై

మౌని శేఖరుతోఁ గూడి మౌనమూని
మానినీమణి కలవరమాని గుండె
కొట్టుకొన నడుగులు లెక్కపెట్టుకొనుచుఁ
గడఁకతోఁ జొచ్చె మునిపల్లె గడపదాఁటి.

ఆఱిపోవకయున్న యగ్నిహోత్రము లేదు
యజ్ఞవైచికి యొక్కఁడైన లేదు
నీ వారబలు లిచ్చు నిష్ఠాపరుఁడు లేఁడు
వటువాతనే లేచు వడుగు లేఁడు

జపతపంబులు సల్పు ఛాత్రుఁ డొక్కఁడు లేఁడు
పితృయజ్ఞము నొనర్చు నతఁడు లేఁడు
నైమిత్తికముఁ దీర్చు నైష్ఠికుండును లేఁడు
వేదపాఠముఁ జేయు వేధ లేఁడు

అతిథివర్యు లభ్యాగతు లసలె లేరు
నారచీరెలు కృష్ణాజినములు లేవు
పెళ్ళుమని మండిపడు రావి పేళ్ళు లేవు
అతివిచిత్రం బహో నారదాశ్రమంబు.

పనితంపు నెత్తావి పైఁడిదామరతూండ్ల
నారగించెడి రాచ యంచమూఁక
క్రొమ్మావి గోమించు క్రొంజిగురాకు సం
గోరు మెసవు మైన గోరగములు
కంగారుపడకుండఁ జెంగల్వమోక స
గంబుఁ గొఱికి మేయు కన్నెలేండ్లు
పండ్లారఁ గొఱుకుచుఁ బండ్లారగించెడి
కొంటెకోఁణఁగి పండు కోతిపిండు

దట్టమగు నీడ నిచ్చెడి చెట్టుమీఁదఁ
బాకి పొదరిండ్ల గట్టెడి వ్రతతివితతి
కల్గి చివురాకుపందిళ్లు గల్గి యొప్పె
నారదర్షి కుటీరంబు నవ్యశోభ.

పుణ్యవతి పుణ్యజనభర్త పుణ్యఫలము
పతివియోగాగ్ని మఱుఁగుచు వసటఁ "బరుల
పంచ బ్రదుకవలసెఁ దొంటి బామునందు
నెట్టిక్రొఱనోములను నోచి పుట్టినానొ."
అనుచు మాటిమాటికి నుస్సురస్సురనుచుఁ
బ్రాలుమాలిక మొగ్గ నిబ్బరము తగ్గ
నురసి లీలావతీదేవి యొక్కనాఁడు
పండువెన్నెలఁ బవళించి పాలుపోక.

వేకటపాద్దులం దనకు సంభవించిన కడగండ్లమాటఁ దలపోసికొనుచుఁ బూర్వవైభవంబు దలంచికొని పొంగిపొంగి పొరలివచ్చు శోకంబు నాపుకొని లోలోనఁ గుములుచు,

గీర్వాణి వచ్చి వాకిట వేచి యున్నది
యని చెప్ప నూకొట్టు నట్టి యొదుపు
ఇంద్రాణి కబురంప నేమితొందర యంచుఁ
గనుసైఁగతోఁ యనుపు సౌరు
మారాణిదూతిక మనవి యొక్కటి తెచ్చె
నని చెప్పఁగా వినీ వినని ఠీవి
శర్వాణి తన్నొక్కసారి రమ్మనెనన్న
వచ్చుచుంటినటంచుఁ బల్కు సొబఁగు

తలంచికొనుచు మనస్సులోఁ గలఁతపడుచుఁ
గాల వైపరీత్యమున కక్కజము పడుచు
దిక్కుమాలిన దైవంబు తెచ్చిపెట్టె
నిట్టియిక్కట్టు లౌరౌర ! యేమి తగవు ?

కాలునిచిన యూరు కారూరు పురిటిల్లు
పాఱుటాకుటోర పాకపంచ
పురుడు పోయు తల్లి మునిపల్లెలోఁ బుట్టి
యేమి తెలియనట్టి యెడ్డెకత్తె.

ఉగ్గుఁ బాలు పోసి యుండరా నాయన్న !
యేడ్వఁబోకు మంచు నేడు పుడిపి
పూలతొట్టెఁ బెట్టి బోరుకాడించుట
యడవిపల్లెఁ బుట్టినట్టి పడుచు.

జోజో యటంచును జోలపాటలు పాడి
పొదిగిళ్ళలో బిడ్డఁ బొదిగిపెట్టి
వినరాని పాటలు వినిపింప విననయ్యె
దిక్కుమాలిన నాకుఁ దెరువు లేదు
తులలేని బంగారు తూఁగుటుయ్యాలలో
ముందూఁగవలసిన ముద్దుబిడ్డ
కడిమిచెట్టులకిందఁ గడిమితోఁ గట్టిన
తీగటుయ్యాలలో నూఁగవలసె

ద్రవిడరాజన్య రత్న సంస్థగిత మైన
పైడిగద్దెపైఁ గూర్చుండు వాఁడు నేఁడు
కాడులో మునిపల్లెలో గావరంచు
నేడ్వ నాలించువా రొక్క-రేని లేరు.

అని యిట్లు చింతించుచు, నింటివేల్పునకు మ్రొక్కు-లిడుచుఁ, దలఁపులు నలుదెసలకుం జెదరిపోవఁ జేయునది లేక యాయాసపడుచు, నిండుచూలాలితనంబున దిగులుపడుచు, నాయంతర్వ్యత్ని కన్ను మూఁతపెట్టుచుండ

మహతి చేఁగొని నారద మౌనివరుఁడు
తరుణ మరుదెంచెనని చెప్పి తారి తారి
నాల్గుదిక్కు-లు పరికించి నవ్వుకొనుచు
నిట్లు హృదయమ్ములో నిశ్చయించుకొనియె.

ఆభిజాత్యము గల్గినయట్టి మౌన
పతికి నొకమారు తలకెక్క- మతపుఁబిచ్చి
యెట్టి పనియైనఁ బొనరించు నీశునాన
మానవుని వల్లఁగా దామె మనసుఁ ద్రిప్ప.

కావున నే యుపాయమును గైకొని యైనను మంచిమాట లే వో ! వినిపించి మావలకు నొప్పగ నామెనుద్రిప్పఁబొప్పు, లే దా విడిపోవు మాపనులు తప్పదు గావున నీమెచేత నే హావడిఁగూర్తు ద్రావిడుల కంచును నారదమౌని యంతటన్.

పున్నమరేయి యాశ్రమము పొంతను మెల్లఁగ సన్నగాలి పే
రెన్నిన సన్నజాజిపొదరిండ్లపయిం బడి వీచుచుండఁగాఁ
గిన్నరసాని యెల్గుఁగొని కిన్నెర పల్కఁగ సన్నగొంతుతో
విన్ననువొప్పఁ బాట వినిపింపఁ దొడంగె మనోహరంబుగా.

పతియెడఁ బాటుచేఁ గలుగు బాధ విరోధి గృహప్రవాస దు
ర్గతి కలిగింప నేమి యెఱుఁగంగని చిత్తముతోడ నా పతి
వ్రత వినుచుండె నారదుని పాటల నేమరి మెల్ల మెల్లఁగా
మతి చెడిపోయె నొక్కగతి భ్రమాన్పడిపోవఁగ తీవ్రపాటుతో.

ఇదె! మంచిపాట పాడుదు నంచుఁ జెప్పి య
ష్టాక్షరీమంత్రంబు నాలపించు
ఇదె! గొప్పకథయంచు నింపుగా సొంపుగా
వైష్ణవగాథలన్ వరుసఁబెట్టు
ఇదె! మేలుసుద్ది చెప్పెదనంచు మురువుతో
నార్యరాజచరిత్ర మట్టె పాడు
ఇదె! లెస్స బుద్ధి పల్కెద నంచుఁ బ్రావడ్డ
ద్రావిడాచారముల్ తడవుచుండు

కన్ను మూఁతలు పడుచున్న కాంత యపుడు
వినెనో! వినలేదా! రవ్వంత వీని నెల్ల
నారదుఁడుమాత్ర మట్టె చిర్నగవుతోడఁ
జెలఁగి పాడుచుండెను గొంతు చిరుగునట్లు.

విష్ణుకథలఁ జెప్ప వినరాదు నేనంచుఁ
జెప్ప లేకపోయెఁ జెలియ యపుడు
సంయమీంద్రుఁ డద్ది చక్కఁగాఁ గనిపెట్టి
విష్ణుకథల నెల్ల విప్పి చెప్పె.

వినఁగ వినఁగ భక్తి విప్పారఁజొచ్చెను
దెలియకుండ సుంత చెలియ కపుడు
కడకు నేమి కలదు ? గర్భస్థపిండంబు
మార్పుఁ జెందెఁ దల్లి మార్పుతోడ.

తల కెక్కుచుండఁ గ్రమముగఁ
గలవాణికి మాని బూటకపు నుడువులు వ్యా
కులపాటుడిగి కుతుకమునఁ
గలఁగక యందుండె బేల గావున నటుపై.

శుభలగ్నంబున నొక రే
శుభలక్షణలక్షితుండు సూనుం డొకఁడున్
బ్రభవించెఁగదా ద్రవిడ
ప్రభాపహారుం డగుచును బ్రహ్లాదుఁ డనన్.

నవనవలాడుచుం బెరిఁగి నత్తినుడుల్ తడబాటు నెన్నడల్
జవజవలాడు మైమెఱుఁగు చక్కని చామనిచాయ మేనితో
గవగవలాడుచుండ నెపకమ్మున నెంతయుఁ గన్నతల్లి తా
నవిరళమోద మంది తనయా! యిటురమ్మని పిల్చుచుండెడిన్.

నారదమౌని శేఖరుఁడు నమ్మిక మెప్పఁగఁ గన్నతల్లికిన్
సారెకుఁ జేరఁదీసి యుపచారముఁ జేయుచు విష్ణునామముల్
నేరుపఁగాఁగ బిడ్డ కవలీలను దల్లి యెఱుంగకుండ వి
స్తారపు వాలకంబునను దన్నొరు లెవ్వరు చూడకుండఁగన్.

ఆరముగ్గిన పండ్ల నారగింతువు రార
చెట్లచాటున కంచుఁ జేర్చుచుండు
మంచిమొల్లలు తెచ్చి మాల గ్రుత్తువ యంచుఁ
బొదరిండ్లదరికిఁ గొంపోవుచుండు
లేఁడిపిల్లలఁ బట్టి యాడింతువా యంచు
దూరదూరమునకుఁ జేరుచుండు
రంగుపుల్గులఁ జూచి పొంగిపోదువె యంచుఁ
గావుకొమ్మలఁ బట్టి చూపుచుండు

నారదుండు ప్రహ్లాదునిఁ జేరి యిట్లు
తంత్రములఁ బన్నసాఁగె నుద్దండుఁ డగుచుఁ
గాన నుండుటచే నొరుల్ గానకుండఁ
గడకు లీలావతీదేవి కన్నుఁ బ్రామి.

శివలింగధారణఁ జేయవే యని తల్లి
బతిమాల మూఁగయై పల్కకుండు
శివదేవునకు మ్రొక్కు జెల్లింపవే యన్న
"ఊఁఊఁ"యటంచుఁ దా నోదిగియుండు

శివదేవు మంత్రంబుఁ జెప్పవే యన్నచోఁ
    శేరత్తి విష్ణునిఁ బిల్చుచుండు
నినుఁబట్టి కొట్టింతు నేనని వచియింప
    నత్తదే యనిచెప్పి యూరకుండు

పిబ్బికోలు మొండితనమ్ము పిల్లదనముఁ
జూపుచున్న ప్రహ్లాదునిఁ జూచి తల్లి
మొగము చిట్లించుకొనలేదు మొదటికాన్పు
గానఁ గనుబొమ్మ ముడివైవఁ గడఁగలేదు.

ఎన్నిపేరు లుండ వీశున కాతఁడే
పేరఁ బిలుచుచున్న వినకయున్నె?
పేరులోన నేమి పెన్నిధి కలదంచుఁ
దిట్టఁబోక సమ్మతించెఁ దల్లి.

నారదుఁ డిది యంతయుఁ గ
న్నారఁగ లక్షించి మోద మందుచు నుండెన్
దారుణముగఁ బెఱయింటను
బోరును దాఁకొల్పినాఁడఁ బో పొమ్మనుచున్.

ఈగతి నైదేండ్లేగన్
వాగీశు ననుగ్రహంబు వలన వరంబుల్
దాఁ గొని హిరణ్యకశిపుఁడు
దూఁగాడుచు నడిచిపాటుతోఁ జొరి నగరున్.

పచ్చము పాడునుం దెలిసి బగ్గున మండి కషాయతాత్ముఁడై
యచ్చెరు వయ్యె దైవగతి యా మగబీరములేని పంద నే
నిచ్చట లేనటం చెఱిఁగి యేమి మొగంబున మందిరంబులోఁ
జొచ్చి మదీయసాధ్వి నెదిచూచుక ముందలఁ బట్టియాడెనో.

దవిడరాజసింహంబు పరాభవంబు
నకట సహియింపనోప దేమైనఁ గాని
మగలరాజౌట నా దండి మగనిఁ బట్టి
తెత్తు మగనాండ్రు చూడఁగన్నెత్తి వాని.

అనుచు నవమానరోషంబునఁ గ్రుద్ధుండై కాల నేలందన్ని-

తలచీరఁ జుట్టి చేతన్
దలతలమను కత్తిఁ బట్టి తటుకున సైన్యం
బుల నగరంబున నిలిపి
కలకల మాపుచు హిరణ్యకశిపుం డంతన్.

కతిపయసాదులం గొని యఖండజవంబున నారదాశ్రమ
ప్రతిసరభూమిఁ జేరి యతివశ్యుని నారదుఁ గాంచి వందనం
బతిశయభక్తిఁ జేసి రయమారఁ గుటీరముఁ జొచ్చి వెంటనే
కుతుకమఁ తోడ నందు సుమకోమలిఁ జూచి సరాగచిత్తుఁడై.

అవలేపముతో నిందుం
డవకాశముఁ జూచికొనుచు నవరోధము లే
కవరోధము దూరి యిటుల
నవమానముఁ జేసె సాధ్వి హంతవ్యుఁ డగున్.

చూడుము మాపా తేపా పరిశోషణఁ జేసెద స్వర్గధామమున్
జూడుము మాపా తేపా కడుఁజూడెద భీకరశత్రుసైన్యమున్
జూడుము దేవి ! నాబలము సొంపు విరోధి బలంబుపెంపు నే
నూడనిబాడఁ జేసెద బిడౌజుని నాకులఁబాడు చేసెదన్.

హిరణ్యకశిపుం డిటు దేవేరితోఁ బరీభావంబు నీఁగు కార్యక్రమంబు నివేదించుచుండ—

చిడిముడిపడు చదుగడుగునఁ
దడబడుచున్ గొణిఁగికొనుచుఁ దందడపడుచున్
మిడిసిపడుచుఁ బ్రహ్లాదుఁడు
వడివడి నడతెంచి తల్లివంకకు నడువన్.

హిరణ్యకశిపుం డానందాశ్రులు చిందుచుండఁ బరవశుండై బాలకు గ్రుచ్చియెత్తి ముద్దాడుచుఁ, జుబుకంబుఁ బుణుకుచుఁ, దడబడు నడలు, బుడిబుడినుడులు, మంటగ్రుంగిన యొడలు, మురిపెంబు గడలుకొలుప

పుత్రగాత్ర పరిష్వంగ భూరిసుఖము
నందు నోలాడి మఱిపుతో నట్టె నిలిచి
కడకుఁ బ్రియురాలితోఁ దన కొడుకుతోడ
వెంటనే పయనం బయి వీడు చొచ్చి.

జైత్రయాత్ర చాటించి, ప్రస్థానభేరి వేయించి, మహా సైన్యంబుతోఁ ద్రివిష్టపంబుపై దాడివెడలి, తన్నగరంబువలఁ

జుట్టియున్న, మిఱ్ఱుపల్లంబులకుఁ దొలంగి, సమప్రదేశంబున దండువిడియించి, కోటకు లగ్గలువట్టి, యత్యల్పకాలంబున సాధించి, పలువురు చూచుచుండ, శచీదేవి కట్టెదుట నింద్రునిఁ జెఱఁబట్టి దక్షిణాపథంబునకుం గొనితెచ్చి వెట్టిపనియందు నియోగించి, యతని మొత్తుకోళ్ళతోఁ బాటు లీలావతీదేవి వేడికోళ్ళు కరుణార్ద్రచిత్తుఁడై యంగీకరించి, విడిచిపుచ్చి,

అఖిల దిగ్దేశవిజగీషుఁడై హిరణ్య
కశిపుఁ డైదారుగాదులు కడపిపుచ్చి
పిదప నుదుకు చల్లారఁగా విశ్వమెల్లఁ
జిక్కు లెడఁబాపి రాజ్యంబు జేయుచుండి

ఒక్కనాఁడు రాకుమారుని విషయమై యోజించి, బాలుని విద్యాప్రసంగమున సంస్కరించుట యుత్తమంబని నిశ్చయించి,

పూర్ణముగ నీతిశాస్త్రంబు బోధపడదు
ప్రౌఢమంత్రాంగ మెఱుఁగంగ వలనుపడదు
రాకొమరుఁడు చదువకుండరాదు గానఁ
జమవు నేర్పింతుఁ గొలవుటొజ్జకడ నంచు,

పదియేనేఁడులు చెల్లిపోయిన సరే వాకాటులం జిక్కి చొక్కి దివారాత్రములట్టె బాలకుఁ డహో క్రీడించుచున్నాఁడదే చదువుల్ నేర్పినఁగాని పోవదు మనోజాడ్యంబు కాఁబట్టి నేఁ జదివింపించెదఁ బెద్దయొజ్జలకడన్ శాస్త్రంబు లన్నింటినిన్.

అంచు విచారించి, సకలనీతిశాస్త్ర పారంగతులును, గులాచార్యులును నైన శుక్రాచార్యతనూజు లగు, చండామార్కుల రావించి, కార్యవిషయంబు ముచ్చటించి రాకుమారుని వారల కప్పగించి, పండితోత్తముం జేసి తోడ్కొని రండని యానతీయ,

మూఁడేండ్లు పోవకమున్నె శుక్రాచార్యు
పట్టి ప్రహ్లాదునిం బట్టి తెచ్చి
ద్రవిడరాజేంద్రు ముందరఁ బెట్టి దీనుఁడై
యితఁ డెట్టిబిడ్డఁడో యెఱుఁగరాదు
గురుభక్తి గనరాదు పరకుసేయుట లేదు
శిక్షింతుమన్నఁ దాఁ జెడ్డకోతి
వనమెల్లను జెఱచు ననెడి నానుడిరీతిఁ
దోడిబాలురఁ దప్పుత్రోవఁ బెట్టి

అకట! కులదైవమును దూలనాడఁ జొచ్చె
శివునికథ లెల్లఁ బెడచెవిఁ జేర్పఁ జొచ్చె
బాలునకు శిక్ష చెప్ప మావల్లఁ గాదు
చతురమతి నీవె యెట్లయిన సాఁకికొనుము.

ఎన్ని చెప్పినఁ దలయూఁచఁ డింతయేని
మాఱు పలుకక తనపని మాత్ర మట్టె
పట్టుఁదలఁ జేయు నిది యేమి పాపమయ్యొ?
మూఁగవానిని బోధింపఁ బూనుటయ్యె.

చదివింపఁగ దొరకొంటిమి
చదివించిన లాభమేమి సమకూడెనొకో!
చదివినయర్థం బెఱుఁగఁడు
చదివింపఁగలేము మేము ధాత్రీవర! వీనిన్.

చిరకాలార్జిత విద్యను
బరమార్థముతోడఁ జెప్పఁ బఠియింపక యే
మఱకువతో నుండును భూ
వర వీనిని సాఁకలేము పాలసుఁ డగుటన్.

ద్రవిడజాతి కీతఁడు గుండె తల్లడంబు
విమల రాజవంశమునకు వేరువిత్తు
దేవ! దీని నెల్ల నెఱింగి దిద్దికొనుము
నీదు తొలికాన్పుబిడ్డను నేర్పుతోడ.

కావున నీ కుమారకుని గ్రన్ననఁ దెచ్చితి మప్పగింపఁగా
భూవర! యింకమీఁద సరిపోయినరీతిని దిద్దికొమ్ము, మీ
పావనమైన వంగడపుఁ బర్వఁ బ్రతిష్ఠను బాఱఁజూచి లో
కావనదీక్ష నేకరణి నైన స్వధర్మము నిర్వహింపుమా.

అంచు వచియించి, చండామార్కులు హిరణ్యకశిపునకు హితవుం గఱపి, సెలవుం గైకొని మగిడిపోవ, తాతు నేశ్వరుండు చింతాక్రాంతచిత్తుం డై,

నయము భయ మనయము నయముగా బోధింప
మచ్చరంబు హెచ్చ మానఁ డయ్యె
మొండిపట్టుఁ బట్టి దండనంబునఁ గాని
సాధ్యపడఁ డటంచు సాహసించి.

వాదన లేటికంచు బలవంతుఁడు తేఁడు కృపం ద్యజించుచున్
గాదిలిపట్టి యంచుఁ గడకంటను జూడక నిష్ఠురక్రియా
పాదనచేత శిక్షఁ బరిపాటి విధింపఁగఁ జీరిపోయెఁ బ్ర
హ్లాదకుమార మాతుల బలంబు చలంబున రెండుపాయలై.

రాచనగ రెల్ల నిట్టి దుర్వార్త వినుచు
నట్టుడికినట్లు తుకతుక లాడిపోయె
నార్యు లియ్యది కనిపెట్టి యార మంచి
తరుణ మాసన్నమయ్యె నీ సరణి ననుచు.

నీతికోవిదుల్ గుమిగూడి నిక్క మెఱిఁగి
దైవగతిచేత గృహములోఁ దారసిలిన
భేదభావంబు నెటులైన విస్తరింపఁ
జేయ సమకట్టి నారదుఁ జీరి చెప్ప.

మహేంద్రుని చెఱ విడిపించి తొల్లి లీలావతీదేవిని దన యాశ్రమంబున నుంచికొని యుపచారములు చేసి సంతోషపెట్టుటచే నా మానవతీమతల్లి తనయెడ కనికరించి నిరాటంకముగా నతఃపురమునకు రాకపోకల కనుమతించిన స్నేహంబుఁ బురస్కరించుకొని కార్యోన్ముఖుం డయి

నారదుఁ డొక్కనాఁడు నరనాథకుమారకుఁ జూడవచ్చి దై
వారెడిప్రేమఁ గన్బఱచి యక్కఱమాటలు నాల్గు చెప్పి. వే
యారులు కొండెముల్ వలికి యానని పించి సుతారమొప్పఁగా
దూరని తోఁపకుండ మది దూరని మెత్తని గొట్టుమాటలన్.

నీ జనకుండు గర్వమున నిర్జరకోటిని సాధుపాళి రా
రాజునటంచు నుబ్బుచుఁ బరాక్రమలీలఁ గ్రమంబుఁ దప్పి పే
రోజముఁ దూల్చుచుండ నిటు లొప్పరికించుట రాజనీతియే ?
రాజులు లేరె ? మున్నిటుల రాజకముం బొనరించినారలే ?

యాగము ముక్తినిచ్చునను నాశ మెయిం గడు శ్రద్ధతోడ నా
యాగమవేత్త లందఱు ప్రయాసముతో నొనరించుచుండఁగా
యాగము ముక్తినిచ్చునె యథార్థముగా ! నని పాడుచేయు నీ
యాగము నాగడంబు తగునా యొడయుండగువాని కెందునున్!

బాలుఁడ నే ననఁబోకుము
బాలకునకు మాత్ర ధర్మపద్ధతి వలదా !
బాలుఁడె ధర్మము నిలుపం
జాలిన దైవంబు మెచ్చి సంతసపడఁడా ?

నే నెటు లీపనిఁ జేసెదఁ
బోనిమ్మని నీవు చెప్పఁబోకుము బాబూ !
వేనకువేలున్నారు మ
హానాయకు లిపుడు నీకు నండఁగ నిల్వన్.

తర్కవితర్కముల్ వదలి తండ్రి పురోహితదండనాథ సం
పర్కముచే మహాకఠిన భావముఁ దాలిచి యొక్కతీరుగాఁ
గ్రక్షుఁడయ్యె దానఁ బ్రజ కష్టము లొందెడుఁ గావునన్ శుభో
దర్కముగాఁగఁ జక్కఁబడు దారిని బోవుట పాడి పుత్రికా!

ఇంతియ కాక—

దేవరహస్య మొండు విను తెల్పెద స్వప్నమునందు సర్వలో
కావనదీక్షితుండు చతురాగమవేద్యుఁడు నాకుఁ దోఁచి నే
నీవల కూరకుంటి నిటు లే నిఁక సైఁప మదీయభక్తునిన్
బావను నిష్ఠురంబయిన బాధలు పెట్టుచు నుండ నెవ్వఁడో.

కంటకుఁడై ధరావరుఁడు కారియ పెట్టిన యప్పుడే సభా
మంటపమందు నున్న యతిమాత్రపు స్తంభమునందు డాఁగి త
న్నంటిన వెంటనే యతని యాయువుఁ దీసెద నాదుభక్తు నే
నొంటరిఁ జేసి పోవ నెటు లూరట గల్గునటంచు నాడెఁగా.

కత్తులు నూరినంతటనె కంపము నొందరు ధీరు లెందుఁ గిం
చిత్తయినం బ్రమాదపడి సేయ రధర్మము గాన దీని యా
వత్తెఱిఁగించినాఁడ భగవంతుని యిష్టముఁ దెల్పినాఁడ నీ
చిత్తము; ధర్మపాలనము శిష్టసమీహితకార్య మౌఁగదా.

రక్షకుఁ డొక్కఁడేనియును రాష్ట్రమునం గనరాని నీ ప్రజల్
రాక్షభయంబునన్ గలఁగి రోజొక యేడుగ నున్న వారు ని
కక్షయసంపదల్ గలుగు నయ్య ధ్రువంబుగ నార్తులౌ ప్రజా
పక్షముఁబూని పోరునెడ బాగని దైవము మెచ్చుఁ బుత్రికా!

ఈగతి నపూర్వ రాజనీతి ప్రకారంబు మెఱయ, నారదుండు బోధించి, యలౌకికుం డయిన ప్రహ్లాదునిచే వల్లె యనిపించుకొని, సూటిగా విశ్వకర్మ మందిరంబుఁ బ్రవేశించి, యొగ్గతనంబున మంతనం బాడి నేర్పరులగు పెక్కుర శిల్పుల సమకూర్చి వారికి రహస్యంబుఁ దెల్ప వారును,

ఎవరికిఁగూడ శంక ఘటియిల్లని నేర్పున మెల్పుతోడ శేఁ
బవ లనకుండ నారదుని పంకము నెగ్గెడుభాతి యుక్తిచేఁ
జివరకుఁ దత్సభాస్థలిని జిక్కని చిక్కని మాటుతల్పులన్
గవిసిన యుక్కకంబమును గట్టిరి శిల్పకళావిదగ్ధులై.

ఆఁకొనియున్న సింగము రహస్యముగాఁ గని పట్టి తెచ్చి యే
పోకలు పోవనీక యొక బోనునఁ బెట్టి యుపాయశాలురై
కైకొని దాని మండపపుఁ గంబమునం దిరికించి పెట్టి తా
మై కనిపెట్టియుండి రెటులౌనొకదా! యనియార్యమాంత్రికుల్

మఱునాఁడు. హిరణ్యకశిపుం డాగ్రహోదగ్రుఁడై సభాముఖంబున గద్దెపైఁ గూర్చుండి, గద్దించుచు "విష్ణుండు, విష్ణుండని నిరంతరంబు. వానిడచి, ప్రలపించు చుంటివి. ఆతండెక్కడ యదృశ్యుఁడయి యడంగియుండెనో చూపింతువా" యనఁ బ్రహ్లాదుండు వికసితముఖుండై నిర్భయముగా "ఇదిగో! నీ సభామంటప స్తంభంబున నుండె, చూడ నిచ్చగింతువేని చూడవే" యనవుడు సార్వభౌముండు మండిపడి తోకఁ

ద్రొక్కిన మహానాగంబుకైవడి రోఁజుచు, గదను బిరబిర సారించుచు గద్దెనుండి దుమికి, సాకం బెఱుఁగక స్తంభంబున కేసి యెదురు నడచి, బ్రహ్మాండంబు బూరటిల్ల సింహనాదంబు జేసి, డాసి యయోమయంబగు దీర్ఘగదాదండంబు గిరగిరఁ ద్రిప్పి పెళ్ళుమని స్తంభంబు విఱిగి కూల విసరికొట్టెను. కొట్టిన మఱుక్షణంబుననే యదృశ్యంబులగు మఱుతల్పులం బడఁద్రోసికొని,

గర్జించుచుఁ బంచాస్యము
నిర్జరరిపుపైకి దుమికి నీరవునింగా
జర్జరితాంగుని జేసెను
ధూర్జటిభక్తునకు నేమి తోఁచకమున్నే.

అంగద నవయుచుఁ జెంగున
సింగము చెలరేఁగి గోళ్ళఁ బిల్చుచు తేనిన్
గంగారుగఁ జేసి పిదప
నంగిడి పుట్టించి వేగ యుసు రెడఁబాపెన్.

కొండలు పిండిపిండిగను గొట్టెడి మేల్పడ వాలుదంట కుం
భాండుఁడు హుంకరించి జ్వాలదాతత శాతకృపాణ హస్తుఁడై
గండడగించి సింహమును గాలుని ప్రోలికిఁ బంపె వెంటనే
దుండగులెల్ల ప్రమానుపడి దూరఁగఁ దొందర సందుగొందులన్

పాతరలాడెను నారదుఁ
డాతరి నుప్పొంగిపోయి యనుకొన్న పనిన్
జాతురితోఁ దీర్చితి నని
చేతం దెగ మెఱయుచుండఁ జిటితాళంబుల్.

అన్నదమ్ము లిర్వురను సింహంబుచేత
నేదుపందిచేఁ గూల్పించి యెగిరిపడుచు
మోదమందె నార్యజనసమూహ మెల్ల
నెల్లభూములఁ దమయాజ్ఞ చెల్లుననుచు.

ద్రావిడరాజ్య మంతయును దక్కొనఁ జేసిన తత్క్షణంబునన్
ద్రావిడు లెల్లఁ బోరెదరు ప్రాణముపైఁ గల తీపి మాని రా
జ్యావనదీక్షఁ బూని సమరాంగణ మెల్లను బీనుపెంటలై
పోవఁగఁ గాన నిప్పుడిది పోలదటంచు మునీంద్రుఁ డంతటన్.

రాజనీతి విరుద్ధమై ప్రాణహానిఁ
జేయు నీకార్య మరయ నిషిద్ధమంచు
నాయ్యలకుఁ జెప్పి యొప్పించి యవలఁ గార్య
చతురుఁడై దూరదృష్టిచే సకల మెఱిఁగి.

కీలుబొమ్మ నొండు కీలకమ్మున గద్దె
మీఁద నుంచు నెడల మీఁద మేలు;
ఎల్ల లేని నేల యెల్ల సీతని పేర
నేలవచ్చు పలుక నేల యనుచు.

జాతిద్రోహునిఁ దాతమారకుని వంశభ్రష్టుఁ బ్రహ్లాదునిన్
జేతోమోదముతోడ నార్యజనముల్ సింహాసనారూఢునిం
బ్రాతిం జేసిరి తత్క్షణంబ ద్రవిడవ్రాతంబు నిర్విణ్ణులై
కాతర్యంబున నేమిఁతోఁచకవె, దిగ్భ్రాంతాత్ములై డాఁగఁగన్.

అతిమతావేశకలనచే నాదమఱచి
గురువులకు లోఁగి మతిచెడి కులముఁ జెఱిచి
వంశనాశంబుఁ జేసిరి పాపమనక
తల్లిబిడ్డ లొక్కటయి పెంపెల్లఁ బోవ.

ఆకలంబు సాపదు మానియైన నేమి?
యాకులంబుఁ జెందినవాసి నందఁ జెందు
నేకలం బీశ్వరునిఁ జేసె నేకలంబు
నాకలంబునకు జోహారు లనకయున్న.

యథార్థ ప్రహ్లాద చరిత్రము
సంపూర్ణము



# యథార్థ రామాయణము

శ్రీరామాయణకృతిలో
మీ రెఱుఁగని భావ మొందు మిసుకునె? కానన్
గారుణికోత్తమ! చెప్పుఁడీ
శ్రీరామాయణమునఁ గల చిత్రము లెల్లన్.

మూర్తుర పేరులం దలలు మాఱిచియున్ దలక్రిందుచేసియున్
నేర్తునటంచు గర్వమున నిక్కి ప్రచేతసుతుండు తెంపునన్
బూర్తిగ రామచంద్రకథ మున్ రచియించెనటంచు బాపురే!
వార్త యొకండు నేఁడు వినవచ్చెడి సత్య మెఱుంగఁబల్కవే.

అనినంతనె సూతమహా
మునిచంద్రుఁడు పల్కెఁ బ్రేమమున నిట్లనుచున్
వెనుకటి గాథలఁ జ్ఞప్తికిఁ
గొని తెచ్చికొనుచు మనంబు కుతుకముఁ జెందన్.

బిడ్డా! నీసంప్రశ్నము
దొడ్డది; యఖిలంబు చెప్పెదన్ విను మిపుడే
చెడ్డయొ మంచియొ తెలిసిన
గడ్డువిశేషంబు లెల్లఁ గాదనకుండన్.

పేరులు మార్చినాఁడు తలపెట్టి దురర్థము రాఁగఁ గొన్నిటిన్
బేరులు మార్చినాఁడు తలపెట్టి యపార్థము రాఁగఁ గొన్నిటిన్
బేరులు మార్చి మాఱుతుర పేరు ప్రతిష్ఠను బాడుచేయుచున్
బేరు గడించె నాదికవి పేరు పొగడ్త జగంబు నిండఁగన్.

'దసగీవ' యనెడి శబ్దము దశగ్రీవఁ గా
వించి గొంతులు బంతి పెట్టినాఁడు.
'రావన్న' యనుపేరు రావణగాఁ జేసి
బొబ్బమానిసి చేసి పోయినాఁడు
'చుప్పనాక'ను దెచ్చి శూర్పణఖం జేసి
చేటగోరులదానిఁ జేసినాఁడు
'రక్కసి' యనుమాట రక్షస్సుగాఁ జేసి
యేమేమొ యర్థముల్ వ్రాసినాఁడు
లోకసామాన్యకవియె వాల్మీకిమౌని ?
తలలు తెగమార్చినట్టి పదాలనెల్ల
వేఱె యొకనాఁడు చెప్పెద విస్తరించి
నేఁడు రామాయణాంశముల్ నీకు వినుతు.

లంకాపుర వర్ణనము

మూఁడు కాలములందుఁ బూచి నెత్తావులం
బొలయెల్ల విరఁజిమ్ము పూలచెట్లు,
ఆకాల మీకాల మేకాల మనకుండఁ
బగటిల్లి తెగకాయు పండ్లచెట్లు

మిద్దెమేడలకొద్దె నిద్దంపు మెఱుగారు
ముద్దుకల్ప నొసంగు మద్దిచెట్లు
పశుపక్షి మృగకీట వర్గంబునకు నెందు
నిలువ నీడ నొసంగు నిడుదచెట్లు

తీగగుంపు, గాటంబుగాఁ గౌఁగిలింప
మిగుల రమణీయమై చూపుమేరవఱకు
వ్రేఁగువ్రేఁగుగాఁ గప్పట్టు విపినభూమి
యిమ్ముకొని యుండుఁ ద్రవిడదేశమ్మునందు.

ఓదములన్న లెక్కఁగొనకుండ మదంబున గుంపుగుంపులై
గాదముమేయుచున్ బసరు గ్రక్కెడి పచ్చనియాకుకొమ్మలన్
బోదెలఁబట్టి తొండముల బోరబగల్చుచు బృంహితంబులన్
వాదములాడుచుం దిరుగు వన్యమదేభ సమూహ మచ్చటన్.

పిడికెడు విత్తనంబులను విత్తినమాత్రన మూఁడుకారులన్
గడుపున చిచ్చుఁబుచ్చఁగల కమ్మని మేలిమి పంటపైరులన్
పుడుకులనిచ్చి భూప్రజను బోషణఁ జేయుచునుండు నప్పుడీ
పుడమిని దక్షిణాపథముఁ బోలెడిదేశము వేఱెయున్నదే!

బుధజనవాసయోగ్యమయి పుణ్యనదీనదవారిసేవ్యమై
మధురఫలప్రసూన తరు మండలమండిత దివ్యభాగ్యమై
పృథుతర దివ్యభోగ్యమయి వెల్గెడి పూతచరిత్రదక్షిణా
పథమును నంటి దక్షిణపు వైపున దక్షిణవార్ధియొప్పెడిన్.

నారికేళావనీరుడ్వనంబులందుఁ
గాపురము సేయుచుందు రక్కడి జనంబు
పరమ సంతుష్టులగుచు నొంటరము లేక
పరుల యధికార మెట్టిదో యెఱుఁగఁబోక.

అఱవము,జాను తెల్గు, మలయాళము, కన్నడ బాస, కోయ,చెం
చెఱుకల గోందు బాసలకు నెల్లను దొల్లిటిదైన బాసనున్
నెఱిపడి మాటలాడెదరు నీఱిదొఱంగక సంచరింపుచున్
బిరుసున మానరక్షణకుఁ బిక్కక ప్రాణము పూటవెట్టుచున్.

కో యని యార్చిచూడు మిదిగో! యని కొండఘుకీను కత్తితోఁ
గోయఁ బ్రతీపకంఠములఁ గొంకరు జంకరు మానరక్షకై
కోయలు చెంచులున్ దులువ కోటులకోటులుపోటుమానిసుల్
పాయరు జన్మభూమిఁ దెగవైచెద రన్యులు కాలు వెట్టినన్.

అంకపడి దక్షిణాంబుధి యంకమందు
లంక, శివలెంక, ప్రతిభాంక లంక వెల్గు
నిత్యనిష్పంక, నిశ్శంక నిష్కళంక
వంక గానరా డావంక వంకవంక.

తొలుత సాలకటంకట కులజులైన
మాల్యవంతుండు మాలి సుమాలి మొదలు
గాఁ గలుగువారు లంకలోఁ గాపురంబు
సలిపి రాజ్యమేలిరి కత్తి బలిమిచేత.

# తృతీయాశ్వాసము

నిరంతర పరాజయసంభవావమానంబుచేఁ గుమిలి కుమిలి, విద్వేషులెల్ల రొక్కటయి, దండెత్తివచ్చి మాలిఁ జంప మాల్యవంతుండును సుమాలియు లంకను బాడువెట్టి రసాతలంబునకుం బలాయితులైరి.

పాడువారిన లంకను బాడుగుడిపి
జక్కు లందుండ వారలఁ జావమోది
కడల నడచిరి కోయలు జడుపునుడిగి
వశముఁ గావించుకొని బాహు బలముచేత.

కొంచె మించుమించుగ నాలుగువయిపులను
నతివిశాలం బగాధంబు నైన కడలి
యతికి యుండుటచే నారు బుతువ్రలందు
వాసయోగ్యంబు లంక యెవ్వారికైన.

నిడుదమలమీఁద వాటంపు నెత్తమందు
గట్టిగా మూఁడుకొమ్మల నట్టనడుమ
దుర్గమంబుగాఁ గట్టిరి దుర్గమొండు
కాసె పనిఁగన్న లోకంబు కన్నుఁగుట్ట.

అభ్రంకషోత్తుంగ హర్మ్యసౌధంబుల
పసిడిరోచులు దెసల్ ప్రాకులాడ
గోపుర ప్రాకార కుడ్యరత్నద్యుతుల్
దూఁకి యొండొంటితోఁ ద్రోపులాడ

రథకేతనాంబర ప్రథిత కాంతిచ్ఛటల్
తెంపారి మింటిపైఁ దేలియాడ
శింజినీటంకార శృంగారి ఘీంకార
రావంబు లొండొంట రాపులాడ
బహుళ చతురంగ వాహినుల్ పగ్గెలాడ
ఘూఁడులోకంబులకు గుండె ముల్లు వెలసె
మాట జవదాఁట నేరని పోటుమగల
కాపురంబైన రమ్య లంకాపురంబు.

చల్లని పిల్లతెమ్మెరలు సాఁగుచుఁ గమ్మని పూవుతావిలో
మెల్లఁగఁ బొల్లిపొల్లి తమ మేనఁ బువుం బొడి మేదుకొంచు న
ల్లలన కుంటికుంటి నడయాడుచు నుండఁగ మింటనుండి జా
బిల్లియుఁ గాయఁగాఁదఱపి వెన్నెల హాయిగ నుండు లంకలో.

అంకాపాంకములెల్లఁ జేవదలి యత్యానంద నిర్మగ్నులై
శంకాతంకవిచారదూరులయి యశ్రాంతంబు నావీట శౌ
ర్యాంకుల్ వాసము చేయుచుందురు సమస్తైశ్వర్యభోగాఢ్యులై
లంకారాజ్య మహావిభూతి గరిమన్ శ్లాఘింపఁగా శక్యమే ?

వెడఁద ఱొమ్ముగల్గి నిడుద చేతులుగల్గి
మాట యొరువుగల్గి సీటుగల్గి
జిద్దు నేర్పుగల్గి చిట్టంటు లంకలో
మాసటీఁడులైరి మనుజులెల్ల.

## తృతీయాశ్వాసము

పదిదిక్కులనుగెల్చి బహు జయస్తంభముల్
పాతి పెట్టించిన బల్లిదుండు
పదిశాస్త్రములుగట్టి పట్టుతోఁ బఠియించి
ప్రజ్ఞాధురీణుఁడౌ పండితుండు
పదునాల్గు లోకముల్ బవరాన నోడించి
కాలిక్రిందను బెట్టు కాలిబంటు
పదియారుకళలఁ బ్రపంచంబుఁ దనియించు
శశిచెంపఁ గొట్టిన సౌమ్యమూర్తి

కడుపులో చల్ల రవ్వంత కదలకుండ
ద్రవిడ జాత్యభిమాని యథార్థవాది
ప్రాజ్య రాజ్యమేలుచునుండె రావణుండు
దర్పితాహిత లోక విద్రావణుండు.

పలుగాకి పులుగాకుఁ బొలిపుచ్చి తననాఁడు
చికాకు పడకుండఁ జేసినాఁడు
గాటంబుగాఁ జెలగాటంబుగాఁ జెల
రేఁగి మార్తురఁ జీల్చి రేఁగినాఁడు
గోపురంపు పురంబు బాపురే ! యన మూఁడు
కొండకొమ్మలమధ్యఁ గూర్చినాఁడు
కలిచేతఁదన్ని యాకలిమాన్ని గిలిమాన్ని
నలిమాన్ని యెల్లర నిలిపినాఁడు

కుదురునకుఁ బట్టుఁగొమ్మయై కుదిరినాఁడు
నాఁడు తనుఁగొల్వ నొనరించినాఁడు నాఁడు
నదురులేని నాయకుఁడైనాఁడు నాఁడు
రావణుం డార్యలోక విద్రావణుండు.

లంకాపురీంద్రమే లబ్ధవర్ణునకెంతొ
బడలార్చు బంగారు పడుకటెల్లు
దక్షిణాపథమే విపక్ష పక్షాంతకు
నలరించు నసివారు నాఁకతోఁట
భారతఖండమే బాహాబలాఢ్యకు
నవరించి గడితేర్చు సాముగరిడి
ఖండాంతరంబులే గానకళావేది
కరియప్పనములిచ్చు నట్టిపాలము

ద్రావిడావళి కెవ్వాఁడు జీవగఱ్ఱ
యతఁడు వీరశైవుండు మహాభిమాని
రావణుండు విద్రావితైరావణుండు
గొనబు జాళువా గద్దెపైఁ గొలువుఁదీర్చు

కోయవారల నాగరికుల నొనర్చి
చదువు సాములఁ జెప్పించి చక్కఁబఱచి
యాభిజాత్యభావోదయమ్ములవరించె
నవుర ! రావణుం డెంత ధన్యాత్ముఁ డగును.

'అన్నమో రామచంద్రా' యటంచు నేడ్చు
వా రయోధ్యలోఁ బెక్కుమంది యున్నారు కాని
'యన్నమో రావణప్రభూ' యంచు నేడ్చు
వారు లంకలో నెవరు గన్పట్టరారు.

కలఁడు తోఁబుట్టువొక్కఁ డుక్కలుఁడు రావ
ణునకు జగజెట్టి కుంభకర్ణుండు, నిదుర
పోతు చిననాఁడె చాదంతి పొడుగుకొమ్ము
లూడిసి చేపట్టి యుయ్యాల లూఁగినాఁడు.

విపుల తంత్రజ్ఞుఁడైన విభీషణుండు
పోకలాఁడు; పెద్ద వదరుబోతు ఖరుఁడు;
మాఱు తమ్ములు చెల్లెలు 'మాటకారి'
శూర్పణఖ యన్నలకు ముద్దుఁ జూపుబిడ్డ.

శైవమతాభిమానియగు జంగమదేవర గావునన్ సదా
రావణభూవరుండు తన రాష్ట్రమునందున జీవహింస తా
నేవిధినైన మానువుటయే మతధర్మమటంచు నెంచి యే
జీవులఁ జంపఁగూడదని చేసెను గట్టడి ధర్మలోలుఁడై.

గొంతెత్తి తొలుసారి కోడికూయకమున్నె
పురవీధులను నూడ్చి తిరిగిపోవు
పడకమంచమునుంచి పడుచు లేవకమున్నె
మెల్లఁగాఁ గలయంపి చల్లిపోవు

వంటపుట్టియ సిద్ధపడి చేరకయమున్న
నీళ్ళతోఁ బంటెలు నింపిపోవు
ముంగిళ్ళు సరిచేసి ముగ్గుపెట్టకమున్న
వెన్నాడి ప్రొయిరాజఁ బెట్టిపోవు
వాయుదేవుండు మేఘుండు వరుణదేవుఁ
డగ్నిదేవుఁడు తమయంత నుగుదెంచి
ప్రాలుమాలక యేప్రొద్దు వరవుడంబుఁ
జేయుచుందురు లంకలో సిగ్గుపడక.

పాదులు కూలఁద్రోసి పగవారల పౌఁజులఁ బట్టి యెక్కఁడే
బాఁదిగుదించి కట్టికొని వచ్చిన నారను సామియానఁ దా
మాఁదలఁదాల్చి కాదు మరి యూ నసకుండఁగ నెల్లవేళలన్
జీదర మాటలేక పనిఁ జేయుచునుందురు లంకలోపలన్.

పురుషులతో సమానముగ బోటులు సర్వకళాభిరామలై
గురువులవద్ద విద్దెలను గోరిక నేర్చుటెకాక ఘోర సం
గరమున నస్త్రశస్త్రములఁ గైకొని యేయుట నేర్చియుండఱున్
గఱగఱికన్ స్వరాష్ట్రమును గాచెడి పూనిక నుందురెప్పుడున్.

ఇంకని పౌరసేవ యొకటే పరమార్థము నిచ్చునంచుఁ గూ
లంకష పాండితీగరిమ లాభముచేత గ్రహించి మంచితో
లంకిణి పెండ్లిమాని యమలం బగులంబగు బ్రహ్మచర్యమున్
గొంకక స్వీకరించె బుధకోటి "హసాద"నఁ ద్యాగశీలయై.

పొలిసిపోని లంకారాజ్యమునకు నెల్లఁ
జేవఁగల లంకిణీదేవి చేతి కత్తి
వేటు పెట్టని కట్టని కోటయయ్యెఁ
గనుగవను మూసి పౌరులు కునుకుచుండ.

లంకిణిఁగంచెలన్ దాఁటి, విలాసముగాఁ గయిసేసి కాంచికా
కింకిణిజాలమున్ మెఱయఁ గింకిరిమాస్త్ర ప్రాణోద్ధమా
వంకిణి చేతఁబట్టి పరువంబున రేఁబవ లొక్కటై వడిన్
లంకిణి శాత్రవుల్ బెదర లంకను గావలిగాయు నెప్పుడున్.

రాజులు లంక వైపునకు రారు భయంబున లంకిణీ రిపూ
ద్వేజకమైన కత్తిఁగని బెళ్కుటి దానను శాంతిభద్రముల్
రాజిలు పౌరపాళి కవురా! యిది కన్గొని లంకిణింగనన్
లాజలు చల్లుచుండెదరు లంకనుగల్గు పురంధ్రులందఱున్..

ఆశ్రమంబులలో గృహస్థాశ్రమంబె
యఖిలజనశిరోధార్యమా నంచుఁ దలఁచి
సోకు టిల్లాండ్ర తలపూస చుప్పనాక
చేకొ నె గృహస్థధర్మంబు చింత లేక.

కేలుపట్టిన పెనిమిటి గూల, గోల
దండకావన సీమలోఁ దపము సేయు
నేకసుతుఁ డూతకోలగా నెగ్గతంబ
శూర్పణఖ ప్రోద్గులనుబుచ్చు సుగతిఁగోరి.

బోటులకెల్ల ధర్మము ప్రబోధముఁజేయుచు జీవహింస బా
హాటముగాఁగనాపుపనికై నిరతంబువిసుమాలకయెల్ల ప్రొద్దులా
మాటలె చెప్పుచుండి మను మార్గమునందున సంచరింపుచున్
దాటక రాజయోగ పరితర్పితయై పురివీడి పిమ్మటన్.

వానప్రస్థము నూనుచు
మానుగఁ దాటకి మహాభిమానవతి యనూ
చానమటంచును దండక
కాననమున సుతులఁగూడి కాపురముండెన్.

ఈగతి స్త్రీ పురుష ప్రభేదంబువలన స్వత్వంబుల
యందు వ్యత్యాసంబుఁ బొరయకుండ ధర్మసంరక్షణంబుఁ
జేయుచు,

పంతముతోడ నన్య నరపాలురపైఁబడి దోర్విభూతి దే
శాంతర సీమలం గెలిచి యావలిపుట్టఁగ వారినెల్ల సా
మంతులుగా నొనర్చికొని మంతునకెక్కి యథేచ్ఛతోడ వి
శ్రాంతినిబూని రావణుఁడు రాజ్యముఁజేసెడి కాలమందునన్,

గండోపలచ్ఛటా గండూషితప్రస్థ
వింధ్యపర్వతపంక్తి వెనుకనెట్టి
పంచాస్యశార్దూల వన్యేభసంకీర్ణ
ప్రస్ఫురద్దండకా వనముదాఁటి

తృతీయాశ్వాసము

ప్రావృట్సమారంభ బహుపయస్సంపూర్ణ
దుర్లంఘ నిర్ఝరుల్ దాఁకివచ్చి
విపరీనృపచమూ విష్కంభ దుర్లోక
తృణలతాగుల్మముల్ తీసివచ్చి
యార్యసంఘంబు మునిపల్లె లచ్చటచటఁ
గట్టుకొని వేగుపనికినై కాపురంబు
లుండి బహుజంతుహింసా ప్రయుక్త యజ్ఞ
యాగములు చేయఁజొచ్చిరి యాగకుండ.

మానినులెల్లరున్ భయము మాని విచారముమాని నెంటరా
మానిజనంబు దండము కమండలముంగొని పోయి పోయి, వే
కాననసీమలన్ నెమకి కాపుర ముండిరి పల్లెలన్ జన
స్థానమునందు గట్టుకొని దారులుకాయుచు మాఱుమూలలన్

వృత్తవేది రావణుఁ డీ ప్రవృత్తిఁ దెలిసి
శైవమతవిరుద్ధంబైన జంతుహింసఁ
బెద్దప్రొద్దు చింతించి మాన్పింపఁదలఁచి
వీరసువు తాటకిని బిలిపించి పల్కె.

తాటకి సాధ్విరో! వినుము తప్పక యేమని చెప్పనేర్తు ? నా
నోటను మాటరాదు విన నోచితి నీ విపరీతకర్మముల్
మాటలఁదీసనే యొడలు మంటలఁబ్రుంగుచు నుండఁగాన నో
పాటలగంధి! యెట్లయినఁ బాపవొ! నాపరితాపవహ్నినిన్.

ఆర్యులంట నీతిపరులంట యాహితాగ్ను
లంట యెచటనుండియో వచ్చిరంట పరోప
కారులంట ద్రావిడులనంట, కాదనకంట
దొడ్డమంత్రంబులం గడతే స్తురటె తల్లి.
నియతిన్ గోమేధంబంట
హయమేధ మంట నరమేధ మంట చేతురటే
దయమాలి స్వార్థపరులై
వ్యయప్రయాసములు లేక యార్యమునీంద్రుల్.

ఎఱుంగుదు నీకుమారకుల నిర్వార దుర్జయ బాహుసారులన్
దెరలని స్వామిభక్తులగు దిట్టగరాసుల వారితోడుతో
నరిగిన నీకుం దప్పక జయంబగు నమ్ముము మాటలేల? యీ
తరుణమునందుం గర్జమును ధైర్యముతో నొనరింపంగాందగున్.

కాదనంబోకుమమ్మ, పని గల్గెనటం చెదురాడకమ్మ, త
ల్లీ! దరి తెన్నుం గానక చలించెడి డెందము మానమూని యీ
మాదిరి నూరకున్న విషమంబగు దుర్గతి సంభవించు లె
మ్మా! దరిం జేర్చుమమ్మ, మను మార్గముం బట్టిన నీకుం దప్పునే!

పరుసని మాటలాడకుము వారలతోం దగురీతి నేర్పుమై
గరుసును దెల్పి యొప్పిదముగా మన యేల్బడినున్న సీమలన్
బరగెడి దేశధర్మమును వాళ్ళొని వారికి నచ్చునట్టులే
సరణిని జంతుహింస నిట సల్పంగ రాదని యొత్తి చెప్పుమా.

ఆముకవిని విశ్వామిత్రుఁ డనెడి మౌని
వరుఁడు గోమేధమును జేయవలయునంచు
యుదియఁగొని యుంచెనఁట వాని యుదియ యుడిపి
వెలఁది! యీపులుగాకు తప్పింపవలయు.

మన ముపేక్ష సేయు నెడ నీ యనువునందు
ధర్మనాశనమౌనమ్మ తప్పకుండఁ
బాడువారి దేశము ప్రజా పీడగల్గుఁ
జావు కడు లెస్స ధర్మరక్షణము కొఱకు.

మనతాతలు ముత్తాతలు
తనువులు బుడగలనుచు మదిఁ దలఁచియు కాదే
యని సేయుచుఁ దెగటారిరి
జనములు మెచ్చఁగ స్వధర్మ సంరక్షణకై.

రాజాజ్ఞ లేనిదే రాజ్యంబుఁ జొరరాదు
పరరాష్ట్రవాసులౌ ప్రజలు తెగువఁ
జొచ్చిరేనియుఁ జొచ్చి చొచ్చుటతోఁ దమ
రాకఁ దెలుపకుండ రాదు పతికి
ఉండిరేనియు నేత దుర్వీక్ష శాసన
ములఁ కల్ల జవదాఁటి పోవరాదు
పోయిరేనియు వారు భూపాలు శిక్షలఁ
దిన్నఁగాఁ దలఁదాల్చి తీరవలయు

చోరులంబోలె దేశంబుఁ జొచ్చి నాకు
పూని ధర్మవిరుద్ధంబులైన పనులు
చేసి రాజాజ్ఞ ప్రతిఘటించెదరు, దండ్యు
లైరి యాకారణముచేత ననుచుఁ దెల్పి.

మంచిమాటల జన్నంబు మానిపింపు
లేద దండకాటవినుండి లేవఁగొట్టి
పొమ్మను మఁటన్న నా మంత్రణమ్ము వడసి
చనియెఁ దాటకి రాజాజ్ఞఁ జక్కఁబెట్ట.

పూఁచిన కార్యభారమున మున్నడి తాటకియింటికేగి మా
రీచ సుబాహులం బిలిచి ఱేని యనుజ్ఞనుదెల్ప వారలున్
లాఁచి నితాంతశక్తిని జలంబునఁ దల్లిని గూడి దివ్యవ
ర్మాచితదేహులై వెడలి యందఱు చేరిరి యజ్ఞవాటికన్.

చేరి గాధేయునకు ఱేఁడు చెప్పినంత
పూస గ్రుచ్చినకైవడి బోధపఱప
నెంతలేసి మాటలని గ్రుడ్లెఱ్ఱఁజేసి
నిప్పుఁ ద్రొక్కిన కోఁతియై నెగిరిపడుచు.

కాపేయంబునఁ గ్రిందుమీఁదెఱుఁగకా కంపించు దేహంబుతోఁ
గోపాటోప విఘూర్ణమానుఁడయి సంకోచంబు నేమాత్రముం
జూపంబోవక కౌశికుండప్పుడు గ్రచ్చుల్ గొట్టి వాచాలుఁడై
మాపట్టున్ విడఁబోవమంచుఁ బలుకన్ మర్యాద లేకుండఁగన్.

పల్కు లాలించి సంక్షోభ పడక, యుదరి
పడక, మోమోటపడక నిబ్బరము చెడక
తాటకీసాధ్వి రాజాజ్ఞ తప్పదనుచుఁ
జాఱఁజూచి పుత్రులవంక బఱటినంత.

పట్టుమంచు మారీచ సుబాహులప్పుడు
పట్టు విడనాఁడవో మృషా బ్రాహ్మణుండ!
కాంతు మీ వేమిసేయఁగాఁ గలవో యంచు
యజ్ఞ విఘ్నంబు సల్ప నాయత్తపడుచు.

యూపంబులకుఁ గట్టియున్న యాఁబెయ్యల
మెడ త్రాళ్ళ సడలించి విడచిపుచ్చి
చిద్రుపలుగాఁగొట్టి చెప్పియుంచిన రావి
చిదుగు కుప్పలపేళ్ళు చిమ్మివైచి
గుమగుమ త్రావి యా గుబ్బుగాఁ గొట్టు నా
న్రల నేతి పంటెల బోర్లగించి,
కుండంబులోనుండి కొలఁది న్నాల్కలుగ్రోయు
నగ్నిహోత్రమ్ముఁ జల్లార్చివైచి

దర్భలను నాల్గుమూలలం దరలవైచి
పాఱుఁబోతులం బెదరించి పాఱఁద్రోల
మిన్ను విఱిగి కూలినమాడ్కి మిణకరించి
చూచిచూచి యప్పుడు గాధినూనుఁడంత.

ప్రాఁతలాతాము మెల్లగాఁ జేతఁబట్టి
చంక నిఱికించి చినిఁగిన జింకతోలు
రెండు రెండంచు శిష్యుల లేవఁదీసి
తల్లడిల్లి సాకేతంబు దారిపట్టి.

కూఁకలు పెట్టుచుం జెదరఁగొట్టుచు నట్టడవిన్ వసించి కా
రాకులు కూడుగా మొనర్పనట్టి మునీంద్ర జనంబుమీఁదికిన్
దూఁకులుదూఁకి కావరముతోఁ దెగనాడిరటంచు రాజుతో
సాకులు చెప్పుచుం దగినశాస్త్రి యొనర్చెదనంచుఁ జెప్పుచున్.

గోవులఁ జంపినంత తమ కొంపమునుంగునె? వీరి కక్కటా!
గోవులు గోవులంచుఁ బయికొందురు తద్వ్యధనాపద్రావిడుల్
గోవుల మాంసపుంజవులు కొద్దిగనైన నెఱింగియున్నచో
గోవులఁ జంపఁగూడదని గొల్లునఁ జెప్పుట వీరు మానరే.

ఎంతయత్నంబుఁ జేసిన నేమివచ్చె?
నావునెఱచిని రుచిచూడరైరి వారు
సోమపానంబునుం జవిచూడరైరి
ఇందుచే నిన్నియిక్కట్టు లేగుదెంచె.

అమ్మరివోసి చుల్కనగ నాఁడుది సైతము లక్ష్యశుద్ధితోఁ
గిమ్మనకుండ శాత్రవులఁ గీటడగించుటె కాక ఘోరసై
న్యమ్మును నిక్కకో ననిమొనన్ నడిపింపఁగ నేర్చె నిట్టి రా
జ్యమ్మును దొల్లియే నెఱుఁగనైతిని నైతి యెటో? జయింపఁగన్

తృతీయాశ్వాసము

పోటుకానితోడఁ బోటుకత్తియ కూడ
నిలిచి పోరుచుండ నిలువఁగలరె
వైరులెంత గండు వజ్జీరులైనను?
మాట దక్కఁబోదు మాటలేల?

బొమ్మముడి వేసి తలముడి పుచ్చుకుండ
అవికముడి వేయునట్టు లాఘువముగొరల
సరుల ముడివేసి ముడిచేప సరులగొంతు
ముడి నరలఁబుత్తు రిచ్చటి ముద్దరాండ్రె.

అంచుఁ జింతించుచుఁ జింతాకులమానసుండై, శిష్యులంగూడి యిటునటు చూడక, యడుగులు లెక్కించుకొనుచుఁ గాలినడకతో, గాలిపాటునకు జంకక, గాలిపాటలు పాడుకొనుచు నెమ్మదిగా,

ఏరులుదాఁటి వాటముగ నిన్నియు గ్రొందలిరాకు బాటలన్
నేరుగ దండకావన వినిర్గమనంబొనరించి పిమ్మటన్
వారక భంగపాటు పొరపాటును దల్లడపాటు పెట్టఁగా
నూరక గాధినందనుఁ డయోధ్యకుఁబోయెను దొట్రుపాటుతో

కులపతియైన వసిష్ఠముని గొంపను జొచ్చి రహస్యపద్ధతిం
గల తెఱంగెల్లఁజెప్పి యిది కాదది కాదని దీర్ఘదృష్టితోఁ
బలుమరు చర్చఁజేసి యిది భావ్యమటంచును నిశ్చయించి తా
వెడలెను గౌశికుండు పృథివీపతి దర్శన సంభ్రమంబునన్.

దశరథభూమిపాలకుని దర్శనముం బొనరించి పేర్మితోఁ
గుశలమునడ్గి యేమిపనికోరని వానినిబోలె సర్వమున్
విశదముగా నెఱింగి తన విహ్వలభావము తోఁపకుండ నా
కుశికతనూభవుండు కొనగోళ్ళను గడ్డము చిక్కదీయుచున్.

పొరపడకుండఁ దొట్రుపడఁబోక గరాగరి మంచిమాటలన్
నరవరు మోముపాటుఁగని సమ్మకముం జెడకుండఁ జక్కఁగా
సరిపడునట్లుగా, నొరులు సైతము మేలని మెచ్చురీతిఁగా
వరుసగఁ జెప్పె నిట్లు నరపాలుని మ్రోలను జాల జాలితో:

పాపభూయిష్ఠ ప్రవర్తనంబును బాసి
సంసారసంబంధ సరణి రోసి
బహుళజనాకీర్ణ పట్టణంబుల వీడి
కారుపల్లెలలో మెకాలఁగూడి
ప్రత్నశిష్టాచార పథమట్టె చేపట్టి
మొలచుట్టు పాఱుటాకులనఁ జుట్టి
ఐశ్వర్యముల నెల్ల నడకాల దిగఁదన్ని
భాగ్యభోగ్యములన్ని పాఱఁదన్ని

షడ్రసోపేతమైన భోజనముడించి
కాయగసరులతో నెట్లొ కడుపునించి
పారమార్థిక చింతతోఁ బరముఁగొల్చి
బ్రదుకుచుంటిమి తాపసాశ్రమముఁ వాల్చి.

సూరవంశాభివృద్ధిని గోరి కాదె
యారితేరిన మేధావులైన మునులు
దండకావనిం జేరి యందుండి తపముఁ
జల్పువెల్లను నగచాట్ల సరకుగొనక.

ఆర్యులనుపేరు విన్నంత నచటి రాజు
లాగ్రహోదగ్రులై వారి హాతమొనర్ప
సిద్ధమాదురు మావంటి శీర్ణదేహు
లేమి సేయంగ నేర్తురో నృపతిచంద్ర!

సెలయేళ్ళ నీళ్ళ దోసిళ్ళతోఁ గడుపారఁ
ద్రావి ముప్పూటలఁ దనియుచుండి
పండి రాలిపడిన యెండుటాకులు పండ్లు
నొంటిపూట భుజించి యొదిగియుండి
పూలతావులలోనఁ బొరలివచ్చెడి గాలిఁ
గోర్కెమైఁ దనివోవఁ గ్రోలుచుండి
మనసుపోయిననాఁడు మాత్ర నివ్వరిభోజ
నముఁ జేసి యొట్టిలో నవయుచుండి

యుఱకయారాలపొంత గూర్చుండు మమ్మ
నడవి మెకములం జూచెడునట్లు చూచి
యెక్కసక్కెములం జేతు రేవగించి
జాతి వైరంబు మనసులో సందడింప.

ఎంతదూరంబు తఱిమి మునీశ్వరుండు
చెప్పచుండిన దశరథ క్షితివరుండు
మాటలాడకుండిన యంత మసలిపడుచు
నుల్లకుట్టు మాటలచేత నులికిపడఁగ.

దూరముఁ బాఱఁజూడు చెవిదూరన్ను నేనిపుడాడు పల్కులన్
గారణమేమియో తెలుపఁ గాదగునయ్య యసహ్యమయ్యెనే!
పాఱులు నిల్వనేరని నృపాలుర రాజ్యము వృద్ధిఁబొందునే?
కారియలందఁడే నృపతి కష్టపరంపర రాక తప్పునే?

పులినోటికండవలె మా
సులు ముప్పొద్దుల మహా మనోవ్యధచేతన్
గళవళపడి నిలువంగాఁ
దెలియని వానివలెనుండఁ దెలిసిన పనియే?

తెలిసికొనవా నీరాజ్య విస్తృతికిఁగాదె
ఋషులు దండకావనసీమ కేగి యందె
నిలిచి పోయినా రిది నీవు తలపవెట్లు?
ఇంతటి కృతఘ్నతను నే సహింపఁజాల.

చొచ్చిరి దండకావనము శుష్కశరీర విషణ్ణచిత్తులై
నొచ్చిరి ద్రావిడప్రభుల నూరిన వెర్రెడి చిక్కటూరులన్
వచ్చిరి నేఁడు దిక్కని భవచ్ఛరణంబును గోరి వారలన్
గ్రచ్చుఱ నాదరించి, యుపకారమునేయ వదేమి చెప్పుమా!

కుశికసుతుఁ డిటులాడఁగ
దశరథుఁడుం గటకటపడి దైన్యముతోడన్
దిశలూరక కన్గొనుచు వి
వశుఁడగుచు వచించెనిట్లు భయభక్తులచే:

కులపతులౌ మునీశ్వరులకున్ వలవంతలు గల్గుచుండ వ్యా
కులపడకుండ నుందుదు మె? కొందలమందదె మాదు డెందమున్
విలయము వచ్చిపడ్డ రఘువీరులు పాలుఱఁ బ్రోవకుండ శ
త్రులమొగసాలముందుఁబడఁద్రోతురె? యేంటులకిట్టి నిందలున్?

ఇదె! పోదము రాఁగదె దో
ర్మదమున ద్రావిడులు పోవు మార్గము లెల్లన్
వదలక యరికట్టెద నా
ప్రదరములకు నెవ్వరడ్డు పడఁగలవారో!

తడయఁగ వద్దు పోవుదము దండక కాననసీమ కిప్పుడే
గుడుసువడంగ సింగిణి లకోరులు 'రంయిసి' దూఁకుచుండఁగాఁ
గెడపెద నేను మార్తురను గీటడగించెద ద్రావిడప్రజన్
గడగడలాడఁజేతు గమికాండ్రను గాండ్రని బొబ్బ పెట్టుచున్

అబము సుబమే మెఱుఁగని నా యట్టివాని
మీఁద నిందమోపుట ధర్మమే? మహాత్మ!
విప్ర సంతర్పణంబైన పిదపఁ గాదె?
యేము భక్తితో భుజియించు టెంతొ యంతొ.

ఏయుగమందు మా రఘుకులేశులు భూపతులన్నమాట కా
నీ! యెవ్వడైన నొక్కపని యేని స్వతంత్రతఁ జేసినారలే?
యీ యనుమానమేల? పదుఁడీ యిపుడే పయనంబయైతి స్వా
మీ! యిటువంటి పల్కులు సహింపఁగనేరను వేయునేటికిన్

అని చెప్పుచు నుండెంగాఁ
జనుదెంచి వసిష్ఠమౌని సాంతముగాఁ దా
విని సర్వోదంతంబిటు
జనపాలుని తోడఁబల్కె ఛద్మముతోడన్:

కడువృద్ధుండవు నీ వి
క్కడ నిలిచి యుండి యేలఁ గల్గుకుగానీ
యడవుల వెంబడిపడి భ్రమ
క్కడి మానవ్రులఁ బడఁగూల్పఁ గల్గుదువొక్కో!

చెలువముకగ్గ నీ వయసు చెల్లఁ బటుత్వము కొంత తగ్గ నీ
కిలపయిఁ దీరఁగాఁదగు నభీష్టము లెల్లను దీరిపోవ నీ
యలవుచలంబు నెందులకు నక్కఱరా వదిగాక సీతనూ
జులకు విరోధిమారణముఁ జూఱగొనంగను నేర్పఁగాఁదగున్

కావున రామలక్ష్మణుల గాదిలి బిడ్డల నిర్వురన్ మహా
పావనుఁడైన మౌనికుల వర్యుని చేతను బెట్టి పంపుమా
పూవులలోన పెట్టికొని పోయి విరోధిచమూసమూహముం
జావఁగఁ గొట్టి తెచ్చి మన సన్నిధి నుంపఁగలండు భూవరా!

భానువంశంబునకు వన్నె వాసికల్గఁ
జెలఁగి నీకీర్తి దెసలెల్లఁ జిందుఁద్రొక్క
వెనుక ముందు యోజనలెల్ల విడచిపెట్టి
మంచుఁ జెప్పఁగా దశరథుఁ డావులించి,

కంటినీటితో బిడ్డల జంటచేసి
చివుకుమన గుండె మౌనీంద్రు చేతఁబెట్టి
శోక మెటుమాన్తురో నాకు? లేకలేక
కన్న సంతాన మియ్యది కావుమన్న !

చెఱియొకవైపునన్ నిలిచి చిందులుద్రొక్కఁగ రామలక్ష్మణుల్
ముఱియుచుఁ గౌశికుండు తనముప్పొదొలంగెనునేఁటితోడ నం
చురవడిఁ బైనమయ్యెఁ జటులోగ్ర భయంకర దండకాటవిన్
జొరి పరిమార్చ ద్రావిడులఁజుబ్బన చూఱఁగ నిబ్బరంబుగన్

పిన్నలు రామలక్ష్మణులు బెగ్గిల వచ్చును వింటిమోఁతలన్
విన్నను వేగిరింపఁ జెడుపేయగుఁ గావున మెల్లమెల్లఁగా
వెన్నునఁ దట్టి భీతి యొకవేళ ఘటిల్లినఁ బోవఁబుచ్చి రా
మన్నకు మున్నుగాఁదెగువయబ్బెను కైవడిఁజేయుటొప్పగున్.

అనుచుఁ దలపోసి పోసి యనంతరమ్ము
తికమకలు మాని మాని యుద్రేకమడఁచి
యొక యుపాయంబు నూహించి యొరులకేమి
చెప్పకుండఁగాఁ గార్యంబుఁ జేయనెంచి.

ముఱిముఱి చీఁకటుల్ దెసలు మూసెడివేళ నరణ్యసీమ నొం
టరిగవసించు తాటకిఁ దటాలునఁ బైఁబడిగూల్చుటొప్పఁదొం
దరపడకుండ నాఁడుదిగదా! యెటుపో యెటువచ్చినన్ సరే
దెరలఁగవచ్చు రామునకుఁ దీరఁగవచ్చు భయంబు కల్గినన్

ఈగతి ననేకవిధంబుల నూహించుచుఁ బ్రొద్దు పడమటి దిక్కునకు వ్రాలుటఁ దలంచి యుత్తలంబున

ఎత్తిలి కాలిబాటఁబడి యేగుచు సంయమి దారిలోఁ బురా
వృత్తము లెన్నియేని వినిపించుచు శౌర్యము పొంగిపోవఁగాఁ
జిత్తములోన నూహలొగిఁ జిక్కురు బొక్కురుగాఁగఁ బుట్టఁజే
రెత్తినఁ గాలుద్రవ్వనటు లెంతయుఁ జేసెఁ గుమారులిర్వురన్.

ఈప్రకారంబునఁ గొంతదవ్వేగి సంభ్రమించుచు విశ్వామిత్రుండు రాముం జూచి ప్రసన్నవదనంబుతో నిట్లు మాటలించి పల్కెను:

అల్లదె! చూచితే! యుటజమక్కడ నొక్కటి దానిలోపలన్
గల్లలమారియైన యొక కామిని తాటకి పేరుతోడ రే
లెల్ల వసించు నీమె హసియించెడి నార్యులు గోఘ్నులంచు నీ
యల్లరి రూపుమాపవలె నాయమనుం దొలిముద్దఁజేయుచున్

ఆఁడుదియని తండ్రీ! యెదు
రాడకు నీవింటికి నెఱియగునటుగాఁ దూఁ
టాడుము దయమాలుచు నీ
యాఁడుది జగజెంత యెంతకైననుజాలున్.

అనిన వెంటనే నరపాల తనయు లట్టి
విల్లు సవరించి సరిచేసి పిఱుతివిఁజుక
దూసి కఱకుటమ్ములఁ గవ దొనలనుండి
నారి మ్రోయింప దెసలెల్ల బూరటిల్ల

తాటకి వింటిమ్రోఁతవిని దబ్బున బైటకువచ్చి నిల్వఁగా,
వాఁడిఁడు తూపులన్ సుదతిపై గురియించిరి చిత్రజల్లుగా
గాఁయలుబెట్టుచున్ దుఁదకు గాళ్లనుజేతులు త్రుంచిత్రుంచి య
చ్చోటనె కూల్చివైచి రతిశూరులుగారె కుమారులిర్వురున్

ఇంతమొగముఁ జేసికొని మునీశ్వరుండు
కేకిసలు గొట్టుచుండ సింగిణుల యెక్కు
డించి మూఁపుదోయికి దగిలించి రామ
లక్ష్మణులు నిల్చియున్నంత గ్లానిలేక

ముక్కువాతను నెత్తురుల్ గ్రక్కి గ్రక్కి
చాపకట్టుగాఁ బుడమిపైఁ జచ్చిపడిన
పడతిఁ బెడసవ్వతోఁ దేరి పాఱఁజూచి
మాని సాఁగెఁబో రామలక్ష్మణులఁగూడి.

ఇట్లు వేయిమాసంబుల ప్రాయంబుచెల్లి మూఁడుకాళ్ల ముదుసలియగు తాటకిని యౌవనప్రాదుర్భావమునఁ గలిగిన కండక్రొవ్వున మిట్టిపడుచున్న యిర్వురు రాకుమారులచేఁ జంపించి యొడలు తెలియక సల్లాపంబు లాడికొనుచుఁ గలఁక

దేఱని మనంబుతో రామలక్ష్మణుల వింటినేర్పు ముక్కాకలందీరిన ద్రావిడహాఁవీరవరుల నేర్పునకు నుద్దికాదని సంశయగ్రస్తుండై, విశ్వామిత్రుండు పాలువోక ముందునకు సాఁగిపోవుచు, నుచ్చరంబునఁ దన పూర్వాశ్రమంబున నేర్చికొన్న యఖిలాస్త్రశస్త్రంబులఁ దోఁడుగను శేయను ముడువను నేర్పి, తన యాశ్రమంబుఁజొచ్చి తల్లడపడుచున్న మనంబుతో సంబారంబులఁగూర్చికొని, చవిచచ్చియున్న నాలుక త్రుప్పుఁదుల్లవుచ్చ వేగిరపడుచు, గోమేధంబును జేయ యత్నించుచుండెను. ఇంతలో మాతృమరణంబు నెఱుంగని మారీచసుబాహులు, తల్లియానతిఁ దలమోయుచున్నవారు గావున యజ్ఞవిఘ్నంబు నాచరించ సమకట్ట శ్రీరామభద్రుఁడు నాఁడు నెత్తుటి తనియారని చేతితో వాఁడియమ్ములు దొడిగి చీకటి యోలంబున నిలిచి, సడిచప్పుడు కాకుండఁ జెవిఁ దాఁకు వఱకు లాగి విడువ నందొక్కటి సుబాహు ప్రాణంబుల హరియించె; రెండవది లక్ష్యశుద్ధి కొఱవడుటచే గుఱితప్పి మారీచు ప్రాణంబుల హరియింపనోపకఁ డిల్లపడునట్టు భూమిపై ద్రొల్లఁజేసె. అంత నతండు భీతిఁగుడిచి పలాయితుండయ్యె. పిమ్మట విశ్వామిత్రుఁడు నిరాటంకంబుగా యజ్ఞపరిసమాప్తిఁ గావించి, రామలక్ష్మణుల చేతి లావు చాలమిఁ జక్కగా గ్రహించి మిన్నకుండవలసిన వాఁడయ్యెను. రామ

లక్ష్మణులతోఁ గొంతకాలంబు తన యాశ్రమంబున విశ్రమించి వారిచే నగు కార్యము లేమింజేసి విశ్వామిత్రుండు తిన్నగా వారలం దోడ్కొని దుక్కిదున్న ననువుగాని వేవిలి మెట్టదారుల నెఱిడిపొలములంబడి, మిథిలకుం గొంపోయి, యందుఁ బదిపండ్రెండు తరములనుండి పడియుండి చివికి చెవదిన్న పెద్ద పాతవింటిబద్ద విఱిపించి, రాజకీయసఖ్యంబు నపేక్షించి, యార్యావర్తయందలి రెండు తెగలవారికిఁ జుట్టఱికం బెట్టులయినఁ గూర్ప గట్టిచేసికొని, శ్రీరామునికంటెఁ బెద్దదియుఁ 'దెలియని' పుట్టుపూర్వములు కలదియు నగు సీతామహాదేవిని, శ్రీ రా ము న కుఁ బెండ్లిచేయించి, సాకేతంబునకుఁ దిరిగివచ్చుచు, దారిలో ముసలివగ్గు వడుగైన పరశురామునిఁ దన గురుధనుర్భంగముచేఁ గుపితుఁడైనవాని బదరి, వానిని వింధ్యాటవులందాఁటి దక్షిణాపథమున మాఱుమూలనున్న కేరళదేశంబునకుఁ బోయి యందు నార్యనాగరికత వ్యాపింపఁజేయ నొడంబఱచి పంపి,యయోధ్యకరిగి యందు రామలక్ష్మణుల డించి, కౌశికుం డొండే యేగెను.

రాజ్యతృష్ణ తీరని దశరథుఁడు రాజ్య
భారమును రామునకు నీక పాలనంబుఁ
జేయుచుండ శ్రీరాముండు సీతఁగూడి
కామతంత్రుఁడై ప్రొద్దులు గడపుచుండె.

తోడుతో నాఁడు నెత్తురుఁ ద్రావి కడుపాఱ
    జెపజెపలాడు మానవులులైన
చిచ్చఱమ్ముల పిండు చెలరేఁగి కవదొనల్
    త్రోపాషి నాలుకల్ గ్రోయుచుండ
ద్రావిడ మన్నీల ప్రాణంబుల హరింప
    శ్రీరామచంద్రుండు చింతఁజేసి
ఏ యెక్కుచేసైన నిల్లువాకిలి డించి
    దండకారణ్య భూస్థలికి నేగి

యార్యరాజ్య విజృంభణ మాచరింప
మంచి తరికోసరం బట్టి పొంచియుండ
నింతలో రాజు వార్ధక్య మెనయఁదన్నుఁ
జెలఁగి పట్టాభిషిక్తునిఁ జేయనెంచ

కేకయ రాజపుత్రిఁగని క్లిష్టపరిస్థితిఁ బూనఁ గ్రుచ్చిన
ట్టేకకు వెట్టి యేకరణి నేనియుఁ దల్లిరో! దండకాటవీ
ప్రాకట వీథులందిరుగు భాగ్యము నాకొడఁ గూర్చిపంపవే
వీఁక మెయిన్ విదల్తు రిపువీరుల, రాజ్యము పెంపుచెందఁగన్

రాజు సంతుష్టుఁడైనచో భ్రష్టుఁడగున
టంచుఁ బెద్దలు నుడువు వాక్యమ్ములన్ని
యెఱుఁగుదువు కాదె? తల్లి! నా కేడుగడవు
నీవు దక్క వేఱెవ్వరు నేఁడు కలరు?

అని యీగతి శ్రీరాముఁడు
పినతల్లినిఁ జేరి పలుకఁ బ్రేమముతోడన్
విని కేకయ రాజాత్మజ
చనువున వచియించె నిట్టు చతురోక్తులతోఁ:

సరి లెమ్ము కన్నతండ్రీ!
తరుణము కనిపెట్టియుంటి తప్పక నేనే
వెరవున నైనను నీపని
సరిఁజేసెద నమ్ము మెట్టి సడిపైఁ బడినన్.

అని కైకేయి వచియింప శ్రీరామచంద్రుండు ప్రహృష్టాంతరంగుండై, పినతల్లివద్ద సెలవుంగైకొని వెడలిపోయె. అటుపిమ్మట వెండియు నొక్కనాఁడు కైకేయి పుట్టినింటి దాసియైన మంథర వడివడి వచ్చి "దేవీ! కేకయరాజపుత్రీ! సార్వభౌముండు శ్రీరామచంద్రుని బట్టాభిషిక్తునిఁ జేయుటకులగ్నంబు నిశ్చయించి సంభారంబులను సేకరించుచుండెను, రేపే పర్వదినంబ"ని రొప్పుచు నుడువఁ గైకేయి తనకుఁ దలఁచని తలంపుగాఁ జేఁజిక్కిన సమయంబునకు మురిసి, తొల్లి మహాదారుణరణంబునఁ దాఁజేసిన తోడ్పాటున కలరి, తన పతి యిచ్చిన వరద్వయంబున రాముని వనవాసంబునకు, భరతుని పట్టాభిషేకంబునకు వయోవృద్ధుండును, స్త్రీలోలుండును నయిన చక్రవర్తిని నొప్పించి, యొప్పించి యీ సమాచారంబు శ్రీరామునకుఁ దెలుప సహధర్మచారిణియగు సీత

తోడను, సోదరుండైన లక్ష్మణుని తోడను విపినావాసంబు నకుఁ దండ్రి వలదని వలవల వాపోవుచుండఁ బయనంబై,

రథముతోలంకఁ బ్రాజిత రాజవీధిఁ
బోయి గంగనీళ్ళాడు శేవ్రునకునేగి
యచట దేరుడిగ్గి సుమంత్రు నంపివైచి
తోఁచని మదితో దొన్నెకై వేచియుండ

రాజనీతిజ్ఞుఁడైనట్టి రాముఁడంత
దేశకాల పాత్రంబులఁ దెలిసికొనుచుఁ
జతురుపాయప్రయోగ కౌశలముచేతఁ
దన యభీష్టంబు నెఱవేర్చికొనఁదలంచి

పురుషు లేనట్టి లావరి బోయపెద్ద
నదురులేకుండ గంగపై నడపఁగలఁడు
పడవ యెట్టిదైనను నట్టి గడుసుదిట్ట
గుహుఁడు వాని నేస్తముఁజేసి మిహిరకులుఁడు

మంచిమాటలాడి మన్నించి పదిలంబు
గాఁగఁ బడవనెక్కి గంగదాఁటి
కాలినడకతోడఁ గదలిపోయిరి ముగ్గు
రంతుపొంతు లేని యడవి కేసి.

భద్రముగాఁ బ్రయాసపడి వారలు మువ్వురుపోయి చిత్రకూ
టాద్రిని జేరఁగా భరతుఁ డచ్చటికిం జనుదెంచి దీర్ఘవరా
నిద్రనుబొందెఁ దండ్రియన నిక్కమవందురి పాదుకాద్వయీ
ముద్రనొసంగి రాఘవుఁడు పొమ్మనిచెప్పి తలంచె నీగతిన్

ఇచ్చట నున్నచో భరతుఁ డీగతి వెండియు బాధపెట్టఁగా
వచ్చును జాలితోఁ దిరిగి పట్టణసీమకు రమ్మటంచు నా
వచ్చిన కార్యముం జెడఁగ భక్తుఁడు నాకతఁ డెంతొగాన మే
మిచ్చటనుండి దూరముగ నేగుట కర్జమటంచు నెంచుచున్

వానవంగుళ్ళ కోరిచి వలికి నోర్చి
యుఱుము మెఱుముల కోరిచి యుబ్బకోర్చి
యెండ దగ దప్పులకునోర్చి యెడకు నోర్చి
పయన మైరంత దక్షిణా పథముఁబట్టి

ఇటు పడిపోవఁబోవఁగ మునీశ్వరపుత్రు డొకండుదారిలోఁ
దటుకునఁ గానిపించిన ముదంబున క్షేమ మెఱింగినంత నీ
యటవిని మాని శేఖరుల యాశ్రమభూములు కొన్నియున్న వే
యిటకు సమీపమందు నొక టేనియుగల్గునె? చెప్పుమీయనన్.

మాణవకుఁ డంతఁ జెప్పె నీ మార్గమందు
ననతి దూరంబునందునే యాశ్రమమొకఁ
డున్నయది దేవ! మిక్కిలి యొప్పుగల్గి
యనిన మువ్వురా దారినే చనుచునుండ

చిఱుతతనంబుగో లేc బరసేవయె వృత్తిగ నెంచుచున్ సదా
గరువతనంబు మాని కలకాలము మానుల యాకుపాకలన్
దొఱకెడి భుక్తశేషమును దూcటుచు సాపడి వారిపొత్తుచేc
బొరయుదు స్వర్గమంచుc దలపోసెడికామిని యుండెనచ్చటన్.

ఇట్లు చెప్పుచుండ నేనును సంకులితస్వాంతుcడనై, యట్టి నిరక్షమానంబున సంచరించిన యామె చరిత్ర యెట్టిదో, యామె యానుపాను లెట్టివో యెఱుంగ నభిలషించి, సూత మహర్షి మోముcదిలకించి—

ఆమె పేరేమి? యేcజాతి యందుcబుట్టె?
జగతియందున నేcడామె జాతికలదె?
యున్నచో నిప్పుడెచ్చట నుండెనయ్య
సంగ్రహంబుగc జెప్పుcడో సంయమీంద్ర!

అనిన మాని యవ్వనిమాలి తాcకుcడగుచుc
జెప్పcదొడcగెను నీరీతి నీడ్రపడక
పెద్దవార లామెకుc బేరు పెట్టలేదు
శబరి యనిమాత్ర పిల్చిరి జాతిపేర

మునులకు బట్టల నుదుకుచుc
గనిపెట్టుక యుంచి యొక్క-కడికూటికినై
పను లెబ్బేతికము లేకయె
పొనరించెడి వంగడంబు పోడిమి చెడcగాన్

జాతి భ్రష్టయటంచును
జాతి శబరు లట్టి బానిసను వెలివేయన్
వా తెఱఁ గొఱుకుచు నామెయు
జాతామర్షంబునఁ దన జాతిని బాసెన్

పాసినయంతమీఁద మునిపల్లెలయందు సదా వసింపుచున్
బాసినకూడు నొక్క కడివంతున వారలు పంచిపెట్టఁగా
దోసిటఁబట్టి సాపడుచుఁ ద్రొక్కిసలాడక బ్రహ్మవిద్యనున్
బాసినవంటకంబొసఁగె బాపురె! యంచుఁదలంచు నామెయున్

వరవుడం బెంతచేసినఁ బాపమేమి
వచ్చె? నీయరయిరి గౌరవంబు సుంత
జాలితో నామెపల్కుల నాలకించి
కనుబొమ లెగురనైతు రా మునిజనంబు

పేరుపెట్టియైన శబరిఁ బిల్వలేదు
పసువు చెడిపోవుననెడి గర్వంబుచేత
నిట్టి యవమాన మెవఁడు సహింపనేర్చు?
బళిర! చెంచెత యనిమాత్ర పల్కినారు

సవరలనుపేర నీనాఁడు జయపురమునఁ
గిమిడికొండలఁ దెల్గు నాఁట మనుజాళి
కలరు వారినే ప్రజలెల్ల బిలిచినారు
వానరులని తొల్లి యెఱుఁగవా? కుమార!

నాఁటి శబరులే యీనాఁటి సవరులైరి
నాఁటి కారుకుప్పమ్ములు నాఁటిగవులె
నేఁటికిని మన్కిపట్టులై నెగడుచుండె
నాగరికత యొక్కవిధంబు నాఁడు నేఁడు

పదంపడి పథిశ్రమంబు సరకుఁగొనక,

శబరి యాతిథ్యము గ్రహింప సంభ్రమించి
రామలక్ష్మణు లభిరామ రామఁగూడి
ముచ్చెమట లట్టె దిగజారఁ బోయఁబోయి
యేతదాశ్రమభూమికి నేగి నిల్వ

మునివర్యులు చెప్పిన యడియాలంబుచే సీతారామ లక్ష్మణులఁ బొడఁగాంచి గుర్తించి, పరమానందకందళిత హృదయయై శబరి,

వంగిన పండ్లకొమ్మలను బట్టి విదల్చుచుఁ గొన్ని పండ్లనున్
జెంగునఁగోయుచున్ గొఱికిచెడ్డవొ మంచివొయంచుఁజూచియా
యెంగిలిపండ్లనున్ రఘుకులేశున కిచ్చినఁ దోడుతోడ ను
ప్పొంగుచు వానినిందినియె భూవరుఁ డాఁకలిచేత దూఁటుచున్

ద్రవిడలోకబునందెల్ల దప్పి దారి
యాభిజాత్యంబుఁ గోల్పడ్డ యట్టి శబరి
యెంగిలి భుజించె శ్రీరాముఁ డేవపడక
కార్యపరులకు నెగ్గులు కలవె ? చెప్పుమ!

ఆర్యమునుల యుచ్ఛిష్టంబు నహరహంబు
కుడిచి దేహంబుఁ బోషించు కొనియెఁగాన
నామె యెంగిలిఁ దిన దోష మేమియుండు
యుమ్మి యుమ్మిలోఁ గలసినట్లుండుఁగాక
శబరి భక్తిని గనిపెట్టి సంతసించి
కంటిచూపుతో మోక్షంబుఁ గట్టిపెట్టె
శంబుకుని తపంబును మెచ్చి సాహసించి
కత్తివ్రేటుతో మోక్షంబుఁ గట్టిపెట్టె
తదనంతరంబు సీతాలక్ష్మణ సహితుండై శ్రీరాముండు,

పలువయెండల కెండి వాసలకుఁ దడిసి
తులువ మెకముల బొబ్బరింతలకు జడిసి
యేమిచేయంగఁ దోఁచ కొక్కింత తడసి
బయలుదేరి యాకానలోఁ బాడుదారి

ముదురు వెదురుప్రాలు ముర్వుతో భుజియించి
పుట్టతేనెఁ ద్రావి పొట్టనిండ
ముడ్డియిప్పకల్లు లడ్డిగం బంకించి
ముగ్గు రడవినడచి పోయి పోయి

ఏదుబందులు సివ్వంగు లెలుఁగుబంట్లు
క్రేళ్ళువారు కుందేళ్ళు తోడేళ్లు లేళ్లు
చిఱుతపులులు బెబ్బులులెల్లఁ దిరుగుచుండు
కారడవిఁ గాళ్లు బలపాలు కట్టఁ దిరిగి

నానుడు వాసలచేతన్
నానినఁ జేయెత్తుపెఱిగిన తఱచుపులులో
మానక డాఁగుదుమూఁతలు
లోనమునిఁగి తేలు మెకములు గలుగుచోటన్

ఇంటివట్టునకు ననువైన పట్టులం గనుంగొనఁజాలక విసుగుచేఁ బోయిన పోకగాఁ బోవుచుండ నొక్కనాఁడు-

దాపునఁ బర్ణశాల తమదారిని నొక్కటి కానుపింప నా
నైపున కేగి యందు మునివర్యుఁ డగస్త్యుఁడు భార్యతోడుతన్
గాపురమున్న మాఱెఱిఁగి క్రన్నన చూచుట మేలటంచు న
త్తాపసిసమ్ముఖంబునకుఁ దద్దయు నేగిరి ముగ్గురొక్కటై

ఏగి, కులగోత్రనామంబులు చెప్పుచుఁ దమ్మెఱింగించికొని, సాష్టాంగముగాఁ బ్రణమిల్లిన నపరిమితానందముఁ బొంది యగస్త్యుఁడు వారల దీవించి, భూతభవిష్య ద్వర్తమానంబు లెఱింగిన యాతండు శ్రీరామచంద్రునిచే నిఖిలంబెఱింగి, కొంతవడి వగచి, యెఱుక కలవాఁడు గావున వగవుడిగి శ్రీరామచంద్రునితో-

జటిలవరుఁడు త్రొక్కిటఁబడి యిటులఁ బల్కె-
నిటకు మందటఁ బిప్పలీ జటిలమైన
పంచవటి నాఁగ వెల్గెడి వనమొకండు
వాసయోగ్యంబు మీఁబోఁటి వారికదియు

చెక్కు చెమర్పకుండఁగ వసింతురు పెక్కురు మానులచ్చటన్
నిక్కన చెట్లనీడ నవనీపతిపుత్రికులార! మీరటన్
మిక్కిలి చిత్తశాంతిని గమింతురు మింతురు మేలుగాంతుకే
రిక్కడనుండి పాసిచనుఁడీ! మునిదర్శన లాభవకాననన్

మునితల్లజు ననుమతినిం
గొని రాఘవు లవనితనయఁ గొని గొనకొని వెం
టనె పైనమయిరి పంచవ
టిని జేరఁగ దెన్నెతేఁగి వడిన్ గాలినడన్

పంచవటిఁ జేరి యటనొక్క పర్ణశాల
గట్టికొని రాముఁ డందుండెఁ గాపురంబు
సీతయును లక్ష్మణుండును జెంతనుండ
గడచిపోయిన కార్యముల్ దడవికొనుచు

తనజాతి తనకులం బనువారు గనరాని
ప్రొద్దుపొడుపులేని భూములందు
ఓరుగాలి చెలంగి యుయ్యాల లూఁగించు
పాఱుటాకుల కప్పు పాకలందుఁ
గాపురంబుండ నేకాకియై యొకనాఁడు
మాలిమితో నొక్క మాలకాకి
పర్ణశాలనుదూరి వసుధాతనూజాత
బెదరించి కొట్టిన పీడకున్న

భర్తతో నెన్ని యెక్కులో పల్కిపల్కి
కాకిఁ జంపించి ముంగిటఁ గాకిగడకుఁ
గడకుఁ గట్టించె నది జారిపడకయుండఁ
దమకు నేదృష్టి దోషంబు తగులదనుచు

పులుఁగులందుఁ గాకములను ద్రావిడులు పూ
జింతురనుచుఁ బ్రేమ బెంతురనుచు
నెఱిఁగియుండి చంపె నృపతిచంద్రుండు ద్రా
విడులతోడఁ బోరుఁ బెట్టుకొనఁగ

కాఱుచీకట్లు దిశలెల్లఁ గ్రమ్మువేళ
గొఱ్ఱెమందను గాచెడి గొల్లవోలె
వదినె యన్నయు నిదురించు పర్ణశాలఁ
గాచుచుండఁ దమ్ముఁడు నిద్ర గాంచకుండ

ఇనుపగుద్దలి యొకచేత నెనయుచుండ
నురులు మూపుపై వ్రేల్లాడుచుండ నొక్క
దినము కందమూలంబులు దెచ్చుపనికి
నినకులుండైన సౌమిత్రి యేగుచుండ.

సునిశిత చంద్రహాస మొకచోటఁ గనంబడ దారిలోపలన్
గనుకని మందహాసమునఁ గైకొని చెచ్చెర వాఁడి యెట్టిదో
కనుఁగొనఁగోరి యాత్రపడి కాచిన మేలిమి ధారుణీజ పా
ళిని బడఁగొట్టుచుండఁగఁ జలింపక దక్షిణ బాహుశక్తిచే

ప్రక్కనుగల్గునట్టి ముని పల్లెలనుండిన మానులెల్లరున్
గ్రక్కునవచ్చి యేమిపని! కారుణికోత్తమ! పూచికాయు నీ
చక్కని పండ్లచెట్లఁ బెలుచన్ బడఁగూల్చెదవేల? యిప్డు మా
చిక్కులుదీర నొక్కపనిఁ జేయుము మాయెడఁ బేర్మిజూపుచున్

అదె! వెదురుపొద యెదురుగాఁ
బొద! పొద!! యచ్చోటకీవు పోనపడఁ జదుపన్
పొదవదలెడి నం దేదులు
పొదలును సరకుగొననట్టి పోటుకైనన్

అనిన నటకేగి యతఁడు బాహాప్పలించి
చిప్పకత్తి నాదర సరిచేసి చూచి
పటుతరంబైన దక్షిణ బాహువెత్తి
వ్రేటుతోడనే పడఁగూల్చె వెదురుపొదను

చూరకత్తిపై నెత్తుటి జారలుండె
వెదురుప్రాలు రక్తాక్షత వితతియయ్యెఁ
గాంచినంతనే లక్ష్మణు కన్నుచెదరె
నెంతపాపంబుఁ జేసితి నెట్టులనుచు

నిటునటు పరికించినయం
తట మెడ తెగిపడ్డ మౌని నాథుండొకఁడున్
దటుకునఁ బొడగట్టిన ముం
దట గడగడలాడి లక్ష్మణ కుమారకుఁడున్

ఎలుఁగురాల్పడఁ గన్నీరు కొలఁకులందు
ముత్తియములట్టు కన్పట్ట ముసుఁగు వెట్టి
పర్ణశాలకు సైదోడు పజ్జకేగి.
పాదయుగళంబుపై వ్రాలి పనవి పనవి,

అన్నన్న! ఘోరపాపం
బన్నా! యొనరించినాఁడ నజ్ఞుఁడనై యా
పన్నుఁడ ననుఁగావుము నీ
కన్నను దిక్కెందుఁగలదు? కారుణ్యనిధీ

వెదురుపొదలోనఁ గూర్చుండి విప్రుఁడొకఁడు
దీర్ఘతపముఁ జేయఁగ దలఁ ద్రెళ్లిపడియె
వంశనాశంబుఁ జేయంగ వంశనాశ
మగునొ! శ్రీరామ యీ బ్రహ్మహత్యచేత

నిష్కారణముగ నెఱుఁగక
దుష్కృత్యముఁ జేసినాఁడ దుందుడుకొప్పన్
నిష్కృతి కల్గినయెడలఁ బ
రిష్కృతి యొనరించి యుద్ధరింపుఁడు నన్నున్

అనవుడు రామచంద్రుఁడకటా! యెటువంటిప్రమాదమయ్యె దు
ర్జనులనుగూల్చి ధర్మ పరిరక్షణమున్ బొనరింపనున్న యీ
మన కిటువంటి సంకటముమాయెనురే! రాఁదగునే కుమార? యే
మనియొదనేమిటోఁ చదుకదా! యని యూఁటఁబల్కుచుండగన్

మునివరులు పర్ణశాలకుఁ
జనుదెంచుచు బ్రహ్మహత్య సల్పెఁడహో నీ
యనుజుఁడు తలఁదెగి కూలిన
మనుజుఁడు బ్రాహ్మణుఁడుకాఁడు క్ష్మాతలనాథా!

దొంగబ్రాహ్మణుం డాతండు దొంగ తపసి
రావణానుజయైన శూర్పణఖ సుతుఁడు
కినియువాఁడు జంబుకుమారుఁ డనెడివాఁడు
వానిఁ జంపినమాత్రపాపంబులేదు

నావిని మోదమందె నరనాథుఁడు లక్ష్మణుఁ డంతమీఁద మో
దావహుఁడయ్యెఁ దప్పెఁగదా! మనమేర్పడి బ్రహ్మహత్య నేఁ
డీ విధినంచు, మానిజన మేగెను బిమ్మట నొక్కఁడొక్కఁడున్
భూవరు మోసపుచ్చి పొరిపుచ్చఁగ నేర్చితిమంచు నొక్కనిన్

ప్రథిత లంకాధిపతియైన రావణునకు
మాఱుచెల్లెలు జంబుకుమారుతల్లి
ఖరునితోడఁ బుట్టువు పరామరిక గలది
యనఁటి గొడ్డురా లాభిజాత్యంబుకలది

ప్రాయంబు సుంత హై ప్రాలకుంజిననాఁడె
దొమ్మిలోఁ దనభర్త ద్రుంగిపోవ
సతతశుష్కోపవాసములచేఁ గడు డయ్యె
నేండ్లు పూండులు చాల నెగిరిపోవ

మోటువారిన మోము ముడుత గగ్గులచేత
ముసలితనమ్ముచేఁ బుల్లసిల్ల
తూఁగాడు రొండిచే దుద్దెక్కు పొరడుచేఁ
గడువగ్గు గబ్బుచే నొడలుదనర

చూపరుల కేవ వుట్టించు చుప్పనాక
బిడ్డపైఁ గల్గు కూరిమి వీడలేక
యకట దండకాటవియందు నాకుపాక
లందుఁ గాపురముంజేయు నెందుఁబోక

కామదేవున కెన్నఁడో కాన్కలిచ్చి
సాఁగనంపి వైరాగ్యంబు సంగ్రహించి
పారలౌకిక చింతచే బ్రదికియుండెఁ
జుట్టపక్కాల దరిఁబోక చుప్పనాక

ఒక్కగా నొక్కబిడ్డ మహోగ్రతపము
సలుపుచుండంగ లోలోన జాలిఁబొంది
పూలఁబండ్లను నందిచ్చి పోవుచుండుఁ
గొండిక తపంబు చాలించి యుండునపుడు

రుచిరఫలంబులన్ నెమకి రోసి ప్రియంబున నేరి తెచ్చి మంచి చవి గలట్టి దుంపలను జేకొని మిక్కిలి దేవపూజకై యుచితములైన పూవులను నొక్కదినంబునఁ గూర్చి తెచ్చి సాధు చరితయైన శూర్పణఖ తొట్రిలుచుంజను దెంచి చూచుడున్

కొడుకు గానఁబడఁడు కొడుకున్న వంశంబు
కుప్పగూరగాఁగఁ గూలియుండెఁ
జట్టుప్రక్క పొలము శోధింప మొదలిడె
గుండె కొట్టుకొనఁగఁ గొడుకుకొఱకు

అటునిటు చూచుచున్న సమయంబునఁ దేజనమధ్యమందును
ఛటపటుశోకముంగొలుపఁగాఁగనుపించెను మొండెమొక్కచో
బొటబొట కంటివెంటఁబడి బొట్టులు గారెను నేకధారగా
విటతటమైన డెందమున వెంగలియైచనె నేమిచెప్పుదున్

కొడుకు శవముమీఁదఁ గూలియాక్రోశించి
తలను మోదుకొంచుఁ దల్లియపుడు
గొడుగొడుమంచు గొంతెత్తి పలవించి
యేడ్వలేక చివర కేడుపుడిగి

ప్రక్కఁదనర్చునట్టి మునిపల్లెకుఁ బోయి యిదేమి పాపమో
యుక్కడఁగించిపోయె నెవఁడో యొకదుష్టుఁడు నాకుమారునా
యుక్కివుఁ డెవ్వఁడో తెలుపకుండిరయేని త్వదీయ జీవముల్
దక్కవు చెప్పఁడన్న మునితల్లజు లందఱు నొక్కపెట్టునన్:

ఎఱుఁగము తల్లి! నీసుతుని నెవ్వరుచంపిరొ క్రూరకర్ములై
యెఱుఁగము నీతనూజమృతి యెన్నఁడుకల్గెనొ కాని యెవ్వరో
యిరువురు పర్ణశాల వసియింపుచునుండిరి యొక్కతన్వితో
నెఱుఁగక వారలేమయిన నీయెడ నీపనిఁ జేసియుండిరో

కడుపుచిచ్చార్చుకొనుటకై కందమూల
ముల మెసవి నీరుఁ దెగ ద్రావి పొట్టనిండ
బ్రొద్దులను బుచ్చుచున్న మా బోంట్లకమ్మ!
పరులఁ జంపఁ జేయాడునే పాపమనక!

గొబ్బునఁ బర్ణశాల కడకుంజని వారల బృచ్ఛ సేయ నీ
యబ్బిని దొంగపోటున గతాసునిజేసిన వారలున్న చో
దబ్బఱలాడకుండఁగ యథార్థము నీకెఱిఁగింతురమ్మ యి
ట్లబ్బురపోయినందునఁ బ్రయోజనముండునె? యంచుఁదెల్పఁగన్

వగ్గుతనంబుచే నడుము వంగిన దేహము తూలుచుండఁగా
నగ్గము కాని శోకమున నంగములన్నియుఁ గంపమొందఁగా
నగ్గలెఱుంగనట్టి తన కీయగచాట్లు ఘటిల్లెనంచునున్
గగ్గుచుఁబోయె శూర్పణఖ కాకులుదూరెడి పర్ణశాలకున్.

సీతతోడఁగూడి శ్రీరామచంద్రుండు
సుద్దులాడుచున్న చోటికఱిగి
చుప్పనాక తొంగి చూడఁగాఁ గనిపెట్టి
సీతనవ్వె నొక్క చెనఁటి నవ్వు.

శూర్పణఖయు, సీత వెడనవ్వు చీరికింగొనక శ్రీరాము నుద్దేశించి "మీర లెవ్వరో యెఱుంగ; పరమతపోనిరతుం డును, జీవహింసాపరాఙ్ముఖుండును, నా యేక పుత్రుండును నగు జంబుకుమారుండు త్రుటితమస్తకుండై ధరంగూలియున్న

వాఁడు. మునిపల్లెనున్నవారి నడుగ నా కుమారహంతకుని మీ రెఱింగియుండ నోపుదురని వాకొన నిటకు వచ్చితి. కన్న కడుపుగాన నూడుదీర్ప వేగిరపడుచుంటి. మీరెఱింగినఁ దెల్పి ధన్యులుకండు. ప్రతాప లంకేశ్వరుని సోదరిని జెనకి బ్రతికి పోవుట సుకరముకాదు. ఎఱుంగఁ జెప్పుచుంటి" ననవుడు శ్రీరాముండు "మే మెఱుంగుదుము. అతండు మునిజనాపకారి యగుటచే మాచే నిహతుండయ్యె" నని చెప్ప, మిన్ను విఱిగి కూలినట్లు నివ్వెఱఁగంది శూర్పణఖ దుస్సహాశోకాతిరేకంబునఁ గ్రోధవివశయై, "మునిజనాపకారి యని యపవాదంబుఁ గల్పించి నిరపరాధుని జంపి సిగ్గిలకుంటిరేల ? మీరు హంతవ్యులు. ద్రావిడరాజపుత్రికలు పరాభవంబు నీగంజాలుదురని యెఱుంగరు కాఁబోలు" నంచు మొలనున్న చురియం బెఱికి మీఁదికిఁబోవ, సీత కెవ్వున కేకవేయ శ్రీరాముం దులికిపడి, శూర్పణఖకరంబు కరంబున నిఱికించి గట్టిగాఁ బట్టుకొని యడంచియుంచిన, సౌమిత్రి చనుదెంచి పెడకేలు విఱిచికట్టి, రామాజ్ఞచే, నిస్సహాయయైన యబలను, శతవృద్ధను ముక్కుచెవులుంగోసి, విరూపంజేసి, క్షత్రధర్మమును నిర్వహించి విడిచిపుచ్చెను. అంత శూర్పణఖ కనలురాజ, రోజుచుఁ బొగులుచు నడవులంబడి సోదరుండగు ఖరుని జేరి తన పరాభవంబు విన్పింప, నతండు మండిపడి, రామునిపైకి దండెత్తి వచ్చి, ఘోరయుద్ధంబున మృతుండయ్యె.

ఖరుని చావుఁజూచి కాలుసేయాడక
యడవి నిలువలేక యడలలేక
చీరచెఱఁగుకాళ్ల జీరాడుచుండఁగా
నింతి యపుడు లంక కేగి పిదప

రావణభూమినేతకుఁ బరాభవమెల్లను మూలమట్టుగా
గావురమంచుఁ జెప్పి ప్రతికారముఁ జేయుచు బన్నమీగఁగాఁ
బావనమైన ధర్మమని పల్కెనయంతట రావణుండు కో
పావిలమానసుండయియహంకృతిహుంకృతిఁ జేసి యార్చుచున్

అంతరంగిక సచివుండయిన మారీచునిఁ బిలిపించి, మంతనంబాడి, రాజపుత్రికయు నందు నా సోదరియు నగు శూర్పణఖయెడ రామలక్ష్మణు లొనరించిన యవమానము నన్నాపాదమస్తకంబు దహించుచున్నది. మఱియు నిఖిల ద్రావిడలోకమనస్సంతాపంబుఁ జేయు వాయసవధ నన్ను నిలువనీకుంచేయుచున్నది. ప్రతీకారంబు తప్పనిపని, కావున స్త్రీయెడ వీరపురుషానుచితమైన కార్యంబు సల్పినవాఁడు గావున, శ్రీరామచంద్రునకు స్త్రీ మూలకంబయిన పరాభవంబుఁ జేయుట సముచిత ధర్మమని నిశ్చయించి, కార్య క్రమంబు మారీచున కుపదేశించి పంపెను. అటుపిమ్మట మారీచుండు దక్షిణాపథంబునకుఁ జని మాయాకురంగరూపం బున, రామలక్ష్మణుల దవ్వుల కెలయించి కొంపోవ నా యదనున రావణుండు పర్ణశాలనున్న సీతను మునివేషంబున, ముచ్చిలి కొంపోవుచు దారికడ్డంబయిన జటాయువుం దునిమి,

యుత్తుంగా భంగభంగయగు దక్షిణోదధి దాఁటి. స్వకీయా భ్యంతరమందిరంబునకుఁ గొంపోయి డించి, తన మనంబున నిట్లు తలపోసెను:

పఱియున్న పరకాంత బదరించికొని తెచ్చి
తనయింటిలో నుంచికొనుట తప్పు
భావింప లోకాపవాదంబు తప్ప దీ
కఱటిలోకంబు వాకట్టరాదు
కాన సీతాదేవిఁ గంకేళి తోఁటలో
వీటికిఁ బరగడఁ బెట్టియుంచి
రాజపుత్రికగాన రామకుం దగినట్లు
రాణివాసంబు కొఱవడకుండఁ

గాలయాపనఁ జేయంగఁ గాపువెట్టి
యుంతు మా త్రిజటను సీత యొద్దనునుచుఁ
బండితుండైన రావణ ప్రభువకుండు
నిబ్బరించి యాత్రపడక నిర్ణయించి

సీత నశోకవనికామధ్యంబున నుంచి, తమ్ముని కుమార్తె యగు త్రిజటను గావలియుంచి యవిచారిత మనస్కుండై, వీతమనశ్శల్యుండై లంకలోఁ గాలక్షేపంబుఁ జేయుచుండె.

త్రిజగములెల్లఁ గెల్చి గడిదేరిన లోకైకశేఖరుండు భూ ప్రజలకుగూర్చు భూవరుఁడు రావణుడెంతయమాయకుండో యా త్రిజటను నమ్మి మోసపడి దెబ్బునఁ గావలియుంచి సీతకున్ గజిబిజిగాఁగఁ జేసికొనెఁగా! తేనలంకను తెప్పపాటులో

ఇచ్చట రామచంద్ర ధరణీశుఁడు భార్యను గోలుపోయి యే
మచ్చునసేని శోకమును మానఁగ లేక విషణ్ణచిత్తుఁడై
యెచ్చటఁ గాననౌనాయని యేగెను రోయుచు గాననంబులన్
బొచ్చెములేని సోదరుఁడు మూల్గుచు భక్తిని గొల్చి వెంటరా.

ఇట్లు పోయినపోకఁగా బోయి యరణ్యంబులన్నియు గాలించి, వైదేహిని గానక పొగులుచున్న రామలక్ష్మణులకు, రావణునిచేఁ గూల్పంబడి కొనప్రాణములతో నున్న పితృసఖుండగు జటాయువు సీతాసమాచారంబు విన్పింపఁదిన్నఁగా నతిగి వారిర్వురు ఋష్యమూకపర్వతంబుఁ జేరి, దట్టమగు నొక్క పిప్పలిచెట్టు నీడఁబడియున్న రచ్చబండపైఁ గూర్చుండిరి. మంత్రిపరివృతుఁడై యందు సంచారంబుఁ జేయుచున్న సుగ్రీవుండు దూరముననుండి వీరింజూచి భయకంపితగాత్రుఁడై,

కంటివె! యాంజనేయ! రణకర్కశు లిర్వురు చాపధారులై
యొంటరిగాఁగఁ జెట్టుకడ నుండిరి! రేఁపనిఁగోరి వచ్చిరో
తుంటరు లెవ్వ రేని యిటు తోడ్కొనివచ్చిరొ కీడుసేయఁగా
వెంటనె పోయి వారల ప్రవృత్తిని నీవుగ్రహించి రాఁగదే

బాల్యమునందు నీవు మునిపల్లెలయందు వసించి చాలఁ గౌ
శల్యముతోడ్తొ జదువు సాములు నేరిచి యార్యభాషసా
కల్యముగా నెఱింగితివిగావున నిప్పుడు వారితోడఁ జా
పల్యములేని మాటలను బల్కి నిజంబును సంగ్రహింపుమా

ఆర్యులపొ త్తియున్నయది యా విలుకాండ్రమొగంబునందువా
రార్యులై యాదు రీతిఁ గమ యచ్చటికిం జని యెట్టులేని నా
కార్యముదీర్పఁగా దగిన గట్టుపకాసువు సందియంబులే
దార్యమనంబు నీ వెఱిఁగినట్లొరు లెవ్వ రెఱుంగలేరసన్

ఔనిముదల నొదలఁదాల్తు నేనటంచు
వారి యాచారము లెఱుంగు వాఁడనంచు
గాలిగాఁబుట్టి పెఱిగిన గాలికొడుకు
గాలినడనేగె రామలక్ష్మణులకడకు

తిన్నగా రామలక్ష్మణుల జేరి యందందునిలిచి వందనం బాచరించుచుఁ, దా వచ్చినపని వినయోక్తుల విన్నవించి, వారివలన సర్వంబెఱిఁగి, సుగ్రీవునితో సఖ్యంబు సమకూర్ప విశ్చయించి, ఋశ్యమూకంబునకుఁ దోడ్కొనిపోయి, కొమ్మల రాపిడిచే నగ్నిని బుట్టించి, యగ్నిసాక్షిగా రామలక్ష్మణ సుగ్రీవులకు సఖ్యంబుఁ గావించినపిమ్మట నొండొరుల భార్యల నొకొల్లొకల్లిప్పించుకొనుటకు బాసఁజేసికొనిరని సూతుం డాన తీయ, దేశికేంద్రా! మీరు చెప్పిన వాక్యార్థంబు బోధపడ దయ్యె; విశదీకరించి చెప్పవే యనవుడు సూతమహర్షి యిట్లు చెప్పఁదొడంగెను:

వాలిన శక్తిచే వాలిని బడఁగూల్చి
రుమను వానరరాజ్య రమనుదెచ్చి
భద్రంబుగా రామభద్రుండు సుగ్రీవు
నకునిచ్చి మాటఁదీర్చుకొనుటకును
సుగ్రీవుఁ డామీఁద సుదతి సీతాదేవి
యేనాఁట నుండెనో యెఱిఁగివచ్చి
బవరంబు గావింప వచ్చినఁ గావించి
తెచ్చి శ్రీరామున కిచ్చుటకును

బాసఁ జేసికొనిన పిదప రవిసుతుఁడు
సింహనాదంబుఁ జేసి కిష్కింధ కేగి
దురముఁ జేయుంగ వాలిని దోడితేరఁ
గాంచి శ్రీరామచంద్రుండు కంపమొత్త

ఎదురై వాలిని డీకొని
కదనంబున నొడిసిపుచ్చఁ గష్టంబనుచున్
బొదమాటున బొంచి మహా
ప్రదరంబున వానిఁ జంపి వైచినపిదపన్

రామచంద్రుండు స్వార్థపరత్వబుద్ధి
నతుల వానరరాజ్య పట్టాభిషిక్తుఁ
జేసె సుగ్రీవుఁ బ్రథిత కిష్కింధనంత
సోదరుని భార్య సుగ్రీవుఁ డుంచుకొనియెం

తమ్మునిదారఁగైకొనె మదమ్మున వాలియటంచు బాణపా
తమ్మున వానినిం దునిమి ధర్మము నిల్పెనటంద్రు మోహగీ
తమ్మున జ్యేష్ఠసోదరునిఁ దారను దారను గొన్నఁ బశుపా
తమున సూర్యపుత్రకునిఁ దప్పన నేరకపోయె రాముఁడున్

కృతజ్ఞుండయిన సుగ్రీవుని పంపున దశదిశలందునున్న గిరిదుర్గ మారణ్య సీమలనుండి వానరులు కిష్కింధలో గుమిగూడి సీతాదేవి యున్నచోటులు గాలింపఁ బ్రయాణోన్ముఖులగుచుండ హనుమజ్జాంబవన్న నీలమైందద్వివిదాదులు యువరాజగు నంగదుని సేనాపతిత్వముక్రింద దక్షిణదిశాభాగంబునకు బయలుదేరిరి. శ్రీరామచంద్రుం డప్పుడు హనుమంతునిం బిలిచి, కౌఁగలించుకొని, తోరంబుగా బాష్పపూరంబు లొలుకుచుండ డగ్గుత్తికతో—

ఎండకన్నెఱుఁగని యిల్లాలు వైదేహి
కడగండ్లు పడెఁదొల్లి కానలందుఁ
బరునింట నేరీతి బ్రదికియుండెనొకదా
యాసలన్నియు నడుగంటిపోవఁ
జిరకాల మెడబాటు చిచ్చులో మఱుఁగుచో
నిలువునఁ బ్రాణముల్ నెగిరిపోవు
నీవు నాకే కాక నిజముగా మాజాతి
కెల్ల దాసుఁడవౌట యెఱుఁగువాఁడ

ఇదిగో! ముద్దుటుంగ్రంబు నీ కిచ్చుచుంటి
నాదు క్షేమంబు నెఱిఁగించి నళిననేత్ర
కానవాలేమయిన నామె నడిగి తెమ్ము
మఱచిపోవ సాయ్యమ్ము నా మాటనమ్ము

అంచు వచియించి, దుఃఖంబు నాపుకొనుచుఁ,
బోయిరాఁగదే యని చెప్ప భూవరుండు
కుప్పిగంతులు వైచుచుఁ గొంటెహనుమ
చెంగలించెను వానర సేనఁగూడి

ఇట్లు హనుమంతుం డెలగోలుపౌజుదారుఁడై నడిపింప, వానరులు చెలరేఁగి, సీతాన్వేషణార్థంబు దక్షిణదిశకు బయనించుచుండ నచ్చట లంకలో—

సవతాలిబిడ్డలు సైదోడులగుటచే
మనసులో విరిపోట్లు మానవయ్యె
సరమావిశాలాక్షి పరజాతి గరితౌట
ద్రవిడజాత్యభిమాన మవిసిపోయెఁ
దల్లిపోలికవచ్చెఁ దనయయౌ త్రిజటకుఁ
బెదతండ్రి యింటికిఁ బెట్టెఁ జిచ్చు
రాజ్యతృష్ణమనంబు రగిలి దహింప వి
భీషణుం డేదేని వినఁగనుండె

లంకలో గృహచ్ఛిద్రముల్ బలసె 'ఇంటి
గుట్టు లంకకుఁ జేటె' య్యెఁ దుట్టతుదకు
బహుళ విజయసంజాత గర్వంబుచేత
మడిసెఁబో రావణుండు ప్రమత్తుఁడగుచు

లంకానగరం బిట్టి దురవస్థకు లోనగుచుండ నశోకవనికా మధ్యంబునఁ బెదతండ్రి యాజ్ఞఁ బాటించుచున్నట్లు నటించుచు–

సీతకుఁ జెంగటన్ నిలిచి చిన్నరి పొన్నరి నవ్వు నవ్వుచున్
జేతులు మోడ్చుచుం ద్రిజట చేయుచునుండె నపర్యలెన్నియో
యేతరినేని నామెకడనే కనిపెట్టుకయుండి జాణయై
సీతకు నమ్మకం గలుగఁ జేసికొనెం దనయందు గట్టిగా.

బెదరింపక బదులాడక
మెదలుచు మదికెక్కునట్లు మిక్కిలి భక్తిన్
మదకోకనాఁ డిట్టు త్రిజట
పదపదె చెప్పంగఁదొడఁగె వసుధాసుతతోన్:

పదినాళ్లు కాలేదె పాకారిఁ దనతేరి
సుతఁగట్టి తెప్పించె సుతునితోడ
నలునాళ్లు కాలేదె నందనోద్యానంబుఁ
జొరఁబాఱి చీకాకు పఱచివచ్చె

మూనాళ్లు కాలేదె ముక్కంటి పడకింటి
        నొక్కఁడే యుబ్బాత లూఁచివచ్చె
రెన్నాళ్లు కాలేదె యన్నపై దండెత్తి
        పుష్పకంబును జూఱఁ బుచ్చివచ్చె

    తల తిరుగుచున్నదమ్మ సీతమ్మతల్లి
    పెద్దతండ్రి చేసెడిపనుల్ విన్నయెడల
    నేమి కలదమ్మ లంకలో నిప్పుడొక్క
    దినము తలలెత్తుకొని మేము తిరుగలేము

మాజనకుఁడు బొత్తిగ నమాయకుఁడౌ నొరు లేవిచెప్పినన్
వ్యాజములేక నమ్మి యటుపై నగచాట్లను బొందుచుండునే
యోజన లెన్నిచెప్పినఁ బ్రయోజన ముండకపోయె, దీనతా
భాజనులన్ బొనర్చెమము 'వాతలుపెట్టిన వాజమానునే'

మాపెదతల్లి సద్గుణ సమన్విత యుత్తమసాధ్వి విస్ఫుర
ద్రూపవతీలలామ యవరోధ విభూషణ కన్నతల్లిగా
మాపయిఁ బ్రేమముంగురియు మక్కువ లోపము సుంతగానరా
దాపెయెడన్ నయంబు వినయంబునుజూపెద రెల్లవారలున్

    ఆమెప్రేమ మాకు నాటంకమయ్యెను
    నామెమంచి మాకు నడ్డమయ్యె
    నేమిచేయఁజాల కిట్లూరకుంటిమి
    రాజ్యతృష్ణ మమ్ము రాయిడింప

ఈమాట లమృతోపమానంబుగాఁదోవ సీత విస్ఫారిత మోముతోఁ ద్రిజటను బరికించి చూచి సంతృప్తిఁజెంది,

సరసగుణాఢ్య! మీ జనని సాధుచరిత్రను జేసి మాసి యొక్కరుతుక నీ యశోక వనికాస్థలికిం గొనితేర నామెతో బరిచయముం ఘటించుకొని వాకొనిధర్మము లెన్నియో యొడం బఱచెదఁ దోడ్పడన్ మనకుఁ బైఁగనుగొందము భావిసంగతుల్

సీతమాటల నాలించి చిత్తమునుచుఁ
ద్రిజట తనతల్లిఁ దోడ్కొని తెత్తునిప్పు
డనుచు నడుగులు లెక్కించుకొనుచుఁ జనియె
బట్టణాభిముఖంబుగా బదరి బదరి

మాపటివేళ పెన్నిరుల మాటునఁ గూఁతురు దార్కొతీయ నెట్లో పురిలోడుచున్ సరమయొంటి నశోకము క్రిందనున్న సీతాపతివత్ని చెంగటకుఁ దర్లి సుఖంబుగఁ గూరుచుండి యేమో పడిపోయినటుగను ముచ్చటలాడెను బ్రొద్దుపోవఁగన్

కరముశిరముఁజేర్చి కరము పెరిమనంత
సరమపురమువంకఁ దటిమి యఱుమఁ
గుంటినడకతోడఁ గొంతదూరంబేగి
త్రిజట సీతకడకుఁ దిరిగివచ్చె

కిష్కింధాపురమునుండి బయలువెడలిన కపిసైన్య సమాచారంబు నాలింపుము.

హనుమంతుఁడు నడిపింపఁగ
వనచర యూథంబుఁగూడి వాలిసుతుండున్
జని దక్షిణాబ్ధి చెంతకు
వనరెతేఁగి వననిధిదాఁట వలయునటంచున్

చాలకాలంబు మనసులోఁ జర్చఁజేసి
యూథపులకెల్లఁ జెప్పఁ దా వోపమనిరి
జాంబవంతుండు ప్రేరేప సాహసించి
నడుముఁ గట్టెను సామీరి కడలిఁదాఁట

గండిచిన్నదైనఁ గప్పగంతులు వైచి
గొప్పదైన సీతఁ గొట్టికొట్టి
కులికికులికి కపులు కొనియాడుచుండఁగా
లంకఁజేరెఁ బ్రొద్దు గ్రుంకువేళ

నదురుబెదురుమాని పదనుకత్తినిబూని
కన్నుమూఁతమాని కాయుచుండె
లంకగవనుముందు లంకిణిఁ బొడఁగాంచి
దొంగపోటుపొడిచి ద్రుంచివైచె

సంజదాఁటిపోవ సందుగొందులుదూర
నానవాలుపట్టనైతికాద
టంచుఁ దలఁచి పొదలయందు దాఁగుచిరుల్లు
బయలుప్రాకునపుడు బయలుదేరి

ఈడును జోడు లేనిసిరు లెల్లెడఁ గన్పడ నేత్రపర్వమై
మేడల రామణీయకత మిద్దెల సుందరతాప్రశస్తిక
న్గోడును బుట్టఁజేయఁగ దిగుల్పడి గాడుపుబిడ్డ యందుఁ గ్రీ
నీడల వంగివంగి యవనీసుత రోయఁగఁబూనె లంకలో

నేర్పుతో లంకగాలించి నెమకి నెమకి
సీతఁ బొడగానలేమి నిస్సీ! యటంచు
దూరముననున్న కంగేని తోఁటకేగి
వెదకివచ్చుట మేలంచు మదిఁదలంచి

దట్టమగు తీవపందిలి నట్టనడుమ
చివురుటాకుల కంగేలి చెట్టుమొదటఁ
జెక్కిటను జేయిఁజేర్చుక చింతపడెడి
చెలియఁ బొడఁగాంచి గంతులు చెలఁగివైచి

అచ్చటికేగి మిక్కిలి రహస్యముగాఁ దనుఁదెల్పికొంచుఁ దా
వచ్చిన కార్యముం దెలిపి భద్రముగా ముడినున్న యుంగరం
బిచ్చి శిరోవతంసము గ్రహించి యనుజ్ఞనుబొంది వెంటనే
తచ్చన లాడియాడి వసుధాసుతతో నిటులాడె నెమ్మదిన్

ఎవ్వరు గానరిందు నినునేఁ గొనిపోవఁగ నేర్తుఁ దల్లిరో!
జివ్వున నబ్ధిదాఁటి రఘుశేఖరుముంగలఁ బెట్టఁగల్గుదున్
నెవ్వగలెల్ల మాని యవనీపతి రంజిలనంచుఁ జెప్పఁగా
నవ్వుచు సీతపల్కెఁ దన నాథుని మర్మము విప్పిచెప్పుచున్

నిజముగ నన్ను రావణుఁడు నిబ్బరికింపక మోహనిష్టుఁడై
యజమున జుల్మచేసి గదియం దమకింపఁగ చెప్పపాటుకూ
డ జమక కొంటిపాటున నిటన్ నిలువంగను నోపువానవే
రజనిచరాంగనల్ సలుపు అద్దిని రవ్వను జూచుచుండియున్

బంగరు లేడి నాపతిని వంచనసేయఁగ దూరమేగిసన్
దొంగిలి రావణుండు ననుఁ దోడ్కొనివచ్చిన మాటకల్ల యే
భంగపడంగ లేదు పొఱపాటున మే మఖిలం బెఱింగియే
దొంగిల వీలుచూపితిమి తోడ్కొనిపోవఁగ గార్యసిద్ధికై

కావున ఘోరయుద్ధమున గండడగించుట యొండె మాయచే
ద్రావిడపాళినింగలఁచి దాస్యమునందునఁ జొన్పి వెంటనే
పావనమైన యార్య పరిపాలనముఁ నెలకొల్పుటొండె, వే
జేవియు మాకునచ్చువు నరే ! చెవికెక్కవు మారుతాత్మజా

కాన సీతోడ వచ్చుట జేనికడకుఁ
బోలదిప్పుడు పనిఁ జెడి పోవు దాన
నీవు నమ్మినబంటువౌ తెలుఁగుదాన
నంచు సొగసుగ సీతమాట్లాడినంత

సీతాదేవికి జోతలు
చేతులు జోడించిపెట్టి చిత్తంబనుచున్
నాతల్లీ! పోయెదనని
వాతూల కుమారకుండు పయనంబగుచున్

## తృతీయాశ్వాసము

కొంతవడిఁబోయి రావణ కులతలనాథుఁ
గాంచిపోవుట యుత్తమ కార్యమనుచు
బాహుసంపదఁ జూపింప భావ్యమనుచు
క్షణములో మేను వెంచి యుత్సాహగరిమ

గురుతరవృక్షముల్ విఱిగి కూలఁగఁదన్నుచుఁ బెద్దకొమ్మలన్
విఱుచుచు, వేగ నేలఁ బడవేయుచుః గూఁకటిఁ వ్రేళ్లతో సరా
సరిఁ దలక్రిందుచేయుచుఁ గుజంబులఁగొన్నిటిఁ బెచ్చరేఁగఁగా
పరులరుదేర వారలను బాది గతాసులఁ జేసినైచుదుర్గ

అక్షయుఁడువచ్చి క్రొవ్వాఁడి యంపగమిని
నాంజనేయుఁపై బరగించి యతులశక్తిఁ
బిరుతిపియ కట్టి పోరాడి వీఁగి తుదకు
వీరశయనంబు బొందెను విధివశమున

ఇంద్రజిత్తు జిత్తులమారి యేగుదెంచి
సునిశితాస్త్రంబులనువైవ సొమ్మసిల్లఁ
బట్టి హనుమంతుఁ గొనిపోయి భక్తితోడ
నప్పగించెను దంష్ట్రి. యౌరా! యనంగ

హనుమంతుఁ,డును రావణుఁ జూచి చూచుటతోడనే
మనంబులో నిట్లు తలపోయఁజొచ్చెను:

వీఁడటే రోరాయు వీఁడటే చౌరంబాతీ
కై కొన్నవాఁడటే గాలికలము
వీఁడటే ముక్కంటి వీడటే పైకెత్తి
త్రొంపాడినాఁడటే కొండవీడు
వీఁడటే నాఁడటే వెట్టివారలఁ జేసి
పీడించినాఁడటే వేల్పుమూఁక
వీఁడటే కొడుకుచేఁ బెడతెక్కలనుగట్టి
తెప్పించినాఁడటే దివిజనాథు

వీఁడటే తనవీడీడు జోడుజాడ
లేనిదానిఁగా జేసిన మానఘనుఁడు
చేతులనునెత్తి జోహారు సేయుతలఁపు
పుట్టుచుండె నిప్పుడు త్రాటఁ గట్టఁబడిన

అవుర! యింత తేజశ్శాలి యగుటచేత
నే, త్రిలోకంబు లరికట్టి నిల్ప నేర్చెఁ
దెగువఁజూపించి, యెల్లెడఁ దిరుగ నేర్చె
వీనిజన్మంబు ధన్యంబు పృథ్విలోన

హనుమంతు డిట్లు విచారించుచుండఁ బ్రతాపలంకేశ్వ
రుండయిన రావణుండు

పట్టువడినట్టి పగవానిఁ బాఱఁజూచి
కొలువులోన శిక్షించుట కూడుననుచు
మంత్రివర్గంబుఁ బిలిపించి మంత్రవేత్త
తత్క్షణమ కొల్వుసేయ సిద్ధపడుచునుండ

విభీషణుండు పుత్త్రికాముఖంబున నీ యుదంతంబంతయు నెఱింగి, యేపన్నుగడనైన నాంజనేయుని శిక్షఁ దప్పించుట స్వార్థంబునకు మిగుల ననుకూలించునని యెంచి, యత్యుత్సాహంబుతో నొడ్డోలగంబునకు నేగి యందు మరణదండన యొక్కటియే సముచితంబగు శిక్షయని జరుగుచున్న చర్చ నాలించి, వారించి, యగ్రజునుద్దేశించి,

దూతయవధ్యుఁ డాతనిని దుంచుట ధర్మము కాదు సోదరా!
నీతిదొఱంగి యీవిధము నీయటువంటి మహానుభావ్రుఁడే
దూతను జంపుచో జగము దూరదె ధర్మవినాశమంచుఁ నీ
వీతనిఁ జంపమాని యెదియేనొకశిక్ష విధించి పంపుమా

దూతను బరిమార్చినచో
ఖ్యాతిఁబరస్పరము రాయబారము లెట్లుఁ
భూతల పతులకు నడచును
దూతల వధియింపఁదగదు దొరలకు నెందుఁ

దూతి దుండగీడైనచోఁ దోఁటుపడక
యంగవైకల్య మొసరింప నగునుగాన
వీనిమొలచుట్టుఁ గడు బ్రాఁత పేలికలను
గూర్చి కొఁఅవిసిప్పుఁగొని దాఁకొల్పుమన్న

లెన్నయని రావణుం డట్టులే యొనర్పఁ
డంచుఁ గొలువుకూటమువీడి యరిగెఁ దోఁక
చుట్టి కట్టెఅనిప్పుఁబాదిపెట్టి, సాఁగ
నంప నాంజనేయుఁడు దెసలద్రువనార్చి

గుప్పుగుప్పున మంటలు గప్పుచున్న
తోఁకచిచ్చు లంకాపురీ దుర్గమునకుఁ
దోఁకచుక్కయ్యె నిల్లిల్లు దూరి నిప్పు
వెట్టి, లంకెల్ల బూఁడిద గుట్టయయ్యె

వననిధిదాఁటి వాయుజుఁడు వాలిసుతాదులఁగూడి రామభద్రునికడకేగి, సీత దయతోడనొసంగిన మస్తభూషణంబునొసఁగి సర్వముందెలుప బోరననేశిచి కొంతసేపు, వెంటనెముదలిచ్చి సైన్యము హుటాహుటిఁ దిన్నఁగఁబోవలంకకున్

దూతయెవండో! యేప్రభువు దూతగ నీహనుమానుసంపెనో!
సీతను జూచిరమ్మనుచుఁ జెప్పెనుగాని రఘూద్వహుండొగిన్
దూతఁగఁబోయి రావణునితోఁ దగురీతిని రాయబారమున్
బ్రాతిగ నడ్పిరమ్మనుచుఁ బంపెనె? రాఘవుఁ డెంతమోసమో!

దూతయగువాఁడు లంకిణిఁ ద్రుంపనేల?
రాత్రి పురిమాఱుటేల? ధరాజతోడ
మాటలేల? వనమునెల్ల మాపుటేల?
యక్షయాదివీరులఁ దెగటార్చుటేల?

కలదొక్క ధర్మసూక్ష్మము
వలఁతులు తొల్లింటి పెద్దవారలు మతిమ
తులు తెలిసి కప్పిపుచ్చిరి
తెలిపెద నిపు డద్ది నీకుఁ దెల్లముగాఁగన్

దూతదూతయంచుఁ దొందఱగాఁ జెప్పి
దూతఁ జంపుటెడల దోసమంచు
బంకుబొంకుబొంక వంక తెలియలేక
భ్రమసి మోసపడియె రావణుండు

అట కిష్కింధాపురిలోఁ
బటుతర సుగ్రీవునాజ్ఞఁ బాటించుచు మ
ర్కటసైన్యము లతిరభసో
త్కటముగ లంకానగరికిఁ గదలఁగసాఁగెన్

వానరవాహినీపతు లపారబలంబులతోడ వచ్చుచుం
బ్రాణములొడ్డి సీతఁ గొనివత్తుమటంచును గచ్చులాడుచుం
గానలనుండి కైకొనిన కమ్మనిపండుల నారగించుచున్
బైనముకాఁగ రాఘవులు వానరనాథునితోడ వెంటనే

కోలాహలముం జేయుచు
గోలాంగూలములునడువఁ గోయని ధరణీ
పాలసుతులు సుగ్రీవుని
కేలూనుచు నడచిరంత కేరింతలతో

వారము లెన్నియొ కడవ వానరులంగొని దక్షిణాంబుధిం
జేరి మహాసముద్రమిది సేన లపారము, లెట్టు దీని నే
ర్పారఁ దరింపఁగల్గుదుమొ యంచు విభాకరపుత్త్రుఁగూడి సా
మీరినిబిల్చి మంతనము మిక్కిలి చేయుచునుండ నచ్చటన్.

రాగన్రఁ డబ్ధికావలను రాణువతో దిగియున్న వార్తనున్
వేగులవారిచేఁ దెలిసి వేగమ రావణుఁ డాప్తమంత్రులన్
వేగను దండనాయకులఁ బిల్చి సమస్తముఁ దెల్పి కర్జమున్
బాగుగ నిర్ధరింపుఁడని పల్కె నిజస్థితి నిందుకొల్వులో

ఎటులో విభీషణుండటఁ జేగి యీ సభ సంగతి యప్పుడప్పుడే
కటఁదొసిపూసికట్టి యొకికఁబుగఁ గొల్వును జేరి యందు నొ
క్కట నుపవిష్టుఁడై సరిగఁ గన్గొనుచుండి సభావిశేషముల్
చిటుకున బూటకీడగుచుఁ జిత్తములోఁ దలపోసె నీగతిన్

ఇదె సమయంబువచ్చె నెది యెట్లయినన్ బదులాడి యన్నతోఁ
బదెబదె తిట్టులం దిని సభాస్థలి లోకులు బ్రువ్వఁదిట్ట త
ప్పిదమును నన్న నెత్తిపయిఁ బెట్టి పురిందిగఁబెట్టి రామభూ
మిదయితు పాదపద్మముల మీఁదనువ్రాలి నమస్కరించెదన్

ఈ యుపాయంబుచే నిప్పు డేయపాయ
మెనయకుండఁ బడసెద నభీష్టసిద్ధి
యంచు నొడ్డోలమంత వీక్షించి యిట్లు
పాపభీతిం బొరయకుండ పక్కణించె:

సీతను బట్టి తెచ్చి వనసీమను బెట్టిన నాఁటఁగోలె నేఁ
జూతుఁ బురంబునందుఁ బలు వోటుల దుశ్శకునంబులెన్నియో
భీతి మునింగియుండె ప్రజ బెళ్కురె నేమియుఁ దోఁచకున్న మీ
రీతరి సంధిసేయ నశియింపక నిల్చును లంక యగ్రజా !

రాముఁడు గుణాభిరాముఁడు
తామసిగాఁడు శరణంబు తప్పకయిచ్చున్
గామిడి మూఁకల మాటల
కేమీ ! చెప్పెదురు వార లేమయినసరే

శూర్పణఖ తెచ్చిపెట్టె నీ సూడు, సోడు
ముట్ట లంకనెల్ల నిపుడు చుట్టఁబెట్టి
కాల్చివేయంగ నుండె, నే కరణినేని
మీకు దప్పింపవలయు సుమ్మోయఁటన్న

పండ్లు పటపటగొఱుకుచుఁ గండ్లుఱుముచు
నట్టహాసంబుఁ గావించి కట్టలుకను
సోదరుం డిట్టు మాటాడఁజొచ్చె నకట
యంచుఁ జిఱ్ఱుబుఱ్ఱాడి లంకాధివిభుఁడు

అభిజనుఁ డెవ్వఁడేని యిటులాడునె దుస్స్వహాజాతివైరినే
యభయముఁ గోరుమంచు నకటా సభలోపల? వీఁడుతమ్ముఁడా
యుభయకులంబులున్ జెఱుప నుద్భవమందినవాఁడుగాక పా
పభయముఁదక్కి నే కెడలఁబంపెదఁ ద్రెంపెద స్నేహవల్లికన్

తమ్ముఁడటంచు వీఁడు పెడదారులఁ గ్రుమ్మరుచున్నఁ జూచియున్
గిమ్మన కూరకుంటి నదె కీడయి యింతకుఁదెచ్చెనౌర నా
సమ్ముఖమందె నిట్టుల ననహ్యపుమాటలఁ బల్కుచుండె నే
నెమ్మెయి వీనిఁబట్టి క్షమియింపఁగనేర్తును మాటిమాటికిన్ !

జాతిపౌరుషంబు జాత్యభిమానంబు
జాతిగౌరవంబు జాతిపరువు
వీనియందు లేవు వీఁడెట్లు పుట్టెనో!
కుక్కమూతిపిందె కులముచెడఁగ

ఇంతలోన విభీషణుఁ డేమియన్న!
తగవులాడకు మీయెడఁ దప్పుమీది
సీతనర్పించి శరణంబుఁ జెందు, రాముఁ
డతిదయాళువుగాన ని న్నాదరించు

శూర్పణఖ బన్న మెల్లఁ బోకార్ప నెంచి
యఖిలకులమును నీవు పోకార్పవలదు
శరణమనకున్న నాత్మనాశంబుగల్గు
శంకవలదన్న, రావణుఁ డంకపడుచు

"బ్రతికినన్నినాళ్లు రావణాత్మాపతి
పౌరుషంబుతోడ బ్రదికెననఁగ
సర్వనాశమైన జాతిప్రతిష్ఠను
గాచువాఁడ రిపుల నేచువాఁడ

పరదారాగర్భ నిర్భేదనచణ ధనుర్జ్యావల్లీకిణాంకితము లైన యీ హస్తములు, నిరంతర నవకోటి శివాలయార్చా పవిత్రీకృతములయిన యీ హస్తములు, ధర్మపీడాపరాయణ కంఠలుంఠనపటిష్ఠ ద్రాఘిష్ఠ ఖడ్గపుంఖరత్న ప్రభారింఛోళీ విభ్రాజితంబులయిన యీ హస్తములు, సంతత దానజలధారా పరిప్లుతములయిన యీ హస్తములు, నీచమ్మానవునకు, జాతి వైరికి, హతభాగ్యునకుఁ గైవారంబుసేయునా? ఓరిపాపీ! ఓరీ కులద్రోహి" యంచు.

బెట్టిదంబుగ నఱకాలఁ బెట్టితన్నఁ
గ్రిందపడి గద్దెపైనుండి కిదికిలేచి
తలవులీడేర నని పొంగి కొలువువదలి
క్రొవ్వుమాటలు తెగఁబడి కొన్నిపక్కి

నలుగురు మంత్రులంగలిసి నక్కి విభీషణుఁ డప్డె యబ్ధియా వలఁగల రామచంద్రుడు పదపద్మయుగంబున వ్రాలి దీనుఁడై గిలి నభయంబువేడఁగ నొగిన్ హనుమంతునిమాటమీఁదనె చ్చెలిగ గ్రహించి రాముఁ డభిషిక్తునిగా నొనరించె లంకకున్

పిదప విభీషణుండు తన ప్రెగ్గడలం బురికొల్పి మంత్రవే
ల్లఁదెలిసి వేగ రండనుచు లంకకుఁబంపఁగ వారు తోడుతోఁ
గదలి పురంబుఁజేరి యటగల్గు రహస్యము లాకలింపుచున్
బదపడి దాఁచకుండ రఘువర్యునికిన్ వినిపించి రంతటన్

ద్రావిడ శిల్పియనా నలుఁడు రామునిపంపున గండ్లుపూడ్చి త
జ్జీవనధిన్ దరించుటకు సేతువుగట్టఁగ నబ్ధిదాఁటి సీ
తావిభుఁడా సువేలమున దండును డించుచు రాయబారిగా
రావణు చెంతకంపె యువరాజగు నంగదు సంధిసేయఁగా

రాయబారంబు చెడిపోయె రావణుండు
స్వాభిజాత్యంబు విడనాడి సంధిసేయ
నొడఁబడకపోవ నందుచే యుద్ధభేరి
మొరసెఁ గోలాహలము మిన్ను ముట్టుచుండ

సంధికాదర లేదనుమాట సరమచెప్ప
సీత వెరడించి కూర్చుండి చెట్టుక్రిందఁ
గడకుఁ గానున్న దేదియో కాకమాన
దైన నొకమాట నాలింపు మనుచు వేడె

గుప్తి కర్మమెట్లు కొనసాఁగుచుండెనో!
మంత్రనిశ్చయంబు మాటయేమొ!
తెలిసివచ్చి తేట తెల్లంబుగాఁజెప్పు
సరమతల్లి నిన్ను మఱవననిన

సరమపురంబుఁజేరి పటుశక్తి రహస్యములన్ గ్రహించుచున్
సరగునవచ్చి మైథిలికి సంగతులన్నియుఁ జెప్పఁగాఁ బ్రభా
కరకులహేళికిం గబురు గ్రక్కునఁబంపె యథోచితంబుగా
మఱగుచునుండె నేమగునొ మంపిలు యుద్ధమటంచు నెమ్మదిన్

ఇరువాఁగులు పోరితమున కాయితమై మహాదారుణ రణంబు ప్రారంభింపఁ బెడబొబ్బలు, పెడనవ్వులు, కనకతప్పెటల మ్రోఁత, యేనుఁగు గీపెట్టులు, జక్కల సకిలింపులతో నిఖాతలంబు దద్దరిల్ల, రోదసీగహ్వరంబు తూఁటుగట్టఁ, జావునకుఁ దెగించి, కనుఱెప్పపాటులోఁ బోరు ముగించుటకో యన, వీర రసావేశంబుతో, నట్టహాసంబుతో, నహష్టంభంబుతో దొమ్మి నడుప మోటువనాటుల పోటుధాటికి నిశాటులోడుగ, నింద్ర జిత్తు సూరెలనిల్చి, కోట్లలఁజేయుచుఁ జెలరేఁగి కొంతవడి యుద్ధంబుఁజేసి, కార్యంబు సుకరంబుగా సాధించుటకు యజ్ఞ దత్తంబులగు రథాశ్వంబులుండుట నుచితంబని యెంచి రణవిముఖుండై, వీడుచొచ్చి, నికుంభిలయందు హోమముఁ జేయసాఁగెను. ఈ సమాచారంబు చారులవలన నెఱింగి విభీషణుండు వెంటనే రామునకు విన్నవించెను. శ్రీరాముండు లక్ష్మణకుమారుని ససైన్యంబుగాఁబంప నతండు మేఘనాథుని యునికి యెఱుంగనేరక తహతహపడుచుండ—

అతిరాజ్యతృష్ణచే నడియాన పాల్పడి
జాతివిరోధి నేస్తంబుసల్పి
కన్నకూతురం జేసికొన్న నాతినిగూడ
లంకలో దిగంబెట్టి శంకలేక
పగవాని శరణంచుం బజ్జంజేరి కులంబు
కూంకటిత్రెవ్వల్లతోం గూల్పనున్న
తనయాలుబిడ్డల ననుకంప నిరతంబు
కంటిరెప్పవిధానం గాచుచున్న

సోదరుని బిడ్డయని జాలి చూపకుండ
లక్ష్మణునకుంజూపె నికుంభిలం జలపట్టి
పరమభాగవతోత్తమ వరుండుకాండె
విమలచరితుండుకాండె విభీషణుండు !

సరమాసతీవిభుండీ
కరణిని లక్ష్మణున కచటం గన్పఱపంగా
శరపాళిని నిగుడించుచుం
బరిమార్చెను మేఘనాథుం బటుతరశక్తిన్

జ్యేష్ఠపుత్రుని మరణంబు చెవినిబడిన
రావణుండు శోకవిహ్వల భావమునను
గొంతసే పూరకుండి సక్రోధుండగుచు
శత్రుమారణోపాయంబు సంస్మరించి

పాతాళహోమంబుఁ బరిపాటిఁ జేసి
లబ్ధదోస్సారుఁడై లావుతో మెఱసి
జయలక్ష్మి కైదండ చనువుతోఁ బట్టి
యేపార రావణుం డెదనిశ్చయించి
మఱువున నొకచోట మంత్రాలతోడ
నొక్కఁడే పాతాళ హోమంబుఁ జేయ
నల విభీషణుఁడంత యాత్రంబుతోడ
శ్రీరామునకుఁ జెప్పి సిబ్బితిలేక
యంగదాదులఁ బంపె నాహోమవిఘ్న
మాచరింపఁగ వార లంతటఁ బోయి
దితిజేశు జాడలు తెలియఁగాలేక
మల్లాడుచుండంగ మతిమాలి సరమ
వీక్షించి వెంటనే వ్రేలితోఁ జూప
నంగదుఁ డచ్చోట కతితంద్రబోయి
పెనుగొండ కై వడి పీటపైనుండి
యగ్నిహోత్రమువేల్చు నచలసమాను
లంకాధినాథు విలక్షణుఁ జూచి
జన్నంబు మాన్పింపఁ జాలఁగాలేక
యవరోధ మెదిలేక యవరోధమేగి
చెక్కునఁ జెయిఁజేర్చి చింతిల్లుచున్న
మండోదరినిగాంచి మాటాడకుండ
ముత్యాల చేర్చుక్క పుడమిపై రాల

జూఁగ్రొవ్వెదఁబట్టి చరచరలాఁగి
రాజవీధులఁగుండ రమణిఁదోడ్తేర
వీక్షించి యేరాలు వెడనవ్వునవ్వ
రాక్షసేశ్వరుముందు రామనునిల్వ
నామె విలాపంబు నాలించి 'రావ
ణుం డాగ్రహోదగ్ర మండితుండగుచు
యువరాజు నెదుటఁగొమ్ము నొకతన్నుఁదన్ని
యర్థాంగి విడిపింప నాతండుపర్వె

పేర్చు పరాభవాగ్నిఁ దపియించుచుఁగుందుచునున్న భార్యతో
డాక్షి విరోధివర్గమును దండడి దొండడిఁజేసి వారిఁబో
కార్చి జయంబుఁదెత్తునని గ్రక్కున దేరును నెక్కిపోయి బా
ణార్చుల కారుచిచ్చు బయలంతయుఁ బ్రాకఁగఁజేసె నంతటన్

పడరాని యవమానబాధ లంకేశుండు
సీతాపహరణంబుఁ జేసి పిదప
బహుళ సాంద్రాశోక వనములోఁ గూర్చుండఁ
బెట్టఁగాహాయిగాఁ బెట్టునీడ
రావణుండెంత దుర్మార్గుఁ డౌరా! యంచు
శ్రీరాముఁ డెగ్గెత్తి చెప్పుచుండె
సుశ్లోకవతి దివ్య సుగుణాఢ్య పతివత్ని
మండోదరిని మోటు మర్కటుండు

రాణివాసంబుఁ జొచ్చి దుర్మదముతోడఁ
గొప్పఁవట్టీడ్వ వీధులగుండ నౌర!
మైథిలీభర్త పల్లెత్తు మాటయైనఁ
దప్పనంగ లేదెటువంటి ధార్మికుండో!

అసలు నూటేండ్లు దాఁటిన ముసలియయ్యు
గుడుసువడుచుండఁ జాపంబు గడుసువడుచు
వెలితియగుచుండఁ గవదొనల్ వెలితిపడక
పోరుసాఁగింప రావణ భూవరుండు

మోటువనాటులైన కపి ముఖ్యులు సంగరభూమిడించి పే
రోటమిఁ బొందుచున్ నిలువనోపక వెన్కకుఁజూడకుండ మై
పోటులు చూచికొంచుఁ బడిపోవదొడంగిరి యొక్క పెట్టఁబో
రాట నెఱుంగు దేవుఁడని యంత కనుంగొని యుగ్రకోపుఁడై

ఓడకుఁడోడకుండనుచు నొక్కఁడు రాఘవుఁ డడ్డువచ్చి తూ
టాడఁదలంప రావణుఁ డహంకృతిఁ దూపులు వేయఁ గాలు సే
యాడక యూరకున్నఁగని యంత విభీషణుఁ డల్లనల్ల మా
టాడక వచ్చువచ్చి సమయంబునకై పరికించి చూచుచున్

దొందడి కయ్యములోనన్
సందడి కనిపెట్టి గుదియ సారించుచుఁ ద
త్స్యందన హయముల నాల్గిటి
మ్రందించెను నొక్కదెబ్బ మాసఁటికాఁడే!

విరథుండయ్యును రావణ
ధరావరుఁడు గొండొక యరదం బెక్కి వెసన్
దురముం జేయుచునుండఁగ
గిరగిర కన్నుంగవదిరిగెన్ రామునకున్

బడలిన రామచంద్రుఁగని ప్రామిడితో సరమావిభుండు త్రొ
క్కుడుపడి రావణుండు రణకోవిదుఁ డీతని గెల్వనేరఁ డె
వ్వఁడయిన ధర్మయుద్ధమున బాపురె! కావునఁ బొత్తికడ్డుపై
గుఱిఁగొని బిట్టుగొట్టి పడఁగొట్టుమనన్ రఘురాముఁ డెంతయున్

నాభిమీఁదను వాలమ్ము నాటి పుడమి
వాల్చె డబ్బాటుతోడ రావణనరేంద్రు
భాగవతుఁడౌ విభీషణు పల్కు వినుచు
ధర్మమెు యధర్మమెు పనిమాత్రంబు దీరె

అవనిపైఁ జాపకట్టుగ నణఁగియున్న
యన్న కగ్నిసంస్కారము లాచరింప
ననె విభీషణుఁ డన్న యత్యధికపాపి
ధర్మదూరుడటంచును దగవుచెప్పి

లోకమువిన్న ధర్మపరిలుప్తుఁ డితండని చెప్పి తిట్టు నే
మోకదయంచు రాఘవుఁడు యోజనచేసి విభీషణా! సరే
నీకిది యొప్పుకాదు రజనీచరనాథుఁడు లోకజేతయే
కాక సహోదరుండుకనుకన్ బొనరింపుము యగ్నిసంస్కృతుల్

చావుతోఁ దప్పులన్నియు సమసిపోవుఁ
గానఁ బ్రేతకు నగ్ని సంస్కారములను
జేయుమని రాముఁడానతిఁ జేసినంత
యటులె చేసె విభీషణుఁ డౌనటంచు

పాలుద్రాగెదవా! నీవు బసవ! యూను
ప్రత్తివిత్తులు తిందువా! బసవ! యూను
మంచిమార్గంబుఁ బట్టెను మావిభీష
ణుండు నేఁటిదాఁ కెన్నో సన్నుతులుగాంచె

ఈరేడు జగముల కీఱేఁడు తగువాఁడు
వేరేఁడు తగఁడన్న పేరుఁగాంచె
చదువు సాములు నేర్చి చదువు సాముల నేర్చు
చదువు సాముల నేర్చు చతురుఁడయ్యె
గోవాంద్ర సరిదిద్ది గోవాంద్రఁ గని యిద్ది
గోవాంద్రఁ గనుడంచుఁ జావఁగొట్టె
ఆపగతురజట్టు నాపఁగఁ బురిచుట్టు
నాపగ దారఁబెట్టె యధికుఁడయ్యె

ధరణిఁ బుట్టుట గిట్టుట కొఱకుఁగాదె
యెప్పుడో యొకప్పుడు చావు తప్పబోదు
జాతి యభివృద్ధికొఱకునై సమసిపోయె
రావణుం డెంతధన్యుఁడో ప్రథనభూమి

విధవయైన లంకాపురి సధవఁజేసి
సీత నగ్నిలోపలఁ బ్రవేశింపఁజేసి
మరలఁ గొనుచు నయోధ్యకు మరలివచ్చె
వానరులతోడ రాముండు వైభవమున

భార్యఁగొంపోవఁగ విరోధి, వానరులను
జేరి శరణంచు బగవానిఁ జంచి భార్యఁ
దెచ్చికొన్న రాముఁడు కీర్తిఁ దెచ్చుకొనియె
వసుధ నెవరియదృష్ట మెవ్వరికివచ్చు

ము గిం పు

నాఁటికిఁ గథాశ్రవణంబు చాలించి, సంధ్యావంద నాదులుసల్పి, యారేయినిదురించి, యుషఃకాలంబునఁ దత్తర పడిలేచి, కాల్యంబులఁ దీర్చికొని, గురువరుండగు సూత మహర్షిం జేరి వందనం బాచరించి,

కడచినరేయి నొక్కకలగంటిని మాదగు కమ్మనాఁటిలో
గడబిడలేవొ కల్గి కడగండ్లగచాట్లు ప్రజానమూహామ్ముల
సుడుపులు పెట్టిపెట్టి పరిశోషణఁజేయుచు నుండెనంచు న
క్కడ కిపుడేగిచూచి యటఁగాంచిన సంగతులన్ని చెప్పెదన్

బుద్ధిపుట్టెను మాయూరు పోయివత్తుఁ
జుట్టపక్కాల నెల్లరఁ జూచివత్తు
దేశికేంద్ర! రెన్నెల్లలోఁ దిరిగివత్తుఁ
గొఱతివడ్డ ధర్మంబుల నెఱుఁగుకొఱకు

ఎల్లకాల మెల్ల వృత్తంబు లెఱుఁగుదు
రైనఁ గన్నులార నేనుచూచి
మీకు విన్నవింతు నాకడ కథలెల్లఁ
దప్పుపట్టవద్దు తండ్రి! నన్ను

అనవిని మానిచంద్రుఁడు రయంబున లేచుచు నొక్కయోషధిన్
గొని యరుదెంచి చూడుమిదిగో! యపురూపపుమందుటాకు దీ
నిని నఱకాలఁ బ్రాముదెడ నింగినిబోయెద వెంతదూరమై
నను గనుఱెప్పపాటుననన్ విని మిక్కిలి యాదరంబునన్

బిక్కమొగమున మునినాథు చక్కచూచి
యేమితోఁచక కూర్చుండి యించుకంత
పైన మప్పుడే నిశ్చయపఱచి నేను
యోగవాగలు సంచిలో నుంచికొనుచు

పాదలేపనంబుఁ బట్టింప నఱకాల
మింటికెగసి నాడఁ మంటినుండి
తెల్లవారలేదు దిగినాఁడ మాయూరి
చెఱువుగట్టుమీఁది చెట్టుక్రింద



## ఫ ల శ్రు తి

సూతప్రోక్తపురాణసంహితను సంశుద్ధాంతరంగంబుతోఁ
బ్రాతస్స్నాయములం బఠించునెడలన్ బ్రహ్మాయురారోగ్యముల్
భూతప్రీతియుఁ జిత్తశుద్ధియుఁదమోలుంటాక వైరాగ్యమున్
నీతిప్రోత వివేచనంబు గలుగున్ నిత్యంబు సత్యంబుగన్.

ఈ కథ వ్రాసిన విన్నను
వాకొన్నను బాడిపంట పరువము సుబ్బున్
తేకువ జోకయుఁ బ్రబ్బున్
బ్రాకటముగ లిబ్బులుబ్బు బైరము లబ్బున్

తొలిపలుకులు

యాదవు లెవరు ? శ్రీకృష్ణుని రాజనీతి, వంశవృక్షములు, యాదవ ప్రళయము, భీష్ముఁడు, రాధ, ధృష్టద్యుమ్నుఁడు.

మొత్తుకోళ్ళు

కథాప్రారంభం

హంసడిచికుల మృతి

ఏకలవ్యుని వృత్తాంతము

ధర్మరాజు రాజసూయము

పౌండ్రక వాసుదేవుఁడు

కృష్ణుని రాయబారం

కురుక్షేత్రయుద్ధము

ఊరుభంగము

యాదవ ప్రళయము

# తొలిపలుకులు

రామరావణ యుద్ధకాలమునాఁటికి వింధ్యదక్షిణ దిగ్భాగము మహారణ్యానులతో నిండియుండెను. ప్రాణసంరక్షణార్థమయి పరాజితులయిన ద్రావిడులు చెట్టుల గుట్టలపాలయి మధ్యదేశమునం దల్లాడు చుండినట్టు పొడఁగట్టును. దక్షిణాపథమునకుఁ జనుదెంచిన రామునకు విరాధునివంటి వారెవ్వరో యొక రిద్దరు దానవు లెదురుపడిరి. కాన నాఁడు దక్షిణాపథమునందు వానరరాజ్యము దక్క ద్రావిడ రాజ్యములుగాని ద్రావిడరాజులుగాని యున్నట్టు చూపట్టదు, ఇంతియెకాక దక్షిణాపథము ద్రావిడ జనాకీర్ణముగాఁగూడలేదు. నామమాత్రపట్టణమగు కిష్కింధాపుర మొక్కటియే దృగ్గోచరమైనది,

భారతకాలమునాఁటి కీ పరిస్థితులు తాఱుమాఱయిపోయినవి. దక్షిణాపథమునఁ బాండ్యరాజ్యము చాల సుప్రసిద్ధముగా నుండెను. దీని ప్రభువు మలయధ్వజుఁడు. ఈ రాజశేఖరుని పుత్రికయగు చిత్రాంగదను నర్జునుఁడు వివాహమయ్యెను. ఈరీతి మలయధ్వజుఁడు ప్రార్థుని వింటి యల్లునిఁ జేసికొనియెను. చిత్రాంగదయుఁ దండ్రినిఁ దలఁదన్నఁగల కొడుకును బభ్రువాహనుఁ గాంచెను. మలయధ్వజుఁడు కడు దురభిమానమును నహంకారమునుగల రాజు. కృష్ణార్జునులె తనకు దీటురారని నిక్కి నీల్గెడివాఁడు. ఇతఁడతిరథుండు, ఎవరయిన పరిపోల్చి చెప్పుచో బొమముడిపెట్టువాఁడు, అల్లునికోసమై కురుక్షేత్రయుద్ధమున నితఁడశ్వత్థామచేఁజచ్చెను.

ఇంకఁ గళింగరాజ్యముకూడ వన్నె వాసికెక్కియున్నది. దీని జనపాలుఁడు చిత్రాంగదుఁడు. దుర్యోధన సార్వభౌమునకుఁగూతునిచ్చిన మామ, కడు వృద్ధుఁడు. కురుక్షేత్ర యుద్ధమున నొదలు దాఁచక కళింగ సైన్యములు మహాదారుణముగఁ బోరాడినవి. ఈ కళింగరాజు పౌండ్రక వాసుదేవునితోడను గాశి రాజుతోడను మిగులఁ జెలిమి కలిగి యుండెడి

వాఁడు. ఈ కాళింగులు యాదవులు హీనజాతి సంభవులని యెంతయో గేలిసేయువారు. ఈ కళింగరాజు బలరాము నెన్నిమారులో గేలిసేసి యా బలరామునిచేతిలోనె చచ్చెను.

నిషాదదేశము: దీనికిఁ గృష్ణుని పినతండ్రి కుమారుడైన యేకలవ్యుఁడు ప్రభువు. మఱియు సాళ్వదేశము కలదు. భీష్మకుండేలిన విదర్భ కలదు. ఇట్టివి యెన్నియో రాజ్యములు తలయెత్తినవి. ద్రావిడ దేశమంతయు జనాకీర్ణముగానే యుండెను. రాక్షసత్వమును వదలివేసి ద్రావిడులు మానవులయిరి. అడవులు వదలి రాజాలక యందె మోటు జీవనముఁ జేయుచున్న ఘటోత్కచాదులు రాక్షసులుగనె పరిగణింపఁబడిరి.

మధ్యదేశమునందు (అనఁగా వింధ్యపర్వతపంక్తి నానుకొని యుత్తరమున నున్న దేశము) ద్రావిడరాజ్యములు చిక్కురుబొక్కురుగా నుండెను. మధ్యదేశమందలి ద్రావిడులు పూర్వపు టౌన్నత్యమును గడింపఁజాలిరి, మగధరాజ్యము, దీనికి జరానంధుఁడు ప్రభువు; చేదిదేశము, దీనికి శిశుపాలుఁడు ప్రభువు; దశార్హదేశము, దీనికిఁ గాశిరాజు ప్రభువు; అవంతిదేశము, దీనికి బాండవులపినతల్లి కుమారులును,గృష్ణుని బావమఱఁదులునైన విందానువిందులు ప్రభువులు; మాధుర శూరసేనదేశములు, వీనికిఁ గంసుఁడు ప్రభువు; కుంతి భోజదేశము, దీనికిఁ గుంతి భోజుఁడు కుంతి పెంపుడు తండ్రి ప్రభువు; హైహయదేశము, దీనికి వీలుఁడు ప్రభువు.

నేఁటికి వివాహరూపకమయిన చుట్టరికం బార్యద్రావిడులకుఁజాల బలసిపోయినది. వసుదేవుని చెల్లెలు, కుంతిభోజుని పెంపుడు కుమార్తె పృథ (కుంతి)ను బాండురాజు పరిణయమయ్యెను. అర్జునుని చుట్టరికం బంతయు ద్రావిడులతోడనే. చిత్రాంగద, యులూచి, సుభద్ర మువ్వురు ద్రావిడకన్యలే. ఒక్క కడుపు చేసికొన్న దాశరాజు కూతురయిన సత్యవతిని శంతనవుండు పెండ్లియాయెను. భీముఁడు హిడింబను గాంధర్వంబునఁ గైకొనియెను. ఇట్టి వెన్నియో చూపవచ్చును.

దేశ మిట్టి స్థితియందుండఁగా జరాసంధుఁడు మగధదేశమునకు రాజయ్యెను. జాతి వైరము వానిఁ బ్రేరేప ద్రావిడరాజుల వందఱి

నొక్క మొగమునకుఁ దెచ్చి యార్యులను దేశమునుండి తఱుమఁ బూనికొనెను. ఈ యుత్కృష్టకార్యమునఁ జాలవఱకు సఫలీకృత మనోరథుఁడయ్యెను. వీనికిఁ జేదిదేశమునకు రాజయిన శిశుపాలుండును, గంగాతీరవాసులగు మహాయోధులు హంసడిచికులు మంత్రులు సేనా పతులు నైరి. మూర్తికావత పురమునకు రాజయిన సాళ్వని నీతండు సామంతునిఁ జేసికొనియెను, పౌండ్రకదేశ ప్రభువగు పౌండ్రిక వాసు దేవుని జెలిగా నొనరించుకొనెను. మధురాధినాథుఁడగు కంసుఁ డీతని కల్లుఁడయ్యెను. ప్రాగ్జ్యోతిషా ధీశ్వరుండగు నరకుండు నేస్తమ్యెను. నిషా నాథుండగు 'ఏకలవ్యుఁడు' మిత్రమయ్యెను. జరాసంధ సార్వభౌముని శ్వేతచ్ఛత్రముక్రింద ద్రావిడు లేకముఖంబునఁ గూడిరి. ఒకప్పుడు కర్ణజరాసంధు లొకరితోడ నొకరు పోరాడి బలాబలంబులను జూచికొని మిత్రులైరి. జరాసంధ ప్రయత్నము లీ కైవడి ఫలోన్ముఖంబునకు వచ్చెను. కాని దైవవిధి వేరువిధముగ నున్నది. అవరోధము సంభ వించినది. ఆ యవరోధము జరాసంధున కవిలంఘనీయమయినది, మహా మాంత్రికుండయిన శ్రీకృష్ణుం డవతరించెను. కథ తలకిందై నది. ఒక విధముగా వ్రాయఁదగిన భారత చరిత్ర వేఱువిధముగా వ్రాయవలసి వచ్చెను. విధి దుర్లంఘముకదా!

## యా ద వు లె వ రు ?

శ్రీకృష్ణుండు మధురలో యదుకులంబునఁ బ్రభవించెను. తల్లి దండ్రులకుఁ జెఱనిప్పించి పిదపఁ దాను పుట్టెను. యాదవులు, వార్ష్ణే యులు, భోజులు, అంధకులు, సాత్వతులు, దశార్హులు అను తెగలు నాఁడు మధురలోఁ గాపురముఁ జేయుచుండెను. ద్రావిడజాతి స్కంధ మునకు నీ జాతులు కొమ్మలు, రెమ్మలు.

యాదవులఁగూర్చి పురాణము లేమి చెప్పుచున్నవో మనము పరిశీలింతము. చంద్రవంశపు సార్వభౌముఁడగు యయాతి పెద్దకుమా రుఁడు యదువు. ఇతండును నితని ముగ్గురు తమ్ములును బిత్రాజ్ఞఁ బాలింపమిచేఁ జక్రవర్తులు కాలేదు. కడఁగొట్టుతనయుఁడయిన పూరుఁడు

తండ్రియానతి జవదాటక పాలించుటచేఁ జక్రవర్తి యయ్యెను. గుప్తముగా నిందొక్క ధర్మసూక్ష్మ మిమిడియున్నది. యయాతి కిర్వురు భార్యలు. పెద్దభార్య దేవయాని. ఈమె రాక్షసగురువగు శుక్రాచార్యుని తనూజ; యయాతి చంద్రవంశ క్షత్రియుఁడు. శుక్రాచార్యుఁడు బ్రాహ్మణుఁడు. కావున యయాతి దేవయానుల యుద్వాహము ప్రతిలోమ వివాహమగును. ప్రతిలోమ వివాహమున సంకర్ణులు పుట్టుదురని స్మృతికర్తలు ఘంటాపథముగ వచించుచున్నారు. కావున క్షత్రియ పురుషునకును బ్రాహ్మణ స్త్రీకిని బుట్టినవాఁ డెవఁడై యుండును? "బ్రాహ్మణ్యామ్ క్షత్రియాత్సూతః" అనఁగా బ్రాహ్మణస్త్రీకిని క్షత్రియునకును బుట్టినవాఁడు సూతుఁడగును. సూతునకు రాజ్యాధికారము లేదు. అందుచేతనే యదువునకు యౌవరాజ్య పట్టాభిషేకముగాని, పట్టాభిషేకముగాని జరిగి యుండలేదు.

ఇక యయాతి రెండవ భార్యయగు శర్మిష్ఠనుగూర్చి విచారింతము. ఈమె దానవేంద్రుఁడగు వృషపర్వుని కూతురు. ద్రావిడ జనపాలురను భారతకాలమునాఁడు క్షత్రియులుగనే యార్యులు చూడ మొదలిడిరి. అందుచేతనే యయాతి శర్మిష్ఠా వివాహము సవర్ణవివాహమయినది. ఇది కారణముగ శర్మిష్ఠా సుతుండయిన పూరుఁడు యయాతి యనంతరము చక్రవర్తి యయ్యెను. ఈ పూరుఁడే కౌరవ పాండవులకు మూలపురుషుఁడు. యదువు యదువృష్ణి భోజాంధకాది జాతులకు మూలపురుషుఁడు. యాదవులఁగూర్చి భాగవత మేమి చెప్పుచున్నదో చూతము: ద్వాదశస్కంధములో భవిష్యన్నరపాల రాజ్య పరిపాలన కాలనిర్ణయాను వర్ణనములో నీ క్రింది వాక్యములు చెప్పఁబడెను. "పురంజయుండు మగధదేశాధిపతియై పుట్టె. అంత నతండు పుళింద యదు మద్రదేశవాసులగు హీనజాతి జనులు బ్రహ్మజ్ఞాన విహీనులై హరిభక్తి విరహితులై యుండువారికి"-ఈ మాటలను బరిశీలించి చూచినయెడల యాదవులు, పుళిందులతో సాటివారుగాఁ గన్పట్టుదురు. పుళిందు లెవరు? "భేదాః కిరాత, శబర పుళిందామ్లేచ్ఛజాతయః" అని అమరుఁడు కంఠోక్తిగా వచియించుచున్నాఁడు. కనుక యాదవులు

మ్లేచ్ఛజాతివారు. ఇఁక మ్లేచ్ఛులన నెవరు? మ్లేచ్ఛంతే అవ్యక్తం భాషంతే ఇతిమ్లేచ్ఛాః; మ్లేచ్ఛ, అవ్యక్తేశబ్దే, అనఁగ నవ్యక్తమగు భాషకలవారు. ఆర్యులకు ద్రావిడభాషలు "అవ్యక్తములే". ద్రావిడ భాషలనుగూర్చి యార్యులయందు వ్యాపించియుండిన యిట్టి యభిప్రాయములే నేఁటికిని మన కర్ణ రంధ్రములఁ బడుచుండెను. నన్నయకాలమునాఁడు తెలుఁగు భాష "గాసటబీసట"గా నున్నదని తలంపఁబడెను. తెలుఁగుదేశమునఁ బుట్టి తెలుఁగుభాష నేర్చిన నన్నయాదులకే తెలుఁగు "గాసటబీసట"గాఁ గన్పట్టినప్పుడు తెలుఁగుబాస నుడికార మెఱుంగని యార్యులకుఁ దెలుఁగుబాస యవ్యక్తముగా నేల పొడచూపదు? ఈ మ్లేచ్ఛజాతులన్నియు ననార్యులనియు ననఁగా ద్రావిడులనియు మా యభిప్రాయము.

వసుదేవుని మూఁడవ తమ్ముఁడగు "అనాధృష్టి"కి శత్రుఘ్నుండను నామాంతరముగల ఏకలవ్యుఁడు కుమారుఁడు. ఈ యేకలవ్యుఁడు "నైషాది" యని బ్రహ్మపురాణము మోమోటమిలేక సత్యమును వెలిబుచ్చుచున్నది. కావున యదుజాతి మ్లేచ్ఛజాతి; అనఁగ నాటవికులయిన కిరాతాది జాతులలోనివారు. ఇట్టి యదుకులంబున శ్రీకృష్ణుండు జనియించె.

యదువృష్ణి భోజాంధకాది జాతులయందు భోజవంశము రాజవంశము. అనఁగా నీ జాతులను బరిపాలించు రాజులు భోజకులము నందే యుండవలయును. వసుదేవుని భార్యయగు దేవకియు, శ్రీకృష్ణుని భార్యయగు రుక్మిణియును నీ భోజాంగనలే; వసుదేవుని చెల్లెలగు పృథ (కుంతి) భోజకులంబునందలి రాజగు కుంతికిఁ బెంపుడువోయి కుంతి యయ్యెను. ఈ కుంతి భోజునకు నాగులచుట్టరికం బున్నదందురు. నాగులకుఁ బెండ్లిండ్లులేవు. అందుచేతనే కాఁబోలు గుంతి సంతుగని దిసంతుతోఁ బెండ్లిఁ జేసికొనినది.

భోజులకుఁ గంసుఁడు ప్రభువయ్యెను. తమ్మాలమున యదువృష్ణి భోజాంధులకెల్లఁ బ్రభువయ్యెను. జరాసంధుఁడు తన కూతుంద్ర నిర్వుర హస్తిని, ప్రాప్తినిఁ గంసున కిచ్చి పెండ్లిచేసెను. భోజు లధిక వంశ్యాతులును, రాజవంశమువారును, సార్వభౌమునితోఁ జుట్టరికంబు కలవారు

నగుటచేత యదువృష్ణికులంబులను దమతో సరిసమానముగాఁ జూచు కొను నలవాటు లేకపోయినది. అందుచే యదువృష్ణి కులములకును, భోజాంధకులకును దమదమ మనస్సులందు విరిపోట్లు కలిగి నెలకొనెను. ఈ సమయంబునఁ గంసభీతి నవయుచున్న దేవకీ వసుదేవులకుఁ జెఱలోఁ జిన్నికృష్ణుఁడు ప్రభవించెను. కంసుఁడు ప్రేలు విడచిన మేన ల్లునిఁ జంపునేమో యను భయంబుచేఁ బుట్టిననాఁటి నడిరేయి వసుదే వుఁడు కృష్ణుని గొనిపోయి వ్రేపల్లెలోనున్న నందగోపకుని భార్య యశోద ప్రక్కఁ బరుండఁబెట్టి యామెయాఁడుబిడ్డనుదెచ్చికొనెను. కం సుండీ యాఁడుపాపను జంపివైచెను. కృష్ణుఁడు గోపకుని యింటఁ బెఱిగి గోపాలుఁడయ్యెను. శ్రీకృష్ణుఁడు వ్రేపల్లెలో బాల్య పౌగండములు గడ పెను. శ్రీకృష్ణుని పెంపుడుతండ్రియైన నందుఁడు రాజపట్టణంబునకు దగ్గర నుండుటకు భయంపడి బృందావనంబునకు లేచిపోయెను.

వ్రేపల్లెలో నుండఁగా వసుదేవుని యింటి పురోహితుండగు గర్గుఁడు వ్రేపల్లెకు రాఁగా నందుఁడు రామకృష్ణులకు నామకరణము జేయుమని వేడఁగా గర్గమహాముని చెప్పిన మాట లాలింపుఁడు. "తొల్లి యీ శిశువు ధవళారుణ పీత వర్ణుండై యిప్పుడు నల్లనైన కతంబునఁ గృష్ణుండయ్యె." పరిశీలింపుఁడు, ధవళారుణ పీతవర్ణంబులు క్రమముగా బ్రహ్మ క్షత్రియ వైశ్యుల వర్ణంబులు. నల్లని వర్ణంబు శూద్రవర్ణంబు అనఁగా ననార్య వర్ణంబు. దీనింబట్టి చూచినను యదుకులంబు ద్రావిడ జాతిగనే స్పష్టమగుచున్నది.

శ్రీకృష్ణుండు బృందా వనములోఁ దన యౌవనములోఁ గొంత భాగంబు గడపెను. గోప ప్రభుండయిన నందునకు లేకలేక కన్న సంతానమగుటచే నందుఁడు శ్రీకృష్ణుని నదుపు, నాజ్ఞలలోఁ బెట్టి పెంప లేదు, శ్రీకృష్ణుఁడు బృంద యంతయు విచ్చలవిడి తిరుగనేర్చెను. అక తాయి యయ్యెను. మల్లుఁడయ్యెను, జారుఁడయ్యెను, జోరుఁడయ్యెను, గాయనుఁడయ్యెను, తాంత్రికుండయ్యెను, వేదాంతి యయ్యెను. స్వేచ్ఛా మధుర రసమును గుత్తుకబంటి గ్రోలెను. ప్రాకృత లోకంబునకు విర్ణ యింపఁబడిన మర్యాద లతనికి నచ్చలేదు.

ఈ మర్యాదలకులొంగి ప్రవర్తించుటకు స్వేచ్ఛాజీవనసారముఁ గ్రోలిన యీ మహాతేజశ్శాలి ప్రవృత్తి తిరుగుబాటొనరించెను. దానం జేసి యాటవికుల కట్టుబాట్లను దుత్తుమురు చేసెను.

ఈ స్వేచ్ఛా జీవనమే భవిష్య ద్రాజకీయ రంగమున శ్రీకృష్ణుని నెదురులేనివానినిగాఁ జేసెను. బృందావనమందలి శరద్రాత్రులన్నియు రసము చిప్పిల్లు వీని మధుర వేణుగానముచే నుత్ఫుల్లము లయ్యెను. చంపక సౌగంధికా వాసితములగు సరస్సు లన్నియు వీని జలక్రీడలచే నల్లడి తల్లడి యయ్యెను. వ్యాకోచ వివిధ పుష్ప సౌరభ్య సంవాసితంబు లయిన నికుంజ పుంజములు వీని రాసక్రీడలచేఁ బరిక్షుణ్ణములయ్యెను. మాధవీలతా మంటపములు వీనికిఁ బరిష్కృత పుష్పశయ్యాగారము లయ్యెను. గోపగోపికా రసనాగ్రములపై నిరంతరము వీని నామము మంగళ తూర్యారావములతో నాట్యమాడెను, అహో ! స్వేచ్ఛా జీవనము నకు మూల్యమేది ?

కన్నులు దెఱువనినాఁడే గోపకునియింటికిం గొంపోఁబడి,యందె పెఱిగి పెద్దయయ్యుఁ గృష్ణుండు దన వంశా చారంబులను సంప్రదాయ ములను విస్మరింపఁ నేరఁడయ్యె. ఏమి యీ చిత్రము ? కిరాత జన సామాన్య శిరోలంకారమయిన కేకి పింఛము నెత్తిపై నుయ్యాలో జొం పాలో యనుచుండ యూఁదుఁ గ్రోవిని చేతఁబట్టి కనుబొమ లెగుర వైచుచుఁ దద్వంశనాళముపై మునివ్రేళ్ళు తాండవింపఁ జేయుచు గోపికా జనంబును జిందులు ద్రొక్కించెను. ఆ మనోజ్ఞ వేణుగానము నాలకిం చిన యాటవికు డెవ్వఁడు పాటకు సరిపడు నడుగు వేయకదారఁగలఁడు? నిశాత బాణ పరంపరచేఁ గాని కార్యము, ముట్టినఁ దుమగు వెదురు బూరచేఁ జేయనేర్చెను, అరసికశిఖామణికి బృందావనమంతయు గైవసం బై పోయెను.

శ్రీకృష్ణుండు నెమ్మదిగ రాజకీయరంగమున బ్రవేశించెను. మహా మేధావియగు వీనికి భావికార్యంబులు కన్నులఁగట్టినట్టు గన్పట్టసాగెను. తల్లి దండ్రులు పడ్డ కష్టంబులు, తన్నుఁ జిన్నవాఁడు కంసుఁడు పెట్టిన పాట్లు, భోజులు తమ్మగౌరవంబుగాఁ జూచు తెఱంగు శ్రీ కృష్ణుని

మనంబు కలవరపెట్టసాగెను. భోజులను బదచ్యుతులను జేసి, ద్రావిడ సార్వభౌముండయిన జరాసంధు పీఁచమడంచి తానే యాపదవి నాక్రమింపఁగూడదాః యనునూహ పొడమెను. వెంటనే ప్రయత్నములు చేయ బూనెను. ఈ ప్రయత్నములచేఁ జేతి కందనున్న పండు చేజారిపోవు చున్నట్టు జరాసంధునకుఁ దోఁచెను. దీన మాగధుండు క్రుద్ధుండై యతి నిగూఢంబుగఁ బ్రతియత్నములఁజేయసన్నద్ధుఁడయ్యెను. ఇరువుర కిట్టు లాంతరంగిక యుద్ధము తలయెత్తెను. ఇరువురును బయటపడిరి. చేతులు గలిపిరి. చదరంగపు టాటలోనికి దిగిరి. ఎత్తునకు మారెత్తుతోఁ గొంత కాలంబు గడపిరి. మహా మాంత్రికుండయిన శ్రీకృష్ణునిముందు జరాసంధుని యెత్తులు సాఁగలేదు. భటులను గోలుపోయెను. గుఱ్ఱములు, నేనుఁగులు మాయమైనవి. శకటములు రూపఱెను. మంత్రులు మటుమాయమైరి. ఆట కట్టెను. ఇరువది ముప్పదియేండ్లు పోరి పోరి శ్రీకృష్ణుఁ డాటకట్టించెను, తానుమాత్రము ఫలమును బొందలేదు. కృష్ణ నిర్యాణ సమయంబున యాదవులు మిగుల బలవంతులైరి. కాని సంపూర్ణ క్షత్రియత్వమును బొందలేకపోయిరి. క్షత్రియులతో వియ్యము, నెయ్యము, తప్పినఁ గయ్యముఁజేయసామర్థ్యమును సంపాదించిరి బొమ్మికములేని రాజులైరి. ఇంతటితో నవసానదశ సంప్రాప్తమయినది. సుగుణము లన్నియు నశించినవి. యాదవ కులంబున మిండరికము, త్రాగుబోతు తనము క్రమక్రమముగా హెచ్చినది. గురుధిఃకారము మూఁడుపూవు లారుకాయలుగా దెసలావరించినది. పెద్దలదగ్గరనుండి పిన్నలవఱకుఁ ద్రాగఁజొచ్చిరి., బలరామ సాత్యకుల సురాపానంబునకు మితియు, మేరయులేకుండఁ బోయెను. కోడిపందెములకుఁ బోయినట్టు పోయి, సముద్రతీరమునఁ దెగఁ ద్రావి యదువృష్ణి భోజాంధకు లెల్లరు తన్నుకుని చచ్చిరి. కృష్ణుఁడు చూచుచుండగనె యిదియంతయు జరిగి పోయెను.

## శ్రీకృష్ణుని రాజనీతి

ఈయమేయ ప్రతిభావంతునకున్న దూరదృష్టి యద్భుతజనకము. తన కార్య సాఫల్యమునకు నవరోధములు కలుగుచో నెట్టి సాధన

సంపత్తిచేనైన వానిని దొలఁగించుకొనుటకు వెనుదీయఁడు. కార్యనిశ్చయము కూడ కడు వేగముగఁ జేయుచుండును, సామాన్య రాజకుటుంబమున జనియించి భారతలోకమునంతయు నొక కీలుబొమ్మగా నాడించుటకు నెట్టి ప్రతిభయుండవలయును ? చుట్టపక్కములు కూడ వీని రాజ్యతృష్ణకు నాహుతి యగుచుండిరి. కాని శత్రువిశ్లేషమునకయి యెన్నఁడేనియుఁ బ్రయత్నించినట్టు కానరాదు.

శ్రీకృష్ణుండు యావద్భారతవర్షమునఁ బలుకుబడియో, రాచరికమో సంపాదింపఁ జిన్నతనమునుండి తలంచుచునే యుండెను. దీనికై మునుముందు స్వసంఘమునఁ బెత్తనముసమకూర్చుకొనవలసియున్నది. శీఘ్రముగఁ జుట్టరికమును బెంపుచేసెను. యదు వృష్ణిభోజాంధక సాత్వతి కన్యలను బెండ్లియాడి యంతశ్ఛిద్రముల నుడిపికొనియెను. కాని మేనమామయగు కంసుఁ డడ్డమువచ్చెను. వెనుక ముందు చూడక తుద ముట్టించెను. ముసలియగు తన తాతను నుగ్రసేనుని నామమాత్రపు రాజునిఁ జేసి నిరాటంకమును, విశంకటమునైన పెత్తనముఁ జెల్లించి కొనెను. కంసవధ సందర్భమున శ్రీకృష్ణుని యద్భుత రాజనీతి లోకవిదితమైనది. కంసభీతిచేఁ గృష్ణుని వంగడమువారు పలుదేశములకు వలసఁబోయిరి. తన్మూలమున యాదవులయందు మిగుల యసంతుష్టి ప్రబలియుండినది. దానిం గనిపెట్టి శ్రీకృష్ణుఁ డొక్కఁడే యన్నతోఁ గలిసి మధురకు రహస్యముగాఁ బోయెను. రాజకుటుంబము యొక్క రహస్యములు తెలిసికొన వలయునన్న దాసీ సాంగత్యముఁ జేయవలయునని పెద్దలు చెప్పుచుందురు. మధురకు నేగిన గోపాలుఁడు తిన్నగాఁ గంసునింటి దాసియైన త్రివక్రయగు కుబ్జ యింటికేగుటయేకాదు, దానితో రతిక్రీడలం దేలి యలరించెను. ఏమి రహస్యములు గ్రహించెనో భగవంతుఁ డెఱుఁగును. కాని యొడ్డోలగంబునకే నిర్భయంబుగా, హఠాత్తుగాఁ జని కంసునిపైఁ బడి చంపెను. రాజ్యము మాత్రము స్వాధీనముఁ జేసికొన ప్రయత్నములు లేకయే, ముసలివానిని గద్దెపైఁబెట్టి, వలసకుఁ బోయిన తమవారిని రప్పించి, యభయప్రదానముఁ జేసి, మధుర వెలవుల నిప్పించి, తన పక్షమును బలపఱచికొనియెను. కంసవధచే శ్రీకృష్ణునకు

బలవద్విరోధము సంప్రాప్తమయినది. కాని స్వసంఘమును గిరిగీచి నిల్పఁగలిగెను. కంసుఁడన్న సామాన్యుఁడుకాడు; జరాసంధుని యల్లుఁడు. జరాసంధుని బలపరాక్రమములు, ముష్టియుద్ధకౌశలము లోకవిదితము. అతని సైన్యము వీరసుభటాకీర్ణము. ఇతఁడు బహుబాంధవుఁడు. ద్రావిడ సంఘము చీలిపోయినది. ఇరుపాయలయినది. బహుళ సంఖ్యాకులు జరాసంధుని కేతన పటాంచలము క్రింద ప్రోవయిరి. యదువృష్ణి భోజాంధకులయందు నధిక సంఖ్యాకులఁ జేపట్టి, శ్రీకృష్ణుఁడు జరాసంధునితో డీకొనెను. జరాసంధ పక్షముననున్న వీరులం జీలదీసి యొకరు తోడ్పడక మున్న యొకరిని పొడవడంచుటకు నారంభించెను, ఆశ్రమంబున హంసడిచికుల మాయోపాయముచేఁ గూల్చెను. దీనజరాసంధుఁ డదరిపడి యప్రమత్తుఁడై యెన్నియో సారులు దండెత్తిపోయి శ్రీకృష్ణుని బరాభూతుని జేసెను. మధురలో నున్నచోఁ బ్రాణంబులు దక్కవని యెఱింగినవాఁడై జలదుర్గము నాశ్రయించుట యుత్తమంబని యూహించి వెంటనే సముద్రములో ద్వారవతియను పట్టణంబుఁ గట్టించి యచ్చోటకుఁ దరలెను.

ఇచటనుండి నిర్భయుఁడై తంత్రములు పన్నసాగెను. ఏకలవ్యుఁ డీ సమయంబుననే ద్వారవతిపై దండెత్తి యా పురంబును మిగులఁ బాదొనరించి మట్టగించివైచెను. సాల్వుఁడు వికత్థనము లాడుచుండెను. శిశుపాలుఁడు మహోల్లాసంబున సైన్యంబులఁ గూర్చుకొని బెదరించుచుండెను.

## విషమస్థితి

ఇట్టి విషమస్థితియందు దిక్కు తోఁచలేదు. దరి తెన్ను గానరాలేదు. ఏవైపు చూచిన వైరి సింహనాదములే, ఏవైపుఁ దిలకించినను వైరి ధనుష్టంకారములేఁ, ఏవైపుపలక్షించినను వైరి సేనాశిబిరములే. ద్రావిడులలో నొక్క వీరుఁడయినను జేయూత యిచ్చువాఁడు గానరాఁ డయ్యె. శ్రీకృష్ణుఁడు భయభ్రాంతుఁ డయ్యెను. జకితుఁడయ్యెను. జడుఁ డయ్యెను. ఆర్యుల సాంగత్యమున కాసింతుమన్న నప్పటికి నార్య రాజుల

యందు విరోధభావములు లేమింజేసి తన్నాదరింపరు. వారితో గలియు టకు నిష్టపడఁడయ్యె. ఒక్కటే శరణ్యమైనది; మంత్రము. మంత్ర సాహాయ్యముచే నార్యులను జీలదీసి యొకపక్షమును జేఁబట్టవలయును. అది యెట్లు తటస్థించును ? కురుపాండవులకు విరోధము గానరాదు. ఇఁకఁదప్పదు. కల్పింపవలయును. ధర్మరాజుచే రాజసూయముఁజేయింప నిశ్చయించెను. జరాసంధుఁ డెదురుతిరిగెను. పాండవులకుఁ దన్నాశ్ర యింపక తప్పనదికాదు. భీమార్జున కృష్ణులు మువ్వురు స్నాతకబ్రాహ్మణ వేషములు దాల్చి కుట్రను బన్ని గిరివ్రజపురంబుఁ బ్రవేశించి యర్ధరాత్ర మున రాజమందిరములోనే జరాసంధుని బిలుకుమార్చిరి. రాజసూయము పూర్తియయినది. అందు నగ్రపూజావిషయంబున భిన్నాభిప్రాయుఁడ యిన శిశుపాలునిఁ బ్రమత్తుని శ్రీకృష్ణుండు చక్రముఁ బ్రయోగించి, తునిమివేసెను. రాజసూయముఁ జూచిన దుర్యోధనునకుఁ గన్నుఁగుట్టి నీర్ష్యాసూయ లేర్పడి రాజదొడంగెను. రాజసూయసమాప్తితో నిర్వురు మహావైరియోధులు సమాప్తిఁజెందిరి. శ్రీకృష్ణున కప్పుడు కొంతవఱకు మనశ్శాంతి చేకూరెను. శిశుపాలవధానంతరము శ్రీకృష్ణుడు సాళ్వుని పౌండ్రక వాసుదేవునిఁ జంపఁగల్గెను. నిరుపద్రవస్థితికి వచ్చితినని శ్రీకృష్ణుండు తలంచెను. ఉత్సాహము మిన్నుముట్టెను. సాహసముతో గార్యములు చేయసాఁగెను. ఈవిధముగ నార్యులతోఁ బొత్తు కుదిరిం చుకొని క్రమక్రమముగా దిట్టముచేసికొని ద్రావిడసంఘ విముఖుఁ డయ్యెను. విముఖుడగుటయేగాక ద్రావిడజాత్యున్మూలమునకే కడంగెను.

## శ్రీకృష్ణుని రాయబారము.

కురుపాండవుల మధ్య తాను వెదఁజల్లిన విరోధబీజములు మోసు లెత్తి, పెరిగి, పెద్దవై మహా దారుణమయిన కురుక్షేత్ర యుద్ధమునకు మూలకందమైనవి. శ్రీకృష్ణుని తంత్రము ఫలవంతమయినది. మంచి తరుణము వచ్చినది. దాయభాగవిషయమయి భారతయుద్ధ మాసన్నమయి నది. సంధి చెడి భారత సంగ్రామమే ప్రవర్తిల్లినఁ దన కమిత లాభమని చక్కఁగా గ్రహించెను. కురుపాండవులకుఁ బోరాటము కల్గి యెవ్వరు

గెల్చినను దనకు నష్టము వాటిల్లకుండునట్లు లెత్తులు వేయసాఁగెను. ఇరు పక్షములనున్న మహావీరులు చచ్చుటయే యతని యభిమతమయ్యెను. ఎవరు గెల్చినను నధిక నష్టముతో గెల్తురని విశ్వసించెను. జేతలుగూడ మిగుల బలహీనులుగా నుందురని నమ్మెను. అట్టివానిని దనచేతిలో నుంచుకొని కీలుబొమ్మలవలె నాడింప నేర్తునని నెఱనమ్మెను. అందుచే తనే మెఱఁగి మెఱఁగి సౌప్తికవధ కంగీకరించి, పాండవ సాత్యకులం దక్క నెల్లర నశ్వత్థామబాఱిం బడద్రోసెను. సాత్యకి నచ్చిన బంటు కాకున్న సౌప్తికవధలోఁ బేరులేకుండఁ బోయెడివాఁడే. దీని నంతయు గూలంకషముగఁ జర్చించియే యాదవమహావీరులను యుద్ధములోనికి రానీయలేదు. సాత్యకి చేకితానులువక్క యాదవవీరులెవ్వరు పాండవ పక్షమునఁ జేరరైరి కృతవర్మ విందానువిందులు నారాయణ గోపాలు రుదక్క నితరు లెవ్వరు కౌరవపక్షమునకుఁ బోలేదు. సత్యభామావివాహ సందర్భమున గృతవర్మ శ్రీకృష్ణునకుఁ బగయయ్యెను. అందుచే నాతఁడు కౌరవులం గలపెను. విందానువిందులు పాండవుల పినతల్లి బిడ్డలయ్యుఁ బాండవ విద్వేషులు. దాన వారు కౌరవులం గూడిరి. నారాయణ గోపాలురనే శ్రీకృష్ణుండు యుద్ధమునకు నెపకొలిపి పంపెను. ఈ నారాయణ గోపాలురు మిగుల బలవంతులును, బొగరుబోతులును. శ్రీకృష్ణుని తిరస్కరించుటకు వెనుదీయనివారు. ఇందుచే నిష్టమువచ్చి నట్టు మారణము చేయవచ్చునని తలంచి కుతంత్రముఁబన్ని వారలను గౌరవబలంబును జేరఁబంపెను. ప్రద్యుమ్న, గద సారణచారుదేష్ణ సాంబాదులు కురుక్షేత్ర యుద్ధమునకు దిగినయెడల నా యుద్ధ మట్లుండె డిదికాదు. కురుక్షేత్రయుద్ధమున బాండవులు విజయులైనను మిగుల దుర్బలులైరి. జయము నామమాత్ర జయమైనది. చతురంగబలమా లేదు. వీరులా లేరు. ఉత్సాహమా బంధునాశముచే నశించినది. పుత్రమారణముచే దిగులేర్పడినది. తత్కారణంబుచేఁ బాండవులు శ్రీకృష్ణుని నవసరము వచ్చినప్పుడుగూడ ధిక్కరించుటకు శక్తిసామర్థ్యములు లేక యుండిరి. ఇట్టి పాండవులను శ్రీకృష్ణుఁడు తనచేతిలో నుంచికొని యాడించుట మిక్కిలి సుకరమైనది.

మొట్టమొదటినుండియుఁ బైఁజెప్పిన కారణములచే శ్రీకృష్ణునకు సంధి చెడఁగొట్టవలయుననియే తలంపు. భారతమున శ్రీకృష్ణుఁడు సంధికై పోవువేళఁ జెప్పినవాక్యము లాలింపుఁడు,

ఉద్యోగపర్వము తృతీయాశ్వాసము

"అసుయోధను ముక్కున నావిగలుగఁ
బడమి నీకీదు గావునఁ బోరకలుగు
నేను గయ్యపుళకునము లెన్నియేని
కంటినీవనుత్సాహివి కాఁగవలయు.

చతురంగ బలంబుల నాయితంబుఁ గావించుచు వీరలం బురికొల్పి కొనుచు నాలస్యములేక సమరమునకు సన్నాహంబు సేయుచుండ వలయు,"

భీమసేనుని బురికొల్పుటకుఁగూడ నీయుద్దేశ్యమేమూలకారణము. ద్రౌపది నూరార్చు సమయంబునఁ జెప్పిన సూక్తులకుఁగూడ నీతలంపే ముఖ్యహేతువు. ఆయా ఘట్టములు చదివిన సర్వము బోధపడకమానదు.

కౌరవసభలో సంధి విషయము ముచ్చటించునపుడు నైతమేపద్ధతి నవలంబించిన సంధి తప్పకచెడునో యాపద్ధతి నవలంబించియే మాటా డెను. రాయబారి సంధి పొసగించుటకు వలయు కారణములను నుడువ వలయునుగాని తనపక్షమును ముందుగ మితిమీఱి కొండాడుట ధర్మమా? తన పక్షమువారి యందున్న మంచిని గోరంతలు కొండంతలుగా నుపన్య సించుట లెస్సయా ? ఎదిరి పక్షముననున్న చెడుగు గోరంతలు, కొండం తలుగా నిందించుట మేలా ? ఈ ఫక్కి సంధిఁ గూర్చుటకా ? చెడఁ గొట్టుటకా ?

ఇఁక సంధి నియమంబులను గూర్చి చర్చింతము. పాండవులు కృష్ణుని ముఖంబున నైదూళ్ళనడిగిరి. ఆ యయిదూళ్లేవి ?

1, మాకంది 2. వారణావతము 3. కుశస్థలి 4. వృకస్థలి 5. మరియేదేని యొకయూరు. ఈ యూళ్లెట్టివి ? ఎవ్వరివి ? ఇందు మాకంది వారణావతంబులు పాంచాలరాజ్యములోనివి. కుమారాష్ట్ర ప్రద

ర్శనానంతరము కౌరవ పాండవులు ద్రుపదునిఁ జావఁగొట్టి లాగికొని గురుదక్షిణగా ద్రోణాచార్యునకిచ్చిరి. మూఁడవదియగు కుశస్థలి కర్ణుఁడు యాదవులనోడిచిపుచ్చి గుంజుకొన్నది, కర్ణుని స్వార్జితము. సంధి కుదురుటకై కృష్ణుఁడీయూళ్ళడిగి యుండునా! ఈయూళ్ళపై దుర్యోధన చక్రవర్తికిఁ బెత్తన మేమియుండును? ఎట్టులనేని యీ యూళ్ళను దుర్యోధనుఁడీయ నిష్టపడినఁ గర్ణద్రోణులు కౌరవపక్షమునుండి చీలిపోవచ్చునను నాళతో వేసినయెత్తు. ఎత్తు సాఁగలేదు. ధర్మజాడు గురుధనాపహరణంబునకు జంకఁడయ్యెను. మొండి దుర్యోధనుఁడు సంధి కుదరనీయలేదని ప్రాకృత లోకమాడుచుండెను. ఏమి చిత్రమోకదా! నీతివేత్త భీష్ముఁడు వాయెత్తలేదు. ఎప్పుడు నితండు మతకరియుఁగపటియేకదా?

శ్రీకృష్ణుఁడు యుద్ధమును నెట్లునడిపించెను? రణనీతి గంగఁగలిపి ధర్మజునకు విజయముఁ జేకూర్చెను. భూరిశ్రవునివధ, ద్రౌణవధ, కర్ణవధ, దుర్యోధనవధ ఇవి యన్నియు నతిహేయములును, నింద్యములును, యుద్ధప్రారంభమున నేర్పఱచికొన్న నియమములకుఁ బూర్ణవిరుద్ధములును.

## యాదవ ప్రళయము

కురుక్షేత్రయుద్ధ సమాప్తితో భారతవర్షంబున శ్రీకృష్ణుని యాజ్ఞ సుగ్రీవాజ్ఞయైపోయినది. దానిచే యాదవులు కన్నుఁగానరైరి. మిన్నుమన్ను నెఱుంగరైరి. కావరమెగఁదట్టెను. పోసరించిరి. ఈ యప్రతిహతాధికారము యాదవ జాతిపతనహేతువైనది. ద్వారకాపురమంతయు శౌండికమయమైపోయెను. పానగోష్ఠులు మదస్థానములు క్రిక్కిరిసెను. జారత్వము హెచ్చెను. మద్యపాన మపరిమిత మయ్యెను. చీకులమ్ము నంగడులు విస్తరిల్లినవి * ఆచార్య తిరస్కారము చెలరేగెను. ఏకలవ్యుఁడు రణనిహతుండయినను. దత్సంబంధికులు తరుణమునకయి వేచియుండి, ద్వారకను జుట్టిముట్టియేయుండిరి. భారతవర్షమునంతయు

* భారతమౌసల పర్వములోని యీ పద్యములఁ దిలకింపుఁడు 28, 29, 40, 57, 93, 66.

నదిమిపట్టియుంపఁగల్గిన శ్రీకృష్ణుఁడు యాదవులను మర్యాదాబుద్ధులను జేయఁజాలక నీరవుఁడయ్యెను. నిర్వీర్యుఁడయ్యెను. యాదవ కుమారు లొరలు తెలియక మత్తులై, సముద్ర తీరమునకుఁ బోయి చెడఁ ద్రావి, లేనిపోని పోరాటము కల్పించుకొని కొట్టుకొని చచ్చిరి. ఏకలవ్య సంబంధికులు సమయము దొరకెఁగదాయని సముద్రతీరమునఁ గనిపెట్టు కొనియుండిరి. యాదవులు నిశ్శేషముగాఁ ద్రెళ్ళి రణరంగమునఁ బడి యున్నప్పుడు బభ్రువొక్కరుఁ డాదారుణ రణరంగమున నతికరుణముగా నేడ్చుచుఁ దిరుగుచుండ బోయఁడొక్కఁడు దొంగపోటునవానిఁ దెగ టార్చెను.॥ శ్రీకృష్ణుఁడు రుక్మిణిని బలవంతముగా నెత్తుకొని పోయి నప్పుడు, కోపమును బట్టఁజాలక శిశుపాలుఁడు ద్వారకపైబడి, యీ బభ్రువు భార్యనే హరించి, కొంపోయెను.

యాదవ ప్రళయానంతరము శ్రీకృష్ణుఁడతి దుఃఖముతో నొక చెట్టునీడఁ బరుండియుండ నింకొక బోయఁడు, తీవ్రబాణ హతునింజేసి ప్రాణములు హరియించెను. శ్రీకృష్ణుని వధకు మన పూర్వులు కట్టు కథనొకదానిని సృజించి సమాధానముఁ జెప్పజూచిరి. గాని, బభ్రువధకు నెట్టి సమాధానమును జెప్పఁ బ్రయత్నింపరైరి. సమాధానము లేకపోవుటం బట్టియే యాదవ కాంతలను ద్వారకపురినుండి కృష్ణానుమతంబున నింద్ర ప్రస్థపురంబునకుఁ దోడ్కొని గ్రీడి పోవుచుండఁగా బోయలు చుట్టుముట్టిరి. ముసలివాఁడయిన యర్జునుండు గాండీవమును మోపెట్ట నేరడయ్యె. బోయలు విస్తారసంఖ్యగల వారగుటచేతను, దానొక్కఁడగుట చేతను, రక్షణీయులు స్త్రీబాలవృద్ధ జనం బగుటచేతను, గలవరపడి క్రీడి గాండీ వము మోపెట్టనేరక యుండును। దీనింగనిపెట్టిన బోయలు పెచ్చు పెఱిగి యాదవ కాంతలను నిలువు దోపిడి చేసిరి. ఇంతతోఁ దవియక కొంతమందిని లేవదీసికొని పోయిరి. మరికొంతమంది తమంతతామే లేచిపోయి చెంచువాండ్రతోఁ గాపురంబునకయి యడవులకుం బోయిరి. ఇట్టి కులావమానముతో శ్రీకృష్ణుని యవతారము ముగిసినది. అధిక

---

॥ 72 మౌసల పర్వము.

రాజ్యతృష్ణచే బలవద్విరోధము సంపాదించుకొన్న వా రంత్యకాలమును నిరుపద్రవముగను, సుఖముగను గడవ నేర్తురా?

భారతకాలమునాఁటికి సాంఘిక పరిస్థితులు చాలఁ దాఱుమాఱైనపి అనులోమ వివాహములు విశంకటముగా జరుగుచుండెను. ఒక నిదర్శనము జూపింతుము. చంద్రవంశ క్షత్రియుఁడయిన ముద్గలుని సంతానము బ్రాహ్మణులైరి. బ్రాహ్మణులేకాదు. నాల్గుకులములవారైరని భాగవతము చాటుచున్నది. నేఁటికిని ముద్గల గోత్రజులు బ్రాహ్మణులయందుఁ గలరు. ముద్గలుని పుత్త్రుఁడైన దివోదాసుని వంశమునందు ద్రుపదుఁడు జన్మించి క్షత్రియుఁడుగనే యుండెను. ముద్గలుని కుమార్తెయయిన అహల్యవంశమందుఁ గృపాచార్యుఁడు పుట్టి బ్రాహ్మణుఁడయ్యెను. అహల్య గౌతముఁడను బ్రాహ్మణుని బెండ్లియాడి బ్రాహ్మణ సంతానమును గన్నది. తేలినసంగతి యేమి? కృపాచార్యునకుఁ దల్లివైపు చుట్టములు పాంచాలురు. కృపాచార్యుని చెల్లెలయిన కృపి ద్రోణాచార్యునిఁ బరిణయమై యశ్వత్థామను గాంచినది. ఒక్కవంశమునందు బుట్టిన పాంచాలురకు రాజ్యముండి తనకు లేదనియే కాఁబోలు నశ్వత్థామకుఁ బాంచాలురపై నంత దురాగ్రహము. బ్రాహ్మణుండయ్యు క్షత్రియత్వము బూనుట కిదియే కారణము. దీని ఫలితమే కాఁబోలు నతని హృదయకార్కశ్యముగూడ. చదువరులకు సుకరంబుగ నుండుటకై ద్రుపద కృపాచార్యుల వంశ మిటఁ బొందుపఱచుచున్నాము.

బ్రహ్మపురాణమునుబట్టి.

# శ్రీకృష్ణుని వంశవృక్షము.




శ్రీకృష్ణుఁడు, యుద్ధవుఁడు, ఏకలవ్యుఁడు అన్నదమ్ముల బిడ్డలు; బ్రహ్మపురాణము సుభద్రను బలరాముని తోఁడ బుట్టువుగాఁజెప్పుచున్నది. భాగవతపురాణము శ్రీకృష్ణుని తోఁబుట్టువుగాఁజెప్పుచున్నది. ఇందేది నిజంటో కదా. వంశవృక్షములనైన బురాణములు సరిగా నీయఁజాలకున్నవి. త్రికాలవేదులయిన మునులుచెప్పుటచేతఁ గాఁబోలు.

## ద్రుపద కృపాచార్య వంశవృక్షము.



సగోత్రజులుకూడఁ దమలోఁ దాము పెండ్లిచేసికొను నాచార మున్నది. సాత్యకి వంశమందుఁ బుట్టిన సత్యభామను శ్రీకృష్ణుఁడు పెండ్లియయ్యె.

వంశవృక్షము.




## కర్ణుఁడు సూతుడేనా ?

ఇందనుకఁ గర్ణుని బురాణములు, భారతము సూతుఁడని వచించుచున్నవి. ఈ కింవదంతిని నాధారము చేసికొని యనేక గాథలు బయలు దేరినవి. కాని భాగవతములోఁ జెప్పఁబడిన వంశవృక్షమును నిటఁ బొందుపఱచుచున్నాము. దానిఁబట్టి చూడఁ గర్ణుని పెంపుడు తండ్రియైన యతిరథుఁడు చంద్రవంశక్షత్రియుఁడైనట్టు పొడకట్టుచున్నది. ఈ చిత్ర మేమియో కర్ణుఁడు సూతపుత్రుడను ప్రవాద మేల బయలువెడలినదో దుర్గ్రాహ్యముగా నున్నది. పుట్టిననాఁటినుండియును గర్ణుఁడు దురదృష్ట వంతుఁడే.

(యయాతి కొడుకు అనువు సంతతి)

చంద్రవంశము.

రోమపాదుఁడు

|

చతురంగుఁడు

|

బృధులాక్షుఁడు

|

బృహద్రథుఁడు

|

బృహన్మనస్సు

|

జయద్రథుఁడు

|

విజయుఁడు

|

ధృతి

|

ధృతవ్రతుండు

|

సత్యకర్మండు

|

అతిరథుఁడు

|

కర్ణుఁడు

# భీష్ముఁడు

ఆసేతు శీతాచలము భారతవర్షమునందలి హిందువులు భీష్ముని స్వార్థ త్యాగియనియు నీతివేత్తయనియు నేఁటివఱకుఁ గొనియాడు చుంతిరి. కాని యింతకపటి, యింత పక్షపాతి భారత యోధులందు మఱి యొకరు గన్పట్టరు. దక్షిణ గోగ్రహణ సమయంబున నర్జునుండు గోవు లను మరలింప బయటఁపడినప్పుడు పదమూఁడు వర్షములు పూర్తికాలే దని దుర్యోధనుని నమ్మకము. అందుచేతనే గోగ్రహణంబు జరిగినది. భీష్ముఁడు దీనినెఱింగి యియ్యకొనియెను, నిజముగఁ బదుమూఁడు సం వత్సరములు చెల్లిపోయినయెడల భీష్ముండు దుర్యోధనునకు గోగ్రహ ణమునకుఁ బూర్వమే వినిపించియుండును. అట్లు జరుగలేదు. పదు మూఁడేండ్లు పూర్తియయ్యెనేయని తాతను దుర్యోధనుడు ప్రశ్నించి నపుడు మహా నీతివేత్తయగు భీష్ముఁ డేమిసమాధానముఁ జెప్పెనో చూడుఁడు.

*సీ॥ రెండవయేట నొక్కండధిమాసమి<br>
ట్లెక్కిన యన్నెల లెల్లఁగూర్చి<br>
కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక<br>
నిన్నఁటితోడనె నిండెనంత.

ఈసిద్ధాంత మెచ్చటిదో బోధపడదు. అధిక మాసములయొక్క యుద్దేశ్యమేమి ? సౌరమానము ప్రకారము సంవత్సరమున కుండదగిన రో॥ 365-6. గంటలు చంద్రమానములోని పంద్రెండు మాసములు గూర్చినఁ గొఱవడిన దినములను బూర్తిచేయుటకేకదా యేర్పడినది ? అట్టిచో నాయధిమాసములను బ్రత్యేకించి లెక్కపెట్టి దొంగలెక్క సిద్ధముచేసి భీష్ముఁడు దుర్యోధనుని మోసపుచ్చఁజాలెను. ఇట్టి సంప్రతి నెచ్చటను బుట్టియుండఁడుకదా,

---

* విరాటపర్వము, చతుర్థాశ్వాసము 232వ పద్యము.

అతికపటియై కర్ణుని నర్ధరథునిగా నిరూపించెను. నిజముగఁ గర్ణుని నిరసించి, నిరుత్సాహుని జేయు తలంపే లేనియెడల, గర్ణుని నతిరథ శ్రేష్టునిగాఁజెప్పి, వానికింగల్గిన శాపాదులచే నిర్వీర్యుఁ డగుటచేఁ జేయఁదగినంత యుద్ధము జేయఁ జాలడని చెప్పవలసి యుండు, ఎఱిఁగి యెఱిఁగియే పాండవులకుఁ దోడ్పడ నెంచి యీ పద్ధతి నవలంబించెను. అంపసెజ్జపై భీష్ముండు పడియుండఁగా జూచుటకునై కర్ణుఁడు వెళ్ళియున్నప్పు డిరువురకు జరిగిన సంభాషణము జూడుఁడు.

## రాధ.

రాధ లిరువురున్నట్లు పురాణాంతరములయందుఁ జెప్పఁబడి యున్నది. ఒక రాధ నందునిచెల్లెలు, కృష్ణుని మేనయత్త. రెండవ రాధ కృష్ణుని నయ్యాటకత్తె; కీలారులందలి చెలిమికత్తె. ఈ రాధయే మహా భక్తురాలనియుఁ గృష్ణుని పరతత్వమహత్వముఁ గనిపెట్టిన జాణయనియు భక్తులచే వర్ణింపఁబడినది. నామసామ్యముంబట్టి యెడలెఱుంగని భక్త కోటిచే నిరువురు నొక్కరుగాఁ జేయఁబడిరి. ఇట్టిది యింకొక యుదాహరణ మిత్తుము. చంద్రవంశమున దశరథుండను రాజొకండుకలఁడు. ఈతనికి శాంతియను కుమార్తె కలదు. ఈయమనే ఋశ్యశృంగునికిచ్చి పెండ్లిఁజేసిరి. సూర్యవంశమున శ్రీరాముని జనకుఁడయిన దశరథుఁడు కలఁడు. మతిమాలిన భక్తులు నిరువురను నొకటిఁజేసిరి. శాంతను సీత యాడుబిడ్డను జేసిరి. ఆడువారి పాటలలోని కెక్కించిరి. ఇట్టి ప్రమాదము లెన్నెన్ని కలవో యెవ్వడెఱుంగును ?

## ధృష్టద్యుమ్నుడు.

భారతము వీనిని శ్వేతజాతుండనియు, నయోనిజుఁడనియు వచించుచున్నది. అయోనిజులు శ్వేతాంగులే. ఈ యయోనిజులు చిరకాలమునకుఁ బూర్వము గ్రీకులయందు నొక తెగగానుండిరి. అయోనియన్ సముద్రమనియు, నయోనియన్ దీవులనియు వీరి పేర నేటికిని సుప్రసిద్ధములై యున్నవి. కావున భారతవర్షమునకు ధృష్టద్యుమ్నుఁడు దత్తపుత్రుడని యూహించు చుంటిమి.

ధర్మజ భీమార్జునులు మూవురు కుంతీదేవి పుత్రులేనా ?

పృథాసుతులనఁబడు ధర్మజ భీమార్జునులు మూవురు పార్థులని పిలువంబడక, యొక్క యర్జునుఁడే పార్థుఁడని పిలువంబడుటచేనర్జునుఁ డొక్కఁడే కుంతిపుత్రుఁడని కొందఱు వాదించుచున్నారు. భారత వీరుల చరిత్రలో బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారీవాదమును మొలకెత్తించినారు. తమ వాదమును బలపఱచికొనుటకుఁ బెక్కు కారణము లిచ్చియున్నారు. ఇది యిట్లుండ బ్రహ్మపురాణములో యయాతి వంశమును జెప్పుటలో "కృష్ణద్వైపాయనుఁడగు వ్యాసులా వైచిత్ర వీర్యక్షేత్రంబున, మాతృనియోగానుసారంబున ధృతరాష్ట్రుఁడు, పాండుఁడు, విదురుఁడు ననువారలను బుట్టించెను. ధృతరాష్ట్రునికి గాంధారి యందు నూర్గురు పుత్రులు పుట్టిరి. అందు దుర్యోధనుఁడు జ్యేష్ఠుఁడై యెల్లరకు బ్రభువై యుండెను. పాండునకు ధనంజయుఁడు, నాతనికి సుభద్రయందు నభిమన్యుడు, నాతనికిఁ పరీక్షితుండును బుట్టిరి," అని వర్ణింపఁబడెను, దీనింబట్టిచూడ ధర్మజ భీములు కౌంతేయులుగాని, పాండవేయులుగాని కానియటు పొడకట్టుచున్నది. ఒకవేళ పాండునకుఁ గృతకపుత్రులేమో ! ఆకాలంబునఁ గృతకపుత్రులు ధర్మసంతానముగనే పరిగణింపఁబడిరి.



# సూతపురాణము

## చతుర్థాశ్వాసము.



### మొత్తుకోళ్ళు

చెవిటిదేవుఁ డొక్కఁడు పాప చెవులదేవుఁ
డొకఁడు లోకపాలనఁ జేయు చుందురద్దె!
యెటులఁ బ్రార్థింపవలయునో యెఱుఁగరాదు
భక్తకోటికిఁ బ్రాణాల పైకివచ్చె.

అఖిల భువన సంవ్యాపకుఁ డంచు బుధులు
నుడువుచుందురు నినుఁగూర్చి నోటినిండ
నదియె నిజమైనచోఁ దీర్థ యాత్రలెల్ల
భగవదపచారములు గావె పరమపురుష?

పరమ సుశీలఁ బాలసుని పాలొనరింతువు మూర్ఖురాలినో
పరసుని పాలుఁజేసెదవు స్వామి! యిదేమి? ప్రపంచ మెల్ల దు
ర్భరతర దుఃఖభారమున గ్రుగ్గుచునుండఁగఁ గాంచి యెంతయో
మురిసెదవా? యిటైననిను భూస్థలి నమ్మెడు వారలుందురే?

పాఠకా! యనంతర కథావిశేషంబు, నిరవశేషంబుగా విన్పింతు సావధానుండవై యాలింపుము.

## నా గోడు

బాల్యమిత్రుల విహితుల బంధుజనులఁ
గూడి సుఖముగాఁబుచ్చితిఁ గొన్నినాళ్లు
కాని యేలొకో క్రమముగాఁ గష్టమగుచుఁ
బుట్టినూర నుండఁగ బుద్ధి పుట్టదయ్యె.

తుదకొక నాఁట నేదియును దోఁచక యూరకయుండలేక నె
మ్మదిఁగను బొంతెపె సూతముని మందను నాశ్రమభూమికేగి, కొ
న్నిదినములందె యుండి బహు నీతివిశేషములన్ గ్రహింప న
భ్యుదయము గల్గునంచుఁ దలపోయుచుఁబైనము నిశ్చయించితిన్.

బలసి బూజువట్టిన యోగ వాగలపుడె
చేతఁగైకొని యోర్మితోఁ జికిలిచేసి
తూర్పురేక లారకముందె తొందరించి
మెదలకుండ బయలుదేరి చదలబాట.

దవ్వుని యెంచకేను జనుదారిని లేవలిగాడ్పు తెమ్మెరల్
జివ్వున మోముదూసి చన జిచ్చును బొందితి నెంతయేని నా
కొవ్వమి, యేదియెట్లయిన నోపికవెట్టి మనంబు తాయిగా
నవ్వనువీధిఁ బోయితి నవాంబుదముల్ మెయిసోకుచుండఁగా.

మింట్రోవ నీగతిఁజని మిహిరుఁడల్ల
ప్రొద్దుమలమీఁదికెక్కక మున్నె గురుని
పర్ణశాల నొక్కెడ నానవాలు పట్టి
గంగయొద్దున దిగినాఁడ నంగవైచి.

# చతుర్థాశ్వాసము

అప్పటికప్పుడే సూతర్షి తనకుటీరంబు ముంగలఁగల జగతిపై నల్లని యిఱ్ఱికళానంబుఁ బఱచి కూర్చుండి నన్నుఁగాంచి, దరహసితవదనుండై, కన్నన్నరమ్మని పిలువ, సామీప్యంబునకు నేగి, సాష్టాంగ దండప్రమాణంబు లాచరించి, కూర్చుండ నన్నుఁగాంచి కుమారా! శుష్కీభూత శరీరుండవైతివేల? యన నేనును గాద్గద్యంబు బయటఁ దోఁపనీక యిట్లంటి.

పరమసాధ్వి నీలీరాగ వతి కళత్ర
మఱఁగ మునిచంద్రమతిపోయె నందుచేత
నిటుల శుష్కించి శుష్కించి యెండిపోయి
శల్యగతజీవినైతిని జావలేక.

ఈ యుదంతంబు గురువరుం డాలకించి తాత్కాలిక ముఖవికారంబు పొడకట్ట నూరకుండి తుదకు.

మఱగిన జాయ మానవతి మాన్యచరిత్ర దివంబుఁ జేరఁగా
మఱుగుట మానరాదయిన మానకచేసెడిదేమి? సౌఖ్యమే
మఱుగును గాన లోఁబొగుల మానుచుఁ బెద్దలత్రోవఁబోవుచున్
దురటిలఁబోక చూడు సుఖ దుఃఖములన్ సమభావమొప్పఁగన్.

సుఖదుఃఖములు 'కావడికుండలు' దీని నెఱింగి మెలంగిన లగ్గగు నన్ననేనును జింతదేఱి, కుత్తుకబంటి శోకమును దిగమ్రింగి, పోయివచ్చిన కార్యంబు సర్వంబు నివేదించి జన్మభూమి దుర్దశాకథనంబు వినిపించి, పురాణకథాశ్రవణకుతూహలుండనై యిట్లు ప్రార్థించితి.

# క థా ప్రా ర ం భ ము

శ్రీకృష్ణ చరితంబుఁ జెప్పవే సర్వంబు
పుట్టు పూర్వములన్ని పొందుపరచి
తలిదండ్రు లెవ్వరో ! దాయాదు లెవ్వరో !
తాత ముత్తాతలు భ్రాత లెవరొ !
ఎచ్చోట జన్మించి, యెచ్చోటఁ బెఱిగెనో
పెట్టి పెంచినవారి పేరు లేవొ !
ఎలప్రాయ మెచ్చోట నేరీతిఁ గడపెనో !
యెవరితోఁ బోరెనో యేదికోరి !

చుట్ట పక్కంబు లెవ్వరో సూడువార
లెవ్వరో ! రాజ్య తంత్రంబు నెవరిఁగూడి
యెట్లు సాగించెనో ! ఫల మేమి వచ్చి
పడెనొ ! యవసానదశ యెట్లు కడపినాఁడొ !

ఆ పెంపుఁ బసిగాపుఁ బూఁబోండ్ల పాలిండ్లఁ
బుణికి పుచ్చని దొండు పుట్టఁబోదు
రేఁబవళ్ళనకుండ ప్రేపల్లెలో ప్రేఁత
గడపఁ ద్రొక్కనియిల్లు కానరాదు
పిన్నయై వెన్నంటి వెన్నంటు పంటులఁ
గెలకకుండిన దొండు కలుగఁబోదు
"రార ! ఓరా"యంచు రాకొట్టి పిల్వని
పడుచొక్కతైనఁ గన్పట్టఁబోదు

## చతుర్థాశ్వాసము

పోకముడి విప్పనీయని పోఁకలాఁడి
రైకముడి విప్పనీయని సాకులాఁడి
బళిర! యుండరైరంట వ్రేపల్లెయందుఁ
గృష్ణు పోకిళ్ళచే నిది యెంత నిజమొ!

వరుస వావులు లేక వ్రేపల్లెనున్న
యట్టి మగవాండ్రు అంకుటాండ్రైరటంచు
సాటి లోకులు వాయెత్తి చాటుచుండ్రు
కృష్ణు పోకిళ్లచే నిది యెంత నిజమొ.

మౌనీశ్వర! చెప్పంగదె!
బోనము తినలేని పాల బుగ్గలనాఁడే
తా నత్తమిల్లె నందురు
మేనత్తగు రాధఁగూడి మేలటికమునన్.

గొల్లఁడందురు కొందఱు గొల్లగాఁడు
యాదవుండను వార్ష్ణేయు డందు రితని
గద్దెపై నెక్కరానట్టి క్షత్రియుండ
టందు రింకఁగొందరు తెల్పరా? నిజంబు.

పొగరు విలుకాండ్ర గమికాండ్ర మొగముఁదన్ని
చాలఁగైచాపు లందుకోఁ జాలునట్టి
యేకలవ్యున కీతని కేలపుట్టె
జన్మవైరంబు సంయమీశ్వర! వచింపు.

ఇదియది యననేల? శ్రీకృష్ణ చారిత్రంబున మీ రెఱింగిన యంత వట్టు మూలముట్టుగఁగల గుట్టుమట్టులఁ జెప్పరే యనవుడు సూతర్షి యత్యుత్సాహంబున నిట్లు చెప్పఁదొడంగెను:

మిహిర బింబముఁగప్పు మిడుత దండునుబోలె
నార్యులు దండెత్తి యాక్రమింపఁ
బొరిపుచ్చఁజాలక యరికట్టనేరక
ప్రాలేయ భూధర ప్రాంతభూమి
'ద్రావిడమన్నీలు' త్యజియించి యందుండి
మధ్యదేశముఁజొచ్చి మాటుపడుచు
పంచబంగాళమై పొంచియుండిన సేన
గుదికట్టి యందందుఁ గూర్చి పెట్టి

చిన్నిరాజ్యంబు లెన్నియో సేకరించి
యేలుకొనుచుండ్రి వారు దోర్లీలమెఱయ
వేరమియు నొంటరములేక బెట్టుతోడ
కాలవైపరీత్యమునకుఁ గళవళించి.

పుండ్రహైహయ చైద్య భోజాంధకదశార్హ
సాత్వత యదువృష్ణి జాతులెల్ల
మధ్య దేశమునందు మహిత బలాఢ్యులై
యీతి బాధలులేక యేలుకొనఁగ
మాగధుండైన దుర్మదవైరివీరభం
జనపటిష్ఠుఁడు జరాసంధ విభుఁడు
సార్వభౌముండయి జనరంజకముగ నే
కాతపత్రముగాఁగ నవనియెల్ల

నేలుచుండ నార్యులు భీతి యినుమడింపఁ
దేఱిపాఱఁ జూడఁగలేక దినదినంబు
కుటిల దుస్తంత్రములు పన్ని కొన్ని యెటులొ
వీనిఁ దెగటార్పఁ దలపెట్టి వేచియుండ

## చతుర్థాశ్వాసము

కొండలచుట్టు నేర్పుమెయిఁ గోటనుగట్టి గిరివ్రజంబునాఁ
గొండొకపత్తనంబు ననుకూలముగా విరచించి దానిలో
నుండి బృహద్రథాత్మభవుఁ డొడక రాజ్యముఁ జేయుచుండె దో
శ్చండిమ జాతివైరులను జంపుచు నింపుచుఁ గీర్తి నెల్లెడన్

ఆ గిరివ్రజపురికి రహస్యపథము
కల దొకండందు నెవరైనఁ గాలువెట్ట
దుందుభులు మ్రోగుఁ దమయంత తూఁటుగట్ట
నెల్లరికి వారిరాకెల్ల నెఱుకపడఁగ

దేవీ పూజారహితుఁడై
పావనుఁడై విప్రభక్తి పరతంత్రుండై
యేవేళ నీతిదొరఁగక
భూవలయము నేలుచుండెఁ బోడిమినతఁడున్.

యాదవపాదపంబునకు నంధక సాత్వత వృష్ణిభోజులున్
మీఁద దశార్హవర్గమును మిక్కిలి కొమ్మలు వీరలెల్లరే
భేదములేక యెల్లపుడు వేడుకతో మధురాపురంబులో
వాదులు పుట్టకుండఁ బరిపాలనఁజేతురు ధర్మబద్ధులై.

రాజ్యకాంక్ష వీరలు మధురాపురంబుఁ
జేరుటకు ముందరణ్యాని జీవనంబు
సల్పుచుండెడివారు దోశ్శక్తి నమ్మి
వ్యాధవృత్తినిఁ జేపట్టి వాడికల్గి.

యోజింప యదువృష్ణి భోజాంధకాదుల
రాజవంశమువారు భోజకులులు
రాజయ్యె నందుచే భోజకులుండై న
యుగ్రసేనుండు యథోచితముగ
కంసాదు లాతని కన్నబిడ్డలు దేవ
కీదేవి కంసపృధ్వీదయితుని
పినతండ్రి దేవకజనపాలకుని బిడ్డ
యైనప్పటికిఁ గంసుఁ డామె సాఁకు
చుండె నుగ్రసేనుఁడు వృద్ధుఁ డోపకున్కి
రాజ్యభారంబు వహియించెఁ బ్రాజ్యలీలఁ
గంసభూజాని మధురఁ జీకాకులేక
ప్రజల గాపాడుచుండె దోర్బలము పేర్మి.

బాంధవకోటి మెచ్చ నతి వైభవ భాసురలీలతో జరా
సంధుఁడు ధైర్యశాలియుఁ బ్రశస్త గదారణ శౌర్యశాలియున్
సింధురవైరివిక్రముఁడు చేసెను బెండ్లికొమార్త లిర్వురన్
బంధురబాహుశాలియగు పార్థుఁడు కంసునకిచ్చి పేర్మితో.

వినుము వసుదేవుఁడు కులము పెద్దయయ్యె
సకల యాదవ వార్ష్ణేయ జాతులకును
నతిపురాతన సంప్రదాయమ్ము చేతఁ
గాని బాహుబుద్ధిబలమ్ము కలిగికాదు.

వైరి సంహతిఁ గడతేర్ప బలములేక
దేశము జయింపఁ దంత్రముల్ తెలియలేక
యౌర! పదుముగ్గురను బెండ్లియాడె నాతఁ
డొండు తోఁచక యూరకే యుండలేక

భోజవంశ్యులకును యాదవులకు నెపుడు
లోని పగలును బయలి చెల్మిలును గల్గి
యొకరినొక్కరు లో నమ్మ కుందురెందు
దురభిమానంబు నీర్ష్యయుఁ బఱగుచుండ.

జనబాహుళ్యము కలుగుట
జనపతి తమ వంశమందు సంభవమగుటన్
జనులను మెచ్చకమురితోఁ
జనుచుందురు భోజకులులు సంభ్రమపరులై

కృతవర్మయు నక్రూరుఁడు
శతధన్వుండును బ్రసేన సత్రాజిత్తుల్
పతులై భోజాంధకులకు
నతులగతిం దోడుపడుదు రవనీపతికిన్.

పెండ్లియయ్యెఁ బన్నిద్దరఁ బెళ్లమంచు
భోజకులముతో వియ్యంబుఁ బొందఁగోరి
జంకక పదుమూఁడవసారి శౌరసేని
మరులు పురికొల్పఁ బెండ్లికుమారుఁడయ్యె

ఓవనివారలుందెగడ నుబ్బరికించుచు భోజవంశ్యుఁడౌ
దేవకుకూర్మి బిడ్డయగు దేవకిదేవిని బెండ్లియాడె, ధా
త్రీవరుఁడై నయట్టి వసుదేవుఁడు భోజుల ప్రాపుగల్గువం
చీవిధిసంతసిల్లుచు నభీష్టములన్నియుఁ దీరునంచొగిన్

కట్టః దేవకిమెడఁ దాళిబొట్టుగట్టి
నపుడె తన కురిత్రాడంచు నఱయఁడయ్యెఁ
గంసుఁడేమందుఁ జిత్రంబుగాదె? చెపుమ!
యెప్పుడేవని యెటులౌనొ యెవ్వఁడెఱుఁగు?

బావను జెల్లెలిఁగంస
క్ష్మావరుఁడనుకంపఁ జీర సారెలనెన్నో
ప్రోవిడి యరణంబిచ్చి మ
హా విభవముతోడ వారి నంపెఁ బేళన్

తేఱికొన్న దెందములతోఁ దేరిచూచి
తేరుపై నెక్కి వారలేతేరదారి
వారినవ్వారిగా ఘర్మ వారి పట్టి
సేదదేర్చికొనంగఁ బ్రస్వేదముడిపి

తెల్లనియెండ వీడ్వడుమ దేవకియున్ వసుదేవ కంసులున్
జల్లని చెట్టు నీడ వెదఁ జల్లఁగ హాయిగఁ దేఱుకిగ్గి య
ల్లల్లన విశ్రమింప నడయాడుచు నందఱు చెట్లక్రిందకున్
మెల్లనపోయిపోయి విరమించిరి యచ్చట నింతలోపలన్

సమయంబునకై నిరీక్షించి, వెన్నాడి వచ్చుచు దట్టంపుఁ బొదల నట్టనడుమ నడంగి,

ఆకాశవాణియనుకొనఁ
గూఁకలనిడె నార్యతాంత్రికుఁడొకఁడు "కంసా!
యీ కాంతాష్టమగర్భము
పోకార్చెడి విన్న"టంచుఁ బొడఁగట్టకయే

ఈ మాటలు చెవింబడిన వెంటనే యులికిపడి కంసుఁడు—

కొంచించి యేమిచెప్పక
యించించుక నమ్మినమ్మి యేమయిననరే
వంచించి చెల్లెలిని మా
యించన్ మది నిశ్చయించె నేమనువాఁడన్

## చతుర్థాశ్వాసము

కుటిలకుంతలఁజూచి కుటిలాత్మకుండయ్యెఁ
గుటిల ప్రచారముల్ పెటిలుచుండ
శాతోదరినిజూచి శాతసత్వుఁడయ్యె
శాతాసిఁబాపంబు సల్పనెంచి
వక్రాలకంగాంచి వక్రమార్గుండయ్యెఁ
బ్రక్రమనయమెల్లఁ బాడువార
చపలాక్షిఁ బొడగాంచి చపలభావుండయ్యెఁ
గృణపణవృత్తికిఁజొచ్చి యపనయింప

స్వార్థమెంతటి పెడదారి పాలుసేయుఁ
దోడఁబుట్టినయామెను దోడునీడ
యైన యామెను దరవాయి యలుకతోడ
గొప్పతరవారిఁజేఁబూని కూల్పనెంచె

అంతటఁ గంసుని ముఖనై లక్ష్యం బుపలక్షించి వసు
దేవుఁడడ్డంబు సొచ్చి దీనస్వరంబున,

సిరి సంపత్తులు, భోగభాగ్యములు దాసీదాస సంతానముల్
మెఱుపుందీవలు నీటిమీది బుడగల్ మీసాలపైఁ దేనియల్
పరమార్థజ్ఞులు వీనినమ్మి యెపుడున్ బాపంబు గావింపఁబో
వరుసుంతేనియుధర్మదూరులయి బావా! నీవు చింతింపవే.

తల్లిమాటునఁ బెఱిఁగిన పిల్ల, బేల,
వాలకం బెఱుఁగని గోల యేల? చాల
వాలుకందోయి కన్నీటి జాలువెడల
బాల బొరిపుచ్చఁబాడియే జాలిలేక

మంగళాభ్యంజన మహితకేశంబుల
నట్టొట్లుపడుట మానంగలేదు,
అగురుకెంజిగురాకు నవఘళించెడునట్టి
యడుగుల పారాణి యాఱలేదు
పచ్చబ్రాల్ తలనుండి పడుటచే నైనట్టి
పసుపు బట్టల నేని పాయలేదు
క్రొత్త పెండ్లికొమార్త కొంగ్రొత్తగాఁబొందు
మందాక్షమైనను మానలేదు.

పెండ్లిపీటలపై నుండి పెళ్ళగించి
యత్తవారింటి కంపెద నరణమిచ్చి
యంచు గొనివచ్చి చెల్లెలి నక్కటకట!
గొంతుగోఁయుట ధర్మమా చింతమాని?

కావునఁ గరుణింపవె యొక
త్రోవను జూపింతుదాన దొలఁగుమనీకున్
బావా! ప్రాణభయము మఱి
దేవకిజీవంబునిల్పఁ దికమకలేలా?

బిడ్డలు పుట్టినయపుడే
యడ్డంబులు చెప్పకుండ నర్పించెదనే!
సొడ్డులు తలపెట్టక నీ
వొడ్డారింపకయె ప్రోవు ముగ్మలిననినన్

భోజకులైకభూషఁడు ప్రభూతముదంబున నాలకించి యం
భోజముఖిన్ సహోదరిని ముగ్ధను నూరక చంపనేల? యీ
యోజ నుపద్రవంబుడుగు చుండిన నంచుఁ దలంచి వెంటనే
వాజులఁబూన్చి తేరుపయి బావను జెల్లెలిఁ బెట్టితోలుచున్

అత్తవారింటి కిర్వుర నంపి, తిరిగి
వచ్చి కంసుండు తల్లడ పాటుఁదొరఁగి
కొంతకాలంబు మధురలోఁ జింతలేక
యుండ నఖిలమాదమఱచి యొక్కనాఁడు

వసుదేవుఁడు తొలికాన్పును
గసిగందును దెచ్చియీయఁ గంసనృపుండున్
గసిమసఁగం జేయాడక
పసిపాపను నిచ్చి చెప్పె వసుదేవునితో:

ఈ పాపని మూలంబున
నాపత్తులు నాకు నేమి యరుదెంచును? పో!
పో! పాపనిఁ గైకొని నే
నీపనిఁ జేయంగనేర నెట్లయిన సరే!

అని చెప్పి కంసభూజాని వసుదేవునిఁ బంపివైవ, నేనాఁడు కంసుండుదరిపడి. తనకుఁ బ్రాణోపద్రవంబుఁ గలుగఁజేయునో; యేనాడు తనకన్నబిడ్డనుఁ దనకుగారుండఁజేయునో యను భయంబు నిరంతరంబు పీడించుచుండఁ జేయునదిలేక—

ఆనక దుందుభి భయమును
మానక శోకాగ్ని దగ్ధమానసుఁడగుచున్
మానవనాయకుఁ జంపఁగ
దైనందిన మధికకుటిల తంత్రుండగుటన్

చక్కఁగఁ గంసుఁ డిదియెఱిఁగి
గ్రక్కున వసుదేవుఁబట్టి కారనుబెట్టెన్
గ్రుక్కిళ్ళు మ్రింగ సతితో
వెక్కసమైనట్టి కోప వేగముచేతన్

గర్భవతిగానఁ జెఱసాలఁ గాపువెట్టి
కన్నబిడ్డను మ్రందించి కత్తివాతఁ
బ్రాణభీతిని సర్వంబుఁ బాపికొందు
ననుచు నట్టహాసంబుతో నతఁడు పల్కి

మనంబు సంచలింప సంశయగ్రస్తుండై యిట్లు తలంచె:

అష్టమగర్భంబనుసుతి
స్పష్టముగా నేను విన్నవాఁడనా లేదో!
కష్టము నాకేటికి నా
యిష్టము వచ్చిన తెఱఁగున నేఁ జరియింతున్

బూమెలు చెప్పఁగ నేలా?
యేమనుజుని నమ్మనేల? 'యేపుట్టను నే
పామున్నదో' యెవ్వఁడెఱుఁగు?
ప్రామిటి యన్నంత నేమి పై బడునంచున్?

గొల్లరు మనఁ దలిదండ్రులు
నల్లరనెల్లరను బట్టి హతమొనరించెన్
జెల్లాచెదరై పోయిన
యుల్లము కుదుటఁబడఁగంసుఁ డుగ్రుండగుచున్.

అంత గొన్నాళ్ళు చనిన యనంతరమ్ము
చెఱను దేవకి ప్రసవించెఁ జిన్నికృష్ణు
దొంగప్రొద్దున నెల్లరు దొంగినపుడు
కావుకావంచు మార్మ్రోగెఁ గారయెల్ల

## చతుర్థాశ్వాసము

తల్లిదండ్రులు శోకమోదములఁబొంది
వీని బ్రదికించు టెటులంచుఁ బిటికిఁబడఁగఁ
గడకు వసుదేవుఁ డారాట ముడిగి పిదప
నొక యుపాయంబుఁ దలపోసి యొదిగి యొదిగి

కావలివారిఁ గట్టికొని కాళుల సంకెల లూడ్చివుచ్చి యా
త్రోవకు నడ్డమౌ యమున తోయములం దిగి, పాటిరేవులో
నావలిగట్టుఁజేరెఁగద యానక దుందుభి నెత్రుకందుతోఁ
గేవల పుత్రమోహమునఁ గ్రిందును మీఁదునుజూడకుండఁగన్

నెత్తురుకందును తొమ్మిన
హత్తించికొని వసుదేవుఁడరిగె నిశీధిన్
బిత్తరపడ కడవింబడి
యెత్తిన యీ పుత్రమోహ మెంతకుఁదగదో ?

నందగోపకుండు బృందదగ్గఱకాన
వల్లవులను గూడి పల్లెఁ గట్టి
యాలకదుపులెన్నొ యార్జించెఁ గొల్లఁగా
సొమ్ములన్ని తనకు సొమ్ముఁగాగ

ఎచ్చట జూచినంబసులె యెచ్చట జూచినఁ దొడ్డుపట్టులే
యెచ్చట జూచినన్ గదుపు లెన్నియొ మేపు కిలారి మూఁకలే
పచ్చని బీళ్ళపైఁ బరుగు వారెడి చక్కని కోడెదూడలే
ముచ్చట గొల్పుచుండు వనభూముల నందునిపల్లెయంతటన్.

గోరాడు గుట్ట మెట్టల
గోరాజులు బటువుగుబ్బ కొమ్ములచేతన్
గాలిలు తిరిగిన మెడలును
గాలినలుపు మూపురములు గలిగి కడంకన్

పుల్లావు లొకవంకఁ బుల్లు మేయుచునుండ
నల్లావు లొకవంక నమలుచుండ
కఱియావు లొకవంక గాడివద్దను మేయ
దోరావు లొకవంక దొడ్డినుండ
మసరావు లొకవంకఁ గసవు మేయుచునుండ
మైలావు లొకవంకఁ బాలుపితుక
వెల్లావు లొకవంకఁ బేరెమేగుచునుండ
బట్టావు లొకవంక బయట నిల్వ

పొందుకల్గి నందుని యాలమందపట్టు
దోసతోటట్టు చేయుఁ గందోయి విందుఁ
బాడికదుపులు కొదలేక పాడియిచ్చుఁ.
దమకుఁ దమవారికిని వెక్క సమగురీతి

కదలుచేయని కోడెలు కాలుద్రవ్వ
మోరవంచి అంకెలిడ మార్మ్రోగ దొడ్డి
కట్టు కారుపెయ్యలు తోక లట్టెయెత్తి
మెడలు సారించి మూచూచు మేఁతమాని

తలుగులమోపు, చిక్కములు దామెనలున్ మొగముట్టుచుట్టలున్
బలుపులు, కట్టుగుంజగుదిబండలు, పెన్ సెలకోలకట్టలున్
బలుతలత్రాళ్ళు, మువ్వమెడ పట్టెలు, బందము, లెన్నియెన్నియో
కలిగిన నందగోష్ఠములు కన్నులపండువు సేయు నిత్యమున్

బదుగుక్రేపుగాని చెడిపెపెయ్యయుఁగాని
గోనయావుతెవులు గొంటుగాని
కరటువంజగాని కనముమందునకైన
నందునాలమంద యందునెందు

## చతుర్థాశ్వాసము

అతని ధర్మపత్ని యశోద యనెడి యామె
యాడుబిడ్డను బ్రసవించె ననుట తెలిసి
యాత్రపాటుతో బిడ్డను నదిమికొనుచు
నేమియో తలంచికొనుచు నేగెనటకు

వెలుగుకోటలేని బ్రేపల్లియను నేగి
కదలకుండ నంత మెదలకుండఁ
బొంచి పొంచి పోయి పురిటాలిపొదిగిళ్ల
బిడ్డనుంచి, యామెబిడ్డఁగొనుచు

కటికచీఁకటిలో దాఁకొత్తోలియుచుచే నిట్టట్టుఁబడిపోయి తుట్టతుదకెట్టులో మరల యమునదాటి చెఱసాల బ్రవేశించి, యాడుచంటిపాపను దన పురిటియాలికిచ్చి యేమియెఱుంగని వానిఁబోలెఁగాళ్ళను సంకెళ్ళు తగిలించుకొని యందు నివసించుచుండె. ఇంతలో జెల్లెలు ప్రసవించినమాటఁ గావలివారివలనఁ దెలిసికొని కంసుండు గారాగృహంబున కరుదెంచి చెల్లెలు కంటదడపెట్టి వలవల వాపోవుచున్నను సరకుసేయక పసికూనను బలవంతముగా విసరి లాగికొని యట్టె యాకసమున కెగురవైచి కత్తివాత కెఱఁజేసి మగిడి చనియె. ఇంకనచ్చట వ్రేపల్లెలో—

నందునింటను గృష్ణుఁడా నంద గరిమఁ
బెరుగుచుండెఁ బెరుఁగుఁ బ్రావి వెన్నఁదినుచు
నామెతగమేను మిసమిస లాడుచుండ
నేమితక్కువ కలవాని యింటబిడ్డ?

నందగోపకు చెల్లెలు నాతిమిన్న
రాధయనునామె ప్రేమైక రసముతొలుక
సతత మల్లారు ముద్దుగా సాఁకుచుండె
ముద్దుకృష్ణుని దుండగంబుల సహించి

ముద్దుకృష్ణుండు క్రమముగాఁ బెద్దయగుచుఁ
గొంటెకృష్ణుఁడై యావుల వెంటబడుచుఁ
గానలన్నియుఁ దిరుగుచుఁ గాయనేర్చె
నెటులఁ దృజియించుఁ గులవిద్య నెవ్వఁడేని ?

మందకట్టుఁదప్పి మర్యాదలనుదప్పి
మందఁగాయనేర్చె మందలందు
మందకాయువారు మందెమేలమ్మంద
మందలందునేర్చె మాటలెన్నొ

నందుం డా వ్రేపల్లియ
కుందొర యచె లేక లేక కొడుకొక్కఁడచే
దుందుడుకు పనులు నేర్వక
మందునివలె నెట్టులుండు మర్యాదలతో ?

గారాపుబిడ్డఁ డగుటన్
మారాములు పెక్కుఁజేసి మఱిమఱియెన్నో
పోరాములు గూర్చికొనియె
నారామలతోడఁ గృష్ణుఁ డభిరాముండై

ఒకొక్కనాఁడు కొంటెకృష్ణుండు చెలికాండ్రనుగూడి
యమునానదీతీరంబునఁ విల్లంబులు దాల్చి తిప్పకాయమై—

## చతుర్థాశ్వాసము

గోపికలు నెత్తికుదురుపైఁ గుండలుంచి
కొనుచు యమునాజలముఁదెచ్చికొనుచునుండ
నొక్కయమ్మనఁ గుండకు బొక్కవెట్టి
నీరుకారనీ కప్పుడే నిల్పునొకట

మందలకడనుండియుఁ దాఁ
బెందలకడ రాఁడిదేమి వేడబమనుచున్
వందురు నెప్పుడు ముంగిట
ముందల మేనత్తరాధ ముటిముటిపడుచున్

ఇంటికి వచ్చిన వెంటనె
తుంటరి; మేనత్త రాధ తొందరపడి వె
న్నంటుచు "నాయన్న జడిసి
కొంటివె" యని బుజ్జగించి కొంపోయివెసన్

ఆవు వెన్నతో నొడలెల్ల నలమి తోమి
గోరువెచ్చని నీర్పోసి కోకఁదుడిచి
యగురు సాంబ్రాణి పొగవెట్టి యప్పుడపుడె
"రార ! నాయన్న !" యని చెప్పి రాధ యంత

ఆవునేతిలోఁ బొరలించి నట్టి కూర
గాయలాఱురసంబులు గల్గు మేలు
వంటకము సిద్ధపఱచి సాపడఁగబెట్టి
కడను గూర్చుండుఁ కృష్ణుండు గుడుచునపుడు

యాదవుండయ్యె యదువంశ మందుఁబుట్టి
గోపకునియింట వర్ధిల్లి గొల్లఁడయ్యె
దానిచేత గోపకులు యాదవులుగారు
యాదవులు గోపకులును గా రటసిచూడ

యదువంశాంతర్గతమయి
పొదలిన వృష్ణికులమందుఁ బుట్టుటచేతన్
బదిలుఁడు శ్రీకృష్ణుఁడు భూ
విదితుఁడు వార్ష్ణేయుఁడనెడి పేరన్ వెలసెన్

ఇట్లు శ్రీకృష్ణుఁడు శైశవక్రీడారతుండై నందగోష్ఠంబులఁ దిరుగువేళ—

రాధ యనుగోపబాలికా రత్నమోర్తు
నవ్యతారుణ్యలావణ్య దివ్యగాత్రి
నందు మందఁగీలారి తనమ్మునందు
మెలఁగుచుండును సర్వదా మిట్టిపడుచు

కాలగతి నేపల్లెలో నందుని యాలమందలో నొకరితో నొకరికిఁ బొత్తుకుదుర రాధాకృష్ణు లిర్వురు నీడుజోడై శైశవ క్రీడల నిరంతరంబు ప్రొద్దులు పుచ్చుచున్న కతంబునఁ బరస్పరానురాగంబంకురించి క్షణక్షణ ప్రవర్థమానం బగుచుండ—

ప్రొద్దుపొడుపుమొదల్ ప్రొద్దు గ్రుంకువఱకుఁ
జిన్నికృష్ణరాధలకట్టై చెలిమికల్గి
యొకరినొక్కరు విడనాడి యుండలేక
తనిసి వింత సుద్దులు చెప్పుకొనుచునుంద్రు

ఈరమలనుదూరి యేటితీరముఁ జేరి
చెట్టునీడ నిక్కి గట్టులెక్కి
ప్రణయమగ్నులగుచు రాధికాశ్రీకృష్ణు
లాడుకొందు రెవరు చూడకుండ

## చ తు ర్థా శ్వా స ము

మువ్వకోడెల మెడనూలి మువ్వలులియ
మురువునడచేత మొలనూలి మువ్వలులియఁ
దమ్మితూఁడుచే నదలించి తఱుముకొనుచు
వచ్చు రాధ శ్రీకృష్ణుని వజ్జకెపుడు

వెన్నెలకారునం జెలఁగి వెన్నెల నవ్వున వెన్నుఁ ద్రొక్కుచో
వెన్నెలరేల రాధఁగొని వెన్నెలకుప్పల నాడియాడి యా
వెన్నెలపుల్గులో యనఁగ వీడక జోడుసుగూడియాడుచున్,
వెన్నలదొంగ రాధయును బృందఁ జరింతురు బద్ధరాగులై

ఇఱుకు గుబ్బలమధ్య యిటికి పిసాళించు
పుంజాలదండ చన్మోనలఁజిక్క

పుంజాలదండలోఁ బువ్వాటలాడెడి
పులిగోరు పతకంబు గులకరింప

తొడవుగా నిడినట్టి మెడనిండ మెలివడ్డ
గురివెందపేరులు గునియుచుండ

పచ్చరాల్ దాపిన యచ్చగుండుల సరుల్
మిట్టుగుబ్బలమీఁద మిడిసిపడఁగ

నడ్డబాసయు ముంగెఱ నటమటింపఁ
గాలియందెలు గల్లురు గల్లురనఁగఁ
జొక్కపుందీవి రాధిక చొక్కుచుండుఁ
దనదు సోయగంబునుజూచి కొనుచుఁ దనిసి

తుఱుము విదల్చుచున్నపుడు తొంగలిఱెప్పమెదజెక్క వెండ్రుకల్
పిఱుఁదులమీఁద జారిపడి పెళ్కుటి మిట్టిపడంగ ముంగురుల్
మురువుమొగంబుమీఁదఁ బడ ముద్దులమూటనుగట్టు రాధికా
తరుణి హరించుఁజూపరుల ధైర్యము పుత్తడి బొమ్మలాగునన్

# సూ త పు రా ణ ము

ప్రొద్దుపొడవక మునుముందె పొరలిలేచి
దూవుముడిలోన విరిపూలు తుఱిమి, తుఱిమి
చెలఁగి చిన్నికోలను రాధ చేతఁబట్టి
తోలుకొనిపోవు నామంద దొడ్డినుండి

జాఱుపయ్యెఁటనట్టె సవరించు నెపముచే
వలుఁదపాలిండ్లఁ గన్పఱచుచుండు
కందోయి మూసికో కలదు చిత్రంబంచుఁ
బూదుమారంబులో ముంచిమెత్తు
గుమ్మపాలను దెచ్చి కోకొమ్ము నాసామి
యనిపాలదుత్తను నందియిచ్చు
కనుగొమ్ము నే నెవర్తనొ యంచుఁ గనుమూయు
వెనుకగా బొమ్మలు వెన్నునాన్చి

తెలిసియో తెలిసికొనకో కలికిమిన్న
దొంగకృష్ణుని ప్రేమంబు దొంగిలింప
జగములన్నియు దిగ్భ్రమింగఁ జాలుజాణ
కందచందము లెన్నియో యట్టెచూపు.

మిట్టుగబ్బిగుబ్బల మొనల్ మీటి చింపు
ననుచుఁ జనుకట్టును దొడిగి కొనుటమాని
పైఁట చెఱఁగున బొమ్మల పట్టుఁగప్పుఁ
బట్టి యెఱుఁగఁబోమిటువంటి పొదుపులాఁడి

రాగములేని రాధ యనురాగము క్రొన్నన సాగుచుండఁగా
రాఁగ ముదంబు కృష్ణుని సరాగములాడెడి కోర్కెపుట్టఁగా
రాగముఁదీయుచున్ సుమపరాగము పై విదలింపఁ బట్టుకో
రాఁగ మురారి, యుందకయె తాఁగతనంబున దాటు జాణయై

వెన్నుఁడు రెండుచేతులను బిల్లనగ్రోవిని గావిమోవిపైఁ
బన్నుగఁబెట్టి మైమఱచి పాడుచునుండఁగ బూవుఁబొత్తులన్
గొన్నిటిఁదెచ్చి వంశమునకుం గయిసేయుచు రాధ మాయమై
మన్ననమాలి పూఁబొదల మాటున డాఁగిలిమూఁతలాడెవిన్

కొండగోఁగులపూలు కొండె సిగం జుట్టి
కొండాడుచుండు మా కొండఁడంచు

నెమ్మికుంచియఁ దెచ్చి నెత్తిపైఁ గుదిరించి
కుదిలించి యూఁగించి కులుకులాడు

బుట్టటకొమ్మలో బుక్కాము విరఁజిమ్మి
"యేర! మాధవ!" యంచు నెత్తిపొడుచు

బొండుమల్లెలదండ దండ చేతికిఁగట్టి
దండంబు నిడుచుండు దండవిల్చి

పూనిగొల్లెత వాతెఱ పానకంబొ!
పూవుఁదేనియయో! యిచ్చుఁ బుక్కిలింత
కలవిగాకుండ, నావోవు నామతించి
జాజిపూవుల పొదరింటి చవికెయందు,

కేతకీ కుంజంబు క్రేవల కేగితే?
చెక్కిళ్ళపై నుండెఁ జిన్ని గీట్లు

వకుళావనీజంబు వద్దకుఁ బోయితే?
మొగమెల్లఁ బుప్పొడి పులుముకొనియె

క్రొమ్మావిగున్నల క్రొన్ననల్ కోసితే?
యెంతొ నీ మునిగ్రేళ్ళ లెఱ్ఱవడియె

ముండ్లతీవెలుగల్లు పొదరిండ్లు దూరితే?
చెదరి నీకీల్గంటు చిక్కువడియె

నొక్కచోటను నీవు కూర్చుండలేవె ?
కాలు కుదరదే నీకెందు? బాలయంచు
చిట్టివ్రేలితో మెల్లగాఁ జెంపమీటి
ముద్దుకృష్ణుండు రాధను బుజ్జగించు

కర్ణికారముఁదెచ్చి కర్ణయుగ్మంబున
సొగసుగాఁ గీలించి సొక్కుచుండు
మెట్టదామరదండ మెడనిండ దిగవైచి
ముసిముసి నవ్వులో మునుఁగుచుండు
కలువపూవులపేరు కలకంఠి సిగచుట్టు
జాఱకుండఁగఁ జుట్టి సంతసించు
పొగడొందు క్రౌంచావి పొగడపూవుల సరుల్
మణిబంధమునఁ జుట్టి గొణుగుచుండు

మోముదమ్మిపైఁ బుప్పొడి బొట్టుపెట్టి
యూఁగు నెమలియీఁకలఁజూచి యురలినవ్వు
ముద్దుకృష్ణుని రాధిక ముద్దులిడుచు
మెలఁగు బృందావనీవీధి మేసుమఱచి

రోమాంచలముచేత రోమంథములు మాని
నిలువుగ్రుడ్డున నాలు నిలిచియుండ
కాళింది బేడిసమీలెల్ల నెదురెక్కి
వేలంబునకుఁజేరి వినుచునుండ
గండ్రమాకుల డిగ్గి కాలాహితండంబు
నిలువునఁ బడగెత్తి నిలిచియుండ
వ్రేపల్లెలోనున్న వ్రేతలు గుదికట్టి
పనిపాటలను డించి వచ్చుచుండ

# చ తు ర్థా శ్వా స ము

చాల విరిపూలు జలజల రాలుపొగడ
నీడలోనఁ ద్రిభంగిగా నిలిచియుండి
మురళి చేఁగొని విశ్వ సమ్మోహనముగఁ
బాట పాడును దనరాధ ప్రక్కనున్న

ప్రొద్దున మేలుకాంచి నవ మోహిని రాధఁ దలంచికొంచు వే
చద్దిని వెన్నతో మెదిపి సాపటి మెల్లనమూదు గ్రోవినిన్
దద్దయుఁబట్టికొంచుఁ దన దారిని మందకుఁబోవు నెప్పుడున్
ముద్దియమైన రాధనెటి ముద్దుమొగంబునుజూచు కోర్కెమై

వాగరమ్ముల వలె నను
రాగాతిశయమ్ము చేత రాధాకృష్ణుల్
భోగాభోగముల మఱచి
యోగీశ్వరులట్టులుందు రొకమై యెపుడున్

ఇంటికడ మందకడ రాధ కృష్ణమూర్తి
కన్నుదోయికి నిండారఁ గానుపించుఁ
గృష్ణునకు రాధమయమయ్యె నీజగంబు
పగలురేలను భేదంబు పాసిపోవ

బృందయంత గోగోపికా బృందమెల్లఁ
గృష్ణమయమై కనుంబడు నెల్లయపుడు
రాధికాచకోరాక్షి నేత్రయుగమునకు
నొండుగనరాదు శ్రీకృష్ణు డొకఁడుదక్క

ఓరంత పొద్దొకందే
యూరంతయుఁ దిరిగితిరిగి యుబలాటముతో
గోరంత భయములేకయె
కేరింతలవింటి కరుగుఁ గిలకిలనగుచున్

ముక్కుఁగోళ్లబిగించి మోరెత్తుముడిగిబ్బ
నలచేతి దెబ్బతో నదిమిపట్టు
కాల్దువ్విపోరాడు కారుగిత్తలనొత్తి
యొక్కఁడే పోరాట ముడుపుచుండు
అంకెవేసెడికోడె యంకెవేసిన మట్టి
తెగియించి చెవిఁబట్టి తెచ్చునొకఁడె
కాళ్ళబందెముదూసి క్రేళ్లువారెడినట్టి
బదరించియొక్కఁడే పట్టితెచ్చు

ఒరులు సేయంగనేరని బిరుసుపనుల
నెన్నియెన్నియో చేయుచు నెన్నరాని
మిత్రకోటిని గడియించి మెలఁగు నవవ
రతము, కృష్ణుండుయౌవనా రంభవేళ

జగజెట్టిచనుదేరఁ జలపట్టి పోరాడి
తనచల్లడముక్రింద ననుపుచుండు
బుసకొట్టునెలత్రాఁచుఁ బుట్టకల్గుననుండి
వెస బైటకునులాగి విసరికొట్టు
అలవోకకారుదున్నల కొమ్ములనుబట్టి
నిమిషంబులో వాని నిల్వరించు
ఎత్తైన నెత్తమ్ము లెగబ్రాకి గండభే
రుండకులాయముల్ రోయుచుండు

ఆకతాయి పనులనిట్టు లాచరించు
గోపబాలురతోఁగవ గూడిబృంద
విందుమురితోడఁ జరియించు చుండు నవవ
రతము కృష్ణుండు యౌవనారంభవేళ

చ తు రా శ్వా స ము

వాసింపన్ శారద రజనులున్ బాండురజ్యోత్స్నచే ము
ల్లాసంబొప్పన్ వ్రజ తరుణులెల్లన్ బిసాళింప రారా
జైసంతోసిల్లి మురహరుఁడున్ యౌవనారంభవేళన్
రాసక్రీడా చతురుఁడగుచున్ రాజిలున్ బృందలోనన్.

కారానిపోరాని గహన భూములనెల్ల
ద్రిమ్మరీఁడై దిమ్మ దిరుగనేర్చె
తెలినీట యమునలో జలకమాడెడి గోపి
కల కోకలను మూటఁ గట్టనేర్చె
తనతోడనాలమందలఁగాయు వ్రేతలన్
జిట్టంటు చేతలన్ ముట్టనేర్చె
కొండాటమునంగోరి కొంపకొంపలు దూరి
మిసిమివెన్నలముద్ద మెసవనేర్చె

కొంటెతనమేల రాకుండు గొప్పయింటి
బిడ్డకును జెల్లుబడి యుండ నడ్డమేమి ?
అవును గాదనువారెవరైన నుండు
వారె నిజముగా నొక గొల్ల పల్లెయందు

క్రమముగా శ్రీకృష్ణుండు పెఱిగి పెద్దయై చెలరేఁగి,

ఒకనాఁడు పెనుబంటి నూఁటి కూలఁగఁదన్ను
నొకనాఁడు పెన్త్రాఁచు నుక్కడంచు
ఒకనాఁడు సుడిగాలి నురలించిమొగఁజిమ్ము
నొకనాఁడు కార్చిచ్చు నుమిసివైచు
ఒకనాఁడు గాడిద నోడించి పొరిపుచ్చు
నొక్కనాఁడాంబోతు నుసురుఁదీయు
ఒకనాఁడు యమునలో నుంకించి వెసదూఁకు
నొకనాఁడు రాకాసి మొకముఁదన్ను

వీనిఁ గనుచున్న రాధిక బేలుపోయి
దేవునంతటివాఁడంచు భావమందు
నమ్మి ముద్దుకృష్ణుని ప్రక్క నక్కియుండి
నిరతమాతని జపియించుఁ బరవశమయి

మరులు జడవేసి కైసేసి మరులు గొల్పఁ
"జెన్నకృష్ణుండు" రాధిక చీర చెఱఁగు
గట్టిగాఁబట్టికొని, పోవుఁ గాలికొద్ది
మరులు జడఁద్రొక్కినటువంటి మనుజుఁబోలె

పసులను గాయఁబోయెడి నెపంబున మందకు బోయికృష్ణుఁడున్
బసులనుగాయకుండఁ బొరపాటుననైనను, రాధఁగూడుచున్
దుసికిలుచుండెనంచువిని త్రొక్కిసలాడక మేనయత్త తా
ముసిముసినవ్వునవ్వుకొని మోదమునందుచునుండు రాధయున్

రాధికఁగూడిమాడి యనురాగమునన్ నిరతంబునున్ రసాం
భోధినిమగ్నుఁడయ్యుఁ దల మున్కలుగాఁ జరియింపుచుంతియున్
మాధవుఁ డెంతమాత్రము, ప్రమత్తుడుఁగాక మనంబులో సదా
శ్మోధవుఁడైన మాతులునిఁ గంసునిఁగూర్చి తలంచె నీగతిన్

క్రోధపరీతమానసుఁడు క్రూరుఁడు భోజకులాభిమాన సం
బాధితుఁడైన కంస జన పాలుఁడు జీవముతోడ నున్నచో
గాధలు చెప్పనేమిటికి ? గల్గునె యోగము రాజభోగమున్
బాధలు తీరునే? తుదకుఁ బ్రాణముమీఁదికి రాకయుండునే

భోజ దౌర్జన్యవాహిని పొంగి పొరల
నానకట్టను వేయక యాఁగియున్నఁ
బొడిచి యాదవ ద్వీపంబు ముంచివైచు
నంచు నిరతంబు లోలోఁ దలంచుచుండు

## చతుర్థాశ్వాసము

సార్వభౌముండనని జరాసంధ విభుఁడు
నరకుసేయుటమానె నెవ్వరినిఁగూడ
వానిఁదెగటార్పకున్న లాభంబులేదు
పురుషకారంబు మానుట పోలదిపుడు

హంసడిచికసాళ్వనరక కంస దంత
వక్త్రశిశుపాల పౌండ్రక వాసుదేవ
దివ్యధానుష్కమత్యేకలవ్య ముఖర
యోధులను గూడి వర్తించు చుండు నతఁడు

ఒక్కొకవంకఁ బెట్టుకొని యొక్కొక వీరవరున్ గ్రమంబుగా
నొక్కొకపట్టునందు సమరోర్విని గూలిచి మాగధేంద్రునిన్
తెక్కలులేని పుల్గునొనరించి హరించుట యొప్పుఁగానిచో
దక్కునెరాజ్యభోగములు ? దక్కునె రాచరికంపుమన్ననల్ ?

కాని కథయొక్కటున్నది కదనమందు
నొంటరిగఁ బోరుసల్పుచో నోటమబ్బు
మాగధుఁడు దివ్యసేనా సమన్వితుండు
శత్రుభీకర యుద్ధ విశారదుండు

నిట్టలమైన నేర్పుమెయి నిత్యము మాగధవైరిపాళితోఁ
జుట్టఱికంబుఁజేసి రణశూరుల వీరులఁ బ్రోవుచేయుచున్
గుట్టుగ సైన్యసంపదను గూర్చుటమిక్కిలి రాజనీతి, యే
దెట్టులనైన సాయమగు నీపనిచేత దురంబుకల్గినన్

అంచుఁ గృతనిశ్చయుండయి యాపులించి
యప్పుడే యుద్దవిడిలేచి యరిగె నింటి
కొకఁడె రాధకడకుఁబోక యొక్కనాఁడు
కార్యభారంబు మనసులోఁ గలఁతపెట్ట

చరణాబ్జ యుగ్మలాక్షారసం బొకమాటు
పగవారిక్రొన్నెత్రు వాఁకయొకట
ముగుద వాలుంజూపు మొత్తంబు లొకమాటు
వైరుల తూపుల బారులొకట
మదనరంగస్థలీ మండనం బొకమాటు
కదనరంగస్థలీ గరిమ యొకట
కామతంత్రపరీత కార్యంబు లొకమాటు
రాజ్యతంత్ర రహస్య రాజినొకట

కలలు గనుచుండె రేలెల్లఁ గళవళించి
యన్యదుర్లభమైన కార్యంబుఁజేయఁ
బూనికఁ గైకొన్నవాఁడౌటఁ బోహళించి
కనుకుపట్టునే కార్యాతురునకు నెందు?

దూరదృష్టియు, దివ్యదృష్టియుఁగల్గి శ్రీకృష్ణుండు వెంటనే బహుబాంధవ సంపాదనంబునకై నడుముకట్టికొని బహుళ ప్రయత్నంబులఁ జేయసిద్ధపడి—

భోజక్షమానాథు పుత్రి రుక్మిణి చెట్ట
పట్టెను రాక్షసోద్వాహమందు
బూటకంబులు చెప్పి పొరపుచ్చి సత్యభా
మను వివాహంబాడె మరులుచూపి
విందానువిందుల ప్రియసహోదరి మిత్ర
విందను మెలపుతోఁ బెండ్లియయ్యె
నగ్నజిన్నృపుని నందన నాగ్నజిత్తిని
బరిణయం బాడెను బందెమొడ్డి

# చతుర్థాశ్వాసము

నరకుఁ బొరివుచ్చి దురమందు నపుడుబెగడఁ
బెండ్లిపెండ్లంచుఁ బదియారు వేల రాచ
కన్నెలకుఁ దాళిబొట్టును గట్టిపైచె
మధ్యదేశంబు బాంధవమయము గాఁగ

అతి భయంకరాటవులందు యమునయొద్ద
స్వైరవృత్తిని నిరతంబు సంచరించు
నాటవికకన్య కాళింది యనెడు నామెఁ
బరిణయంబయ్యెఁ దనవార లెఱుఁగకుండ

మద్రవసుమతీనాథు కొమార్తైన
భద్ర గుణసముద్రను భూరి వైభవమున
మత్స్యయంత్రంబుఁ బడఁగొట్టి మహితశక్తిఁ
బెండ్లి పెద్దలు వెఱగందఁ బెండ్లియాడె

కొండగవులయందుఁ గ్రుమ్మరు భల్లూక
జాతి జాంబవంతుఁ జావఁగొట్టి
వానిబిడ్డ జాంబవతిని బెండిలియాడె
నడవిజాతి పొందు నాశఁజేసి

యాదవాన్వయులకును భోజాంధకులకుఁ
గలుగు వైమనస్యంబెల్లఁ దొలఁగిపోయె
రుక్మిణీ సత్యభామా సరోజ పత్ర
నేత్రల వివాహములచేతఁ జిత్రముగను

ఇట్లు గృహచ్ఛిద్రంబులనెల్ల నుడిపికొని బలవంతుండై మంత్రదత్త ప్రభావంబుచే సత్యోత్సాహంబున జెలరేఁగి, మింటికి మంటికిఁ దాళము వేయ నెంచుచుండ,

మాగధుఁ డీయుదంతము సమస్తముఁ జారులచే గ్రహించి యీ
యాగడమేమి? యాదవునకా తలవంచుట మాగధుండు ? భూ
భాగమునన్ జరాసుతుని బాహుబలంబున కడ్డుగల్గునే ?
సాగునె యిట్టిచిత్రములు ? సాగునె యీ విపరీతకర్మముల్

ఓడుగోరు వెచ్చని నల్ల నౌలసి ముద్ద
కట్టినట్టి కృష్ణుని యెమ్ముక పౌటి యనెడి
కుంకుమున బొట్టుపెట్టెదఁ గొంకులేక
యలుగుసెలచేత జయలక్ష్మి యలికమందు

ఎవనిఁగాఁదల పోసెనో ? యీ జరా త
నూజు? ఎవరిగాఁ దలపోసెనో మగధనృ
పుని బలంబుల? అడవి మూఁకనుచు నాత్మఁ
దలఁచెనో యతఁడె నిజంబుఁ దెలిసికొనును

అంచు దండనాయకులం బిలిపించి పణవఢక్కాది ఘోషంబులచే భూనభోంతరాళంబు బీటలువార నతులచతురంగపృతనావితాన పరివృతుండై, కృష్ణునిపై దాడివెడలి నాల్గహోరాత్రంబులు హోరాహోరింబోర యాదవ సైన్యంబులు, పంచబంగాళమై, వీటతాటమై, చెల్లాచెదరైపోవ, శ్రీకృష్ణుండు చేయునదిలేక యాప్తబంధు సహితుండుగా బలాయితుండయ్యె. జరాసంధుడు మగిడిమగధం బ్రవేశించెను. శ్రీకృష్ణుండు విసుగువిరామము లేక, విఱిగిపాఱిన సైన్యంబులఁ గూర్చికొని, మరల యుద్ధప్రయత్నములు సేయుచుండ మాగధుండు వెండియు దండెత్తిపోయి పరాభూతునిం జేయఁ జేఁజిక్కక శ్రీకృష్ణుండు

దునకిల్లెను. ఈక్రైవడి నికువనిమాటు లోడించి శ్రీకృష్ణునిఁ బలాయనసూత్ర పరాయణునిగాఁ జేసెఁ దత్కారణంబున జరాసంధుఁడు యాదవునిఁ బట్టుకొన నేరకపోయె. ఈ పోరిట్టు లేఁగుచుండ,

మధురాధిపుఁడగు కంసుఁడు
పృధు సైన్యంబులను గూర్చి కృష్ణుని నెట్లో
మధియించుట ధర్మంబని
క్రుధతోఁ దలపోయుచుండెఁ గుసిలింతలతో

ఇది కని పెట్టి నేర్పుమెయి వృష్ణికులుంకిటు నిశ్చయించె నే
యదనుననైనఁ గంసవసు ధాధిపుపైఁ బడుచున్ హఠాత్తుగా
గుదియను దచ్చిరంబుఁ బడ గొట్టుచుఁ జుట్టలు రాకమున్నె త
ప్పదవిని నాక్రమించికొనఁ దప్పదు తప్పినఁ గార్యముంజెడున్

మాగధనృపాలకుం డనుమానపడెన
నతుల సైన్యంబుతోడ సాయంబువచ్చు
జగతి "నాలస్య మమృతమ్ విషమ్మనంగ
వినమె? పెద్దలనుడి రిత్త చనునె యెందు?

కృష్ణుఁ డీరీతిఁ దలపోసి కితవబుద్ధి
నన్నతో మధురకు నేగి యందుఁ గృష్ణు
నింటి దాసియైన త్రివక్ర యింటికేగి
ప్రేమతో నామెతో నొక్క రేయి కడపి

ఖలసంయోగమటంచు దానెఱిఁగియున్ గార్యార్థి శ్రీకృష్ణుఁ డా
కులపాటుం గనకుండ దాసియను సంకోచంబులేకుండఁ బు
వ్వులసెజ్జన్ గఱగించెఁ గుబ్జనుగడున్ పూత్కారసీత్కారముల్
గళరావంబులు ధూత్కృతంబులు పెలంగన్ గామశాస్త్రజ్ఞుఁడై.

అనునయసూక్తులాడుచు రహస్యములన్నియు సంగ్రహించి కు
జ్జను మఱపించి మాటుపడి సాహసపద్ధతిచేత నన్నతో
జనపతి కొల్వుకూటమును జయ్యనచొచ్చి ప్రశాంతచిత్తుఁడై
సునిశితఖడ్గమట్టికొను మన్దెగవైచె శిరంబురెండుగన్

సఖికులాహారవంబులు సల్పుచుండ
భటులుచెదరి నల్దిక్కులు పాఱుచుండఁ
గొలువుకూటంబు గందరగోళమయ్యె
వాసుదేవుని సింహరావంబుచేత

కలగుడు బొందుచున్ మధురఁ గ్రక్కున వీడుచుఁగంసభీతిచే
వలసకుఁబోయినట్టి తమవారలఁ బిల్వఁగఁబంచికృష్ణుడున్
నెలవులు వారికేర్పఱచి నీతులుసెప్పి బహూకరించియే
యలజడియుండదంచు నభయంబునొసంగి ప్రమోదచిత్తుఁడై

పిమ్మటనుగ్రసేన పృథివీపతిఁదాతను బైటికిగద్దెపై
నిమ్ముగనుంచి రాజనుచు నెల్లరకుంబ్రకటించి మంచినే
స్తమ్ముగడించి కొన్ని దివసమ్ములపాటటనుండుచున్ స్వప
క్షమ్మును బెంపుఁజేసికొనె సారసనేత్రుఁడుమంత్రవేత్తయై

పతిమృతియాలకించి యతి పాపుఁడు యాదవుఁడెంతకార్య మీ
గతినొనరించి పోయెఁ గడగండ్లు సదా మముఁ జుట్టుముట్ట భూ
పతికిదియంతయుం దెలిపి వానినిజంపఁగఁజేతుమంచుఁ దా
మతికుపితాత్మలై చనిరి హస్తియుఁ బ్రాస్తియుఁదండ్రియొద్దకున్

తండ్రియగు జరాసుతుని చెంతకునుబోయి
బిట్టు కంటిసీరోడికఁ గట్టుచుండ
వెక్కివెక్కి యలందురి విభుని యాద
వుండుగూల్చిన విధమెల్ల బొగిలిచెప్ప

## చ తు ర్థా శ్వా స ము

కన్నబిడ్డల దుఃఖంబుఁ గంటఁజూచి
యల్లుఁడేకాదు పరమాప్తుడైన బంటు
నొకఁడు చంపెననుటచేత నుమ్మలించి
పల్కెమగధభూనేత కట్టల్క నిట్లు:

పదిదినములు చనకుండన్
దుదముట్టించెదను గృష్ణు దోర్బలలీలన్
విదళించెదఁ గనుగొనుఁడో
సుదతీమణులార నాదు శూరత్వంబున్

వందలకొలఁది యున్నారు భార్యలతని
కందఱిని మిమ్ముఁబోలెనే నగతికలను
జేసివచ్చెద క్షణములోఁ జింతఁదక్కి
పొద్దుఁదీర్చెద నో కన్నబిడ్డలార!

అనుచు బుజ్జగించి తనయల నిర్భరలోనికంపి యతి రోషావేశంబున యుద్ధసన్నాహంబుఁ గావించి దిక్కులు పిక్కటిల్ల భూమి గ్రక్కదలఁ బ్రస్థానభేరి వేయించి,

నడగొండ లన్నట్టు లెడమీక నడతెంచు
గుడికొన్న పొగరేన్గు గున్నదండు
కాలిగిట్టలగాలి నేలఁబై కెగఁజిమ్మి
తేలిపేరెమువారు తేజిపౌజు
మిఱుమిట్లు గొనునట్లు మిట్టాడఁ గొఱముట్లు
దిటవుగాఁగలమేలు తేరిబారు
పీఁకమై రిపుసేన చీకాకుఁబడఁదూఁకి
పడనూకుజోకకాల్బంటుమూఁక

కల్గిదుర్జయంబైన మాగధనృపాల
చంద్రచతురంగవాహినీ సముదయంబు
యాదవద్వీపమును ముంచునట్లు బయలు
దేరె దుర్వాద ఖండనోద్రేకగరిమ

వచ్చిన మాగధసైన్యముఁ
జెచ్చెర యాదవులుగాంచి సిద్ధంబగుచున్
గచ్చలు బిగియించికొనుచు
విచ్చలవిడి వచ్చిపడిరి విద్వేషులపై

ఏటున కొక్కనిఁ గూల్పఁగఁ
బోటరియగు యాదవుండు పోపో యదియున్
వ్రేటా ! యని మాగధుఁడిదె
నూటికి సెలగంచుఁ జంపె నూర్వర నొకఁడే

సెలవింటిదెబ్బ నెత్తుటి
సెలయేరులుపాఱ మగధ సేనాసుభటుల్
సెలరేఁగి పగరనలుగుల
సెలచే గుదిగ్రుచ్చిసెలగి సెలఁగుదురంతన్

కోటానకోటులు కుప్పఁగూరఁగ గూలఁ
బంచబంగాళమై పాఱ రిపులు
వెన్నాడి మాగధ వీరాధివీరులు
పాఱదోలిరి యాదవ ప్రవరుల
కృష్ణుఁడీయోటమి వీక్షించి యన్నయౌ
బలరాముతోఁగూడి పాఱిపోయి
యనతి దూరమునందు నలరు ప్రవర్షణ
గిరిఁజేరి డాగెఁ గందరమునందు

నిది జరాసంధ భూపాలుఁ డెటిగి గిరికి
నగ్గి దాకొల్పనందుండి యన్నతోడ
మాగధునికంటఁ బడకుండ మాయమయ్యె
వ్రేత యిండ్లఁదిరుగు ప్రాఁత వెన్నదొంగ

విని జరాసంధ సార్వభౌముండు మరలి మగధ రాజ్యంబుఁ జొచ్చి మంత్రాగంబుఁ జేయుచుండె.



# హంసడిచికులమృతి.



మాగధపృతనాధీశు లమాత్యవరులు
హంసడిచికులు రాజసూయాధ్వరంబుఁ
జేయ సమకట్టి యుప్పుకై చీరియొక్క
బ్రాహ్మణునిఁ బంపిరప్పుడు ద్వారవతికి

ద్వారకకేగి బ్రాహ్మణుఁడు పద్మదళాక్షుని దర్శనంబు దై
వారఁగఁజేసి పిమ్మటను వచ్చిన కార్యముఁదెల్ప శ్రద్ధతోఁ
బాలుఁడువల్కు నెన్నుడుల వక్కణయెల్లను నాలకించి లో
సారెకు నీగతిన్దలఁచె సాధకబాధకముల్ మురారియున్

'వెదుకఁబోయిన తీవెయే పదములందుఁ
దగిలె'నన్న సామెతరీతి ధరణిసురుఁడు
తంత్రమును నడ్పుచుండె హితమ్ముఁగోరి
సంశయింపంగఁ బనిలేదు సమయమంచు

వితర్కించి శ్రీకృష్ణుండు కొండొకసేపు మౌనము వహించి యెట్టకేలకు ధరణీసురునితో నిట్లు వచియించెః

ఓ ధరణీసురా! చని హితోక్తులు చెప్పుము మీదుధారుణీ
నాథునితోడ యాదవులనన్దలలొగ్గరు వైరిపాళికిన్
గాథలు చెప్పనేల? యపకర్ష సహింపరు ప్రాణభీతిచే
సాధక బాధకంబు లొకసారిఁ బరీక్షను జేయమేలగున్.

ఉప్పుఁదెమ్మంచు మీతోడఁ జెప్పెనోటు!
వింత విడ్డూర మిప్పుడు వింటిముప్పు
గోరుచెల్లను దమముప్పుఁ గోరుకొనుచె
యనుచు మీరాజచంద్రుతో నాడఁదగును

మీరలు ధర్మమూర్తులరు మేమిఁకమాటలఁ జెప్పబోపదే
మారణభేరి చెప్పెడుసుమా! యతిమాత్రము మాకు మారుగా
మారణకేళి నిక్కముగ మారణకేళి విచారమేల? ని
ష్కారణయుద్ధమేమిటికిఁ? గల్గునె లాభము దానఁజెప్పవే

కావున మీరు వెంటనే చని యీ యుదంతమంతయు మీ భూకాంతుల స్వాంతంబున కెక్కునట్టు లెఱింగించి, పోలిన తెలుంగున బుద్ధులు గఱపుఁడు. మా ముక్కున నావియున్నం తవఱకుఁ బరులకు జంకి యుప్పిచ్చువారము మాత్రము కాము. ధర్మయుద్ధమున వీరశయ్యాసుఖ మనుభవింప నిచ్ఛించువార మనుఁడు విప్రుండు లేచి వాసుదేవునివద్ద సెలవుగైకొని ప్రయాణోన్ముఖుండయ్యె. అంత—

ఆనక దుందుభిసూనుం
డానక దుందుభివిరావ మతిభీషణమై
మానక మ్రోఁగుచునుండఁగఁ
బూనికఁ దన సేనఁగొంచుఁ బోరికి వెడలెన్

అంతకుమున్నె జరాసంధుఁడు చారులవలన శ్రీకృష్ణ రణప్రారంభ మెఱింగి, సమరోత్సాహంబున సైన్యముల గూర్చు కొని, హంసడిచికులకుఁ దోడ్పడ గంగాతీరంబున దండువిడిసి,

యాదవసేనకై యెదురుచూచుచుండెను. కోలాహలంబుతో యాదవ సైన్యంబు లదుదేర దోఃకండూతినిరాసంబుగాఁ బోరఁదొడంగెను.

అలమటఁ బొందకుండఁగ బృహద్రథపుత్రుఁడు వైరిసైన్యమున్
దలపడి పోరనొక్కెడ వితాకును జెంద మఱొక్కచోట ను
త్తలపడి యాదవుల్ పఱవఁ దార్కొని హంసుఁడు యుద్ధమాడఁగా
విలయముఁజేయు నాడిచిక వీరుఁడు వేఱొకచోట నుద్ధతిన్

ఈ వీరత్రయంబుచేయు కోల్తలకు నిలువంజాలక తల చీరలూడ యాదవ సైన్యంబు క్రేళ్లుఱుకు చుండఁగాంచి, శ్రీకృష్ణుండు సైన్యరక్షణాం బవశ్యకర్తవ్యమని నిశ్చయించి,

డెప్పరముగ నొక్కట పోరుడిచికు కడకు
వార్తఁ బుత్తెంచె హంసుండు ప్రధనభూమి
నీల్గెనని దీని నాలించి యెన్నరాని
శోకమున మున్గి డిచికుండు శూరుఁడయ్యు

అన్నలేని రాజ్యంబేల ? యాయువేల ?
భోగభాగ్యంబు లవియేల ? భూములేల ?
యంచు మిక్కిలి వగచేత నోడుఁగఱచి
గంగలోఁదూఁకి ప్రాణముల్ గంగఁగలిపె

తమ్ముఁడు గంగలోదుమికి తా మరణించెనటన్న వార్త శో
కమ్మను గూర్పఁగా నడలి గ్రక్కునఁ దమ్ముఁడు లేనిరాజ్యమున్
దమ్ముఁడులేని వైభవము తమ్ముఁడులేని సుఖంబులేల ? నా
కిమ్మహినంచు గంగఁబడి యీల్గెను హంసుఁడు ధీరచిత్తుడై

## చతుర్థాశ్వాసము

అన్నదమ్ము లీగతిఁ దెగ టారినంత
బహుళ తత్సైన్యములు పటాపంచలగుచుఁ
బొంగి బార్హద్రథియు నాల్గు మూపులగుచు
యాదవులనెల్ల నరికట్టి యాఁగినంత

వాసుదేవుండు తనసైన్య పటలినెల్లఁ
జేయునదిలేక మరలించి చెప్పకుండఁ
బ్రథనభూమిని విడనాడి పాఱిపోయెఁ
బౌరుషము మాసెఱుఁగు భగవంతుఁడనుచు

మధురకడనున్నఁ బ్రాణముల్ మఱియుఁ దక్క
వంచు లోనెంచి శ్రీకృష్ణుఁ డాప్తబంధు
సుత కుటుంబసహితముగా హితులతోఁ గు
శస్థలీవిషయమునకుఁ జనఁగ నెంచి

పడమటి సంద్రమందు ఫలవంతమునై వెలుగొందు దీవిపై
గుడులును గోపురంబులును గోటలు పేటలు రాచబాట క్రొ
త్తడములు మిద్దెమేడలును దద్దళముల్ మిఱుమిట్లుగొల్పఁ బ
త్తడి యదుసోకిగించి వనితంబుగఁగట్టిరి ద్వారకాపురిన్

ద్వారవతియన వెల్గు నీ పత్తనంబు
వైరి దుర్భేదమై యుందు వాసుదేవుఁ
డెలమి యదువృష్ణి భోజాంధకులను గూడి
రాజ్యమును సేయు నే అద్ది అవ్వలేక

దివ్యజ్ఞానము దివ్యదృష్టి వెలుఁగన్ దేదీప్యమానంబుగా
నేవ్యాసంగములేక యజ్ఞనయనుం డేకాగ్రతన్ భూరి శ
త్రువ్యూహంబుల మంత్రతంత్రములచే దూలింప యత్నింపుచున్
దివ్యత్సైన్యము గూర్చి పెట్టికొని యుందే యుండె నిశ్చింతతో

ద్రావిడ జాతినిందొఱఁగి ద్రావిడసంఘము పొత్తుమాని యా
ద్రావిడసార్వభౌముపయి దర్పముఁజూపఁగ నెంచినందునన్
ద్రావిడులెల్ల మూర్తురయి దగ్గరఁజేరగ నీకపోపుటన్
ద్రోవమఁబొందులేక పెఱ తోయమువారలఁ జేరనెంచుచున్

అనువుగల్గిన యపుడెల్ల యాదవుండు
సహచరులతోడఁ జెప్పును జాత్యహంకృ
తి విడనాడి కార్యంబు సాధించుటొప్పు
బాగుపడనెంచు వారికెప్పాటనైన

దేశకాలపాత్రంబులఁ దేరిచూచి
మొనయు వల్లతిఁ దప్పించు కొనుటమేలు
మొండితనమును జూపింప మొదటికంట
నాత్మనాశంబుగల్గు న టంచు జెప్పి

ఒకవంకన్ శిశుపాలుఁడుండ గురు యుద్ధోద్యోగసంరంభియై
యొకవంకన్ మగధక్షితీశ్వరుఁడు సైన్యోపేతుఁడై యుండ మీఁ
దకు లంఘింపఁగ దాయలో కపటులై తారాడుచుండంగ వే
ఱొకవంకన్ మనమున్ సురక్షితులమై యుండన్ సదాశక్యమే

కావున నార్యులం గలిసి కాలముఁబుచ్చుట యొప్పు లేనిచో
దేవుఁడెఱుంగుఁగాదె మన తిప్పలు తప్పవు, చావులక్కటా!
నావచనంబులన్ విని వినాశముఁబొందకుఁడంచు నార్య ధా
త్రీవరమైత్రి కిష్టపడు రీతినిఁ జేసి స్వజాతివారలన్

అంతకుమున్నె పాండనృపుఁ డంతలపొంతల చుట్టమౌటచేఁ
జింతయొనర్చుచున్ సవతి చెల్లెలిఁ జిత్రను గ్రీడికిచ్చెఁబో
పంతముతో సహోదరుఁడు వద్దని చెప్పుచుఁ బట్టుఁబట్టినం
గంతులువైచు నగ్రజుని కండ్లకు గంతలుకట్టి మాయచున్

# చతుర్థాశ్వాసము

కొన్నియేఁడులిట్టులు కడచన్న పిదప
నన్నకూతురి మేనల్లుఁ డర్జునాత్మ
జుఁ డభిమన్యునకు నొసంగి సోదరుండు
వలదు వలదన్న దొంగపెండ్లిని జేసె

సురటిపై యయ్యాలొ జొంపాలొ యనుచుండు
నెమ్మియూఁకలకుంచె నెత్తిఁజూచి
"నా పితృవ్యసుతుండు నళినాక్షుఁడ"ని చెప్పు
నేకలవ్యునిమాట లాకలించి
"నన్నుఁబెండ్లాడవా నాముద్దు చినకృష్ణ"
యనెడి చెంచెతపల్కు లాలకించి
కారుమబ్బులతోడఁగయ్యమాడఁగఁజాలు
నిద్దంపుమైచాయ నిగ్గుఁగాంచి
చెంచులకు నింటివేల్పయి మించుకృష్ణు
నేకులమునందు నేజాతి నెందు బుట్టె
నని వితండ వాదముఁ జేయనగునె చెపుమ
తేటపఱచవే యవియెల్లఁ దెల్లముగను?

కిట్టని మాట యౌనె? యొక కేలను వేణువుగల్గఁ మౌళిపై
నట్టువపిట్టకుంచియ కనంబడుచుండఁగఁ జెంచువారితోఁ
జుట్టఱికంబు గల్గఁ గడుఁ జొక్కపు నల్లనిమేనిచాయక
న్పట్టఁగఁ జెంచుకాఁడనుచు వాకొన సత్యవిరుద్ధమేకదా!



# ఏకలవ్యుని వృత్తాంతము

అఖిలయదువృష్ణి భోజాంధకాది జాతు
లన్నితొలుదొల్త మ్లేచ్ఛులై యెన్నఁబడియె
నార్యజాతికి భిన్నంబు లగుటచేత
నడవిపల్లెలు కాపురంబగుట చేత

ఆర్యసంబంధమును బొంది యణఁగి మణఁగి
వర్తిలుటచేత శ్రీకృష్ణు వంగసంబు
క్రమముగా గడించెను గొంత గౌరవంబు
దానఁబరులు మ్లేచ్ఛులనుట మానినారు

ఆర్య జనాచారంబులు
నార్యమతవిశిష్టధర్మ మనువమనుచున్
గార్యజ్ఞులగుచు యాదవ
వర్యులు గై కొన్నవారు బ్రమపడివానిన్

ఆర్యజనులకు "దాసోహ" మనిన యాద
వాళి మ్లేచ్ఛదశను బాసి యబ్బురముగ
క్షత్రియత్వం బొక లవలేశంబుఁ బొంది
బొమ్మికములేని రాజులై పోయినారు

జాతివిడనాడి తొలఁగుట జాతిధర్మ
ములను నంత్యజించుట పాపమూల మంచు
జాతివీడకనిల్చిన శబరులెల్లఁ
శబరులుగ నుండిపోయిరీ జగతియందు

## చతుర్థాశ్వాసము

అభిమానంబునఁ బెనఁగుచు
వ్యభిచారముసల్పఁ జోక వర్తిలువారల్
శుభములఁ బొంచంజాలక
యభిఘాతములందు బొక్క యబ్బుర మగునే?

ఆర్యులపురములఁ గలయని
వార్యంబగు సంతసంబు పరిగొనఁగా నా
యార్యులరీతిగ నుండఁగఁ
బర్యాలోచించి మోహ పరవశులగుచున్

వనములనుండలేక యదువర్యులు కొందఱు సంభ్రమంబునన్
దనియక కొంచెమేని నవనాగరికంబును బొందఁగోరి ప
త్తనములఁ గట్టుకోఁదలఁచి దాసుకాదులఁగూడి యేడకో
చనిరినితాంతహర్షమున జయ్యనఁబిమ్మట నొక్కయిమ్మునన్

అధికోత్సాహంబున మరి
పృథుసామర్థ్యంబున యదువృష్ణ్యంధకులున్
మధురాపురి నిర్మించిరి
ప్రథితంబుగ నెల్లవారు ప్రస్తుతిసేయన్

వసుదేవాదులు తమ దా
రసుతాదులఁగైకొని మధురాపురమునకున్
వసియింపఁగ బోయిరచట
వసతి గలదటంచు భోగ భాగ్యములందన్

పిమ్మట నావసుదేవుని
తమ్ముఁడ నాధృష్టి యనెడి ద్రావిడవరుఁడున్
సమ్మతిపడఁడయ్యె నర
ణ్యమ్ముల దిగఁబెట్టి పోవ నా నగరునకున్

అనాధృష్టికి నశ్మకి శ్రుతదేవ యను కళత్రద్వయంబు కలదు శ్రుతదేవయందు శత్రుఘ్నుండను నామాంతరముగల యేకలవ్యుండు జనియించి మహావీరలక్షణ లక్షితుండై పెరుగుచుండ నొక్కనాఁడు తండ్రియగు ననాధృష్టి కొడుకుంజూచి యనురాగంబున నిట్లనియె: కుమారా! శస్త్రాస్త్ర విద్యాప్రాగల్భ్యంబు మనకుఁ దరతరంబులనుండి కలదు. అది మన కక్కఱకు వచ్చున ట్లితరులకురాదు. మహాదక్షిణ్యానిఁ గాపుర ముంటిమి, ధనుర్గురుండగు ద్రోణాచార్యుని కడకుంబోయి, ధానుష్క శేఖరుండవై రమ్మనవుఁడు,

మేచకదేహకాంతి మిఱుమిట్లు గొనం, దల మేచకంబు వ్యా
కోచముగాఁగ విల్లును లకోరులునింపిన తూణయుగ్మమున్
గోచతనంబుఁ బోవిడచి కుఱ్ఱఁడు గైకొని, కాసెఁగట్టి సం
కోచముమాని కూర్మిపితకున్ నతిసేసి సెలంగిపైనమై

చని ద్రోణాచార్యునిఁగని
ప్రణతియొనర్చి విలువిద్య పాఠము ముట్టన్
దనకున్ నేర్పుఁడటంచును
వినయంబున వేఁడి విఫలుండగుచున్

మరిడి కాననసీమకుంబోయి జనకుంగాంచి విషణ్ణచిత్తుండై దైన్యంబున సర్వంబు వినిపించి, రెట్టించిన పట్టుదల నెట్టయిన శస్త్రవిద్యా పాండిత్యము సాధింప దీక్షవహించి, పరాకాష్ఠతో నేకాగ్రచిత్తుండై ద్రోణుని ప్రతిరూపంబున దృష్టిని బద్ధముంజేసి, దృఢముష్టిలక్ష్యలాఘవంబుల నిరంతరాభ్యాస

పటిమంబుచేఁ గౌశలంబు సంతరించి, సొంపులు తేరిచూడఁగ రానికీర్తి విక్రమోపేతుఁడై వెల్గుచుఁ దన యశశ్చంద్రికలు గగనసీమ నాల్గుకొనలు వ్యాపింపఁ దేదీప్యమానంబుగా విరాజిల్లుచు జనకుని మరణానంతరము రాజ్యంబు వహించి ప్రాజ్యభావంబునఁ బ్రజలను గాపాడుచుండెను.

కన్నుఁ బొడుచుకొన్నఁ గనరానియడవులఁ
జిమ్మచీకఁటులెల్లఁ జిమ్మివైచె
కాలు పెట్టఁగరాని కలుకునేలలనెల్ల
సవరించి తిన్నఁగా సాఁగుచేసె
వన్యమృగంబుల వల్లికిఁ దప్పింప
వలఁజుట్టి దిట్టమౌ వెలుగువేసె
చిలుగుతొడుగుకంపఁ జెలగివేయుచు మంచి
యాఁకతోఁటలగుంపు నలవరించె

పోసరించిన బలుదిట్ట పోటు బంటు
లోర్మిఁ దనయాజ్ఞఁ బాలించుచుండ నెపుడు
ధర్మమొకవీసమేనియుఁ దప్పకుండ
నేకలవ్యుండు రాజ్యంబు నేలుచుండె

చెంచుజాతి యటవీరాజ్యంబున నాకలిదగదప్పు లెఱుంగక, కుసిలింత లెఱుంగక, యసంతుష్టి యెఱుఁగక,

పుట్టతేనె గలిపి మదురు వెదురుబ్రాలు
కడుపునిండఁ గుడిచి గట్టుమంచుఁ
ద్రేచి తనివిఁ జెంది తిరుగాడుదురు తప్పు
లెంచరానివారు చెంచువారు

పాయకట్టుకట్టుఁ బాయఁగొట్టఁగలేరు
మాసటీఁడులైన మనుజులైనఁ
పలికి బొంకువారు గలుగఁబోవరుసుంత
యేకలవ్యనృపతి యేలుబడిని

ఏసినతూపుతప్పి చని యెప్పుడు ఱిత్తగఁబోవ లేదొరన్
దీసినకత్తి యెప్డుపనిఁ దీర్పకయుండఁగలేదు, భీతిచేన్
డాసినవారికెప్డు శరణంబునొసంగమిలేదు, వానికై
వాసిగ నేకలవ్యు సరిబంటొకరుండుగలండె భూమిలో ?

యదుకులంబునఁ బ్రభవించి నట్టివాఁడు
కాననాంతర రాజ్యంబు గలుగువాఁడు
వినుము కృష్ణునిపినతండ్రి యనుఁగుబిడ్డ
యేకలవ్యుండు శబర జాత్యైకవిభుఁడు

జాతిని బాసి తామయిన క్షత్రియులంచుఁ దలంచి గొప్పఁగా
నేతుమటంచు నిక్కుచును నీల్గెడివారలతోడఁ బోకహో !
జాతిని ధర్మమున్ విడువఁ జాలనివారికిఁ జెంచువారికిన్
భూతలనాథుఁడై వెలసెఁ బోటరిమాటరి యేకలవ్యుఁడున్

అరయ రెండుపాయలైన యాదవులకు
నుద్దిలేనిరాజు లిద్దరైరి
యొకరు మధురలోన నొక్క రడవియందుఁ
గృష్ణుఁ డేకలవ్యుఁడేలుచుండ్రు

వెన్నునిఁ గన్నఁ గన్నెఱుపు వెక్కసమౌఁగద చెంచుతేనికిన్
వెన్నుని మాటయన్నఁ బ్రభవించెడివేరము చెంచుతేనికిన్
వెన్నుని బూటకీఁడనుచు నిక్కుచుఁ జెప్పును నేస్తకాండ్రతో
వెన్నుని నమ్మఁడెన్నఁడును వీరశిఖామణి యేకలవ్యుడున్

జ్ఞాతి ద్రోహియధర్మమంచు ననకేస్వార్థంబపేక్షింపుచున్
జాతిన్‌వీడి యొనర్చెనార్యతతితో సంబంధబాంధవ్యముల్
గోత్రం బెట్టిదనంచు నుండు శబర క్షోణీపుఁడత్యుగ్రుఁడై
'జ్ఞాతిశ్చేదనలేనకిమ్మ'నెడి వాక్యస్ఫూర్తి దీపింపఁగన్

ఏతరి నేకలవ్యు మొగమించుక చూచినఁగృష్ణుఁడద్దిరా!
యీతఁడు జాతిజాతియని యెప్పుడు త్రుళ్ళుచుఁ గల్వరించుచున్
జాతిని గూడియుండు నతిసాంద్రవనంబుల జాతివైరమున్
సైతము మానఁడంచు నెకసక్కెము లాడుచు గెలిసేసెడిన్

ఇట్లు పరస్పర విరోధభావంబులచే భావంబులు కలవర పడుచుండ,

గరువతనంబుచేతఁ జెలికాండ్రనొకానొకనాడు గూడుచున్
గురుతర కాననస్థలికిఁగోయని యార్చుచుఁబోయి యందఱున్
గరమరుదైనవేట తమకంబున రేగుచు సంచరింపుచున్
దరమిడి క్రూరజంతువుల దద్దరిలంగను జేయుచున్నెడన్

కలుకు పదనుగల్గు కాండంబునొకదాని
వింటఁదొడిగి పందివెంటఁబడుచు
నేకలవ్యుఁడొక్కఁ డే కాకిమైపోయి
యేకలంబు సురుగనీక తరుమ

కొండొకవైపునుండి రణకోవిదుఁడైన కిరీటియప్పుడే
కాండము వింటనుందొడిగి గమ్మున నేసెను వేసినంతనే
యొండొక బాణమో రభసమొప్పఁగ జివ్వన వచ్చి సూటిగా
విందుమొగంబుఁదాకి ధరణీస్థలిపైఁ బడఁగూల్చెఁ బందినిన్

లక్ష్యశుద్ధి యద్భుత శరలాఘవంబుఁ
గాంచి నరుఁడేకలవ్యునిఁ గంటఁజూచి
యీడుగానని చెప్పి తానీడఁబోయి
తేరి పాఱఁజూచి యపుడె తిరిగిపోయి

ఇంతటి విద్యానైపుణి
యింతటి శరలాఘవంబు నెన్నండెఱుఁగన్
వింతకదా! యితఁడెవఁడో
యంతెఱుగుట మేలటంచు నాతండపుడే

చాపాచార్యుండగు ద్రోణాచార్యునింజేరి వినయం బుట్టిపడ దీనాననుండై,

ఎఱు కొక్కనిఁగంటిని ద
చ్ఛరలాఘవమెల్లగంటి సాంద్రాటవిలో
గురువర! యాతని రూపము
మఱువఁగ రాదయ్యె నాకు మాపులుఁబేపుల్.

మూఁడులోకాల విలుకాండ్ర మొత్తమందు
నన్ను సరిలేని బంటునౌనన్తునంటి
వదియు నేఁటికి వమ్మయ్యె నక్కటకట!
మీరలేమిసేతురొ నాకు మేలు నేఁడు

సరియెకాదయ్య నాకంటెనురువగునతఁ
డెచటనేర్చెనొ విలువిద్య నెరుఁగరాదు
బాసమాత్రము తీర్చుకోవలయునన్న
గురుడు చింతించి మిగులసంకోచపడుచు

## చ తు ర్థా శ్వా స ము

వెంటనె క్రీడిఁగూడి యటవీస్థలికేగ గురుండు సిద్ధమై
జంటఁగనంటి వెంటఁబడి ఛాత్రుడు ముందుగ దారితీయ గో
రింటల డొంకలన్ నడచి త్రిప్పులు పొందుచుఁ గాంచిరొక్కెడన్
వంటెముకాని గూడెమును వాకలు దానిని డాసినంతటన్

నెట్టెంబుఁ గై సేయు నెమ్మిపురితురాయి
 కనువిచ్చి డెసలెల్లఁగాంచుచుండ
దొనల రారాపుచే తను గాయగాసిన
 యెగుమూపు దోయిపై బిగువుచూప
ఎన్నెన్నొ కత్తురి వన్నెపూసలపేరు
 లెదురొమ్ముపైఁబడి కదలుచుండ
మొలచుట్టుచుట్టిన మోటువన్నియు ప్రాత
 మోకాలు దిగజారి పోకయుండ

ఇంటిముంగలియఱుగుపై నొంటరిగను
రెడ్డిగమువేసి కూర్చున్నదొడ్డతేని
శబరజాతి క్షమానాథుశౌర్యరాశిఁ
గాంచి గురుశిష్యులిర్వురు కొంచెపడిరి

అతిథులిద్దరింటికి వచ్చుటల్లకాంచి
దూరముననుండి తొందరతోడలేచి
యర్ఘ్యమును బాద్యమునునిచ్చి యాదరించి
వారి పయనంపు బడలికఁ బాపనెంచి

చారపప్పును నూచబియ్యము సన్నమండిగ గుగ్గిళుల్
దోరముగ్గిన మావిపండులు దుర్లభంబగు ద్రాక్ష ఖ
ర్జూర పక్వ ఫలాళి తంగెటి జుంటితేనియఁజక్కఁగా
నారకాగిన యావుపాలను నారగింపఁగఁ బెట్టుచున్

ఇంటికి వచ్చిన పెద్దల
వెంటనె పూజించునియతి విహితంబుగఁ జే
కొంటిమి యాతిథ్యమె మా
పంటలు వీనిఁగొని సేదఁ బాపుకొనుండీ

అని బహుప్రకారంబుల వేడిన ద్రోణార్జునులతిథి సత్కారముల గ్రహించి తృప్తులైన యనంతరంబు వారలం జూచి యేకలవ్యుండు—

ఏపనిఁబూని మీరలిటులిచ్చటికింజనుదెంచినారు ? మీ
కాపురమేది ? నావలనఁ గాఁగలకార్యముఁజెప్పుఁ డున్నచో
నావఁనిదీర్తు నాకలవియైన నటంచు వచించినంతనే
చాపగురుండు పల్కెను నిజంబును దెల్పుచుఁదత్క్షణంబునన్

నా పేరు ద్రోణుఁడందురు
చాపాచార్యుండ నిఖిలజనపాలసుతుల్
నాపజ్జ నేర్చికొందురు
చాపాభ్యాసంబు దివ్యశరలాఘవమున్

క్రీడియితండు ఘోరరణకేళివిదగ్ధుఁడు మొన్నమొన్న వేఁ
టాడఁదలంచి యీయడవియందునఁజొచ్చి చరించుచుండఁగాఁ
గ్రోడముతోడవచ్చి యిటకున్ గుఱివెట్టి శరంబుఁబుచ్చఁ దో
డ్తోడఁద్వదీయబాణము కడున్ రయమారఁగ దానిఁగూల్చెడున్

నీ శరలాఘవంబు గని నివ్వెఱపాటెనయంగ వేగ నా
వేశముఁజొచ్చి యీయెడకు ప్రేల్మిడిఁదెచ్చెను నిన్నుఁజూఁపగా
నో శబరేశ్వరా ! పలుక నోడకు పేరునుదంతమెల్ల నీ
వీ శరవిద్య నెప్పుడెటు లెవ్వనివద్ద నేర్చినాడవో

## చతుర్థాశ్వాసము

అనినంత నేకలవ్యుఁడు
వినయాదర మొప్పుచుండ విస్పష్టముగాఁ
దనగురునితోడను బలికెఁ
గనుదమ్ములవింతకాంతి గంతులువైవన్

ఏమేమీ! యితఁడర్జునుఁ
డా? మీరలుద్రోణగురువులా? మోదంబా
హా! మీరాకను ధన్యుఁడ
నే మీకడఁగా దె విద్య నేరిచికొంటిన్

ఈ మాటలాలించి ధనురాచార్యుండు కలగుండువడిన మనంబు కలవాఁడై, బోయతుంటరియై, మెఱమెచ్చులకో, మిడిమేలమునకో, మేలమునకో యిట్లాడుచుండెనని సంశయించి, యేకలవ్యునిముఖలక్షణంబుల నుపలక్షించి, విలక్షణంబులేమియుఁ గన్పట్టమిఁ గుదుటఁబడిన మనంబుకలవాఁడై—

చిత్రముఁ జెప్పుచుంటివి, హసింపఁగనేమొకొ విన్నెఱుంగఁబో!
ఛాత్రుఁడవై మముంగొలిచి సాంగముగా విలువిద్యనెన్నఁడే
మాత్రము నేర్వవీవిటుల మాటలుచెప్పఁగనేల? నీదు చా
రిత్రమువిస్మయంబుఁ బచరించెడియంచు వచింప, బోయఁడున్

ఎఱుఁగకపోవుటేమిసను? నే విలువిద్దె గ్రహించు కోర్కెతోఁ
జిఱుత తనంబునందు మిముఁ జేరి భయంబునఁ జాఁగివేడఁగా
నెరుకకుఁ జెప్పరాదనుచు నెన్నియొ శాస్త్రములున్నవందుచే
గఱపఁగజాలనంచు ననుఁ గత్తరిమాటలనాడి పంపరే

అట్లు మీచేత నవమాన మంది దుఃఖి
తాత్ముఁడనయి యేమియుఁదోచ కలమటించి
యించుకంతవంచిన తల యెత్తకుండఁ
దిరిగి మాచెంచుగూడెంబు దరియఁజొచ్చి

సతతము కొలిచితి నే మీ
ప్రతిమారూపంబు భక్తిపరతంత్రుఁడనై
జితకాశినైతి దానన్
గృతహస్తుఁడనైన నాకు నెదురునెఱుంగన్

నాపేరేకలవ్యుండు, ఈ యాటవిక ప్రదేశంబు మదీయ బాహువప్రయుగళీ గుప్తంబై, దొంగకోడుబోతులవలని వల్లడిదక్కి చల్లగ వర్ధిల్లుచుండు. నాకదుసుగాని యెదురుగాని లేక యుండె వసియింతు;

మాకొరవంజిగూడెములు మాటలు తప్పవు తప్పినంతనీ
లోకములోనఁ బుట్టుగతులున్ మరియుండవు చుట్టపక్కముల్
కాకులుదూసి మీఁదబడి ప్రాణములన్ హరియింతురట్టి యీ
మూఁకలకెల్ల నే దొరను బొంకులెఱుంగని కారుకోనలో

అంతట ద్రోణుఁడిట్టు హృదయమ్మునఁదాఁదలపోయఁజొచ్చె వీఁ
డంతక కల్పుఁడీతని యుదంచితభీషణ బాహుశౌర్య వి
క్రాంతియు వీనినిస్తుల పరాక్రమ మీతనిచాపవిద్య, ప్రా
ణాంతక మార్య కోటి కెటులైనను హీనునిఁజేయుటొప్పగున్

వీనివింటికి నెదురెత్తివింటినారి
లేశమైనను మ్రోగింప లేఁడెవండు
వీని భుజశక్తిఁ బొరిపుచ్చ లేనియెడల
మాకు బ్రదుకుట దుర్లభంబయని యెంచి

ఎఱుఁగవె శిష్టాచారం
బెఱిఁగియు నిష్టాచరింప నెఱుకకుఁ దగునే
గురుదక్షిణఁ బెట్టని యా
కఱటికి సద్గతులు పుట్టఁగలవే యెందున్?

ఇట్లు గురుండు కుత్సితుండై తనయభీప్సితంబును మఱుగు పుచ్చి పలికినవెంటనే యేకలవ్యుండు—

"తల తల మను కత్తివిగో!
తలయివిగో! కోరుకొన్న దానిని నిపుడే
తలఁగక యిచ్చెద గురువర!
తలఁగోసిమ్మనుదొ లేక ధన మిమ్మనుదో!"

చెడుతలఁపున ద్రోణుం డ
ప్పుడు పలికెను నాకదేది పోలదుగానీ
కుడిచే బొటమన వ్రేలొ
క్కఁడు చాలును దానినిమ్ము గురుదక్షిణగా

చెంగట నిల్చి కుంభజుఁడు చెప్పినమాటలనాలకించి యం
దుగల మోసముం దెలిసి తొట్రిలకుండఁగ నేకలవ్యుఁ డా
యంగుటముం గరుక్కున ఖరాసినిఁ గోసి యిదే గ్రహింపవే
వెంగలికాఁడహో! శబర వీరుఁడు దానను దప్పఁ డెన్నడున్

ఇట్లు వచించి, నిర్వికారంబున

తలతలలాడు కత్తి నొఱఁదాల్చి విషణ్ణతఁ బొందకుండఁగా
జలజల రాలుచున్న క్షతజంబును సుంతయు లెక్కపెట్టకే
కలకలలాడు నెమ్మొగము కాంతులు పర్వఁగ మాటలాడఁగా
బలపలనౌచు ద్రోణుఁడును ఫల్గునుఁడంతట బిత్తరింపుచున్

ఏకలవ్యుని గురుశిష్యులిర్వురంత
చిట్టకంబునఁ బొడఁగాంచి పెలవుఁబొంది
కోర్కెలీడేఱెనని చెప్పి కులుకుతోడ
మరలిపోయిరి తమవీటి తెరవుఁబట్టి

ద్రోణార్జునులు మగిడిపోయినపిమ్మట నేకలవ్యుండు తన మనంబున నిట్లు తలపోయసాఁగెను:

గురుఁడఁటవీఁడు నన్ను వెడ కోర్కులు గోరుచునంగుటంబునన్
నఱకఁగఁజేసి కైకొనియె న్యాయమ ? శిష్యునిఁ ఖండలింపఁగా
గురుజనుఁడున్ స్వలాభమును గోతఁగవచ్చునుగాని శిష్యునిన్
గరుణయొకింతలేక యపకారమునన్ గ్రసియింపధర్మమే ?

చింతింపక యొకనికినై
యంతఃకరణ ప్రవృత్తి నావలనిడెఁబో
యంతేః వాసిచెఱుచుకొనె
నంతేవాసి చెడఁడింతయైనను గనుఁడీ

హృదయంబు కలవరపడుచుండఁ దన్నుదానూరడించుకొని

కృష్ణమూర్తి మేనత్తయౌ పృథకుఁగొడుకు
నరుఁడు వానిగురువు చాపగురుడుగానఁ
గృష్ణుఁడీపనియెల్లఁ జేయించియుండు
వేఱువిధముగాఁ దలపోయ వీలులేదు

ఇంతమాత్రంబునకునైనదియేమి ? త్రిజగంబులు విస్మయంపడ శ్రీకృష్ణుండు సంగ్రామరంగంబున నా ప్రళయతాండవముంగనుంగొని ఊచ్చపడుఁగాక;

అడ్డంబువచ్చిన హరిహరాదులనైన
"ఉప్పు"ని క్షణములో నూదివైతు
శ్రీకృష్ణుఁడేవచ్చి డీకొన్నచో వాని
వేటారుతునియల విఱుగవైతు
దండెత్తిపోయి నే ద్వారకాపతిలోన
దండాటలాడింతు దండునెల్ల
పాండుపుత్రకులెతోడ్పడవచ్చుచో మట్టి
పెలుచవారల తలల్ డులిచిపుత్తు

వెలయఁ బదివ్రేళ్ళలో నొక్క వ్రేలుపోయి
నంతమాత్రాన నేమి దురాశగాక?
ఏకలవ్యుండు సర్వలోకైక ఘార్మి
కుండనఁగ మారుమ్రోగింతుఁ గుతలమెల్ల

అంచు రోషించి మంచికాలరులఁబంచి, చెంచు గూడెములనుంచి చెంచుదొరలం బిలిపించినఁ జేసుమోసిన సెలవిలు కాండ్రు, తడవిలుకాండ్రు, వెదురు విలుకాండ్రు, వెడవిలు కాండ్రు నెమరులేక యొకరి నొకరు పిలుచుకొని, మించిన భక్తితో తనికడకు రా నేకలవ్యుండు రణభేరి వేయించి, పైనంబుఁ జేసి ద్వారకాపురివిడాసి, చుట్టుమూఁగి పైఁబడి యాయా చారులనెల్ల నరికట్టి, పురంబుననున్న సరదారుల నాదారులం జేసి, కట్టెదుటనున్న తోఁటలను, దొడ్లను బాడుచేసి, జోదుల పెక్కండ్ర మడియించి, కృష్ణుండు లేమిచే, మగిడివచ్చె. పదంపడి కొండొక కాలంబున మరల యుద్ధంబు ప్రవర్తింపనందు నన్యాయంబుగాఁ గృష్ణునిచే నతఁడు నిహతుండయ్యె.

# ధర్మజు రాజసూయము

నిరంతర ఘోర సంగ్రామవ్యాపారసంక్షుభిత మన స్కుండై శ్రీకృష్ణుండొక్కనాఁడేకాంతంబున, నవరత్నఖచిత కుడ్యపరిభ్రాజమాన నిజసౌధాభ్యంతర చంద్రశాలలో, సాంద్ర చంద్రమరీచి జాలంబు హృదయాహ్లాదంబు కలుగఁజేయుచుండ నెమ్మదిఁ గూర్చుండి యిట్లు తలపోయసాఁగెను:

మురనరకహంసడిచికళ
బరభూవరకంసముఖర పరనరవరులన్
బొరిగొనితి నను పెకానీ
యెఱుగనయితిఁ గంటినిండ నెన్నఁడునిద్రన్

ఒకమూల మాగధుం డూర్జితసత్వుఁడై
దండెత్తిపైఁబడఁ దలఁచుచుండ
ఒకవంక శిశుపాలుఁ డుద్భటారభటితోఁ
గోలాహలముఁజేయఁ గొంకకుండ
ఒక చెంప పౌండ్రకుం డుత్సాహవంతుఁడై
డెప్పరంబుగ ముట్టడింపనుండ
ఒకప్రక్క సాల్వుండు వికటాట్టహాసియై
కైలాటములు పెట్టఁ గదలుచుండ

కాలయవనుఁడొక్కట నౌడు గఱచుచుండ
దంతవక్త్రుండు తనదండఁ దట్టుచుండ
వీరివారిఁ దప్పించుక వేగుటెటులొ !
కలలలో వీరిమూర్తులే కానిపించు

వినరాదువీరి పల్కులు
కనరాదిసుమంత వీరి కార్యచయంబున్
మనరాదు వీరిపొత్తునఁ
జనరాదొక యింత వీరి సంగతికొఱకై

ఆర్యసంఘంబుతో నైక్యమైతినటంచు
మాజాతివారెల్ల మసకపడుచు
ననుఁజూచి కినుకతో నాయందు లేని త
ప్పులమోపి దవ్వుగాఁ దొలఁగిపోయి
చతురంగసైన్యంబు సమకూర్చి నిరతంబు
వెంటాడుచుంటిరి విసుగులేక
కంటినిద్రయెఱుంగఁ గడుపుకూడు నెఱుంగఁ
జాలకాలమునుండి జడుఁడనైతి

నొంటరిగ వీరితోఁబోరుచుండ లేక
జన్మభూమిని గాపాడు శక్తిలేక
కానిద్వీపంబులోనిల్లు గట్టుకొనుచు
నిట్టు లారాటపడుచుంటిఁ దుట్టతుదకు

పాపియగు జరాసంధుఁడైశ్వర్యమత్తుఁ
డగుచు రాజచక్రమునెల్ల నానకట్టి
తోలుచుండె నామీఁదకు ధూర్తుఁడతఁడు
జాతివిద్రోహినని చెప్పి సాకుపెట్టి

అతనిపేరు సింహాస్వప్న మగుటచేతఁ
దొలఁగియుండుట లగ్గించుఁ దలఁచినేను
మధ్యదేశంబు నెడఁబాసి మాటుపడుచు
వచ్చియిందుంటి బాంధవ వ్రజముతోడ

ఎచ్చటి పచ్చికబీళ్ళను
విచ్చల విడిమేయు ధేనువిసరంబులు నా
కిచ్చినవొ గుమ్మపాలను
నచ్చటి భూములను వీడనాడఁగవలసెన్

జన్మభూమియౌ మధ్యదేశంబునందు
నిలువనీడ లేకుండఁ జేఁ గలిగినాఁడు
వీనిరాజ్యంబు కూఁకటి వ్రేళ్ళతోడఁ
బెళ్ళగింపకుండినఁ బేరుపెంపు చెడును

ద్రావిడ జనముల పంచకుఁ
బోవక యెట్లయిన నార్య భూమీశ్వరులా
పోవఁదలలోని నాలుక
కైవడినే సంచరింతుఁ గార్యార్థుఁడనై

సంజకెంజాయలోఁ జలువతిన్నెలమీఁద
విరమించు భాగ్యంబు వెడలిపోయె
పండువెన్నెల నారుబైటలోఁ బవళించు
సౌభాగ్యగరిమంబు సమసిపోయె
ముత్రొప్పొద్దులందుఁ బుప్పొడి దుమారంబులో
మునిఁగితేలుట యెల్ల ముగిసిపోయె
పున్నాగములకూడి పున్నాగములనీడ
పన్నాగములఁబన్ను చెన్నుపోయె

## చతుర్థాశ్వాసము

జన్మశతములకైన నా జన్మభూమి
సౌఖ్యములమాట మఱవంగఁ జాలనౌర
రాజచండాలుఁడైన జరాతనూజు
వల్లనింతవల డిగల్లె వల్లమాని

అమ్ముడువోయితిననుచున్
సమ్మతిఁ జూపింపలేక సందేహముతో
నమ్మరు ద్రావిడజనములు
నమ్మినలాభంబులేదు నాకిఁక వారిన్

అరయఁగ నార్యసంఘమున యందిపుడిప్పుడె భేదభావముల్
పొరయ చునుండెఁగాన నెటి పూనికతో నెటులైన వానినిన్
బెరయ గఁజేసి చిక్కులను బెట్టి నిజంబుగ రెండుపక్షముల్
స్థిరముగఁ గూడకుండునటు చేసినమేలగు రాజనీతిచే

కౌరవ పాండవుల్ తొడరి కౌరవ రాజ్యరమానిమిత్తమై
పోరఁగనున్న వారలని పొక్కెను వార్తలు, కాన వెంటనే
వారి విరోధముల్ చతురుపాయములన్ నిగుడింపఁజేసి యే
తీరుననైన దగ్గరకుఁ దీయుట మంచిది యొక్కపక్షమున్

చతురంగబలముతోడన్
సతతము సప్తాంగ బహుళ సంపదతోడన్
ధృతరాష్ట్రపుత్రుఁ డుండెను
జతపడునేఁవానిపొత్తు సరిపడి మాకున్

పర్యవసాన మేమయినఁ బాపమొ గీపమొ తప్పకుండ నా
యార్యులఁ జీలఁదీసి సమయజ్ఞత వారలు కూడకుండఁగా
ధైర్యముతోడ నీపనిని దప్పక చేయకయున్న బాపురే!
కార్యము తప్పిపోయి యడకత్తెఱలోపలి పోకనయ్యెదన్

బలవంతునితో నెన్నఁడు
చెలిమింజేయంగ రాదు చేసిన యపుడే
సిలుగులు తప్పకకలుగును
జెలిమియు బగయౌచునుండుఁ జిట్టచివరకున్

పగ్గెకలట్టివారు బహు బాహుబలాఢ్యులు నెట్టివారికిం
దగ్గరు పంచపాండవులు దర్పసమగ్రులు యుద్ధభూమి, మా
దగ్గర చుట్టముల్ గనుక దగ్గరతీసి వివేకమొప్ప నా
.యగ్గముఁ జేసికొన్నఁబని యంతయు నెగ్గును నెగ్గులేటికిన్

అన్నన్నా ! నన్నెంత వి
పన్నునిఁ గావించినాఁడు బార్హద్రథియున్
గన్నీటి ధారలొలుకన్
మున్నీటి మయమ్మునందు మునుగఁగవలసెన్

చుట్టపక్కాలు తక్కువ చుట్టునున్న
యట్టి బలగంబు తక్కువ యగునుగానఁ
బరమసంతుష్టులగుచు నా ప్రాపు ప్రోపు
నొందఁ బాండవు లివ్విధి లూరుచుంద్రు

కావున నామాటలపై
గావలసినయంత నమ్మకంబుంతురు గా
దే వారలు దానివలన
నావచనములేవియైన నచ్చఁగవచ్చున్

చండమదంబునన్ దిరిగి సాహసచర్యల నాచరించు రా
ణ్మండలి వారికిన్ బృథకుమారులకుం బగఁజేసిపెట్ట నా
యండను బాయకుండెదరు ప్రాణభయంబునఁ బాండవేయులున్
నిండు బలంబు చేకురును నిక్కము మేలగు నాకు దానిచే

# చతుర్థాశ్వాసము

రాజసూయాధ్వరంబొనర్పంగఁ బాండ
వులను బురికొల్పి నంతటఁ బుడమిఁ బొడమి
యారిపోవని శత్రుత్వ మఖిల రాజ
రాజితోడె క్షణంబులో రాజఁగలదు

అని యాకీర్తి రాజనీతిజ్ఞుఁడై లోతు విచారించి వితర్కించి, వెంటనే దేవర్షి యగు నారదుని బిలిపించి, కార్యవిధానంబు సర్వంబు నిరూపించి చెప్పింప, నారదర్షియు ఇంద్రప్రస్థంబునకేగి పాండవులచే నర్ఘ్యపాద్యాది విధులం బూజింపఁబడి, క్షేమసమాచారంబు లెఱింగి, ప్రసంగవశమున నేమియు నెఱుంగని వానింబోలె నిట్లుచెప్పఁదొడంగె:

"మొనమొన్ననె త్రిదివమునకుఁ
జనివచ్చినవాఁడ నేను జనపాలా! మీ
జనకుని నటఁ గాంచితి నా
యనఘుఁడు సౌఖ్యముల నోలలాడుచునుండెన్

నన్నుఁగాంచినయంత మీపిత నాకమందున వెంటనే
నన్నుదగ్గరి మీదుక్షేమము నాముఖంబునసర్వమున్
విన్నవాడయి సంతసిల్లుచు వికచమోమున నాపయిన్
గొన్నిమాటలు మీకుఁజెప్పఁగఁ గోరి యిట్లనిచెప్పెఁగా

భూతలంబున నున్నయప్పుడు భూతలేశులఁగూల్చుచున్
భూతిఁగూర్చుటెకాని మీకయిబుద్ధిపుట్టకపోయెఁగాఁ
భూతయజ్ఞము లాచరించుచుఁ బ్రోవనైతిని బుణ్యమున్
భూతలంబును వీడినప్పుడు పుణ్యలోకముఁ జేరఁగా

అజ్ఞుఁడయ్యునధర్ముఁడయ్యును నల్పుఁడయ్యును నెవఁడే
యజ్ఞమొక్కఁడు చేసియుండునొ యట్టివానికినిత్యమున్
బ్రజ్ఞగల్గును సత్యలోక నివాసమొందఁగ సర్వదా
ప్రాజ్ఞులయ్యును నాకమందునఁ బ్రాకులాడెదరన్యులున్

ఎద్దడిలేని భూమితలమెల్లనునేలుచునుంటి వింటికిం
బెద్దవుపెద్దపీవయనిపించుకపేరును మోసినావు నీ
కెద్దియు నడ్డులేదు పృథివీశులు తమ్ములు రాజసూయమున్
వద్దనఁబోరు తోడుపడవత్తురు జన్నముసేతునన్నచో

నాకంటెన్ గుణహీనులైననృపులున్ నాకంటె ధర్మచ్యుతుల్
నాకంటెన్ గడులుబ్ధులుంశిరిగదన్నా ! సత్యలోకంబులో
నాకుంగూర్పుము సత్యలోకము మహానందంబు వాటిల్లఁగా
సాకల్యంబుగ రాజసూయమను యజ్ఞంబొండుగావించుచున్

కానఁ బిత్రాజ్ఞఁబాలించి మాననీయ
చంద్రవంశ మర్యాద దేశములయందు
నిలిపి నన్నుఁద్ధరింపంగ వలయునంచు
బలికి, ధర్మజా ! నన్ను మీవద్దకంపె"

నారదుఁడాడిన మాటల
గారవమున నాలకించి కంపిల్లుచుఁ గ
న్నీరొలుకఁగ నిట్లనె వసు
ధారమణుఁడు తండ్రిపాట్లు తత్తరపెట్టన్

తండ్రీ ! చెప్పితి గదె మా
తండ్రి దివమునందు నందు తాపంన్గను నే
మంద్రోజనంబులు విన్నన్
తీంద్రించుచునుండె శోకతీవ్రత నన్నున్

తంత్రి యానతి నేఁదలఁదాల్చి చేత
రాజసూయ పవిత్రాధ్వరంబు నిపుడె
కావి మాకేకుగడమైన కంసవైరిఁ
బిల్చి చెప్పవలసియుండుఁ బెద్దమాకు

అనుచున్న వెంటనే దౌవారికుండు చనుదెంచి శ్రీకృష్ణు నాగమనంబు వినిపింప యుధిష్ఠిరుండు దిగ్గన లేచి యెదురేగి, సాష్టాంగదండప్రణామంబులాచరించి శ్రీకృష్ణుని గ్రుచ్చి కౌఁగలించి యుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి, కుశలసంప్రశ్నముఁ జేసి, నారదుండు చెప్పిన యుదంతంబు విన్పింప దరహసితవదనుండై యదూద్వహుండు—

ఇంతకన్నఁ గావలసిన దేమిమనకు?
తంత్రికన్న వేఱుగలండె దైవమొకఁడు?
తంత్రి సంతుష్టిఁ బొందినఁదప్పకుండ
భువనమంతయు సంతుష్టిఁబొందఁగలదు

దైవజ్ఞుల రావించి సుముహూర్తంబు నిశ్చయించి వెంటనే,

నల్వుర తమ్ములంబిలిచి నాలుగుదిక్కులకు కప్పనంబులన్
గొల్వఁగఁదేరఁబంపు సమకూర్పుము ద్రవ్యములన్ని చక్కఁగాఁ
బిల్వఁగఁబంపు చుట్టములఁ బెత్తనముంబొనరింప నిప్పుడే
నల్వురచేత యజ్ఞము నెఱవెనిపించెదఁ దంత్రి హర్షిలన్

కానుకలీయకయున్నన్
మానక దండెత్తిపోయి క్ష్మాపాలకులన్
దీనులఁజేయుచు నీ స్వా
ధీనముఁగావింతు వారిదీమస మెడలన్

అధ్వరసమాప్తి యయ్యెడు నంతపఱకు
నిందెయుంటి సంబారము లెల్లఁగూర్చి
పెట్టి మెప్పించెద విరోధి వితతిచేతఁ
గలఁతపడనేల యీపాటి కార్యమునకు ?

అని ప్రోత్సాహముఁ జేసినంతటనె యజ్ఞారంభసంపంథిసై
తన తోఁబుట్టుల నల్వురంబనిచెఁ బంతంబొప్ప నల్దిక్కులం
గని రాజన్యులనుండి యప్పనములంగై కొంచు రమ్మంచుఁ జ
య్యనఁ గుంతీతనయాగ్రజుండపుడె పిత్రాజ్ఞానిబద్ధాత్ముఁడై

కొన్ని దివసంబు లట్టులే చన్నపిదపఁ
గవలు వడముడిపచ్చిరి కానుకలను
సకల రాజచంద్రులనుండి సంగ్రహించి
వాసుదేవ ధర్మజులు సంతోసమంద

బేలుపోయినమనసుతో విజయు డొకఁడు
వట్టిచేతులతోఁదిర్గివచ్చెనకట !
సిగ్గు ముప్పిరిఁ గొనుచుండఁ, జెప్పలేక
చెప్పె నగ్రజుతోఁ జిట్ట చివరకిట్లు

రాజగృహంబుఁజొచ్చుచు జరాసుతుఁ గన్గొని యొంటిపాటునన్
నేఁ జనివచ్చినట్టి పనినిన్ వినిపింపఁగ నవ్వి యిట్లనెన్
రాజటె ధర్మసూనుఁడవురా! యిది యెన్నఁడువచ్చి పైఁబడెన్
రాజనుకొన్న మాత్రనె జరాసుతుఁడిచ్చునె యప్పనంబులన్ ?

# చతుర్థాశ్వాసము

అరియప్పనంబులీయం
దరివారముఁ ద్రుంచుఁగాని యరుదెంచిన నా
హరిహరులరిఁ గొనఁదలఁగక
యరిగాపులఁ జేసికొనును నరి నరవరులన్

ఇటు జరాసుతుఁ డాడ నే సేవపడియు
నోడ కదలింప కరికట్టి యూరకుంటిఁ
జేయునదిలేక యచ్చట సిగ్గుపడితి
రాజచంద్ర! దుస్సహమీపరాభవంబు

వానినిఁ జంపి కాని కయివాల్చను నాకనుదోయి ఱెప్పలన్
వానినిఁ జంపికాని కుడువం దలపోయను భోజనంబునున్
వాని కఠోరవాక్యములు వానిఘనోక్తులు నీసడింపులున్
మానవనాథ! నాచెవుల మానక గింగురుమంచునుండెఁబో

అనవిని కృష్ణుఁడిట్లనియె సౌర! జరాసుతుఁడన్న నల్పుఁడే?
యనిమొనఁ జూచితీరవలె నాతనిచేవ, బలంబు, సొంపు, నా
తని పటుముష్టియుద్ధము, గదారణపాండితి, శత్రువీరులై
నను నుతియించి తీరుదురు నాపలుకుల్ వినియూరకుండుమా

భీమార్జునులిర్వుర నా
తో మానవనాథ! పంపు తొందరపడ కె
ట్లో మాగధు లోఁబరచెద
సామమునసో లేక ఘోర సమరమ్మునవో

నేటికిఁ గొల్వుఁ జాలింతమని చెప్పి లేచి శ్రీకృష్ణుండు కొండొక క్షణంబు ధర్మజునితో రహస్యాలోచనంబుఁ గావించి, రాత్రిఁ గడపిపుచ్చి మఱునాఁడు పెందలకడ నిద్దుర లేచి భీమార్జునులను గూడి గిరివ్రజపురంబునకుఁ బ్రయాణోన్ముఖుండయ్యెను.

వెలయ స్నాతక బ్రాహ్మణ వేషములను
గొనబుగా సంతరించి ముగ్గురునుగూడ
వెడలి ముచ్చిచ్చురీతిగా బిడియపడక
చనిరి యప్పుడప్డె గిరివ్రజపురమునకు

ఒద్దికవారు మూవురును నబ్బకు నెండకునోర్చి దారిలో
సుద్దులుకొన్నిచెప్పికొనుచుం జనుచుండఁగ నోర్మినొక్క నాఁ
డద్దమరేయియైన యపుడందఱు రాజగృహంబు చెంతకున్
దద్దయుఁజేరి యొక్కయెడ దారికిదూరమునందునిల్వఁగన్

వాసుదేవుండొ యిటునటు పాఱఁజూచి
చీమ చిటుకుమన్న నులికి చివుకురుమనఁ
దోడవచ్చిన పార్థులతోడ నేమి
పలుకులో పల్కి యచ్చోటనిలువనీక

రాచబాటను దిగఁద్రొక్కి కోచలగుచుఁ
గొండకోనలో లోయలోగుండ నడచి
కాలి సవ్వడి కాకుండఁ గట్టకడకు
గదలివచ్చి నిల్చిరి కోటగమికివాత

ఎఱిగినవాఁడుగాన మును కృష్ణుఁడు పాండు నృపాలపుత్రు లి
ద్దరి విడి దుందుభుల్ గలుగుతావున కేగి యగల్చివైచుచున్
బిరబిరవచ్చి వారలను వెంటనె తోడ్కొని పట్టణంబునున్
జొరి చనె నెట్టి సంశయము చొప్పడకుండఁగ నెట్టివారికిన్

రాజమందిరమేగి యారాత్రిపూట
వార్తఁబంపిరి కావలివానితోడ
స్నాతకులు ముప్వురు తమ దర్శనముఁగోరి
నిలిచియున్నారు మొగసాల నీడ ననుచు

# చతుర్థాశ్వాసము

శైవపూజానిమగ్నుఁడై సర్వమాన
మఱచియున్న జరాసంధ నరవరునకు
సౌవిదల్లుఁడు మెల్లగాఁ జనియచటకు
విన్నవించె నీవార్త భూపతినితోడ

వచ్చినది విప్రుఁడగుటన్
జెచ్చెర వినిపింపకున్న శిక్షింపనొకో
మచ్చరపడి భూపతియని
గ్రచ్చర వినిపించెనపుడు కావలివాఁడున్

ముంగిటియందు బ్రాహ్మణులు మువ్వురు నిల్చియున్న వార్త వి
ల్లంగలిగుండుఁ బొంది పదిలంబుగఁ బూజనుమానిపై చిక
న్నుంగవడాప్పముల్ పొడర, సూత్నవికాసము మోముఁ గ్రమ్మఁగా
ముంగలి సంగజాల వడిఁ బోవుచునుండఁగ వారిఁ తీయుచున్

పంచరత్ని ప్రమాణంబు బహుళమాంస
లాంగకములుఁగల్గు శరీర మగ్గలింప
విపులవక్షఃకవాటంబు వెల్గుచుండ
నంగణమున జరాసంధుఁ డవతరించి

మువ్వురిమూర్తులంగని యపూర్వమువీరల బ్రహ్మతేజమున్
మువ్వురియందుఁ గన్పడదు పూర్తిగ వీరలు విప్రులౌదురా!
యెవ్వరొ వీర లెందుకయి కృత్రిమ వేషములిట్లు దాల్చిరో
నివ్వెఱ గల్గుచుండె గమనించుట మంచిది వీరి చర్యలన్.

అంచు నీగతి లోలోన వితర్కించుకొని జరాసంధుండు
కోలిక పోలిక నాగులాడు మనంబుతో వారలఁ జూచి,

ఏనినిఁజూడఁగోరి యిటు లిచ్చటికిన్ జనుదెంచినారు ? మీ
మీనివసించు భూములయు మీనరపాలుర పేరులేవియో
యీనడిరేయి యేమిపని కిచ్చటి కీగతి వచ్చినారలో
నేననుమానముంబడితి నిక్కముచెప్పుఁడి యాచకుండఁగన్

ఈ మాటల నాలించిన
తామరసాక్షుండు పల్కె దంభముతోడన్
మోమున విలక్షణంబుల
నేమియుఁ జూపట్టనీక యెంతొ కపటియై

స్నాతకులమైన మాకొక్క సమయముండె
రెండుజాముల మునుముందు రేయియందుఁ
బల్కరింపము పల్కము పరులతోడ
నిందుచే వచ్చితిమి యిట కీ యవేళ

మీతోడంబని గల్గుట
చేతన్వచ్చితిమి యీ నిశీథిన్ దేవా !
మీతోఁ జెప్పెదమంతయు
నేతావునకైన వోదమేకాంతముగా

అనినంతనె వెంట జరా
తనయుఁడు భీమార్జునులను దామోదరునిన్
గొనిచనె నిర్వాతమయిన
తన పూజాగృహమునకును దద్దయుఁబ్రీతిన్

నలువురు లోనికేగిన యనంతర మర్జునుఁగన్నుసైగచేఁ
దెలుపఁగ యాదవుండతఁడు దీనినినెల్ల గ్రహించి వెంటనే
తలుపులుమూసి మాగధునిదగ్గరఁజేరుచుఁ జుట్టుమూఁగియే
పలుకులొకొన్ని పల్కుచును వాదములోనికిదింపి యంతటన్

జిలిబిలిపలుకులు పలుకుచుఁ
జెలిమిని నటియించి కొంతసేపు తటుకునన్
దొలకరిమెఱుపుఁ బోలెఁ బైఁ
గలియంబడి మూపులొకటిగా మాగధుపై

పెఱికిటిపోటులం బొడిచి పెళ్ళుఱిపోవఁగ నజ్జునజ్జుగాఁ
గఱిమిచెడంగఁ బాదముల గట్టిగఁదాకుచు గొంతుఁబట్టుచున్
నుఱిబడఁ గ్రుమ్మిమర్మముల గ్రుక్కఁగఁజేయుచు మూపులొక్కటై
మఱియఁగఁజేయుకోర్కెమెయి మాగధుఁడాకిలి భీకరంబుగన్

మొనసిజరాతనూభవుఁడు మూపురితోడను మూఁపుమూర్తులై
కినిసిప్రచండవేగమునఁ గిట్టిపలంబునఁ గీలుకీలునున్
దునిసిపడంగ వాఱిపయి మూకుచు నూకుచు రెంపుమూర్తముల్
పెనగెను ముష్టియుద్ధమున వీపుఁబెతండని తెల్పనోయనన్

మూపురు మిక్కిలి రోజుచు
చాపులు దప్పించుకొనఁగఁ జకితాత్మకుడై
పైవచ్చి పడుటమానుచు
లావును దగ్గింపఁగను వెలార్చిరి వారిన్

క్రమముగ బలముడుగుటఁగని
సమయమరుగుదెంచెననుచు సాహసలీలన్
బొమముడిఁ బెట్టుచుభీముఁడు
తమకమ్మున మీఁదికుఱికి ధరఁబడఁగొట్టెన్

పడినవానిఁ గృష్ణార్జునుల్ పట్టుకొనుచు
నదిమిపెట్టంగ భీముండు కదిపి కాలు
పట్టి పెళపెళారావంబు పుట్టిపడఁగఁ
జీల్చివైచె జరాసంధు శీర్ణదేహ

తెల తెలవారకమున్నె
బలవంతపు తేనిచావు పట్టణమెఱింగెన్
గలగుడుపతి చెడిపోయిరి
పలపలనయి యెండుఁగల్లు బవిసీంద్రెల్లన్

పేరుమోసిన రారాజుపేరు మాసి
పోవఁ బురిలోననున్నట్టి పోటుకాండ్రు
బిత్తరిల్లిరి యెదురెక్కి పెనఁగులాట
మాటఁ దలపెట్టరైరి డబ్బాటుచేత

వీరగంధము నొడలెల్లఁ బెటిలఁబూసి
యెఱ్ఱ కసుగ్రుస్సు మిక్కిలి యెఱ్ఱపూల
దండ లెఱ్ఱపల్వలును మైనిండఁదాల్చి
రాచబాట నిలచిరి వీరత్రయంబు

స్నాతకు లోకక్షణంబులో నల్లఁద్రావు
కటిక వారలై పోయిరి కాలమహిమ
ఘోరహత్యలు చేయఁగాఁ గొంకరెందు
మానవులు రాజ్యకాంక్షచే మఱుగునపుడు

గిట్టిజరాతనూభవునిఁ గీటడఁగింప నరాజకంబుగాఁ
బట్టణమెల్లఁ బాడువడ వందురుచుండుటఁగాంచి తత్సుతున్
దిట్టతనంబులేని సహదేవుని రమ్మని పిల్చి వానికిం
బట్టముగట్టి పాడిమెయిఁ బాలనసేయుమటంచుఁ దెల్పఁగన్

తండ్రిచావుచే భీతిల్లి తత్తరించి
జడిసి సహదేవుఁ డుడుగరల్ చాలఁదెచ్చి
కృష్ణ సన్నిధిఁ బెట్ట నాకేటి కనక
వాని నన్నింటిఁ జేకొని వరుసఁబెట్టి

మాగధుచేత నోటువడి ప్రగ్గుచునుండిన రాజలోకమున్
మాగధుకార నుండిరనుమాట యెఱింగి యమాత్యప్రహుండు తా
వేగమె వారినెల్ల విడిపింపగఁ బోయిరి వారువీళ్ళకున్
భోగములందు కోర్కెపరిపూర్ణముగాఁ దముఁ బొందరింపగన్

పోయిన రాజులెల్ల యదు ముఖ్యపృథాతనయాభిమానులై
పోయిరి కారయున్ వదలిపోవు నటంచును నేఁటితోడ నా
పోయిరి పూర్వబాధఁదలిపోయుచు మిక్కిలి తండరించి వా
పోయిరి సొంతవీటులకుఁ బోయిరి క్రోధపరీతచిత్తులై

ఇట్లు జరాసంధ జీవోత్పాటకులైన యాదవ పౌరవవీరులింద్ర ప్రస్థపురంబునకు నేగి, చింతాకులుండై యెదురుచూచుచున్న ధర్మసూతికి నఖిలంబు నెఱింగింప, నాతఁడు విస్మయాకులచిత్తుండై యద్భుత రసావేశనుగ్నుండై శ్రీకృష్ణభీమార్జునులఁ గాంచి గాఢపరిష్వంగసుఖంబునఁ దేల్చి రాజసూయ మహాధ్వరారంభ ప్రయత్నంబునను నుండ,

దూరభారమనక మాఱుమూలలజనం
బధ్వరంబుఁజూడ నరుగుదెంచెఁ
బిక్కటిల్లిపోయె నొక్కొక్క గేహంబు
నేలయీనినట్లు నిండెఁబురము

దిక్కులనుండి భూపతులు తెచ్చిరి కానుకలు చుట్టపక్కముల్
పెక్కురు ద్రవ్యరాసులను బెక్కులు తెచ్చిరి మేలివస్తువుల్
మిక్కిలి గూర్చితెచ్చిరి సుమీ యభిమానము గల్గు రాజు
లమ్మకక్క! యటంచునుంబొగడి రావురమంవలి యమ్మలక్కలున్

దైవజ్ఞోపదిష్టంబుగా ధర్మజుండు మంగళస్నానం బాచరించి సహధర్మచారిణియైన ద్రౌపదింగూడి దీక్షితుండై యజ్ఞప్రారంభంబుఁ గావించి శాస్త్రానుసారంబుగా నగ్రపూజావశిష్టంబుగా ముగియుంచి, తత్పూజార్హు లెవ్వరాయని లోవితర్కించికొనుచుఁ దిట్టతుదకు-

తమమాటన్ దలపెట్టి కెప్పుడు దయాదాక్షిణ్యభావంబుతోఁ
గనుదోయింగను తెప్పలట్టులు మమున్ గాపాడు చున్నట్టి వె
న్నుని సంప్రీతుని గాఁగఁజేసికొని సంతోషించు భాగ్యంబు క
న్నను నాకున్ మఱి వేరుధర్మ మొకటైనన్ గల్గునే ధాత్రిలో ?

నాకంటెన్ బలవంతులైన నృపులున్ నాకంటెశౌరాద్యులున్
నాకంటెన్ రణదక్షులైన నృపులున్ నాకంటె ధైర్యాత్ములౌ
భూకాంతుల్ గలుగంగ నీసవనమున్ భూపాలకశ్రేణియున్
నాకౌకుల్ వెరగందుచుండ నిపుడున్ నాచేతఁజేయింపఁదే

కృతకృత్యుఁడ నయ్యెదనేఁ
గృతజ్ఞతను గానిపింతుఁ గృష్ణుని సభలో
నతిభక్తిఁ బూజచేసెదఁ
బ్రతిపక్షుల తోడనాకుఁ బనియేముండున్

ధర్మజుఁడు తన మనంబులో నిట్లు నిర్ధారించుకొని,

పూజాద్రవ్యములన్ గ్రహించుకొని సంపూర్ణౌత్సుకత్వంబుతో
రాజీవాక్షుని పాదపద్మముల నారాధించి సద్భక్తితోఁ
బూజించెన్ గద తత్సభాముఖమునన్ బోరామియేపాఁరఁగా
దేజఃపుంజముచేత మోము వెలుఁగన్ దేదీప్యమానంబుగా

## చతుర్థాశ్వాసము

కొందరు సంతోషించిరి
కొందఱు మౌనంబుఁదాల్చి కూర్చుండిరికన్
గొందఱు గుందిరి చైద్యుం
డందఱి నదలించి యాపి నతఁడిట్లనియెన్

పేరున ధర్మరాజనని బెట్టుగ నుంటివి యింతమాత్రమా
రౌర ! యెఱుంగఁజాలవా కొ యాఁడదియయ్యెను వృద్ధసేవ నీ
పేరుప్రతిష్ఠలున్ జెడెనె వెంగలివైతివి యిప్పు డీ సభా
గౌరవమేల యిచ్చితివి కంటిమె వింటిమె యిట్టి చిత్రముల్ ?

క్షత్రియుండని కాళ్లు కడిగి పూజించితే
యుండఁడేయిందు మహోగ్ర ధనుండు ?
ఆచార్యుఁడని చెప్పి యరసి యర్చించితే
కలుగఁడే యిందు గంగాసుతుండు ?
వృద్ధుడంచును విచారించి సేవించితే
వర్తింపఁడే యిందు వాహ్లీకుండు?
వేదవేత్తని చెప్పి పిలిపించి కొలిచితే
వరలఁడే యిందు ద్వైపాయనుండు?

కులములేదు జాతియులేదు గుణములేదు
ధర్మ మెఱుగఁబోఁడాచార్య తత్వమెఱుగఁ
డేల పూజించినాడవో కృష్ణునిపుడు
సభికులకుఁ దలవంపులు సంభవింప

ఔర ! నిన్న మొన్నటిదాఁక యదుకులంబు
మ్లేచ్ఛజాతిగా నున్నది మేదినీశ !
యెఱుఁగవా యట్టివానికి నిప్పు డగ్ర
పూజనిత్తువా యీ సభాముఖమునందు ?

ఉత్తమ రాజవంశ్యులకహో తలవంపులు చేసినావు నీ
చిత్తము నేఁటికిందెలిసె సీ! యిది ధర్మమె? యెందతోనినున్
మెత్తనివేఁగివందురది మిధ్యయొకించుకకూడఁగాదు యా
వత్తునెఱింగి భీష్ముఁడొక పల్కును పల్కఁడు మూఁగలాగునన్

గుసగుసలాడుటె కానీ
బిసవిడి మాటాడరిందుఁ బిఱికితనముచే
నిసిరో! యిట్టి సభికులున్
వసుధంజూపట్టువారె పరిశీలింపన్?

చుట్టమైనచోఁ గుడువను గట్టనిచ్చి
పూజలొనరించెదవు గాని బుద్ధిలేక
పూజ్యుల యెదుటఁ బూజించి పొగడుటేల
గొల్లవారింటి గజదొంగఁ గొంకులేక?

ఏటికి మముఁబిలిపించితి?
వేటికిటు పరాభవింప నీ సభలోనన్
జిటికి మాటికి నిటు కై
లాటముతో సంచరింప లగ్గగునొక్కో!

బాలుండగు శిశుపాలుం
డీ లీలం బలుకుచుండ నిదియదియని వా
చాలుండై సభికులలోఁ
గోలాహల మట్టెపుట్టెఁ గొల్లగ నపుడున్

అంతఁ దోకద్రొక్కిన మహానాగంబు చందంబున
రోజుచు నతి రోషంబున సహదేవుండు లేచి నిలువంబడి,

ఊరక ప్రేలుచుండితివి యో శిశుపాల ! సభాముఖంబునన్
రాజులు క్షత్త్రియోత్తములు పండితులుండిరటంచు నెంచ వె
వ్వారలు మమ్ముఁగాదనుచుఁబ్రల్లదముల్ వచియించువారలో
వారలఁ దన్నిపంపెదము పంతముతో నిది చెప్పుచుంటిమిన్

బాలుఁడవయ్యున్ బెద్దలఁ
బోలెన్ ధర్మంబు జెప్పఁ బోయెదె? పోపో
బాలిశ ! పెద్దల సభలో
నాలోచింపక ప్రసంగ మాడందగునే ?

సహదేవుని వాక్యంబుల
సహనము విడనాడిపోవ సంభ్రమపరుఁడై
యహమహమికతో నప్పుడు
సహదేవునిఁజూచిపలికెఁ జైద్యుండిటులన్

తన్నెదనంచు నెత్తిన పదంబదె పెద్దలు చూచుచుండగా
దిన్నఁగ నాకటారిఁ దెగటీరును మిక్కిలి ప్రల్లదించినన్
దన్నఁగలట్టి శక్తికలదా ? తమపద్దను జూతమేది? ఏ
యన్నలులేక తన్నఁగలవా? సహదేవ ! యెఱుంగనింతకున్

తన్నెదననుచున్ సభలోఁ
దన్నిక కూర్చుండి మాటఁదప్పినవానిన్
మన్నింపరు పెద్దలెపుడు
తన్నుటొ తన్నించుకొనుటొ తప్పదు నీకున్

మూగురు దొంగవేసములబూని యధేచ్ఛమహానుభావు మా
మాగధు విప్రబంధుని ప్రమత్తుని నిర్మలు స్నేహపాత్రునిన్
మూఁగుచు నర్ధరాత్రిఁ బొరిపుచ్చుట మాత్రము కాదుపోరి! మీ
యాగము సాగునా యిఁకను యాగమునందిటు దూరి పల్కినన్

శిశుపాలునితోఁ బోరుట
వశమగునే నిన్నుఁబోని పందకుఁజెడుగా ।
శశిధరునంతటివాఁడు వి
వశుఁడయ్యెడు వానిబారిఁ బడినంతటనే

అని గంభీరవచనంబులు నుడివి ధర్మనిర్ణేతలు ధర్మంబు నెఱింగియు, ధర్మనిర్ణయంబుఁజేయక యధర్మంబుసాగనిచ్చు టంజేసి యిందుండఁదగవుకాదని లేచిపోఁబోవుచుండ, ధర్మజుండు శిశుపాలుని చెంటంజని వానింబట్టుపఱచి తోడ్కొని మగిడివచ్చెను. శిశుపాలుండును బాలుండగుటచేఁ బరుషవాక్య పరంపరల విరమింపఁడయ్యె. భీమసేనుండు దాన రోషకషాయితనేత్రుండయి భుజాస్ఫాలనంబుఁజేసి యుద్ధోన్ముఖుండయ్యె. భీష్ముండిది చూచి భీముని నదిమిపట్టికొని శిశుపాలుండలంతియని తలంచితివే ? నీ కసాధ్యుం, డూరకుండుమని బోధింప మిన్నకుండెను. శిశుపాలుని పరుషవాక్యంబులకు, వీరవాక్యంబులకు వికత్థనంబులకు యాదవ పాంచాలురు సంక్షుభిత మనస్కులైరి. చైద్యులును సంగరోన్ముఖులగుచుండిరి. సభయంతయు నల్లకల్లోలమైపోయెను. ఈ సందడిఁ గనిపెట్టి చైద్యుండు ప్రమత్తుండై యుండుటంగాంచి—

ఎగుమూపునకున్ నేర్పునఁ
దగిలించినయట్టి చక్రధారను శిరమున్
దెగిపడఁ దటుకునఁ గృష్ణుఁడు
మొగిసి ప్రయోగించెఁ జక్రమును సభ చెదరన్

# చ తు ర్థా శ్వా స ము

ఈగతి రాజసూయము మహీశుఁడు సాంతముఁజేసి దూరదే
శాగతబంధులన్ బనిపి యందఁడు మోదము, కాని కృష్ణుఁడున్
జాగని లోఁదలంచె శిశుపాల జరాసుతులిర్వు రింతలో
నేగిరి స్వర్గలోకమిఁక విక్కటులేవియుఁ రావటం చాగిన్

కలిగించెం బగ చేదిరాజమగధ క్ష్మాపాలసంహారమున్
గలఁగించెన్ గురురాజమానసము యజ్ఞంబింక మాయిక్కటుల్
తొలగెంబొమ్మని ధర్మరాజుకడనెంతో భక్తి శ్రీకృష్ణుఁడున్
సెలవుంగైకొని ద్వారకానగరముం జేరెన్ బ్రమోదంబునన్

ద్వారకఁజేరి యందుఁగల తల్లిని దండ్రిని నన్నదమ్ములన్
గూరిమి బిడ్డలంగనుచుఁ గొన్నినెలల్ గడుపంగ నారిటం
కారములున్ వినంబడవు గంధగజేంద్ర ఘటాకఠోర ఘీం
కారములున్ వినంబడవు, క్ష్మాస్థలి శాంతిగ నుండె, నింతలో

చైద్యునిఁజంపె గృష్ణుఁడను సంగతి సాళ్వుఁడెఱింగిఁ క్రుద్ధుడై
చైద్యుబుణంబుఁ దీర్చెదను సంగరమందునఁ గృష్ణుఁజంపి యా
యుద్యమమందు నాయసురులంకువఁజేసెద నెవ్వరడ్డినన్
జైద్యునిపావు ద్రావిడుల శౌర్యము నింకఁగఁజేయజాలునే

ఎప్పుడు నిట్టివాఁడెయగు కృష్ణుఁడెఱుంగమె? ఔర వీనికిం
దప్పులులేవు, లేదు రణధర్మము శూరకులంబునందునన్
జొప్పఁడ బుట్టియుండినను సంతయొఱుంగఁడు శూరధర్మముల్
ముప్పొదఁ గూడు విక్కముగ ముక్కున వీనికి నావి యున్నచో

చచ్చుటో వీనిం జంపుటో
మచ్చరముగఁ బోరుసల్పి మానకయనుచున్
జెచ్చెరసాళ్వనృపుండు వి
యచ్చరులెల్ల గుమిగూడి యచ్చెరువందన్

దంభనృపాలకోటి మదదర్ప సమగ్ర భుజాపలేప సం
స్తంభన మాచరింపఁగల దారుణబాణకృపాణయుక్తమా
సౌంభకపట్టణంబు రిపుజాలముఁదూల్పక వ్రేల్పకెల్ల వి
శ్వంభర దిర్దిరం దిరిగి వాలక మ్రాలక యుండ నుంచునే

ప్రళయతాండవమాడింతు భగ్నరథము
శిథిల సమరాయుధంబు విశీర్ణదేహ
మై రణస్థలి గోమాయువాహరించి
మిగులవిహరించు భోగభూమిని నొనర్తు

అని వచియించి కృతనిశ్చయుండయి,

తుంగమాతంగ తురంగశతాంగ స
ద్భటరాజి నెక్కించ పదిలపఱచి
ఆయుధాగారంబులన్నింటి శస్త్రాది
నిఖిలాయుధంబుల నింపివైచి
వివరించి స్త్రీ బాల వృద్ధరోగార్తుల
మంచిమాటలు చెప్పి దించివైచి
మేఘమండలిపైకి మెలపుతో నెగయించి
యలవోక తనదారిఁ దొలఁగనీక

సౌంభకవిమాన నగరంబు సాళ్వుఁడెక్కఁ
జండభయదవలాహక స్వనితతులిత
చటుల గంభీర భేరికాస్వనమునిగుడె
జైత్రయాత్రాసముత్సాహసమయమందు

తలఁగక యాదవుల్ కడలి దాపునబందరునందు సాళ్వునిన్
దలపడి లెక్కపెట్టక వితాకును జెందక పోరుచుండఁగా
నలవు జలంబుతోడను భయంకరరీతి జయాభిలాషచేఁ
దొలఁగెను మాసముల్ జయము తోఁపకపోయె లవంబు సైతమున్

# చతుర్థాశ్వాసము

ఆరునెలలు పోరు ఘోరంబుగాఁజేసి
సాళ్వభూమి ధవుఁడు సమసిపోయె
గాలిజోగుఁప్రోలు కడలిలో దిగఁజారి
పేరు మాసిపోయె విభునిఁగూడి

యాదవ సాళ్వవీరు లిటు లాలముఁజేసెడి కాలమందునన్
జూదమునాడి పాండు నృపసూనుఁడు కోల్పడిపోవ రాజ్యమున్
గాదిలితమ్ములన్ సతిని గౌరవనాథుఁడు యాజ్ఞసేనినిన్
జ్మ్రదయితుల్ కనుంగొన సుమాళముతో సభకీడిపింపఁగా

కనుగొనలందు నశ్రువులుగ్రమ్మఁగ బోరునసేడ్చెఁదత్సభన్
గనుగొనఁ గాచువారలటఁ గానమిఁ గృష్ణుఁడు సాళ్వరాజుతో
డ నని యొనర్చుచున్ మిగుల దస్సి భయంపడి వేగవీనినిన్
దునుముట యెట్టులో యనుచు దూబయియిచ్చట నేప్పుచుండఁగన్

## పౌండ్రక వాసుదేవుడు

కలదొక ద్రావిడప్రభువు గండరగండఁడు పుండ్రజాతికిన్
గులపతి వాసుదేవుఁడను క్షోణిధవుండభిమానవంతుఁడున్
జలజదళాక్షుసన్నిధికిఁ జారునిబంపె నొకప్పుడీగతిన్
బలుకుమటంచుఁజెప్పి తనభావముతేటపడంగఁజెచ్చెరన్

వాసుదేవుఁడన్ పేరుగా వలపెనోటు
ఇపుడు శంఖచక్రములు నీకేలవలపె?
నెంతవాఁడవైతౌరౌర! యింతలోనఁ
గృష్ణ! గోపీకుచాలంకరిష్ణవీవు

ఏమిర! కృష్ణ! చిత్రములనేకముఁజేయుచు నుంటివంట నా
నామము బూనినావఁట వినాశము నీకిఁకఁదప్పబోదు పైఁ
గా మము ధిఃకరించుటకుఁ గైకొనినావఁట శంఖచక్రముల్
నీ మతి పోయెనే? బ్రదుక నేరవె? తీరని వైరమేటికిన్.

పేరు ప్రతిష్ఠలేల? యదువీర! చలంబును మాని వీడు నా
పేరును శంఖచక్రముల వీడకయున్న శరీరమంతయున్
బేరుకొనంగ నెత్తు అరివీరులు పేరుకొనంగ నన్ను నీ
పేరునడంతు నీక్షణమ పేరులకోరుల గ్రొచ్చిపాతుచున్

చారముఖంబునన్ వినివిచారములేకయె కృష్ణుఁడీ సమా
చారము యాదవప్రజకు సర్వము చక్కఁగ విప్పిచెప్పి గో
చారఫలంబుఁజూచికొని సంగరభూమికి భూరి సైన్యసం
చారముతో బయల్వెడలెఁ జయ్యన వైరులు పిచ్చలింపఁగన్

గాండ్రని బొబ్బరింతలిడు గండుపులింబలె గ్రుడ్లుద్రిప్పుచుం
పౌండ్రక వాసుదేవుఁడు జవంబున యాదవ వాసుదేవునిన్
దీండ్రిలివచ్చి దాఁకెఁ గడతేర్చెదనంచు జయాభిలాషచే
వాండ్రును వీండ్రు నీపగిది వచ్చిన సైఁతునెయంచు గర్వియై

శరసంధానముఁజేసి లాఘవముతో సవ్యాప సవ్యంబుగా
దురముంజేసిరి వాసుదేవయుగమున్ దోస్సారదుర్వారులై
పరిపోరాటమటంచు వీరభటులాశ్చర్యంబుతో వింతతోఁ
బరికింపం దివసంబులేగె సమరవ్యాపార మేపారఁగన్

శౌరి గర్జించి నిర్ణిద్ర శక్తిపటిమ
ఖండనంబునఁ బౌండ్రక వాసుదేవు
శిరము చక్రధారాహతి దొరలనేసెఁ
బుండ్రజాతి దొరలు నేల పొరలి దొరల

ఇటు యాదవపుంగవు ద్రావిడలోకంబునఁగల దొరల నాక్రమించి బట్టుకొని చతురుపాయంబుల మందించి పరిశ్రాంతుండై యెగులుదిగులు లేక కాలక్షేపంబుఁ జేయుచు నార్య లోకంబునందు తనమంత్రాంగంబుచేఁ గల్గినవిభేదంబు లెట్లు విస్తరిల్లునాయని యోజించునవసరంబున—



# కృష్ణ రాయబారము

ద్యూతమాడుటకునై దుర్యోధనుఁడు పిల్వ
క్షత్ర ధర్మమటంచు సాకువెట్టి
తనకున్న యక్ష విద్యాప్రౌఢి నెఱనమ్మి
పూర్వాపజయముచేఁ బొగులుచుండి
కురురాజ్య విభవంబుఁ గొల్లఁగొట్టఁగవచ్చు
ననిచెప్పి పాండవేయాగ్రజుండు
పదిరెండు వర్షముల్ వనవాసమామీఁద
నొకయబ్దమజ్ఞాత మొనరుపంగ

నిండుసభలోనఁ బందెంబు నిర్ణయించి
శకునితో జూదమాడి సభికులయెదుట
నోడి, పెండ్లాము తమ్ముల తోడఁగూడి
బయలుదేరెఁ దక్షిణమ ప్రవాసదీక్ష

అవ్యయమైననోర్మి సమయాబ్దములన్ గడువంగఁబుచ్చి నా
నావ్యధలంది ఘోర గహనంబులఁ గ్రుమ్మఱి యెట్టకేలో యుప
ప్లావ్యపురంబుఁజేరి తమభార్యను దమ్ములఁగూడియుండి కా
లవ్యవధిన్ సహింప కుబలాటముతోడఁ బృథాతనూజుఁడున్

చిడిముడిపాటుతోఁ గలఁత జెందిన డెందముతోడఁ బాలలో
బడినటువంటి బల్లివలెఁ బాండుతనూభవుఁడుండి చాలసే
పెడతెగకుండ లోఁదలఁచి యేమియుఁ దోచక బేలుపోయి యొ
క్కఁడె తుదకీవిధంబు మతకంబునఁ జేయఁగనెంచెఁ గార్యమున్

## చతుర్థాశ్వాసము

రణము రణమన్న వత్తురో రారొ ! రాజు
లఖిల బంధువర్గము వెనుకాడునేమొ !
యేదొ యొకయుపాయమ్ముచే నిటకు నెల్లి
వారి రప్పించి యెసకొల్ప వలయునంచు

ఉండెఁగా యభిమన్యు నుద్వాహకార్యంబు
సరవితో నేఁడెల్లి జరుగవలసి
యదిసాకుగా నిప్పు డఖిల బంధుజనంబు
విహిత సంఘంబుఁ బిల్పించువాఁడ
పెండిలియైనంత పెద్దవారలముందు
మాగొడుచెప్పి బాగోగులెల్లఁ
జక్కవిచారించి సామరస్యముతోడ
సంగోరు నిప్పించి సంతరింప

వేడికొనువాఁడ నెటులైనఁ బెండ్లిపెద్ద
లంపజిని బోరుపెద్ద లౌనటులఁజేసి
రాణువను సేకరించి యారాజుతోడఁ
బోరుసాఁగించు పనిఁజేయఁ బోలునంచు

ధర్మజుఁడు వెంటనే మౌహూర్తికులరప్పించి లగ్న నిశ్చయంబుగావించి నిఖిలబంధువర్గంబునకును, మిత్రులకును, విహితులకును శుభలేఖలఁబంపి వారిరాకకై యెదురుచూచు చుండ—

కౌంతేయు లేఖలందినఁ
జింతింపకబ తక్షణం స్నేహితులగు భూ
కాంతులు బాంధవులును న
త్యంతామోదంబుతోఁ బయనమై యప్పుడే

అరుదెంచి దండువిడియఁగఁ
బరివారముతోఁ బ్రభూత పరివాహముతోఁ
దెఱపేమియి లేకయె క్రి
క్కిఱిసి యుపప్లావ్యమంత కిటకిటలాడెన్

కుంతి భోజులుకొందఱు గొంతి యన్న
దమ్ములును మాద్రిదేవి సోదరుఁడు శల్య
ధారుణీనాథుఁడొకఁడును దైవగతిని
బాండవులఁ జేరరారైరి పల్కురైరి

రోసరమెత్తి చిత్తముల భూవరులత్తరి బిత్తరించి మా
మీసములుండిరేయనుచు మీసములన్ మెలివెట్టి దువ్వుచున్
రోసపుఁ బల్కులాడుచును ఱొచ్చుచు వారలొకళ్లొకళ్ళతో
గోసుఁ దలంపకుండఁ దెగఁ గోయుచునుండిరి కోఁత లెన్నియో

వేఱుగ ద్వారకాపురికిఁ బెండ్లికి రమ్మనువార్త వచ్చుడున్
సారసపత్రనేత్రుఁ డొకసారి మనోబ్జమునందు సర్వమున్
బాఱఁగఁజూచి పాండవులపాలికిఁబోవుట కర్జమంచు ని
ర్ధారణఁజేసి పైనమయి దారుకు రమ్మని చెప్పినంతటన్

## చతుర్థాశ్వాసము

కౌమోదకీనందకసుదర్శనంబుల
బహు జాగరూకుఁడై భద్రపఱచి
శుభ్ర చిహ్నితశైబ్య సుగ్రీవ మేఘ పు
ష్పవలాహకాఖ్యరాజములఁబూన్చి
వైరి దుర్లోక దుర్వారమై క్రూరమై
తనరారు గరుడ కేతనముఁగట్టి
దారుకుండు రథచోదకుఁడై శతాంగంబు
నిటు సన్నికొనితెచ్చి యెదుటబెట్టి

బలుమి కృతవర్మ సాత్యకి ప్రభృతు లెల్ల
బయలుదేర వెంటనె యుపప్లావ్యమునకు
దారిలో వాసుదేవుండు తలఁపసాగె
భావికార్యంబులను గూర్చి యీవిధంబు:

ఆర్యసంఘమందున నేఁటి కవతరించె
ఘోర వైరాగ్ని దానిఁజల్లారకుండఁ
బట్టుదలతోడఁ గాపాడవలయుఁ గాన
సంధి చెడఁగొట్టితీరెద సంధిఁజేసి

సంధి నియమంబులను విన్న జగతియెల్ల
బళి ! బళీ !! యంచు శ్లాఘింపవలయు, సంధి
కుదురకుండఁ బోవలయు లోకులకు రాజ
నీతి నైపుణిఁ జూపింపనేర్తు నేఁడు

నా పూనుకార్యంబునకుపోద్బలంబులగు పరిస్థితులు పెక్కులుగలవు.

గురు ధనుర్వేది పాంచాలకుల విరోధి
గురుఁడు తనయూళ్లు పాలించుకొనుచునుండ
బ్రదికి యున్నాఁడు జీవచ్ఛవంబు కరణి
మానధనుఁడైన పాంచాల మనుజవిభుఁడు

కురుపాండపు లొక్కటియై
గురుదక్షిణకొఱకుఁ జావఁగొట్టి ద్రుపద భూ
వరు వారణావతంబును
మఱి మాకందిఁగొనుటెల్ల మాకుందెలియున్

గురుదక్షిణ యనుచు ధను
ర్గురునకు నీయూళ్ళు రెండు గొనియిచ్చిరి మున్
కురువర పాండుకుమారులు
గురువశమై యుండె నాఁటఁ గోలెనవిరెండున్

దుర్మదుఁడై విభాకరసుతుండు మముందెరలించి యెన్నఁడో
దోర్మదమొప్పఁ గైకొనియెఁ దొల్లి చలంబున మాకుళస్థలిన్
మర్మముఁ జీల్చుచుండెఁగద మమ్మది నేఁటికి బూటకంబులన్
ధర్మజు సమ్మతింబఱచి దానిగ్రహింపఁగఁ బోలు నేర్పునన్

కావునఁ గుశస్థలియును మాకందివార
ణావతముల వృకస్థలిందప్పకిచ్చి
మరియు నేదేని యొక యూరు మాకునీయ
సంధియగు నంచుఁ జెప్పింతు జడియకుండ

దీనంజేసి స్వార్థపరాయణత్వమునఁ దప్పక,

పాంచాలురు నాపట్టయి
కొంచింపరునన్ను గొల్వఁ గూరిమితోడన్
గొంచెంబైనను మమ్మెది
రించంగలవారలుందురే సభలోనన్

ఐదూళ్ళేనడిగించెద
నైదూళ్ళనుగూడ నీయనని కురుపతిచేఁ
గాదనిపించెదగట్టిగ
నాదోసముఁ గప్పిపుచ్చి నటియించెదనే

రాయబారంబు నడపెద రాజరాజు
కడకు నారాజవీథి ప్రకారమెల్ల
బయలుపడకుండ రాజప్రపంచమంత
నన్ను నగ్గింపఁ జూపింతు నాదుశక్తి

కౌరవులు భీతులై సంధిఁ గోరి పాండ
వులకు నీయూళ్లనైదీయఁ గలుగునొక్క
మేలు; కాకున్నచో రెండు మేళ్లుగలుగు
లగ్గుగాని యిందేమియు నెగ్గులేదు

శ్రీకృష్ణుండిట్లు తలంచుకొనుచు, బలరామకృతవర్మ సాత్యకి సహితుండై యుపప్లావ్యంబుఁజేరి తనకై యెదురు చూచుచున్న రాజలోకంబును సమాదరించి, పాండవులంగుశల సంప్రశ్నముం జేసి, రాజహంసంబురీతి నడయాడుచు, నిష్ఠగోష్ఠిఁ గొంతప్రొద్దుపుచ్చెను. పదంపడి యభిమన్యు పెండ్లిముచ్చటలు దీర, నేకాంతంబునఁ గృష్ణుండు ధర్మజుంగూడి పెద్దప్రొద్దు సంధివిషయంబుఁ గూర్చి చర్చించి మైత్రిఁబఱచి, యైదూళ్ళ

నడుగుటకు ధర్మజు నొడంబఱిచి, సింహాలగంబున నియ్యది నిర్ధారణఁజేయుట యుత్తమంబని యూహఁజేసి యేమెఱుంగ నట్టు మిన్నకుండెను.

ఆమఱునాఁడు నిండుసభయందున రాజులుకొల్వుదీర్చి యీ
బాముసఁ బాండవుల్ వడిన బన్నములందలపోసి, యింక సం
గ్రామము దప్పఁబోదు, కురురాజనరాని వృథాభిమాని తా
నేమెయిఁ బంచిపెట్టఁడెవరెన్నివిధంబుల నొక్కిచెప్పినన్

ఆమాటల నీమాటలఁ
దామసులై యిట్లుచెప్పు ధరణీపతులన్
మోమోటపఱచి మెల్లఁగఁ
దామసిలఁగఁ గోరిపల్కె ధర్మజుఁడంతన్:

ఓనృపులార? మీరుకని యుంటిరె? వింటిరె? యెన్నఁడేనియున్
గానలకేగు పందెమునుగల్గిన జూదము మోసగింపఁగా
నీనియమంబు వెట్టి మము నెల్లరఁ గానలకంపినారు మే
మానియమంబుఁ దీర్చియిపు డంపఱి ముందఱనుంటి మీగతిన్

జూదము పూర్వములేదా?
జూదములోఁ జూఱ గొన్న శూరులులేరా?
యేదీ వారిటు జేసిరె?
జూదపు గెలుపొక్క గెలుపె సుజనులకెందున్?

సిగ్గుచుండె మీయెదుటఁ జెప్ప రజస్వల నేకవస్త్రనున్
బెగ్గిలఁ గొప్పువట్టి పదివేవురు చూడఁగఁ గొల్వులోనికిన్
సిగ్గిలకీడ్చి తెచ్చి యెకసెక్కములాడరె క్రొవ్వుచేత? నీ
యెగ్గులు రాచబిడ్డలు సహించెదునట్టివె? మీరుచెప్పుఁడీ!

## చతుర్థాశ్వాసము

పెద్దలు ద్రోణభీష్ములును బెద్దలు బాహ్లిక సోమదత్తులున్
వద్దనరైరి జూదమును వద్దనరైరి పణంబులొడ్డ మా
వద్దనయుండి చూచెదరు పెద్దన వారికి మాకు నిట్లు న
య్యొద్ద తొలంగునే యిటుల? యుద్ధమువచ్చునె సర్వనాశమై?

జూదమునాడు నాఁడనిన చొప్పుననే పదమూఁడు వర్షముల్
కాదనకుండఁ గ్రుమ్మరుచు కానలసీమలయందు దాఁగి యె
ట్లోదరిఁజేరఁ గల్గితిమొ లోకులఁ జూడఁగనింక మీఁదటన్
మీ దయ యెట్లు చేసినను మీరలె దిక్కయినారు నేఁటికిన్

అడుగుటలేదు మేము సమయంబనియన్నల భాగమీయఁగా
నడుగుట లేదు భూతలము నంతయు మాకును గట్టఁబెట్టఁగా
నడుగుటలేదు మేమిపుడ యన్నలరాజ్యముఁ బంచిపెట్టఁగా
నడిగెదమింతె మా జనకుఁ డార్జనఁజేసిన యర్థభాగమున్

కావున,

రాజరాజు కడకు రాయబారమునంపి
యిచ్చినట్టిదేహొ పుచ్చుకొనుటొ!
కాక రణముఁ జేసి కైకొందమందురో
చేతఁబడిన పుడమిఁ జెప్పుఁడన్న

బలరాముండది యాలకించి పలికెన్ బౌరవ్యవంశాగ్రణీ!
బలమున్ నమ్మి రణాంగణమ్మునకుఁ బోవన్ ధర్మముంగాదు మీ
రలు రోషంబున సంధియత్నము లొనర్పన్ మాని, కాల్ద్రివ్వ లో
కులు నోనాడరె మీదెదోషమని మీకున్ మేలు చేకూరునేన్?

అన్నదమ్ముల బిడ్డలరైన మీర
లోకపవిత్రాన్వయంబున నుద్భవించి
పంచుకొనలేక పోరు సాగించిరన్న
విన్నవారలు నవ్వరే పృథ్విలోన?

పాలడుగంగఁ గౌలవుని పాలికిఁ బంపుము రాయబారమున్
మేలగు సంధియైనయెడ మీకునువారికిఁ గాకపోయినన్
నాలుగుమూలలన్‌గల జనంబు మిముంగొనియాడియాడి యే
వాలుననేని మీరెగెలువన్ వలెనంచుఁ దలంతురన్నచో

శనివరుఁ డాలకించి యిటుచెప్పెను బిమ్మటఁ దత్సభన్ సుయో
ధనుఁడతిలోభి వానికిని దగ్గరనుండిరి కర్ణసౌబలుల్
మనలను లెక్కపెట్టఁడు సుమావృథ! వానికిరాయబారమున్
బనుచుటగాన నీమెయిని వైరమెచాటుట నామతంబగున్

బంధుజనంబులోఁ గలఁత వచ్చిన నిద్దురఁ బోక యెట్టులో
సంధియొనర్చి యెల్లరకు సౌఖ్యముఁ గూర్పఁదలంచు దుష్క్రియా
గంధములేదు కల్లయెఱుఁగంజనఁ డుత్తయమాయకుండునున్
బంధుజనప్రియుండు సమభావుఁడు మాబలదేవుఁ డెప్పుడున్

కార్యగతి తెఱంగెఱుఁగండు కపటిగాఁడు
కాన నామాటలనునెల్ల గట్టిపెట్టి
గఱువచందంబుఁ దలపోసి కత్తిఁగట్టి
పాలు పంచించితీరఁగావలయు నిపుడు

దండిమగలు కలరు మన దండునందు
భయముపడనేల? సంధికిఁ బంపనేల?
భయదఘోర బాణకృపాణ పాణులగుచు
సదమదింతురు కురురాజ సైన్యపటలి

ఈమాట లాలకించుచు
దామోదరుఁడపుడు పల్కెఁ దగ దనకుండన్
భూమీశ్వరు లాసభలోఁ
బ్రేముడి నందఱును జెవులు ఱిక్కించి విన

లోకులు పాండవేయులదె లోపమటంచును జెప్పికొందు రే
పోకలు పోయినన్ గురువిధుండటు కావున సంధియత్నముల్
మేకొని చేయఁగావలయు మీరలు కౌరవరాజు సంధి విన్
బోకడఁ బెట్టకుండఁ దతిమూర్ఖుఁడు గల్గను దీన లాభమున్

జనవాక్యమ్మనుకూలము
మనకగునది కల్గునెడల మనకుం జేకూ
రును బలమెంతో కావున
మనుజేశ్వరులార వద్దు మానఁగ సంధిన్

కౌరవరాజు పక్షమునఁ గయ్యము సేయఁగ నున్నవారు దు
ర్వారులు ద్రోణభీష్మ లతి బాహుబలాఢ్యులు సంధియత్నముల్
మీరలు సేయకున్న మితిమీఱిన కోపముఁ బొందవచ్చు, నె
ట్లో వెరవారు వారలను లొంగఁగఁ జేయుట మేలు ధర్మజా!

కౌరవేశ్వరుండు కలుషాత్ముఁడై సంధి
కిచ్చగింపకున్న నేవగించి
పక్షపాతమూని వారిర్వురు మనకు
మేలుసేయవచ్చు జాలిపడుచు

జలజాక్షుని నుడువులువిని
తలలూఁపిరి యిదియె మంచి దారియనుచు భూ
తలపతులు ధర్మసూనుఁడు
పలికెను విందోలగమునఁ బదపడి యిటులన్

గతజల సేతుబంధనము కల్గఁగఁజేయునె యెందు మేలు? దు
ర్గతులనుబొంది యింతదనుకన్ గొఱప్రాణముతోడనుంటి మీ
యతులిత బాహుశక్తి విజయమ్మును నమ్ముచుఁదంత్రిపాలు గో
రితి మదికూడ నీయనని పేర్కొలుమనుండెను ధార్తరాష్ట్రుఁడున్

పద్మనాభునికన్న నుపాయశాలి
లేఁడు మనపక్షమందు గాలించి వెదుకఁ
గాన రాయబారిగ నేను వాని బంపు
చుంటి దేవునిపై భారముంచి నేఁడు

శ్రీకృష్ణుఁడీ ప్రసంగంబాకర్ణించి తనమంత్రంబుపాత్ర ననియెఱింగి, దౌత్యంబుఁ బూననంగీకరించిన ధర్మజుఁడతి హృష్టుండై,

దేవగురునంత వాఁడవో దేవ! నీవు
నీకు నీతులు గఱపంగనేర మైన
మా మనోగతు లెఱిఁగించి మసలకుందు
మవల నీయిష్టమెట్లొ యట్లాచరింపు

పాండునృపాలు బిడ్డలము పాండునృపాలుని పాలు పంచి మా
కిండని మేముగోరఁదగదే? యిదితప్పని చెప్పు పెద్దలిం
దుంచిరె! తండ్రి సొత్తుపయి నుండదె బిడ్డల కాస మాకు ని
ట్లుండుట నేరమౌనె చెపుడోన్నృ పసత్తములార మీరలున్

కూల్పఁజాలము మాపాలు కోసరంబు
నిఖిల భూపాలచంద్రుల నేలపాలు;
ఆర్తరావముల్ మినుముట్ట నవని నేలఁ
జాలమింకేల జాలంబు సంధిసేయ!

పద్మనాభ! మా సాఁబాలు పంచిపెట్ట
నిష్టపడకున్నచోఁ గౌరవేశ్వరుండు
నిఖిలజనపాలలోక సమ్ముఖమునందు
వినుము కడసారిమాటఁ జెప్పెదను నేను

చ తు ర్థా శ్వా స ము

కదనమన్నచో భయపడికాదు సంధి
సల్పు, వంశక్షయమునకు జంకి కాని
కాన నైదూళ్ళ నిచ్చుచోఁ గాదునాక
యొప్పు వారల మీమాటఁ దప్పఁబోము

అవియెవ్వియంటివేని వృకస్థలి కుశస్థలి మాకంది వారణావతంబు మఱియేదేని నొక గ్రామంబు. ఈమాటలు ధర్మజుని నోటినుండి వెలువడినంతనే ధర్మజుఁడింత పేదఱికంబుఁ జూపునే యనువారును ధర్మజుఁడెంత పాపభీతికలవాఁడను వారును, సాత్యకి ధృష్టద్యుమ్నులు గలుగఁదనకింత పిఱికితనమేల యనువారును, ధర్మజుఁడుసామాన్యుఁడె! యిం దేదియో నిగూఢ రహస్యంబిమిడియున్నదని తలంచువారునై సభ యంతయు గుసగుసలతో నిండిపోయెను.

ధర్మపుత్రునిమాటలు తనదుచెవులఁ
బడెనొ పడలేదొ ద్రుపదభూపాలపుత్రి
చిఱ్ఱుబుస్సుమనుచు లేచి చెప్పె బొమలు
ముడివడఁగ నేలిదపు మాతి ముఱకటించి

ఏమని సంధి సెప్పవుగ యే వినఁగూడదె సంధిమాట ? ని
న్నేమని చెప్పఁగోరెను నరేంద్రుఁడు కౌరవరాజు కొల్వులో
నేమఱియుంటి గృష్ణ యిది యిట్లనిచెప్పిన నాలకించి యెం
తో ముదమందెదన్ బతులతోఁ జెద లోకమ యాడువారికిన్

ఊళ్ళయిదిచ్చుచో దనివి నొందెదమంచనినాఁడె ధర్మరా
జిళ్ళను వాకిళుల్ దమకునేవియుఁగల్గమి నిన్నమొన్నదాఁ
కేళ్ల కొలంది కాఱడవు లేలినరాజులువీరు; వీరి కై
దూళ్ళనుగూడ లేనియెడ నుంఁడగనేర్తురె రాజ్యవితో?

నామగలేవురుంగలిసి నా పగఁ దీర్పక మిన్నకున్న నే
నేమనుదాన? నీయెడకు నిప్పుడువచ్చిన రాచవారలో
యేమిమొగంబుఁ బెట్టికొని యిండ్లకుఁబోదురు వాసుదేవ! యీ
భూముల నాడువారలకుఁ బుట్టుగతుల్మఱిలేవె చెప్పుమా!

ఎఱుఁగవే నీవు వారునన్నెంతలేసి
మాటలనినారొ సభలోన మఱవఁగలనె?
వారునన్ బఱచినపాట్లు వాసుదేవ!
యెచ్చటేని యిల్లాండ్రు సహింపఁగలరె?

ఏమనిసేతుమంచు నృపు లిచ్చటనింపఱుకూడి యుండఁ దా
వేమని సంధిసేయుమనె నీమనరాజను గాక కృష్ణ! నీ
నేమిమునింగిపోయెనని యీవెడ సంధికి రాయబారివై
యేమనియుండ హస్తినికి నేగుచునుంటివి నాకుఁ జెప్పవే

ముడికోకఁ గట్టుచుంటిని
ముడివేయకయుంటిఁ గురులు ముడిబొమదక్కన్
ముడి దుర్యోధను కుత్తుక
ముడి యూడకరముడి శాంతిఁ బూనంగలనే

చెనఁటియైన దుశ్శాసను చేతివ్రేళ్ళ
సగముద్రెస్సినయట్టి కేశంబులివిగొ
దాఁచియుంచితి నిన్ని వత్సరములెల్ల
దారుణపరాభవాగ్ని చల్లారకుండ

ఎట్టయినన్ దరించితిమి యేకుతకంబులదాఁక నేఁటికీ
చట్టటికంబు చేతననుచున్ మువమెంపఁగమాదుతండ్రిచే
పట్టితిఁబంచపాండవుల బాగుగఁగోటరికంబుఁజేసినే
బొట్టెలఁగాంచితిన్ భరతభూమిని వన్నెకువాసికెక్కితిన్

ఇన్నియుండియు నాబ్రతు కిట్టులయ్యెఁ
బతులుచూడంగ నన్ గొప్పువట్టి సభకు
నీడిపించిన యాచేయి యేనుఁజూడఁ
ద్రెళ్ళిపడదయ్యె నాయేడ్పు తీరదయ్యె

పంచపాండవు లైదుగురు పాలిగాండ్రె
యంచు మాతండ్రి మెలిఁగి యున్నట్టిమెదలి
నిట్టి సంబంధమునుగూర్చ నిష్టపడఁడు
పెళ్ళి సేయఁబోవఁడు వారి కాళ్లకడిగి

కొలువున కీడిపించెనమఁ గొప్పును బట్టిన ప్రాతికామిచే
గిలగిలమంచు కొట్టుకొని కెవ్వున కేకలు వేయుచున్ రజ
స్వలనని చెప్పుచున్నను సభన్ విననొల్లక కౌరవేంద్రుమున్
గిలకిల నవ్వె నాతనికిఁ గడును రోయక యుండనేర్తునే ?

పగలు కండ్లారఁజూచి నా మగలు పగలు
దీర్చి నామొగులుదిగులు దీర్చుకున్న
పెగలు చిమ్ము తూపులు గల్గు జెట్టిమగలు
నా సహోదరుల్ తండ్రియు నాకు లేరె ?

రాచపుట్టువుఁ బుట్టియు రాచదొరలు
మఱియు పేరోలగమున నా మగల యెదుటఁ
బరులచేఁదిట్లు తిని యేల బ్రదుకవలయు?
యంత తీపియా ప్రాణంబులన్న కృష్ణ ?

పాపైన మఱచిపోవును
భామిని మఱవంగఁబోదు పగనెన్నఁటికిన్
దామోదర ! యాలింపుము
నామాటలు, సంధినాకు నచ్చదు నేఁడున్

ఏటికి దొరలెల్లరు నీ
వీటికిఁ జనుదెంచినారొ విల్లంబులతో?
నేటికి నిటఁగూర్చుంటిరొ ?
బోటికి నభయంబు నిచ్చి బ్రోవకయున్నన్

అతిరథులున్ మహారథులు నందఱుకూడిన నిండు కొల్వులో
నతివయొకర్తు చెప్పవలెనా? యిది క్షత్రియధర్మమంచు భా
రతకుల వీర్యమున్ మఱచిరా? తగునా? యిటువంటి జోలికూ
డుతినుతలంపుమీకు టకటొంకులు చెల్లునె సంధిగల్గునే!

భీమసేను గదను విజయుగాండీవంబు
నెఱదనమ్మి మోసపడినదాన
నిండుకొల్వులోన నేఁబడ్డబన్నంబుఁ
దీర్పఁగలునట్టి దిక్కులేదు

మా కులగౌరవంబు కనుమాయకయుంపఁగఁ గోరుచున్న యా
మా కుల దైవతంబయిన మాధవుఁడేమనె? ద్రోణ భీష్ములో
యా కురురాజుపక్షమయి వత్తురటంచునుగాదె? చెప్పుఁడీ
మీకు భయంబుకల్గునెడ మీరలు నిండ్లకుఁబోవవచ్చుగా

ముసలి వగ్గు లిర్వురునేఁడు బుసలుకొట్ట
భయముకల్గిన మీరలు పాఱిపొందు
కాంచెదముగాక యేమౌనొ కట్టకడకు
దారిలేనట్టి యీయాఁడుదాని బ్రతుకు

అయినను రణపరాఙ్ముఖులు కానున్న వారితో నేమి చెప్పనేర్తు; ఇన్నింటికి మిమ్మనవలసిన పనియేమున్నది?

నన్నుఁగాంచిన పాంచాలి నరవరుండు
నన్నుదెంచిన జోదుమాయన్నకలరు
కయ్యమును వారు చేయరే కత్తిఁగట్టి
పేరు చెడ నామగలు సంధిఁ గోరుచున్న?

వీరపత్నినని నేను గర్వించుట నేఁటికి సంశయాస్పదమయ్యె. కాని నేనింకను వీరసువుగనే యుంటిని.

హైడింబేయుఁడు లేఁడా?
లేడా యభిమన్యుఁడింక లేరా? ననుఁగా
పాడంగా నా బిడ్డలు
నాడింపనె కౌరవేంద్రు ననిమొనలోనన్

బాణము చేతఁబట్టిన నృపాలుఁడుఁ బ్రాణములెక్కపెట్టకేఁ
బాణము వేసెఁదొల్లి తలఁబ్రాణము తోకకు వచ్చుచుండినన్
బాణము వేయ జంకెదరు బ్రాణభయంబున నేఁడు మీరలీ
క్షోణిని మిమ్ముఁబోని రణశూరులఁగంటిమె యెన్నఁడేవియున్

సంగరభయ నిరాసంబును రణోత్సాహజనకంబునైన యీ ద్రౌపదీవాక్యంబులాలించి, కొల్వంతయు నిస్తరంగ నీరాకారంబుఁబలె నిశ్శబ్దముగానుండ, వాసుదేవుండు మెల్లగ

పీఠంబుననుండి లేచి ద్రౌపదీదేవి దక్కఱకు దరహాసచంద్రికల

బ్రసరింపజేయుచు మృదూక్తుల నిట్లు ప్రసంగించె:

ఎఱుఁగవె తల్లి నన్నుఁ బగనీగకయుందునె యెన్నఁడేని? నే
నెఱుఁగనె నిన్నుఁ గౌరవనరేశ్వరుఁడా సభకీడ్చితెచ్చి యం
దఱు వినుచుండఁ బల్కినవిధంబును దుస్సహవర్తనంబు? నే
నెఱుఁగక చేయుచుంటినని యెంచకు మీపని యిప్డు సోదరీ ।

ఉడుగుము శోకమేబ్రదికి యుండిన నీపగసొల్ల దీర్తు నీ
వడుగకయున్నచో మఱతునా? యిపుడెంతటి వేలవైతి వీ
యడుగులు రెండునన్ బవరమందున మార్తుల నెత్రుటేటిలోఁ
బడిపెదనంచు నేను శపథంబును జేయుచునుంటి సోదరీ ।

వేడినెత్తుటి తొంగిళ్ల వ్రేళ్ళనుండి
జారిపడుచుండ యువరాజు సంతసమున
జడలుగట్టిన నీకురుల్ చక్కదువ్వి
మరుల ముడివేయఁ గలఁడమ్మ మాటలేల ?

ఇట్లు సమాధాన వాక్యంబులఁజెప్పి ద్రౌపదిం బట్టు

వఱచి, యూరార్చి,

పోయివచ్చెదఁ గాకేమి పోరుమాన్పి
సంధిచేయ దుర్యోధన చక్రవర్తి
సన్నిధికినైన మీరెల్ల సైన్యములను
గూర్చి పెట్టుకొనగ మేలు గూర్చుననుచు

# చతుర్థాశ్వాసము

శ్రీకృష్ణుండు ప్రయాణోన్ముఖుండగుటు, సహదేవుండు తిలకించి సవరించుకొనుచు, గృష్ణునింజూచి యీగతి నుడివె:

ఒచ్చెములేదు కౌరవులు యుద్ధముమానిన మానకున్న వి
శ్వాచ్ఛిగ మాటలాడి మన గౌరవముం జెడకుండ సంధికై
యిచ్చకముం గనంబఱపు మింతియె పెక్కులువద్దు వారలన్
గచ్చిపమానకున్న మన కచ్చెను దీరిచికొందమంతయున్

అయిన నది యెటులుండిన యట్లు వినుము.

రాజనకున నే నెదురాడ రాదు గాని
చెప్పుచున్నాడ నొకమాటఁ జెవినిజేర్పు
సంధిసేయంగ నీకెట్లు సాధ్యపమునో!
ధర్మనిర్ణేతవైతి వీ తరుణమందు

జూదమునాడు నాఁడుమనజూదరిపంచెముఁ బెట్టినాఁడొకో!
మాదగుదాయమెల్లఁ గురు మానవ నాథున కిత్తునంచు; వాఁ
డో! దయమాలి సర్వమును డొంగిలె నీవదుమూడు వర్షముల్
పేదజీకంబుఁ బాపుటపుఁ బెత్తనముం బయివేసికొంటివే?

పదుమూఁడేఁడుల యాయము
పదిలంబుగ సంప్రతించి వశపఱచనచోఁ
గుదురింతువె సంధిని? నీ
పదకంబేమియొ తెలియదు బావా! నాకున్

శ్రీకృష్ణుండీ వాక్యముల నాకర్ణించి సహదేవునిభుజంబుఁ దట్టుచు నీచెప్పిన ధర్మసూక్ష్మంబు బుధజన గ్రాహ్యంబు, కౌరవరాజు సభలో సంధిప్రస్తావన సమయంబున నీనుడులు

మనస్సునందుంచికొనియె ముచ్చటించెదనని బుజ్జగించుచుఁ బ్రయాణంబు సన్నద్ధపఱచి వివిధాయుధంబుల రథంబునందిడి కొని సాత్యకిని రథంబెక్కించికొని తన ప్రక్కఁ గూర్చుండఁ బెట్టికొని హస్తినాపురోన్ముఖుండై పోయి,

ఎవని ధార్తరాష్ట్రుఁడు తన హృదయమందు
సతము లేశంబు నమ్మక సంచరించు
మఱి యొకకంటఁగని పెట్టి యుండునట్టి
విదురునింట శ్రీకృష్ణుండు విడిది దిగియె

సుయోధన సార్వభౌముని కొలువుకూటంబుఁ బ్రవేశించి సంధి విషయక ప్రసంగంబుఁ గావింపకమున్న హస్తినాపురమునందలి రహస్యంబులఁ దెలిసికొనుట భావ్యంబనియెంచి విదురుండు తొలుతనుండియుఁ బాండవపక్షపాతియని యెఱింగిన వాఁడగుటచే శ్రీకృష్ణుండు విదురునింట బసచేసెను. సుయోధనుం డిదియెఱింగి మంత్రిసామంత పరివృతుండై, విదురునింటికిం జనుదెంచి కుశల సమాచారంబు లడిగి తనయింటికి విందారగింప రమ్మని శ్రీకృష్ణునిఁ బ్రార్థింప,

పాండుపుత్రులకును బగవాఁడవౌట
నాకుఁ బగవాఁడవైతివి న్యాయమగునె
యెంచఁ బగయింట విందారగించుటనుచుఁ
బల్లవిఱుపు మాటల నంపిపుచ్చె రాజు

మఱునాఁడు రారాజొడ్డోలగంబుఁ దీర్చి సంధివిషయక ప్రసంగంబు విన శ్రద్ధాళుండై సింహాసనంబునఁ గూర్చుండఁ

గమలనాభుఁడు సాత్యకి కృతవర్మలంగూడి కొలువుఁజొచ్చి యామాటల నీమాటలఁ గొంతతడవుపుచ్చి జల్పాకుఁడై ధర్మరాజంసిన బట్లువోలె,

పాలబుగ్గలతోడఁ బాకాడునప్పటి
నుండి ధర్మాత్ములౌ పాండుసుతులు
గురువృద్ధజనముల గురుభక్తి సర్వదా
కొలిచి సేవించిరి కొఱఁతలేక
పంచజనులకెల్లఁ బంచప్రాణములౌచు
సంచరించిరివారు శ్రద్ధతోడ
దాసదాసీజన తండంబుఁ బ్రేమతో
నిరతంబు సాకిరి నిన్నుఁబోలె

పెక్కుమాటలేటికి? నింటి పెద్దవనుచు
నడుగులకు మడుగులొత్తిరి యహరహంబు
నీకు నట్టివారలను దృణీకరించి
పరుల పంచలఁ బట్టింపఁ బాడియగునె?

తడయక వారు ధర్మమొ యధర్మమొ జూదపుఁ గట్టుబట్టచే
నడవులయందుఁ గ్రుమ్మరుచు నాకలిదప్పుల కోర్చి యెట్టులో
విడివడి వచ్చి నేఁడు పృథివీపతులందఱిఁ జూడఁగల్గి రీ
యెడ మిమువంటిధర్మపరు లెద్దడిచేయుట ధర్మమౌనొకో

పాండునృపాలు పాలు తమ పాలొనరింపుమఁటంచు జాలితో
నిండుసభన్ వచింపుమని నేర్పునఁజెప్పిరి యాంబికేయ! నీ
కండఁగనుండు నేర్తురు యథార్థముఁ జెప్పుచునుంటి నిప్పుడే
యొండనకుండఁ బాండవుల నొప్పరికింపక పిల్వఁబంపుమీ

దుర్యోధనుండతి ధూర్తుఁడై చిననాఁడు
పెక్కుకష్టంబులఁ బెట్టినాఁడు
లక్కయిల్ గట్టించి లాలించి యందుంచి
వచించి తగులఁ బెట్టించినాఁడు
నీచాతినీచమౌ నెత్తంబు లాడించి
మించియిల్ వెడల గొట్టించినాఁడు
కాకోదరములెన్నొ గడియించి తెప్పించి
భీమసేనుని గఱపించినాఁడు

ముట్టుతను సభకీడ్పించి ములుచయగుచుఁ
బల్వురి యెదుట నవమానపఱచినాఁడు
చేయరానట్టి పనులెన్నొ చేసినాడు
సాధువని యెంచగలవె దుర్యోధనుండు ?

కావున దమ్ముబిడ్డలను గాదని చెప్పుటకన్న నీసుతున్
భూవర! త్రోసిపుచ్చిసరిపుచ్చవె దాయము పంచిపెట్టవే
వేవురు మెచ్చికొందురు వివేకముఁజూపితివంచు దాన ఘో
రావహమెల్లఁ దప్పు నృపులందఱు సౌఖ్యమునందుచుండఁగన్

కర్ణసుబలపుత్రుల ప్రసంగంబు విన్న
భారత కులక్షయమునకే దారిచూపు
జెడుగుమాట లాకర్ణించి చెడఁగనేల?
పరువు మర్యాదలు సెలంగ బ్రదుకలేవె?

కృష్ణుండీగతిఁ జెప్ప తెలుఁగులరాజనీతి వైశద్యంబు
విశదంబగుచుండ ముచ్చటింప,

## చతుర్థాశ్వాసము

సంధివిషయప్రసంగంబు సల్ప మొదలు
పెట్టినపుడెంతయో ఘూర్ణివిఘూర్ణి సంధి
సుముఖులైయుండి కృష్ణుని సూక్తులెల్ల
ముగియువేళకెల్లరు పరాఙ్ముఖులైరి

అంత సుయోధనుండు ప్రవిక్తనయనుండై లేచి సభనెల్లఁ గలయంజూచి వాసుదేవుని దిక్కు మొగంబై "బావా! యీ సంవేశంబుతోఁ జనితేవె?

అవిభాజ్యంబగు రాజ్యమైన కురురాజ్యంబందు భాగంబు నీ
వెవియో చెప్పుచుఁ బంచిపెట్టుమన నే నెట్లొందనో! నీ వెఱుం
గవె? ముత్తాతగు బాహ్లికుండపుగా! భాగంబాతఁ డర్థించెనే?
వివదింపన్ దలపోసి పంచుమనుచున్ వేలార్చెనే యన్నమున్?

ఓ యదునందనా! పెక్కుమాటలేటికి?

నిఖిలధారుణీ చక్రంబు నేఁటిదాకఁ
దనకు నాకత్తిమొన యందు నిలిచియుండెఁ
బరుల ప్రార్థింప నీకేమి వచ్చెపదును?
మాట వ్యయమౌట యొక్కటే బాటకీఁడ"

సారసనేత్రుని నుడువులు
రారాజు వచించినట్టి ప్రతివచనంబుల్
కౌరవపక్ష నృపాలకు
లోరిమి విని తలఁచిరిట్టు లుల్లములందున్:

పాండవులు ధర్మపరులు గావచ్చుఁగాని
యితఁడు రారాజు దూషింప నేలయనుచు
నపుడు గ్రుడ్లెఱ్ఱఁజేసి ధరాధిపతులు
కత్తులను ముట్టసాఁగిరి బిత్తరించి

కౌరవపక్షయోధులకుఁ గల్గినయట్టి యశాంతినెల్లఁ గ
న్నారఁగఁజూచి సంతసిలి యాదవవీరుఁడు దూరదృష్టిచేఁ
గౌరవ పాండవేయులకుఁ గాదిఁకసంధియటంచు నెంచి గం
భీరమనస్కుఁడై పలికె వేరమునంతయు డాఁచిపెట్టుచున్:

పిన్నలు పెద్దలు నీసభ
నున్నారుకదా యిఁకేమి యుండగలదు? నా
విన్నపమొక్కటి వినుఁడీ
యన్నెము పున్నెంబువలదయార్యుల కెందున్ ?

పాండు నరపాలు సంగోరు పాలుపంచి
యీయమీకు నిష్టంబు లేదేని తుదకు
నిప్పుడేవురకేనూళ్లు లిచ్చి సంధి
సేయఁబాడిగాదో యాంబికేయ! చెపుమ

ఆయూళ్లెవ్వియంటివేని వినుము కుశస్థలి వారణావతంబు
మాకంది వృకస్థలి మఱియేదేని యొక గ్రామంబు

కడసారిమాటఁ జెప్పితిఁ
గడగండ్లను దెచ్చికొనుట కర్జంబగునా ?
చెడుగులమాటలు విన్నన్
జెడు రెండుకులంబు లేమి చెప్పఁగవలయున్?

రాధేయుండు శ్రీకృష్ణ వాక్యంబులయందలి నిగూఢ
భావంబు గ్రహించి వెంటనే చిడిముడిపాటులేక,

జలజాక్ష ! నీమెత్తు సాఁగిరాడిఁకమీఁద
నింతమాత్రంబు మే మెఱుఁగలేమె?

కలహంబు మాలోనఁ గల్పింపనెంచి యీ
నైదూళ్ళనే కోరి యడిగినావు

నాకుఁగుశస్థలి, మాకంది వారణా
వతములు గురునకు వచ్చుటెఱిఁగి

యాయూళ్ళ నడిగితి నందుచే రారాజు
పై మాకుఁ గోపంబు వచ్చెననుచు

సంధిచేయ దుర్యోధన చక్రవర్తి
యిష్టపడెనేని నైదూళ్ళనిత్తుమిపుడె
సకలకురురాజ్య సౌభాగ్య మొకటె మాకు
వలసినట్టిది. వేయేల వాసుదేవ?

రవితనూజు పల్కులువిని రాజరాజు
సింహసంహననుఁడు డిగ్గి సింహపీఠి
పలికె గంభీర భాషణంబుల సభికు
లెల్లఁ దలయూఁచి కొండాడ నొప్పిదముగ:

శైశవమునుండి రాజవంశంబు వొరఁగి
పెఱిఁగి పెద్దవాఁడవయి తాభీరపల్లి
వారి యాచారములెనీకుఁ బట్టువడియెఁ
బల్లెమాటలిమానుమో పంకజాక్ష!

చిఱుత తనంబునన్ జదువు చెప్పిన హేతువుచేత భక్తితో
గురునకు మేము వారలును గూడియెపార్షతుఁజావఁగొట్టి యా
నరపతి రెండుగ్రామముల నాఁచియొసంగితిమౌర! నేఁటికిన్
గురుధనమున్ హరింపగను గోరెనె? ధర్మజుఁడెట్టి శిష్యుఁడో!

విపులతేజః ప్రతాపంబు వెలయ మిమ్ము
నొడిచిపుచ్చి కర్ణుఁడు తొల్లి పుడికిపుచ్చు
కొనెఁ గుశస్థలి దానిసేమనుచుఁ గర్ణు
నడిగి పుచ్చుకొనుచు మీకు నిదెడివాఁడ?

అతి కరుణాసముద్రులయి యాగురు కర్ణులు నన్నుఁజూచి స
మ్మతిపడి యీయవచ్చు.బతిమాలిన వారల మూఁడుగ్రామముల్
కితవుని మాటలాడెదవు కేవల మీవెపుడైన వింటివే?
వితరణమిచ్చి యాపయిని వెండియు దానినిగొన్న రాజులన్

పేరుపెట్టి యీ వైదూళ్ళఁ గోరు టేల?
తేవె కురురాజ్యమందు నీఁకేవియేని
యూళ్ళయిదు? వానిఁగోఁక యుండు టేల?
యింతమాత్ర నీ మతకంబు నెఱుఁగలేమె?

అఖిల భూచక్రమంత నా కగ్గమయ్యెఁ
బరుషవాక్యంబులనియెంచ వలదు, వాఁడి
సూది మొనమోపఁ జాలిన చోటుకూడ
నీయ నెవ్వరిప్పింతురో యేనుజూతు

దుర్యోధనసూక్తుల భూ
వర్యులు కొనియాడినపుడు బళిరా! యనుచున్
గార్యజ్ఞులగుచు యాదవ
వర్యుని బంధింప మేలు వచ్చునటంచున్

ఒలయక యాత్మలోఁదలఁచి యొక్కరికొక్కరు మూకభాషచే
బొలకువఁజెప్పికొంచు విడిపోవుచుఁ గూడుచు వెంటవెంటనే
కొలువును జొచ్చుచున్ బయటకుంజని వచ్చుచు నొక్కరీతిగా
నలజడిఁ బొందుచున్ దిఱుగుటందఱు గాంచుచునుండనప్పుడున్

ప్రత్యయికుండు తత్సభిక వర్గము పన్నుచునున్న కుత్రమున్
సాత్యకి తా గ్రహించి యదునాథునకున్ వినిపింపనంతయున్
దౌత్యము మాటుమానుచు యథార్థముఁ జెప్పినయంత నాపగా
పత్యముమాటుమీఁదుగ సభన్ ధృతరాష్ట్రుఁడు మాన్పు నెంచగన్

ఇంద్రజాలికుండయిన చందంబునఁ గనుకట్టు ప్రభావంబుచేఁ బల్లురు కోటులు తన్ను బలసికొనుచున్నట్లు కనుపట్టఁ జేసి సాత్యకితోఁ గూడ బయటఁబడినంత వైచిత్రవీర్యుండు కొలువు చాలించెను. రాజులెల్లరు తమతమ నివాసములకుఁ జనిరి. లేనిపోని గౌరవముఁ గల్పించుకొని శ్రీకృష్ణుండు కర్ణుని కరంబు కరంబునఁ దెమల్చిపట్టుకొని తనతోఁ గొంతదూరంబు గొని పోయి, మెల్లఁగా నొకయెడ నేకాంతమున నాతని జన్మరహస్యంబు నెఱింగింపఁ గర్ణుండు వాసుదేవుని నెగాదిగ చూచి "కృష్ణా! యీ నీ మేనత్త రహస్యంబుఁ బాఁచక నాకేల చెప్పితివి? నన్నేమని పాండవులం జేరమందువు? కని పాఱవేసినది కుంతీదేవి. కని పెంచినది రాధాదేవి. కన్నులు దెఱవని నెత్తుకందును బొడ్డుగిళ్ళతోఁబాటు నట్టేటఁ ద్రోసినది కుంతీదేవి; నట్టేట దొఱికిన పసిగందును బొడ్డుగిళ్ళలోఁ బెట్టి పెంచినది రాధాదేవి. పుత్రమోహమును దిగఁద్రావి జాలిలేని రాతిగుండెతో నన్నము పున్నెమెఱుఁగని కన్నబిడ్డను లోకాపవాదముఁ బాపుకొన గంగపాలుచేసినది కుంతీదేవి; కావుకావంచు నేడ్చుచున్న దిక్కులేని పసికూనను దెచ్చి చన్నుఁగుడుపులిచ్చి పెంచి పెద్దను జేసి మనిచినది రాధాదేవి. పెండ్లి పేరంటములు చేసి

యపరిమితానందముఁబొందిసది రాధాదేవి. నేనెవ్వండనైన నేమి ? నేను లోకంబునకు రాధేయుండనగుదును గాని కౌంతే యుండఁగానోవ. చదువు సాములు చెప్పువారు లేక దేశదేశం బులు తిరిగి తిరిగి ద్రోణునిం జేర మోమోటమి లేక కుటిలుండై నీకు బ్రహ్మాస్త్ర ప్రయోగంబు నేర్పనయిుతికాదని చెప్పి యవ మానపఱచినప్పుడు పరశురాముండిూ కష్టకాలంబున భార్గవా స్త్రంబు ప్రతిభాషింపకుండునట్లు శపియించినప్పుడు నిష్కారణం బుగ నొక బ్రాహ్మణుండు నన్నుఁ దిట్టినప్పుడు, కుమారాస్త్ర ప్రదర్శన సమయంబున భీముండు నన్ను గేలిచేసినప్పుడు నేఁబడ్డ మనః పరితాపంబు నెవ్వంటెఱుంగంజాలు? నాకీ ప్రపంచము నందుఁ జోటున్నదాయని సందియంబు పొడమినది. ఇట్లు బ్రాహ్మణులచే శప్తుండనై దిక్కులేక నేనల్లాడిపోవునప్పుడు నన్నుంగని కనికరంబున సుయోధనసార్వభౌముండు నాకాశ్ర యంబునిచ్చి, యాదరించి, గౌరంబిచ్చి, పెద్దను జేసి,పరివారంబు నిచ్చి, పరివాహంబునిచ్చి సకివారలలో తలయెత్తికొని తిరుగ నవకాశమిచ్చి మన్నించె. స్వామిద్రోహంబుగాని, మిత్రద్రో హంబుగాని యీ కర్ణునకుఁ జేతరాదు. ఓ కృష్ణా! యీ జన్మంబునకుఁ గర్ణుండు రాధేయుండే. సుయోధన సార్వభౌ ముండు నమ్మినబంటే. ఈ మాటకుఁ దిరుగులేదు. గోపాలా! నాకు రాధాదేవి కన్నతల్లి, మహారథుండు కన్నతండ్రి,సుయో ధనుండేలిక. ఇవి త్రికరణశుద్ధిగా జెప్పుచున్న మాటలు. ఈ మహానుభావున 'కపచారంబుఁదలంచుటకాని చేయుటకాని

మహాపాపహేతువు. తలపెట్టజాలను, జేయజాలను. ఇంక మాటలు చెప్పి నన్నుఁ బడింపక మగిడిపొమ్ము"ని చెప్పి, తటాలున సెలవంది గిరుక్కున మగిడి కర్ణుండు శ్రీకృష్ణుని సన్నిధానంబునుండి తిరుగుమొగము పట్టుచున్న మనంబుతో వెడలి పోయెను.

అంతట శ్రీకృష్ణుండు నిర్వ్యాజపడి కొండొకసేపేమియుఁ దోఁచక నిలిచియుండి మేనత్తయగు కుంతిని దర్శించి సభావృత్తాంతం బెఱింగించి యామె చెప్పినమాట లాలించి విదురునితో ముచ్చటించి యటనుండి తిన్నగా నుపప్లావ్యమునకు నేగి,

పాండవపక్షయోధులకుఁ బాండుకుమారులకేయుదంతమున్
నిండు సభాముఖంబున గణించినపిమ్మట యోద్ధలెల్ల ను
ద్దండత సింహనాదములు దారుణపద్ధతిఁ జేసి ధీరులై
ఖండన మెప్పుడెప్పుడని పంతములాడగఁ జొచ్చిరెల్లెడన్

ఉపప్లావ్యమంతయు, భేరీభాంకారములతోడను, మత్తకుంభీంద్ర ఘీంకారములతోడను, ధనుష్టంకారములతోడను బూరటిల్లెను.

# కురుక్షేత్రయుద్ధము

విజయాభిలాషచే నిరువాగుల దొరలు నవష్టంభ విజృంభణంబునఁ దమతమ సైన్యంబులతోఁ బోరికిఁ గాల్ద్రివ్వుచుఁ పుణ్యక్షేత్రంబగు కురుక్షేత్రంబున పాళెంబుదిగిరి. యాదవవర్గంబునందు ధృష్ట సాత్యకి చేకితానులు పాండవపక్షపాతులై వారలం గలిసికొనిరి. నారాయణ గోపాలురు విందానువిందులు కృతవర్మయు దుర్యోధనపక్షంబునం జేరిరి. బలరాముండు దుర్యోధన పక్షపాతియయ్యు, భీముండు శిష్యుండగుటచేతను, దమ్ముండగు శ్రీకృష్ణుండు పాండవ పక్షపాతియగుటచేతను బాహ్లీక సోమదత్తాదులు దుర్యోధనపక్షంబున నుండుటచేఁదాను బాహ్లీకనిమనుమండగుటచేతను, నేమియుఁ జేయనేరక తీర్థయాత్రామిషంబున నెందేనరిగెను. భీష్మకసుతుండగు రుక్మి పక్షద్వయంబుచేఁ దిరస్కృతుండై యింటియందునుండెఁగె. దుర్యోధనుని సవతితమ్ముండగు యుయుత్సుండు ధర్మజుంగలిసె. ధర్మజుని మేనమామలగు కుంతిభోజు లిరుపక్షంబులం జేరిరి. కవల మేనమామయగు శల్యుండు దుర్యోధనపక్ష మవలంబించె. ఈగతిఁ గురుపాండవులు పరస్పరాభిముఖులై నిలువంబడిరి. పాండవసైన్యంబునకుధృష్టద్యుమ్నుండు సర్వసేనాధిపతియయ్యె. కురుబలంబునకుఁ బితామహుండైన భీష్ముండు సేనాపతి

యయ్యె. ఆసన్న గురువృద్ధజ్ఞాతి బంధువధచే విషాదచిత్తుండైన శ్వేతవాహనుని బోధించి సమరసుముఖునిగా శ్రీకృష్ణుఁ డొనరింప, నుభయసైన్యంబులు పెచ్చుపెఱిగి తలపడి పోరు నారంభించెను.

గ్రీష్మభానునిభంగి భీష్ముండు చెలరేఁగి
  చిచ్చఱమ్ములచేత జిచ్చపడఁగ
పాండవవాహినీ పతనంబుఁగావింప
  నొక్కఁడైనాఁడద్దుకొనఁ గాని లేక
గాంగేయునెదిరింపఁగనలి యాతండతి
  క్రూరాశుగములచేఁ గొట్టినంత
ఆయుధంబుల ముట్టనని బాసపేసిన
  నగధారిపగ్గముల్ నొగలఁబెట్టి

  చక్రమును ముట్టి చేఁబట్టి సాహసించి
  శాంతనవుపైకి లంఘించెఁ జంపవైతు
  ననుచు నపుడు ధనంజయుఁ డడ్డువచ్చి
  తివిచి మరలించి కొంపోయెఁ దేరుపైకి

తన్నుఁ గాపాడ వాసుదేవుండు ప్రతిజ్ఞాభంగంబగునన్న సంకోచంబులేక చక్రధారి యయ్యెనని సిగ్గిల్లి ఫల్గునుండు కినిసి సముత్సాహ సంరంభంబున గాండీవచండకోదండజ్యా నిర్ఘోషంబునఁ గురుసేన బెగ్గిల్లిపాఱ నిశాతబాణపరంపర బడలు వడఁజేసి యుద్ధంబు ప్రవర్తింపఁజేసెను.

పాండవసేనలుంజెదరి పాఱఁగ భీష్ముఁడు విక్రమింపఁగాఁ
గొండొకనాఁడు శౌరి మునికోలధరింని నదీతనూజునిన్
మొండెముఁజేతుఁ జూడుమని మొగ్గరమందు రథంబు డిగ్గనా
ఖండలసూతి యడ్డుపడెఁ గర్జముకాదని నచ్చఁజెప్పుచున్

తొమ్మిదవనాఁడు సంగ్రామ దోహలుంపు
జాహ్నవీసూనుఁడుగ్రుఁడై సవమవించెఁ
బాండవచమూసమూహంబు బడలు పఱచి
ఘోర శరపాళి సేన గగ్గోలుపుట్టి

పంచపాండవుల్ సైన్యాధిపతులు గూడి
యుక్కు చెడియొక్క యెడగూడి యుమ్మలించి
వడకునంగకమ్ములతోడ నడలుతోడ
నిలిచియుండగ వెన్నుండు కలయఁజూచి

ధర్మజుతోడ నిట్లనియెఁ దాతకు నీవనినంత నెంతయో
యర్మిలి యెట్లునీకు విజయంబొడఁగూర్పఁ దలంచుఁగావునన్
మర్మమువిప్పి చెప్పు మనుమానుము మానుము తప్పకుండ దు
ష్కర్మమటంచునెంచకయె జాహ్నవిపుత్రునిఁ జూఁడబోవుమా.

పోరునకుముందు సెలవందఁ బోయినపుడు
మించి యాపదల్ విన్నావరించినపుడు
వచ్చి తనుఁ జూడమనిచెప్పి వంపలేదె?
తగినసమయంబు పొమ్మన్నఁ దాతకడకు

తాతకడకేగ నిచ్చించి ధర్మసుతుఁడు
దొరలు శిబిరంబులను నిద్ర దొరలుచుండఁ
దారి మెల్లగా నడిరేయి తాతకడకుఁ
బోయి తనగోడు విటు వెళ్ళఁ బోసికొనియె:

అదవదలన్యో నాట్రదుకు నాహవభూమికి నీవురాఁగ నీ
యెదుటను నల్లత్రాడు ఓగియించి శరంబును వింటఁదొడ్గి నె
మ్మది గురితప్పకేయఁగల మానటియొక్కఁడు గల్గవాఁడె యీ
పదిపది నాల్గులోకముల? వట్టిదిగాదె జయంబు నాకిఁకన్?

ఇంతటిజాలిలేక రణ మిట్టులు సేతువఁటన్న మేము మా
వంతును బంచిపెట్టుమని వట్టును బట్టఁగఁబోము వారు మ
మ్మెంతలు చేసినారొ యని యెల్ల నెఱుంగవె నీవు తాత? మే
మింతకు బీదవారమనియేకద! యిట్టులుపేక్ష సేయుటల్

చెప్పెదనేఁడు రాజులకుఁ జెచ్చెరఁబొంచిఁక వీళ్ళకంచు నా
తప్పిదమున్ క్షమించి యొక దారిని జూపకయున్న వారలన్
ముప్పులపాలు సేయఁగల మూర్ఖుఁడఁగాను మహానుభావ! నా
కిప్పుడు తోఁచదేమియును నీవొకదరిని జూపి పంపవే

తాతవునీవు చిన్నపుడె తాతగతించిన జాలిచేత నీ
చేతులమీఁదఁ బెంచితివి చేతముచల్లఁగ నీవునేఁడొ యీ
చేతులమీదఁ జంపెదవె, చిత్తమువచ్చినయట్లు చేయు మీ
చేతులుమోడ్చి భక్తిమెయిఁ జేతును జోతలఁటన్న పిమ్మటన్

ముసిముసి నవ్వునవ్వుకొని మోము వికారముఁ దోపనీక సం
తసపడి జాహ్నవీసుతుఁడు ధర్మజుతో నిటుపల్కె నర్ధరా
త్రసమయమందు నొంటరిగ రాఁదగునే పరసైన్యమధ్యమం
దెసగు గుడారముల్ చొరఁగ నేటికిఁజేసితివీయకార్యమున్

కూడుగుడ్డలనిచ్చి కాపాడుచుండె
నేఁటిదాఁక దుర్యోధనుఁడేటిమాట?
ధర్మమో యధర్మమ్మొ యుద్ధంబుఁజేయ
బూనితిని వానిపక్షంబు పొమ్మటంచు

దీనాననుఁడగు కుంతీ
సూనునిఁగనుగొని సురనది సుతుఁడు కనికరం
బూనుచుఁ గటకటఁబడుచున్
మౌనముతోనుంతి కొంత మాటాడె నిటుల్:¹

"ఇంతకుమున్నె నీవిచటికేలరుదెంచఁగలేదటంచు నే
నెంతొ తలంచుచుంటిఁగద యిప్పుడు వచ్చితి వేమిసేతు నీ
వంతలుదీరుపెట్లు బలవంతుఁడు కౌరవరాజు భూరి వి
క్రాంతిగలట్టి సైన్యములు గల్గను వానికి వేల పెట్టుగన్

నా వంతలయిక చేసిన
నీ వంతలు నీకుఁ దీరునే? కురుపతికిన్
మావంతులు రేవంతులు
లావంతులు బలముకలదు లక్షలకొలఁదిన్

చాపము నాచేనుండినఁ
జాపాచార్యంపుగూడ శరమొక్కటియేన్
మోపెట్టి వేయనేరఁడు
నీ పట్టుగలట్టివారు నేర్తురె? సైనన్

ముదుసలినైతి నే బ్రదుకఁబోనిఁక నెన్నియొ యేంచులక్కటా!
బ్రదికిన లాభమేమిపుడు? పౌత్రులు గొట్టుక చచ్చుచుండఁగా
నది కనులారఁగాంచు టొక టబ్బెను గావున యుద్ధమందునన్
గదిరినచావుకన్న మరి క్షత్రియుఁడొక్కటి గోరనేర్చునే?

బ్రదికియుండిన నీకు దోడ్పడఁగఁజాలఁ
జచ్చిపోయిన లాభంబు సంక్రమించు
నొక యుపాయంబుఁజెప్పెద నొండునాక
నాకమరణంబుఁ గూర్పఁగా నీకతగును

నాకొక వ్రతంబుకలదు. అంగనాపూర్వుల మోముఁ దిలకింపను. నీపక్షమందియగు శిఖండి యంగనాపూర్వుఁడు. వానిని ముందల నిడికొని సవ్యసాచిచే జ్యేష్ఠు నన్నుఁ బడవేయింపుము. నీకును లగ్గగు. మిమ్ముఁ బెంచినవాఁడ నగుటచే మీయెడఁ గూర్మికలవాఁడ. మీకు భాగంబుఁ బంచిపెట్టింప విశ్వప్రయత్నంబులు చేసితి. దుర్యోధనుండు వినఁడయ్యె. కర్ణుని దివ్యాస్త్రమహిమంబు నమ్మియున్నవాఁడు. ఏతత్కారణంబున వానిని నిరుత్సాహునిఁ జేయుటకై యర్ధరథుండని నిర్ణయించితి. దాన మీకు లాభంబుగలిగె. ఇంతదనుక నతండు రణరంగంబునకు రాఁడయ్యె. అతండసామాన్యుండైన యోధుండు. వానినిఁ గనిపెట్టియుండుట సముచితంబు. నీవిడిదలకుఁబోయి కార్యోన్ముఖుండవుకమ్ము." ధర్మజుండంత తాతకు సాఁగి ప్రణమిల్లి సెలవుఁగైకొని సంభ్రమంబునఁ దన పర్ణకుటీరముం జేరి కృష్ణునకు సర్వంబు విన్నవించి యా మఱునాఁడు గాంగేయోపదిష్టంబుగా రణంబు నడపి కరుణమాలి తాతయని తలంపక క్రీడిచే శరశయ్యాగతునిం జేయించెను.

అంపసెజ్జమీఁద నాపగా తనయుండు
కూలియున్నయంత కురునృపుండు
కుంభభవునిదెచ్చి కురుసేనలకునెల్లఁ
బట్టభద్రుఁజేయ బైసితోడ

పాంచాలురతోడనున్న పూర్వవైరంబు మనంబునం దుంచుకొని ద్రోణాచార్యుండు విక్రమావష్టంభంబునవిజృంభించి గెలుకనాడు—

తామర మొగ్గరంబు నొకదానిని బన్ని ప్రచండుఁడై సమి
ద్భూమి విహారమున్ సలుప దోర్బలుఁడై యభిమన్యుడొక్కఁడున్
దిమసమూని చీల్చి చొరి తేకువఁజూపఁగ యోద్ధలెల్ల సం
గ్రామముచేయఁజుట్టికడఁకన్ గుమిఁగూడినయంత బైటనున్

భీమముఖ్యులు తోడ్పడ వెడలుచుండ
మొగను సైంధవుండాకట్టెఁ బగరనెల్ల
మొగ్గరంబునఁ బల్వురు ముట్టిగిట్టి
చంపివైచిరి యభిమన్యుఁ జలముపట్టి

కవ్వడి యీసంగతివిని
నివ్వెరఁగును బూనియపుడె నిశ్చేష్టుండై
దవ్వులనుండిన సైంధవు
బ్రువ్వందెగఁదిట్టిపల్కెఁ బొక్కుచు నిటులన్

"అస్తగిరిపైకి నాదిత్యుఁ డరుగకుండ
నవని సైంధవు తలఁ గూల్పనైతినేని
నాలుకలు గ్రోయు నగ్నిలోఁ గూలువాఁడ
గాండివముతోడ నెల్లరు గాంచుచుండ"

సకలం బాలించి గురుఁడు
శకటవ్యూహంబుఁబన్ని సైంధవు సైన్య
ప్రకరముతో దానినడుమ
సుకరముగా నుండుమంచు సుసిరుఁజేయన్

మఱునాఁడు బీభత్సుండు బీభత్సంబుగా భూనభోంతరాళంబు పిక్కటిల్ల దేవదత్తంబుఁ బూరించి, ప్రచండగాండీవకోదండజ్యావల్లీటంకారంబునఁ గురుసైన్యంబు కలవరపడ, రథంబెక్కి, శకటవ్యూహంబుఁ జేరి తత్సేనాముఖంబుననున్న గురునితోఁ గయ్యంబాడఁ దొడంగె. శ్రీకృష్ణుఁ డిదిగాంచి కాలహరణంబగునని తలపోసి గురునకుఁ బ్రదక్షిణంబుగాఁ దేరుపోనిచ్చి తప్పింప క్రీడి సైంధవుంజేరు తమకంబున శకట వ్యూహంబును జించుకొనుచు మహోదారుణంబుగాఁ బోరాడుచుఁ బోవుచుండ, సిక్కడ

శినివరుఁ జూచి ధర్మజుఁడు చెప్పెను నీగురుఁడొక్కరుండె దా
సను నెఱవేర్చికోఁదలఁచి సైన్యసమాకులమైన మోహరం
బునుజొరె నేప్రకారముగఁ బోరుచునుండెనొ నేనెఱుంగఁ గా
వున నరుఁజేరి తోడ్పడుము పొమ్మన సాత్యకి పొంగిపోవుచున్

మొగఁగాచి యున్నద్రోణుని
మొగమునఁబడక మొగఁ దప్పి పోవుచు ఘోరం
బుగ సైన్యముఁబడఁ గూల్చుచుఁ
బగతులకును బిట్టపిడుగుభాతిఁ జరించెన్

శకటవ్యూహ మధ్యభాగంబునకుఁ జనునంత భూరిశ్రవుండెదురుపడఁ బ్రాతపగలు పొగలెగయ నొకరినొకరు పేర్కొని దార్కొని మార్కొని తులారణంబుఁ జేయుచు నిరువురు విరథులై ముష్టియుద్ధంబునకుఁ గడంగిరి. భూరిశ్రవసుండు సముత్సాహంబున శైనేయునింబట్టికొని, పడవేసి ఱొమ్ముఁ

ద్రొక్కి నిలిచి, కాలసర్పంబుఁబోని ఖడ్గయుక్తంబయిన భుజా దండంబు పైకెత్తఁ గృష్ణుండు దూరంబుననుండి పరికించి త్వర పడి క్రీడిం గనుంగొని,

అదె చూడుము నీశిష్యుని
మదమునఁబడవైచి యొక్క మానిసి గొంతున్
విదళింపఁగ నున్నాఁడదె
బ్రదికింపుము పగతుచేయిఁ బడఁగూల్చి పరన్

రణనీతి దైవమెఱుఁగును
రణమున నిశిష్యునిపుడు వబ్రదికింపయో
రణమున నీకై వచ్చెను
తొణకినలాభంబులేదు తొందరపడుమా

అనిన సవ్యసాచి యమోఘమైన తూపు
వింటసంధించి వెంటనే విడిచినంత
సౌమదత్తి హస్తంబును సగమువఱకుఁ
ద్రుంచిపడవైచె భూమిపై దొరలఁ బెగడ

క్రోధోద్రేకంబున నొడలు తెలియక సాత్యకి భూరిశ్రవ సునిఁ గ్రిందికి దొరలించి నికృత్తకంఠునిఁ జేయ నుభయసేనలు హాహాకారంబులు చేసెను. అంత సైంధవ వధోత్కంఠ నర్జు నుండు కురుసేనాపతులఁ గాందిశీకులం జేయుచుండఁ బ్రొద్దు గ్రుంకుతఱి యగుడు విషణ్ణవదనుండై యుండ——

## చతుర్థాశ్వాసము

ప్రొద్దుక్రుంకుచుండఁ బొడతెంచె బెడగొండ
నలమె నెఱ్ఱచాయ లభ్రవీధి
పెడను సాచిసాచి పడమటిదిక్కును
సింధు రాజుచూచి చెలఁగుచుండె

సమయం బిదెయని కృష్ణుఁడు
తమకక బోధింపఁగ్రీడి తతదివ్యామో
ఘమగు శరమువింటఁ దొడిగి
తమకంబున సైంధవుతల ధరఁబడనేసెన్

ప్రొద్దుగ్రుంకెననుచు మొఱపెట్టి కొందఱు
బాస తప్పెననుచుఁ బల్కినారు
ప్రొద్దు గ్రుంకలేదు పొరపడినారంచుఁ
గొందఱాడిరపుడు గొల్లుమనుచు

ఏది యెట్లయిననేమి? సైంధవుండు హతుండయ్యె. వివ్వచ్చుండు చిచ్చుఁజొరఁడయ్యె.

పదునేనవనాఁడు గురుఁడు
తుదియగు యుద్ధంబు నేఁటితోనని పెలుచన్
వదరుచు ద్రుపదవిరాటులఁ
దుదముట్టించెఁ గడువాఁడి తూపులచేతన్

ద్రోణాచార్యునిఁ బొడఁగని
ప్రాణంబులమీఁది తీపిఁ బాండవసేనల్
క్షోణీతల మెల్లనద్రువ
బాణంబులు విడిచిపెట్టి పరుగిడుచుండన్

అప్పుడు ధర్మరాజుఁగని యాదవుఁడీగతిఁజెప్పె ధర్మజా!
తప్పని చెప్పబోక రణ ధర్మనిరుద్ధమటంచుఁ బల్కఁబో
కిప్పుడు ద్రోణుఁజేరి వచియించినచో నొకమాట వేగ నీ
ముప్పుతొలంగు లేనియెడ మూడునుబో మన చావులిప్పుడే

ద్రోణాచార్యుండు సన్యస్తశస్త్రుండైనంగాని మన మోర్వంజాలము. వినఁగూడనిమాట విన్నచో నతం డస్త్ర సన్యాసంబుఁ గావించుననుట నీవెఱింగిన విషయంబె; కావున మన భీముచేఁ జచ్చిన యశ్వత్థామనామ కుంజరమిషంబున నశ్వత్థామ చచ్చెనని గురునకుం జెప్పు మనవుఁడు ధర్మజుండు కొంతవడి నిషంబుఁ జూపకుండి పిదప వల్లెయని ద్రోణాచార్యు నింజేరి, పేరెలుంగున నశ్వత్థామ చచ్చెనోయు నీరెలుంగున గుంజరంబనియుఁ జెప్ప గురుండు నమ్మి యస్త్రసన్యాసంబు గావించెను; ధృష్టద్యుమ్నుండపుడు విజృంభించి ద్రోణురథంబు మీఁదికి లంఘించి కేశాకర్షణంబుఁ గావించి, కుత్తుకను త్తరించి కబంధంబు భూమికి డిగ్గఁద్రోసెను

గురుఁడగు ద్రోణుండీల్గినఁ
బరివాహమునిచ్చి కర్ణుఁబట్టముగట్టెన్
గురు సైన్యంబుల కెల్లను
గురుపతి, తత్సైన్యమెల్ల గోల్తలు సేయన్

పదునేఁడవదివసమ్మునఁ
గదనముఁజేయంగబూని కర్ణార్జునులున్
మదమునఁ గొల్తలఁజేయుచు
నెదుర్కొనిరి నొకరినొకరహీనజపమునన్

అతులితశిక్ష కన్పడఁగ నందఱుయోధులు మెచ్చలింప న
ద్భుతముగ రెండుసైన్యములు పోరునుమాని తమంత వారి పో
రితమును జుట్టుమూఁగి కనుఱెప్పలవేయక చూచుచుండఁగా
జతపడి పోరుసేయఁగను సాగఁగ నిర్వురు నొక్కరూపుగా

తేరికండ్లు రెండు దిగఁబడ భూమిలో
నొడ్డగెడపఁగాఁగ నొండుచేయ
లేక కర్ణుడంత లేచి రథమునుండి
డిగ్గి నిలువఁబడుచు వెగ్గలించి

నే నిరాయుధుండ నిర్వాహకుండను
గనుకఁ గండ్లనెత్తు కొనెడుదనుక
బాణమేయమాను పార్థ? నీ కెప్పుడు
క్షత్రధర్మ మెఱుఁగఁగాని దగునెఁ

అనినఁజిన్నవాని నభిమన్యు మత్పుత్రు
నొంటివానిఁబట్టి యుసురుదీయ
క్షత్రధర్మ మెటకుఁ జని యుండెనో చెప్పు
కానిమాట లేలఁ కర్ణ యనినః

పలువురతోఁ బోరాడఁగ
వలయుననుచు వచ్చినట్టి వానిని గలనన్
బలువురు చంప నధర్మమెఁ
పలికెదవేమైననీవు పాలసుఁడౌటన్

అయినను

ఇదిధర్మంబని చెప్పినాఁడసుమి యంతేకాని నీతోడి యీ
కదనంబిన్న భయంబుఁజెంది యెటులో కాపాడుకోఁగాదు నే
నెదియర్థింపను బుట్టిబుద్ధెఱిఁగి, మున్నెవ్వానిఁ బ్రార్థించియు
న్నదిలే దర్జున! యిచ్చవచ్చినటు లెట్లయినన్ బ్రతారింపుమా

ఒకఁడధర్మంబొనర్చెనం చోర్మివిడచి
నీ వధర్మంబుఁ జేయ ననింద్యమగునె?
కృష్ణ శిష్యుండవైన నీకేమి తగవు
కలదని వచింపఁ బార్థుఁడాగ్రహముజెంది

ధర్మమేల? మాకుఁ దలపోయ రాధేయ!
శత్రుహనన మొకటి చాలుగాఁన
గాచియుండనోపఁ గలపనులను నీవు
తీర్చికొనెడిదాఁకఁ దేర్పకుండ

అగునగుఁ గృష్ణుని శిష్యుఁడ
వగుదువుగా యిట్టి ధర్మమాడఁగ నీవున్
దగుదువు గాకేమియనుచు
నగుమొగమునఁ గర్ణుఁడని యనంతర మతఁడున్

కడఁగి రథచక్రమునుబట్టి కాలుదన్ని
పైకి లేవనెత్తిడివేళఁ బార్థుఁడట్టె
దివ్యబాణ మొక్కండు సంధించి విడచి
పుచ్చెఁ గర్ణుండు తలఁద్రెళ్ళి చచ్చిపడఁగ

పిమ్మట శల్యునిఁ గురుసై
న్యమ్ముల కధినాథుఁజేయ నహికేతనుఁడున్
దొమ్మిరిపులను గలచి జీ
వమ్ముల విడె ధర్మసూతి బాణమ్ములచే

సెల్లుఁడు ద్రెళ్ళినంత తనసేనలు పర్విడఁ గౌరవక్షమా
వల్లభుఁడల్ల కాంచి యిఁక వల్లడి తప్పదటంచు డెందమున్
డిల్లపడంగఁ దోఁచమి కడిందివిచారముఁబూనియేడకో
తల్లడమంది దాఁటెనుగదా కలితుండయి చాటుమాటుగన్

# ఊరుభంగము

శంఖచక్ర పద్మరేఖాంకితములయిన పదములజాడంబట్టి దుర్యోధన సార్వభౌముండు ద్వైపాయన హ్రదంబున జలస్తంభనవిద్యచే డాఁగెనని యెంచి ధర్మజుండు శ్రీకృష్ణసహితుండై యచ్చటికిఁ జనెను. పిమ్మట భీమాదులు పోటుమాటలచే నుడికింప మానసుయోధనుండు నీరంబువెల్వడి తీరంబునుం జేరి నిలువంబడెను. అంతట శ్రీకృష్ణుండు పరిహాసపూర్వక దరహసిత వదనుండై

ఓ కురువంశవర్ధన! సహోదరబాంధవ పుత్రమిత్రులన్
నాకముఁజేరఁబంపితి పనాదృతిదాయము పంచిపెట్టకే
నీకయిపచ్చి యెందఱవనీపతులీల్గిరొ చూచియుంటివో
లోకులు నవ్వ నీమడుగులోపలడాఁగఁగనేల? యన్నచో

దప్పితి సేదదీర్చుకొన డాఁగితి నంతియెకాని పిఱికినై
యిస్సిరా! నేను భీతివడి యిచ్చటడాఁగను కృష్ణ! మీదు మే
దస్సిన సందియంపడక ధారుణి సర్వము కప్పుతున్న నా
దుస్సహమైన దుఃఖమును ద్రోయఁగ నేర్తునె యంచు రాజనన్

ఒక్కఁడవీవు మేమిచటనుంటిమి యేవురమంచు భీతి నీ
కక్కఱలేదు నాదు పలుకాలనఁజేయుము వీరియందు నీ
వొక్కనితోడఁబోరి జయమొందినఁ గౌరవరాజ్య సంపదల్
దక్కును రాజరాజ! యది తప్పిన దక్కును స్వర్గభోగముల్

కావున నీయిష్టంబగు
నేవిధ యుద్ధమయిన సరియే వినుమా మా
యేవురియం దొక్కనితోఁ
గావింపు మటంచుఁ జెప్పఁ గౌంతేయుండున్

ఉలికిపడి సారసదళాక్షుఁ డుద్దుకుడిచి
విస్మయంబునఁ బరికించి వెగటుపడుచు
నరుని దరిఁజేరి మెల్లగా బలుకుచుండఁ
గాంచి దుర్యోధనుఁడు కృష్ణుఁ గనలిపల్కె

వనరుహనాభ! ధర్మజుఁడు వట్టియమాయకుఁడంచు నీవు లో
ననుకొనినావె? తప్పగు సుమా! యతఁడంతటి కన్నమేటియౌ
ననయము నాస్వభావమును నాతఁడెఱింగియె యిట్టులాడెఁ గా
వున ననుమానమీయెడలఁ బొందఁగనేటికిఁ భీతియేటికిన్

తెలిసియొ తెలియకొ! నాకుం
గలిగించెను నతఁడుగొప్ప గౌరవమదియున్
దొలఁగింపక దక్కించెదఁ
గలగుడు పడనేల? నీవు కంజదళాక్షా!

పాలించినాఁడనే పౌర వాన్వయసంప్ర
దాయమ్ము లిసుమంత తప్పకుండ
ఆలించినాఁడనే నార్తావిలాపంబు
లతిశయ శ్రద్ధచే నరులువొగడ
దూలించినాఁడనే దుర్మదారులనెల్ల
ధర్మంబు లవమైన దాటకుండ
తోలించినాఁడనే దొంగ దొద్దడికాండ్రఁ
బరసీమలకుఁ జేరి బ్రతుకుచుండ

నర్థులకు నీవి యిచ్చితి నడిగినంత
జన్నములు చేసితివి బ్రజల్ సంతసింప
అనుభవించితి భోగ భాగ్యంబులెల్లఁ
జావు చావన్న భయమున్నె? శంకయున్నె?

వచ్చు జయంబు నేనెఱుఁగు వాఁడ గదా రణమందు నిన్నొ వి
వ్వచ్చునొ మాద్రిపుత్రులనొ వచ్చి రణంబొనరింపుఁడన్నచో
మెచ్చదు నామనంబు ననుమెచ్చదు లోకము దీనిఁజేసినన్
జచ్చెడువాఁకనున్ మఱవఁజాలను ఎంతగు నాభిజాత్యమున్

రాజరాజను పేరుతో రాజ్యమెల్ల
నేలినాఁడనే నిండాఁక నింకమీఁద
మానదుర్యోధనుండంచు మనుజగణము
నన్నుఁ గొండాడఁజేతు నీ నాఁడుమొదలు

అంచు బరవసంబుఁ జేయుచు మహాసంరంభంబున భీమునిదిక్కు-
మొగంబయి చేయివీచుచు,

ఇరువురమొక్క యొజ్జకడనే కద తొల్లిగదారణంబునున్
గఱచితి మంతెకాని మన కౌశలమున్ గనుపింపఁజేయ నే
వెఱవును గల్గదయ్యె నదివెన్నుని సన్నిధి నబ్బెనేఁడు నా
తెఱఁగును నీతెఱంగు బలదేవుఁడు సాక్షిగఁ దెల్లమయ్యెడున్

అతులమహానుభావుఁడగు నాబలరామునివద్ద విద్దె నే
ర్చితిమి రహస్యముల్ మనకుఁ జెప్పెగురుండును దద్విశేషముల్
వితథముఁ జేయకుండ నొకవీసము ధర్మము తప్పకుండనిన్
బితరులఁ జూడబుత్తు నొకపెట్టున మాధవుఁడాపులింపఁగన్

అదె! తాలాంకుఁడువచ్చెను
బదపద యభివాదనంబుఁ బచరింతముపైఁ
గదనముఁ జేతుము మనకుం
గొదలుండవు భీమసేన కొంకఁగనేలా?

భూభుజులందఱుంబొగడ భూరిగదారణ పాండితీ మహా
వైభవముం గనంబఱచి ప్రస్తుతికెక్కఁగవచ్చు వాయుపు
త్రా భయదావహంబు మఱితప్పదు నాకును నీకు ధర్మపీ
ఠాభయముండ నేరదిఁక డాయుము పోరికి మాటలేటికిన్

అంచు సుయోధనుండు వినీతవేషుఁడై బలరాముంజేరి-

శిష్యుఁడభివాదనంబును జేయుచుండె
నతిభయంకర ఘోర జన్యంబునల్పఁ
బ్రాణము పణంబుగా నొడ్డి యరుగుచుండె
దీవెనలనిచ్చి పంపవే దేశికేంద్ర!

సుయోధనుండంత రోహిణేయునిచే దీవనలందిమోము విప్పారనొడలు పెంచి, భుజాస్ఫాలనంబుఁగావించి, గర్జించి దీర్ఘగదాదండంబు గమిచిపట్టి, యుద్ధరంగంబున నిలువంబడ, భీముండును గన్నెఱంగని కోపంబుతో గదంబట్టి సారించుచు మల్లచఱచి, సుయోధనుని నెదుర్కొనఁ బరస్పర జయకాంక్షచే వారు పోరసాగిరి. ఒకరినొకరు డాయుచు, వీడుచు వ్రేయుచు గదను బిరబిరఁ ద్రిప్పికొట్టుచు, మండల ప్రచారంబుల భ్రమించుచు, మలయుచు, నొండొరులపెఱింగి మట్టుచుఁ గొంతవడి పెనంగిరి. స్థూలకాయుండగు భీముండు క్రమక్రమముగా డయ్యనారంభించి, రోజుచునిట్టూర్పు విడుచుచుండెను;

అతికష్టంబుపై మండలభ్రమణంబుఁ జేయుచుండెను. ఎదిరిఁ గొట్టుటమాని, తన్నుఁ గాపాడుకొను ప్రయత్నంబున నుండెను. దుర్యోధనుం డతిలాఘవంబునఁ జుఱుకుదనంబున నెచ్చుటఁ జూచిననుదానవై భీమసేను వెలార్ప మొదలిడె.

చకచక మాటల నాడుచు
జకపిక గదత్రిప్పి త్రిప్పి సర్పధ్వజుఁడున్
గకవికలై బెకబెకలై
తికమకలై భీముఁ గన్ను తిరుగఁగఁ గొట్టెన్

సొక్కి భీమసేనుండంత సొమ్మసిల్లి
తేరి, తేరి కొంతవడికి దెప్పిరిల్లి
గదను జేఁబట్టి తన యౌడుఁ గఱచికొనుచు
యుద్ధమును జేయుచుండెను నోసరిల్లి

తడబడు నడుగులతోడన్
గడలుకొనెడి భీతితోడఁ గంపముతోడన్
బడలిన వడముడిచేగద
గిడుగయ్యెను జెప్పనేమి! కృష్ణుండపుడున్

వినవోయి ఫల్గునా! మన భీమసేనుఁ డీ
యహికేతనుని గెల్చునట కల్ల
అలవాటులేమిచే నాయాసమున భరం
పడిపోరుచుండెను బాలఁజూడు

సారెసారెకుఁ దూలి జవ్వాడుచుండెను
నడకలో బిగువు కన్పడుటలేదు
అతిలాఘవముతోడ హస్తిపురీశుండు
వెఱవుతో గదత్రిప్పి విసరుచుండె

భీమసేనుండు ప్రతివీరు పీఁచమడఁచు
యత్నమునుమాని తన్నుఁగాపాడుకొనెడి
యత్నముననుండెఁ జూడుమా యక్కటకట!
చూడఁజాలఁ గంటను వాయుసూను చావు

నిట్టూర్పులగమి మిక్కిలి
దట్టంబగు చుండె నింక దక్కఁడు మనకున్
గట్టా! భీమునిఁ గొట్టన్
గట్టల్కన్ గాచియుండె గౌరవనృపుఁడున్

ధర్మమనుమాట మనమేల తలఁపవలయు?
తొడలు విఱుగఁగొట్టించి యాధూర్తుఁడైన
కౌరవేశ్వరుఁ జంపించి తీటవాఁడ
శ్రీ విజయలక్ష్మి ధర్మజుఁ జెట్టఁబట్ట

నాభిక్రింద ఘోర గదా రణంబునందుఁ
గొట్టరాదనిచెప్పి పల్కుదురు నీతి.
విదులది యెఱింగి కౌరవ విభుఁడు జోకఁ
గాచుకొనుచునుండెను నూర్ధ్వ కాయమొకటె

బలరాముని భయమొక్కటి
కలఁగించుచునుండె నైనఁ గౌరవనృపు భూ
తలమునఁ గూల్చినపిదపన్
బలరాముని బట్టుపఱప వచ్చునెట్లో

కావున భీమునెదుటఁ దొడ
నీవు చఱచికొనినయంతనె యతఁడెఱిఁగి యా
పై విఱుగఁగొట్టు దొడలను
బోపుమ యిదినీవుచేయఁ బొక్కకు మన్నన్

# చతుర్థాశ్వాసము

భీము కట్టెదుటకు నేగి విజయుఁడప్పు
డేమొ పనియున్న యటు నటియించి కొంత
తొడను జఱచుకొనియె దీని వడముడియును
జక్కఁగా గ్రహియించి యుత్సాహమూన

సర్పకేతనుఁడు దప్పదుర్వారుఁడై
యుప్పరంబు నెగసె నుకవపించి
గదను జిక్కఁబట్టి గర్జించి భీముని
మట్టుఁబెట్ట నొక్క పెట్టుచేత

మీఁదకుదూఁకి గర్జిలి సమిద్ధజవంబున వచ్చు కౌరవ
క్ష్మాదయితుంగనుంగొని ప్రచండగదాహతి నూరు యుగ్మమున్
బాదెను నుగ్గునూచముగ బాణహతింబడు పుల్గు కైవడిన్
వేదనఁబొంది రాజు పృథివీస్థలిఁగూలగఁ గుప్పకూరఁగా

పడినటువంటి కౌరవనృపాలునిఁ గన్గొని మచ్చరంబునన్
వడముడి డాసి దగ్గరకుఁ బల్మారువద్దని చెప్పుచున్ననున్
దొడిబడి దూరి కట్టలుకతోడ సుయోధను నుత్తమాంగమున్
గడువడి ధూర్తుఁడై యెడమ కాలను దన్నె దురాగ్రహంబునన్

శాలాంకుండిదికాంచి దుర్భర పరీతాపంబునుంబొంది యా
ఖీలంబౌగదఁ జేతఁబట్టి యిదిగో! భీమా! నినుంగూల్తు నీ
లీలం ధర్మముతప్పి కూల్తువె నృపున్? లేలెమ్ము కౌరవ్య భూ
పాలక్షోభము మాన్పనేరనె గదా ప్రావీణ్య మేపారఁగన్?

అంచు లేచిన బలరాము నడ్డగించి
ధర్మజాతు ధర్మపీడచేఁ దత్తరింపఁ
జేతులను బట్టి గదలాఁగి చెప్పె నిట్లు
వాసుదేవుండు గద్గద స్వరముతోడ

చచ్చిన దుర్యోధనుఁడిఁక
వచ్చునె మన భీమసేను వధియించినచో ?
నిచ్చలు మేనత్తనినున్
బొచ్చెము లేదంచు నెపుడు పొగడుచునుండున్

అయినపని యేమొ యైపోయె నాగ్రహింప
వలవదని చెప్పి బతిమాలి యవల కంప
నేవపడియప్డె బలరాముఁ డేగెనకట!
కర్మఫలము ననుభవింత్రు గాతమంచు

ఈ సంభాషణంబు నంతయు భీమ గదాక్షేపంబున భగ్నోరువుండై పడియున్న దుర్యోధనుం డాలించి సడుము నలిగిన, మణిరోచిష్ణువగు పడగవిప్పి లేచి యాడుమహానాగంబు చందంబున, వివిధమణిప్రభాపుంజ ధగద్ధగిత నిస్తుల కోటీర ప్రశస్తంబయిన మస్తంబెత్తి భూతలంబుఁ జేతుల నానుకొని కృష్ణునింజూచి——

సేతువుఁదొట్టి శీతనగ సీమలదాఁకను గల్గు భూతధా
త్రీతలభాగమంతయును రేఁగిన తీరని యాడుకూయిచే
మ్రోఁతలు మ్రోఁగుచున్నఁగనుమూసిన రాత్రులు నిద్రపట్టునే?
నీతలవ్రాత యీవిధము నీకొడ గూర్చె దురంత దుఃఖముల్

ఎల్లరు పేరుమోసిన మహీశులు యుద్ధమునందుఁ జావ నీ
వెల్ల వసుంధరావలయు మేలఁగవచ్చునటంచు నెంచుచున్
బల్లిదులైనయట్టి యదువర్యులఁదోడ్కొనిరామిఁ బోరికిం
దెల్లము; కాని ధర్మజుఁడు దీని నెఱుంగఁగ నేరఁడేమియున్

చెల్లదు, సత్యమున్ వినుము చెప్పెద మాధవః సర్వధారుణీ
వల్లభులన్ నశింప యదు వంశమె యేలెడు నన్నమాట; నీ
వల్ల నొనర్పఁబడ్డ బహు పాతక మూలక ధర్మపీడలన్
వల్లడిఁ గూర్చికూర్చి యదువంశముఁ ఓలిచి పిప్పిఁజేయవే

బలవంతుఁ దైనవానిని
బలహీనుం డెందు నమ్మవచ్చునె చెప్పుమా!
బలవంతుఁడు సమయంబున
బలహీనుని మ్రింగకున్నె పటుతరశక్తిన్

పట్టించితివిగదా పగవాని కాళ్లనిన్
నమ్మియున్నట్టి పాండవులచేత
కొట్టించితివిగదా కురువృద్ధ గురుభీష్మ
గురుయోధులనునెల్లఁ బరువుదప్పి
మట్టించితివిగదా మహితవీరులనెల్ల
సంగ్రామ నియమముల్ జారవిడచి
ముట్టించితివిగదా ముమ్మరంబగుచిచ్చు
భరతాన్వయారామ పటలికెల్ల

ఎవ్వఁ డనుభవించు నీమహాదారుణ
పాపకార్యవితతి ప్రతిఫలంబు
రాత్రులెల్ల నిద్రరామిచే శ్రీకృష్ణః
కలయగాంచి చావఁగలవు నీవు

దారుణ సంగరంబు రణధర్మముఁ దప్పక చేసినాఁడనే
వీరవిహారమున్ సలిపి పెద్దలు మెచ్చఁగ నాకభోగముల్
జారఁగఁబోవుచుంటిఁగద శోకము నాకిఁక లేదుమాధవా!
భూరి విషాదఖేదముల బ్రుంగుదు గాంతురు నీవు పాండవుల్

కృష్ణా ! నీమందెమేలంబునఁ బాండవులు ధర్మమూర్తులై నీతిబాహ్యులై భారతకులంబునకుఁ గలంక మాపాదించిరి. చంద్రవంశంబునకు నీపుట్టువునఁ బుట్టునచ్చు దాకొనె,

కంటిఁ గన్నార నీవు వెన్నంటి భీము
నెదుటఁ గ్రిడిచే సైగఁ జేయించుటెల్ల
నింత పాపకార్యంబుఁ జేయింతువనుచు
నెఱుఁగనైతి నద్దానిచే నిట్టులైతి

బలదేవ దేశికేంద్రుఁడు
కలఁడుగదాయంచు నూర్ధ్వ కాయము నేనున్
గలఁగక కాపాడుకొని వ
దలితి నధఃకాయ మిట్టిదశ ప్రాప్తింపన్

వీరస్వర్గముఁ బొందెదఁ
గౌరవ వీరాధివీర గణమిచ్చెటి కై
వారంబుల నాలించెద
గౌరవమున నాకుఁగొదువకలదే కృష్ణా !

అని చెప్పుచు డగ్గుత్తికపడి క్రమక్రమంబుగ ప్రాణమ్ము వెట్టి మాటాడ నేరకయున్నఁ బాండవులు కృష్ణునింగూడి యథేచ్ఛగాఁ జనిరి.

మఱువలేక మాధవుఁడు మానసమందుఁ దలంచె నీక్రియన్
గురుపతి చావునుం దెలిసి కొన్నయెడన్ గురుపుత్రుఁ డుగ్రుఁడై
దురమునఁ బాండవేయులను ద్రుంచుటయొండెను దొంగపోటునన్
బొరిగొనుటొండె చేయఁగల పోటరికావున నేర్పుతోడుతన్

పాండవేయుల నీరాత్రి వానిబారిఁ
బడక తొలఁగియుండెడునట్లు భద్రపఱుప
వలయునని చెప్పి వెంటనే పాండవాగ్ర
జునిఁ గనుంగొని శ్రీకృష్ణుఁ డనిను నిట్లు:

ధర్మజ! దప్పియుంటిమి గదా! పదునెన్మిదినాళ్ళ పోరుచే
దుర్మదుఁడౌ సుయోధనుఁడు ద్రుంగెను నోఘవతీస్ఫురన్నదీ
నిర్మల వాయువీచికల నిద్దురఁబోవుచ మేనునీవు నీ
పేర్మి సహోదరుల్ మఱియు వృష్ణికులుండును నేఁటిమాపునన్

అనిచెప్పి ధర్మజు నొడంబఱచి నాఁటిరేయి పంచపాండవులు కృష్ణుండును సాత్యకియు నోఘవతీపులినంబులవిశ్రమించిరి. అశ్వత్థామ విజృంభించి న్యాయయుద్ధంబునఁ బాండవులఁ గెలుచుట దుర్లభంబని యెంచి యర్ధరాత్రంబునఁ బటకుటీరంబులం జొచ్చి కృపకృతవర్మ సాహాయ్యంబున నెల్లరం బొరిపుచ్చి, రారాజు ఋణంబుఁ దీర్చికొనియె.

# యాదవ ప్రళయము

భారతయుద్ధమైన పిదపన్ యదువర్యుఁడు పాండవేయ స
త్కారముఁబొంది సంతసిలి ద్వారవతీపురి కేగుచుండఁగా
దారిని బ్రొద్దుగ్రుంకఁగ నుదంక మునీశ్వరు పర్ణశాలయున్
జేరువనున్నమాట తెలిఁగి చేరెను నచ్చట రేయి పుచ్చఁగన్

చేరిన కృష్ణునిఁ గనుఁగొని
గారవమున సంయమిప్రకాండుఁ డతిథి స
త్కారముఁ జేయుచునీగతి
సారసదళనేత్రుతోడఁ జనవున ననియెన్

కౌరవ పాండవేయులకుఁ గల్గిన యాపగ యేవిధంబుగా
మారెను? సంధియౌననెడి మాటలు నిక్కమె? సంధియయ్యెనే?
సారసనేత్ర! సత్యముగ సంధిని నీవొనరింపఁ బూన, నె
వ్వారును మాన్పలేరిది ధ్రువంబనిపల్కఁగఁ గృష్ణుఁడిట్లనెన్

మొండి దుర్యోధన నృపాలకుండు వినక
సంధిచెడఁగొట్టె నందుచే సమరమయ్యెఁ
గౌరవులు చచ్చిపోయి రొక్కరును లేరు
ధర్మజుని బొందె జయలక్ష్మి తాపసేంద్ర!

పదునెనిమిది యక్షోహిణు
లెదురెదురై పోరి పోరి యేపటికడకున్
బదునెనిమిది దినములలోఁ
గదనంబున నీల్గిచచ్చెఁ గ్రమ్మఱకుండన్

## చతుర్థాశ్వాసము

కౌరవులయందుఁ గృతవర్మ గౌతముండు
ద్రోణసుతుఁడును మిగిలిరి తుదకుఁ ధర్మ
తనయు డెసఁ బంచపాండవుల్ శినివరుండు
నే యుయుత్సుండు చావక నిల్చినారు

అతిభయంకరమైన యీ యాహవమ్ముఁ
గన్నవారికిఁ గంపంబు గల్గఁజేసె,
భరతవర్ష మీరీతిగాఁ బాడువడియె
నన్నదమ్ములు పాళ్ళకై తన్నుకొనఁగ

అనునీనుడులను వినుచును
గనారిలుచు మండిపడుచుఁ గటము లదరఁగా
మునికుల శేఖరుఁ డిట్టుల
వనరుహపత్రాక్షుతోడ వక్కాణించెన్ :

పానలుపూననేల? కురు పాండవ యుద్ధము మాన్పఁబూనుచో
మానుపఁగల్గియుండియును మాన్పక కౌరవపక్షయోధ సం
తానమునెల్లఁ గూల్చితివి న్యాయముమాని రణంబునందునన్
మానక శాపవహ్ని నిను మాడ్చెదఁ జూడుమటంచుఁ గ్రోధియై

శాపోదకమిదుగోఁ నీ
చాపల్యము మాన్తునంచు సంరంభమువన్
జేబట్టి కమండలువున్
గోపంబున శాపమీయ గొదగొనుచుండన్

ఆగుమాగుము కోపంబు నాఁచికొనుము
నీకమండలమటుపెట్టి నేను జెప్పు
మాటలను నాలకించి పిమ్మటను నీవు
చేయవచ్చునుగాదె తోఁచినవిధంబు

వారిని వీరిఁబోలెననుఁ బల్కెదవేటికిఁ? జాలు, నీశ్వర
ప్రేరితమై మహారణము వీరవినాశన హేతుభూతమై
ధారుణి భూరిభారము వదల్పఁగవచ్చె నిజంబు గాన నీ
వోరునుమాన్ప నేనెవఁడఁబో ! తలపోయవె మౌనిచంద్రమా !

పూర్వ కర్మఫలము సర్వంబు భుజియింప
కుండ నెవరిశక్యమో మునీశ !
మర్మమేల ? నరుఁడు కర్మంబు చేతిలోఁ
కీలుబొమ్మగాదె కేవలంబు ?

ఎన్నిపాటులు పడినానొ యెవ్వఁడెఱుఁగు ?
సంధిసేయంగ నెటులైన శక్తివంచ
నంబులేకుండఁ గౌరవనాథుఁ డొకఁడు
వినక చెడఁగొట్టె నందుచే బెడిసె సంధి

అందఱు దారుణయుద్ధము
నందున మరణించుచుండ నతిభయదముగాఁ
గ్రందై యేడ్పులు సెలఁగన్
విందగునే నాకుఁజెప్పు విపరీతముగాన్ ?

శ్రీకృష్ణుండిట్లు కల్లబొల్లుమాటలు పెక్కులు చెప్పి యుదంకమహాముని నిరుత్తరుం జేసి, మిక్కిలి చనువుతో-

మౌనిపర్ణశాల మరుభూమియందుండ
మంచినీళ్లులేక మాఁడుచుండఁ
గాథలోనదానిఁ గనిపెట్టి చక్కఁగా
మంచిమాటలాడి మౌనితోడ

## చతుర్థాశ్వాసము

చుట్టుప్రక్క పొలము శోధించి త్రవ్వింప
నీళ్లు పడెడిచోటు నిశ్చయించి
నిలువులోతుపోవ జలజలమని జెల
పొంగి పైకివచ్చి పొలముఁదడిపె

వసానియు నీయాకస్మిక జలపాతముచే మెత్తవడి, వాయెత్తి మాటాడ నేరఁడయ్యె. శ్రీకృష్ణుఁడీగతి బొంకులు బొంకి యుదంకమహాముని హృదయకలంకముఁ బాపి, సుయోధనుని వంక వంకనిల్పి, తదాశ్రమంబున సుఖముగా నారేయి పుచ్చి, సుప్రభాతంబుననే లేచి, మునీశ్వరుకడ సెలవంది, ద్వారవతిం బ్రవేశించి, నిశ్చింతతోఁ గాలముఁ గడుపుచుండ,

భారతభూతధాత్రిఁ గురు పాండవయుద్ధము వీరరక్తకా
సారమయంబుఁ జేయఁగ విసారమునై బహుదీర్ఘశోకవి
స్తారపరీతమై కులముఁ జారులచోరులు భీతిలేక సం
చారముఁ జేయసాఁగిరి విశంకటపీడల నాచరించుచున్

వినరావు మంగళ స్వనములు రవ్వంత
యోదార్పరాని యేడ్పొకటి తక్క
కనరారు నగుమోము కలవారు శిశువృద్ధ
వికలాంగ బధిరాంధ వితతి తక్క

పరికింపఁగాలేవు పంటపొలంబులు
పిన్న పెంటలఁ గుళ్లు బీళ్లు దక్క
పొదకట్టఁగారారు పుణ్యాంగనామణుల్
విలపించు ముండమోపులును దక్క

ఏడ్పుబొబ్బలు లేనట్టి యిల్లుగాని
యూరు పల్లెలుగాని కొండొక్కఁడైనఁ
గటకటా! కన్నుదోయికిఁ గానరావు
వలుకులైపోయె భారత వర్షమెల్ల

ఒక్కని రాజ్యతృష్ణ మఱియొక్కని మొండితనంబు నింక వే
ఱొక్కని రాజనీతి భరతోర్వినిఁ బీలిచి పిప్పిఁజేసెఁబో
పిక్కటిలంగఁ బేదఱిమి పెంపఱఁజేసె మహోగ్రభంగిగాఁ
ద్రెక్కొను బీదసాదలకు దిక్కెవరుండిరి కాచిప్రోవఁగన్

ధర్మపీడలుమాన్పఁ దగువారు లేమిచేఁ
బాపముల్ మినుముట్టి పరుసఁబెఱిగె
బలవంతులైనట్టి పరిపాలకులు లేమి
జారచోరులబాధ సాఁగిపోయె

పగవాండ్రు మరణింప మగనాండ్రు చెలరేఁగి
తిరుగాడఁ జొచ్చిరి తెంపుఁజేసి
తగవుఁదీర్పఁగఁ జాలు తగవరుల్ గనరామి
గోవాండ్ర గోవారు గుబ్బటిల్లె

భరతవర్షంబు దుస్సహ నరకమయ్యెఁ
గాలు కదలింపగా వీలు కలుగదయ్యె
బ్రాణభయమొక్క క్షణమైనఁ బాయదయ్యె
దిగులు విడనాడిపోదయ్యె దినదినంబు

ఇట్లు భరతవర్షంబు సంక్షుభితమై, వ్యాకులమై, యాభీలమై, పాపమూలమై శోకరసాధిదేవత కనికిపట్టైయుండ

## చతుర్థాశ్వాసము

ద్వారకయందు యాదవులు దర్పసమగ్ర మహోగ్రులౌచు నె
వ్వారిని లెక్కపెట్టక యపారబలంబున వృద్ధిఁజెంది దు
ర్వార పరాక్రమాఢ్యులయి రాజులనెల్లర ధిక్కరించి పై
వారుచునుండి రాపురిని వైరులు లేరని గర్వలీఢులై

కులవృద్ధులను జూచి గురుభక్తిఁ బూజించి
మర్యాదలనుజూప మానినారు
ఆచార్యులనుగాంచి యర్చించి శ్రద్ధతో
నుతుగఁదలిచ్చుట యుడిగినారు

ధర్మాత్ములగువారి దర్శించి నెమ్మితో
భాషించుపద్ధతి వదలినారు
దైవతారాధన తత్పరత్వముమాని
మూడు సంజల పూజ వీడినారు

యాదవకుమారు లుగ్రులై వ్యసనసక్త
కమునఁజిక్కి దురంతులై క్రమముఁదప్పి
వృద్ధజనముల గికురించి వెడగులగుచు
దిరుగుచుండిరి ద్వారకాపురమునందు

ఆయము లెక్కపెట్టకయె యందఱిసుందఱిఁ గేరడించి, పై
రేయముఁద్రావి హైమఱచి రేఁబవలొక్కరుఁ డొక్కరై పసిన్
బ్రాయముఁ బానగోష్ఠికల పద్దను బుచ్చుచునుండఁ గాంచియున్
న్యాయము కాదటంచు నొకరైనను జెప్పెడివారు లేరటన్

త్రాగుబోతుతనము తగవుగాదంచును
ముట్టఁబలుకువారు పుట్టరందు
నేమి పల్కనుందె; నిందీవరాక్షుని
యెదుట సాఁగుచుండె నిట్టిపనులు

త్రావుము త్రావుమంచుఁ దెగఁ ద్రావుమటంచు నొకళ్లొకళ్ళనున్
ద్రావఁగఁ జేసిచేసి మదిరంబును లాహిరిఁబొంది వారుణీ
దేవత కేటికొళ్లు నిగదించెద రాపురిఁగల్గు శౌండికుల్
త్రావుచు నేలమీఁదఁబడు దాఁకమదంబుముదంబుమీఁఱఁగా

ఓరోరీ ! తేరమదిర
తేరా ! చషకంబునిండఁ దెగఁ ద్రావెద నా
పేరెఱుఁగవురా యనుచున్
బూరింతురుగిండ్లు త్రాగుఁబోతులు చొరవన్

మద్యము నాని యాని యవమానమెఱుంగక రాచబాటలన్
జోద్యము లాడుచుందిరుగుచున్ గనుపింతురు చేతనున్న యా
ఖాద్యములన్ బసాపడుచుఁ గాఱులు ప్రేలుచు బాసలాడుచున్
బద్యము కూనరాగమునఁ బాడుచు యాదవ శౌండులప్పురిన్

ఎప్పుడు పురవీధులలోఁ
దప్పక కనవచ్చుఁ దప్పఁద్రాగినవారిన్
దుప్పతలల ముండలతోఁ
దప్పటడుగు లిడుచు దారిఁ దారెడివారిన్

మదిరాపాన విఘూర్ణమానులగుచున్ మల్లాడి మల్లాడియున్
మదిరాక్షీపరిరంభ సౌఖ్యములతో మత్తిల్లిపువ్వాటలో
మదమత్తుల్ చరియింతురాపురమునన్ మర్యాదలేకుండ నా
యదువంశోద్భవులేమి చెప్పెదను దుర్వ్యాపార లీలారతిన్

దెప్పరంబుగఁ బోరు కడింది మగలు
సందుగొందులఁ దిరిగి విస్సారులైరి
పుడమి నెదురించువారు కన్పడమిచేత
నౌర ! సామరి సోమరి యయ్యెనచట

ఆనదొరంగి ద్వారవతి యందువసించెడి మత్తకాశినుల్
పానముఁజేయనేరిచి పిపాసను దీర్చికొనంగ వారుణిన్
బానలు నింపియుంపఁ దమవంతు మహోససమందునన్మద
స్థానములయ్యెఁ గేహములు ధర్మవినాశనమూలకంబులై

పౌరుగూరి పెద్దలయినన్
బౌరపతి ద్వారవతికట్టె పోయిరయేనిన్
బరువు ప్రతిష్ఠలు దక్కవు
సురచే మత్తిల్లిన యదుసూనులమెదుటన్

నారద ప్రభృతి మునిజనమునకైనఁ
దప్పవయ్యె నీపాటులు ద్వారవతిని
యదుకుమారుల స్వైరవిహారమిట్లు
తెన్నుగానక మితిమీఱి మిన్నుముట్టె

వివిధములైన మద్యముల విల్చుచు నమ్మఁగ శౌండులెల్ల ద్వా
రవతిని బాన గోష్ఠికల రాయిడిమేమని చెప్పనేత్త రేఁ
బవలును మూయఁగాఁబడవు వానిని బాయరు త్రాగుబోతులున్
బవరము పానగోష్ఠికల వద్దఁగనంబడు గంద్రగోళమై

పత్తనమిట్లు దుర్వ్యసన పంకిలమైకనుపట్టఁ గృష్ణుఁడున్
జిత్తులమారియయ్యు నెది సేయఁగలేక విషణ్ణచిత్తుఁడై
యొత్తిగిలంగ యాదవులహో! చెలరేఁగుచు వంతకంత రే
కెత్తఁగ నుగ్రసేన పృథివీశుఁడు చాటఁగఁబంపె నీక్రియన్

హాలాపానముఁజేసిన
వేళాకోళమ్ముగాదు వినుఁడీ వారిన్
శూలారోపణఁ జేసెద
జాలింబడఁ దత్కుటుంబ సహితముగాఁగన్

ద్వారకాపట్టణపుఁ బొలిమేరలోనఁ
బానగోష్ఠులు పెట్టినవారినెల్లఁ
బట్టి మరుభూములకుఁబంపివైతు సర్వ
జనుల కవిలంఘనీయ మీ శాసనంబు

ఈ శాసనంబు నాకర్ణించి యతికుపితులై యదుకు మారులందఱు నొక చోటఁ గుమిఁగూడి

ముదుకఁడుగాన నెట్లయిన భూపుఁడు ప్రొద్దులు పుచ్చవచ్చుఁగా
గొందగొనియున్న యీపడుచు కుట్టలమాటఁ దలంపకిట్టు బె
ట్టిదమగు శాసనంబు నొకటిన్ బ్రకటించుట రాజనీతియే ?
యిది కనుగొందమంచునపుడెల్లరు రోషకషాయతాక్షులై

అతినిగూఢంబుగా నొకరినొకరు బిలిచికొని బందు కట్టి శాసనంబు నిరర్థకంబుఁజేయ సమకట్టి జాతరయను నెపంబున

బుసబుస పొంగారి పులకంపుఁగొట్టుసుం
డెటి కల్లుకుండ కావడులఁదాల్చి
పదపువాసనగొట్టు మధువునింపిన పంట్లు
మూపులపైఁబెట్టి మోసికొనుచు

లాహిరి గలిగించి లంభింపఁజేసెడి
వారుణీ భాండముల్ వట్టుకొనుచు
మదిరాక్షులకుఁగూర్చు మదిరతోఁ బెగనిండి
తొలుకు కుండల బండ్లఁ దోలుకొనుచు

ద్వారవతివీటి యాదవుల్ బయలుదేరి
వార్ధి చెంతకుఁ జిత్తంబు వచ్చినట్టు
త్రాగవచ్చునటంచును దరలినారు
క్షోణిధవుఁ డేమిసేయునో చూతమనుచు

రాజశాసన భయము సర్వంబు తొలఁగఁ
జేతఁ జషకముల్ పూని వాచేరఁ బట్టి
రేకలనుదాల్చి మంచి మైరేయమెల్లఁ
గ్రోలిరప్పుడు యాదవుల్ గొంతువఱకు

కవకవలుగఁ దిరుగాడుదు
రపచంచము లమ్మనట్టి యంగకులందున్
చెవఁ ద్రాపిన యదువంశ
ప్రవరులు మాటాడకుండ బందరునందున్

తసతసఁ గూలెడువారై
పిసపిసఁ బరుగెత్తుచుండి విగళాంబరులై
గుసగుస లాడెడివారై
పసచెడి కందోయి తేలవైచెడివారై

యాదవ సందోహం బొడలెఱుంగక సంచరింపుచుండు టంజేసి ప్రచండ శౌండపిచాడిలాంబై సముద్రతీరం బంతయు మహా కోలాహలంబులుగానుండె. అట్టిసమయంబునఁ బ్రద్యుమ్నునిపై నానుకొని యతి వాచాలుండై,

కనుగ్రుడ్లెఱ్ఱవడంగా
శినివర్యుడు తప్పఁద్రావి చిటచిటమనుచున్
ఘనయోధుని గృతవర్మను
గనుగొని యిట్లాతిపోపెఁ గనుబొమ లెగురన్

ప్రధనముఁ జేసిచేసి శిబిరమ్ముల నిద్దురవోవు బాలురన్
ద్రథితుల నర్ధరాత్రమునఁ బైఁబడి కంఠమునొక్కి కోయఁగా
రుధిరముఁ గ్రక్కుచుండగను రోయక పాయక తానృశంసుఁడై
వధయొనరించినట్టి బలవంతుని నేఁ గొనియాడుచుండెదన్

అనవిని కృతవర్మయుఁ దన
మనమునఁ గట్టల్కరాజి మండుచునుండన్
వెనుదీయక చెప్పె నిటుల
వినువరు వీక్షింపుచుండఁ జిఱునవ్వొలయన్

పగతుఁడు నేలమీఁదఁ బడవైచి రణస్థలి యందు స్నేహితుల్
వగవఁగ రొమ్ముఁ ద్రొక్కి నిలువంబడి కంఠముఁ గోయఁ జేయిపై
కెగయఁగఁ బట్టి దానిఁ బయినే తెగఁగొట్టఁగఁ గ్రీడి యొంటిచే
పగతునిఁ ద్రోసి కూలిచిన వానిని వీరవరున్ స్మరించెదన్

అనిపలికి కొంచెపుచూపుల
వనరుహముఖి సత్యభామ వదనముఁ జూడం
గను సిగ్గు నలుక ముప్పిరి
గొనఁగాఁ దలవాంచుట గనుగొని సాత్యకియున్

చిత్తముఁ గలంప భోజుని యెత్తిపొడుపు
సత్యభామాపమానంబు సంగ్రహింపఁ
గుపితుఁడయ్యు సాత్యకి వేగిరపడుచుండ
దృష్టిసారింపఁ గృష్ణుని దిక్కునకును

కమలనాథుఁ డంత కడగంటి సైగచే
హెచ్చరింపఁ జూచి వృష్ణికులుఁడు
సంభ్రమించి సాహసంబున నుత్సాహ
భరితుఁ డగుచుఁ బెదవి కొఱుకుకొనుచు

అగునగు స్మరియింతుపులే
యిఁగ నెన్నాళ్లోయని చెప్పి కృతవర్మతలన్
తెగిపడఁ గొట్టెను వెంటనె
తగవుండునె ద్రాగుఁబోతుతనమున్న యెడన్

# చతుర్థాశ్వాసము

ఇదికని భోజులెల్లరు సమిద్ధపరాక్రమ విక్రమాఢ్యులై
మదమునఁ గన్నుఁగానక ప్రమత్తతఁ దాలిచి క్రూర ఖడ్గముల్
బెదరక త్రోసికొంచు యదువృష్ణి కులంబులవారి మీఁదికిం
గదియుచుఁబోరుసేయఁగడఁగన్ యదువృష్ణిజులంత నొక్కటన్

చేకొని కత్తులభోజుల
వీకొని యెదిరించి నిల్చి వెస్సరముగ ఘో
రాకంపము గల్గనటుల
నాకస్థులుఁ జూచుచుండ యాదవవరుఁడున్

దారుకుని దగ్గరకుఁ బిల్చి ద్వారవతిని
గల్గు స్త్రీబాల వృద్ధ సంఘంబునెల్ల
హస్తినాపురంబును జేర్చి యాదరింపఁ
పార్థుతోడఁ జెప్పుమటంచుఁ బంపివైచి

చెంతకప్పుడే బభ్రునిఁ జేరఁజీరి
పార్థుఁడరుదెంచు నందాఁక ద్వారవతిని
గల్గు స్త్రీజన శిశువృద్ధ గణమునెల్లఁ
బ్రోచుచుండు మనుచుఁ జెప్పి పుచ్చి పిదప

ఒదిగి తానొక్కఁడే యొంటిగ నెడనిల్చి సముద్రతీరంబున మహాదారుణంబుగఁ బ్రవర్తిల్లుచున్న సంగ్రామంబును జూచుచున్నయెడ

అధిక సంఖ్యాకులగుటచే యాదవులను
వృష్ణికులులను భోజులు మించమడఁప
వాసుదేవుండు క్రుద్ధుఁడై వసుధగూల్చె
బోరుసాఁగించి మిగిలిన భోజకులుల

యాదవవృష్ణి సాత్వత దశార్హులు భోజులు నీవిధంబు రా
మై దెగఁద్రావి మైమఱచి మైకము కప్పఁగఁ గ్రూరకర్ములై
వాదములాడి తన్నుకొని ప్రాణము వీడుటఁగాంచి బాపురే!
యాదవనాశ మీకరణి నయ్యెనె నేఁటికినంచు జాలితో

కట్టెదుటన్ గులక్షయము కల్గుటకాంచి దురంతవేదనా
ఘట్టిత మానసుండగుచుఁ గన్నుల గాంచఁగలేక ద్వైపముం
దిట్టి సముద్రతీరమును దించి సమీపమునందు నొక్కచో
దట్టపుఁజెట్టునీడఁగని దగ్గరకేగి పరున్నయంతటన్

చిన్నతనంబునుండియును జేసినకార్యము లొక్కమాటుగాఁ
గన్నులఁగట్టినట్లు పొడగట్టఁగ మిక్కిలి విస్మయంబుతో
నన్ని తలంచికొంచు హృదయమ్మున నబ్బురపాటుఁ జెందుచున్
కొన్ని నిమేషముల్ గడవఁ గొంచెముకొంచెము నిద్రఁగూర్కఁగన్

బోయఁడొక్కఁడు వీక్షించి పొత్తిఁబట్టి
చిక్కనేచిక్కెఁ గృష్ణుండు చేరికిప్పు
డెటులఁ దప్పించుకొని యాతఁ డేగఁగలఁడొ
కొంతుననిచెప్పి సంతోష కలితుఁడగుచు

వెల్లకిలం బరుండి పృథివీజముక్రిందను నుమ్మలమ్ముచే
నుల్లము తల్లడిల్లఁబడి యుండగ నొక్కఁడు చాపకట్టుగా
భిల్లుఁడుచూచి బాణమును వేయ రపంతయు వీలు చిక్కమిన్
బుల్లపడంగ మోము కొఱవోవుచునుండగ నింతలోపలన్

కాలు కదలించి యిట్టట్టు కమలనాథుఁ
డెడమకాలిపైఁ గుడికాలు నిడిముసించి
నిదురపోవుచునుండెను గదలకుండ
నెఱుక కనిపెట్టి సంతోష మెసయుచుండ

## చతుర్థాశ్వాసము

వెడదవాతియమ్ము వెసలాగి ప్రోడిసంధి
వింటఁ దొడిగి మొదల కంటఁబడక
తివిచి యల్లెబ్రాకు పెవిదాఁక గుఱిచూచి
విడిచిపుచ్చె వాని విధమెఱింగి

ఎఱుకలొగి తోఁకుపకుమంద నెఱుకయమ్ము
జివ్వుజివ్వున సూటిగా జెచ్చిపోయి
పోయి కృష్ణుని కుడికాలి బొట్టవ్రేలు
నెఱుక వెడిపోవ మొదలంట నఱికివైచె

కట్టికిపైన బోయ విశిఖమ్ముకడుక్కన మూసిపోవఁగా
బొట్టనవ్రేల్ చురుక్కునఁ జివుక్కునఁ గృష్ణుఁడు కన్నువిప్పియ
ట్టిట్టులచూడఁ గన్బడుట నే యగుపించెను బోయ, యొండొరుల్
గుట్టుగ భావముల్ తెలిసికొంచును మౌనముతోడనుండఁగన్

వెనుకకు గిరుక్కునఁ దిరిగి
చనియెఁ బ్రహృష్టుండగుచు నిషాదుండటుపై
వనజాక్షుఁడు వెనువెంటనె
తనువు వదలి తాఁ బరమపదంబును బొందెన్

కులనాశకుఁడగు కృష్ణని
కౌలపెద్దది సంతసింపఁ గూల్చితిననుచున్
గులికెను బోయఁడు ప్రాత వ
గలుమాయునె? యూకెంత కాలము పడినన్

చ్వాశీతి వర్షంబులు భారత వర్షంబును నిజచేతనిడికొని డేగాట యాడించిన లీలామానుష విగ్రహుండగు శ్రీకృష్ణుండు కాలంబునకుం జిక్కి, నిషాదబాణవ్యాఘాత వ్యాజంబునఁ

దనుత్యాగంబుఁ జేయవలసినవాఁడయ్యె. ఇంతకుమున్న యాదవ ప్రళయంబు సముద్రతీరంబున మహా ఘోరంబుగాఁ బ్రవర్తించుచుండ నొక్కయెడ,

బలుఁడు తెగఁద్రావి కుత్తుక బంటిగాఁగ
నొడలు తెలియక తూలి తప్పడుగులిడుచు
దారిలోనున్న యొకకోడె త్రాఁచుఁద్రొక్కఁ
గస్సుమనిలేచి బలరాముఁ గాటువేయ

త్రాగియుండినవాఁడౌట నాగుబాము
బట్టి యిట్టట్టు పేలార్చి పాఱవైచి
కదలి మత్తుతో నొకచెట్టు మొదటఁబండి
గుఱ్ఱుపెట్టుచు నిద్దురఁ గూరెనపుడు

కసిఁబట్టిన యాపాము
పసిఁబట్టి యచటకువచ్చి పైబడివానిన్
బుసగొట్టుచుఁ గాటందెను
వెసమోమున దాన నతఁడు వెంటనెయాల్గెన్

దారుకునిచేఁ బంపఁబడినవార్త శూలాయమానమై చెవిని బడినంతనె, పార్థుండు బయలుదేరి నిరంతర ప్రయాణంబుచే ద్వారవతిం జేరి, శ్రీకృష్ణసాత్యకి బలరామప్రముఖ మహావీర శూన్యంబును, వార్తాలాప దైన్యంబునునై, యాపురంబు కురుక్షేత్ర యుద్ధానంతరము పెంపుచెడియున్న హస్తినాపురంబును జ్ఞప్తికి దేరఁజాలసేపు వగచి, తన్నుఁ దానూరడించికొని, ధైర్యంబవలంబించి,

## చతుర్థాశ్వాసము

అంతఃపుర కాంతాజన
సంతాపముడించి సవ్యసాచి కడంకన్
గొంతల వృద్ధుల బాలుర
చింతలుదీరంగఁజెప్పి చిరిమురిపముచున్

పసిపిల్లలఁ గసిగందుల
ముసలిముదుకవారినెల్ల ముసుగుడువడుచున్
వెవలారసికొనితెచ్చుచు
వెస ద్వారక విడిచిపోవ వెదలినయంతన్

ద్వారక చుట్టునున్న కొఅపంజాలమూఁకలు మూఁకఁగట్టుచున్
దారులుగట్టి యాదవనితంబినులెల్లరఁబట్టి ద్రోచుకో
దారులుగట్టి నిల్చె సతి బంధుర కాననసీమలందునన్
మోరకులై ప్రచండులయి పూర్వవిరోధముతొందరింపఁగన్

పార్థుఁడొక్కఁడు రక్షణకార్య నిమగ్నుండై యాదవ స్త్రీజనంబులఁ గొని తెచ్చుచుండ నకస్మాత్తుగా జెంచు దొరలువారలపైఁబడి నిర్దయులై దోపిడి మొదలుపెట్టిరి.

ఉన్మత్తచిత్తుఁడై యొకచెంచు చెలరేఁగి
నిలువుదోపిడిచేసె నెలఁతనొత్తి
కన్నుఁగానక బోయ కడముట్టి యొకకాంత
ముప్పేటహారంబు మొలనుదోపె
కొఅపంజి యొకఁడొక్క కొమరాలి నదలించి
ముంగెరఁ దెగగుంజి మూటఁగట్టె
శబరుఁడొక్కఁడు ధైర్య సహసంబుల చేత
నొకకాంత మెడపేరు లూడలాగె

వ్యాధుఁడొక్కఁడొక్క పడంతి నదిమిపట్టి
యొడలి బంగారమెల్లను నొలిచి కొనియె
ఒక్క యెఱుక పేరాసతో నొక్కబోటి
పైఁడిమొలనూళ్లపైఁబడి యూడఁదీసె

ఆలగోలు బాలగోలమ్మె యాదవ
మదవతీ సమూహ మధ్యమందు
నేమిచెప్పువాఁడ నిదియెల్ల వీక్షించి
పార్థుఁ డుగ్రకోప భరముచేత

బాపురమంచు నేడ్చుయదు భామినులందఱిఁ బాఱఁజూచి రో
షావిల చిత్తుఁడై యతిభయంకర రూపముఁదాల్చి దివ్యగాం
డీవము నెక్కుపెట్టుటకు నేర్పున యత్నములెన్నొ చేసియున్
లేవడి యల్లెత్రాడు తగిలింపఁగలేక కిరీటియంతన్

వింటిపట్టుజార కంటిబొట్లు గాఱ
నల్లెత్రాడు గూర్పు వల్లఁగాక
చిత్తమెల్లఁ జెదర జీకాకు పడిపోయె
ముసలి చెయివణకి పోవుచుండ

తెఱచిన కన్నులతోడన్
మఱచిన గాండీవ చాపమధ్యముతోడన్
బఱచిన తలఁపులతోడన్
నరుఁడట్టె నిల్చియుండె నల్వురు నవ్వన్.

నిలువుగ్రుద్దుతోడ నిలిచియుండఁ గిరీటి
నిలువుదోపిడంత నిలిచిపోక
యదుపులేక సాఁగె, యదువధూజనమంత
క్రొత్తపోటరులకు మెత్తపడుచు

పూర్వార్జితములైన పొలములు నన్నిటిఁ
బొరలివచ్చిన వార్ధి పూడ్చివైవ
కాయకష్టముతోడ గడియించిపెట్టిన
ధనధాన్య సంపత్తి పొనుగుపడిపె
పుట్టి పెఱిగినట్టి పుటభేదనంబెల్లఁ
గడలిలో క్షణములోఁ గలిసిపోయె
కనుకట్టు లేకుండ మనుగడ జరిపించు
పెనిమిటు లని లోన దునిసిపోవ

ఎఱుకలేని దేశాలకు వేగవలసె
నెఱుకతో మనియుండుట పరువుగాదె?
ఏల పరదేశమునకేగి యిలియుటెల్ల
ననుచు యాదవ కామినీ జనము తలఁచి

కడగంటి వాల్చూపు గమిచేత నొకచెల్వ
సొగసుకానికిఁ జాల సూరెలంపె
సొక్కి సోలి మనస్సు చుక్కాని వెసఁద్రిప్పె
సుందరాంగునివైపు సువతియొత్తు
కంచెల తెగిపడ్డ చంచలాక్షి యొకర్తు
వంచించి కొంపోయెఁ జెంచుమగని
పెరిగిపోయిన పేమ వెవకుచు నొకకాంత
మరులుచూపునుబంపె మరల మరలఁ

దోచుకున్నవారు దోచఁబడినవారు
జంటజంటలైరి క్షణములోన
యాదవకులకాంత లటులౌటఁగన్నార
నర్జునుండు చూచి యోడుఁగటచె

నవరాగోదయమైనన్
నవలావణ్యంబుతోడ నవలాగుమి భి
ల్లవరులతోఁ గిలకిలమన
నవమానముఁ జూడలేక యలమటపడుచున్

చెంచుదొరలనోవమి దన యెట్టయెదుట నతి కుత్సితం బుగా నడుచుచున్న యాకార్యంబు నాపఁజాలక భీభత్సం బొక్కెడ నిల్చియుండ,

రుక్మిణీదేవి పొదఁజొచ్చి రూపుమానెఁ
జలిమలకునేగెఁ దపియింప సత్యభామ
తక్కు కులకాంత లేమైరొ దైవ మెఱుఁగు
యాదవకులంబు తుదకు నిట్లయ్యెనకట!

కామోపభోగముల్ కాంక్షించి వాంఛించి
చెలరేఁగి యాదవ స్త్రీజనంబు
మితిమీరి గతిఁదప్పి మ్లేచ్ఛకిరాతని
షాదపురుషపాళి పజ్జఁజేరి
కాంతారవీధులఁ గదలిపోయిరివారు
మరులెత్తి సరిక్రొత్త మగలతోడ
శ్రీకృష్ణునంతటి చిరయశోవంతుని
చెలిమి చుట్టరికంబుఁ జేసియుంచి

యతఁడు చనినంత కులగౌరవాదులైన
సరకుసేయక దుశ్చింత జారపాళిఁ
గూడియేగిరి కామార్త కుటిలలగుచు
నేమికలదు రామస్వామి! యింకఁ జెప్ప?

లేచిపోవగా మిగిలిన లేమపిండుఁ
గొని ధనంజయుఁ డిభపురంబునకుఁదెచ్చి
ధర్మసూతికి వినిపింప దద్దరిల్లి
భయముఁ గొల్పెతి యాదవ ప్రళయమెల్ల

పెద్దప్రొద్దువగచి నిట్టూర్పు విడచి,

సరసిజనేత్రుచావు విని సాత్యకి దుర్మృతి యాలకించి వా
రిరువురు చిన్ననాఁట గొలె నెప్పుడు చేసినమేళ్ళ నెంచుచున్
బురపుర పొక్కి ధర్మజుఁడు పోయినవారలఁగూర్చి యేడ్చినన్
బొరయదు లాభమంచు వగపున్ విడిచెల్లరసమ్ముఖమ్మునన్

వాసుదేవ ప్రపౌత్రుఁడౌ వజ్రుఁగాంచి
కురునృపాలుఁ డింద్రప్రస్థ పురమునిచ్చి
చుట్టలలరంగఁ బట్టంబుఁ గట్టి పాటి
తప్ప కేలుకొనుమటంచుఁ జెప్పిపంపె

సాత్యకి తనూజునకు సరస్వతీపురంబు
నిచ్చి మార్తికావతపురంబిచ్చె భోజ
కులుడు కృతవర్మ పుత్రునకును నరాజ
కంబుగానది చెడియున్న కారణమున

పదంపడి ధర్మతనూభవుఁ డొక్కదినంబున నతి దుఃఖా
వేశపరవశుఁడై కలవరపడి యొంటరిగఁ గూర్చుండి దీర్ఘముగ
విచారించి,

ప్రాణసమానుఁడై తనకుఁ బ్రాభవమిచ్చిన కృష్ణమూర్తి ని
ర్యాణముఁ జెందనున్నడ దురంతవిచారముఁ గూర్చుచుండె న
క్షీణధరాధిరాజ్యమును శీఘ్రమ మన్మనికిచ్చి యా జగ
త్త్రాణపరాయణుంగుఱిచి ధ్యానముఁ జేసికొనంగ మేలగున్

అంచు నిశ్చయించి వెంటనే ద్రౌపదీభీమార్జున నకుల సహదేవులం బిలిపించి కంపితస్వరంబుతో వారల నుద్దేశించి సంబోధించి,

కాలము మాఱిపోయె మన కాలము సర్వముఁ జెల్లిపోయె దు
ష్కాలము దాపరించె మన కన్నులముందటె యెంతమందియో
కాలముఁజేసినారు గతకాలమె మేలుగఁదోచు నక్కటా!
గాలమురీతి గ్రుచ్చుకొను కష్టపరంపరవచ్చెఁ గంటిరే!

ఇష్టసఖుండు కృష్ణుడఖిలేశ్వరుఁడక్కట యస్తమింపగాఁ
గష్టసుఖాలు చెప్పికొనఁగా దగువారలుకూడ లేరు సం
తుష్టియు మాయమయ్యెనెదితోఁచక యుంటినిగాన నిట్టి ప్ర
భ్రష్టజగంబునన్ నిలువవచ్చునె? చెప్పుడిమీరలిప్పుడున్

పౌత్రుని నీధరాస్థలికిఁ బట్టముగట్టి ముదంబుతోడ నే
మాత్రము సంశయంపడక మౌనిజనంబుల సేవఁజేయుచున్
క్షత్రియ వృత్తినిన్ విడచి శాంతిని బూనుచు సన్యసించి లో
కత్రయ కారకుం బరముఁగన్గొనఁబోవఁగ నిశ్చయించితిన్

అన్నా! పూర్వాచారము
లన్నియు మనకండ్లయెదుట నతివేగముగా
మన్నైపోవుచు నుండెను
ఛిన్నాభిన్నంబులగుచుఁ జెప్పఁగనేలా?

# చతుర్థాశ్వాసము

కానీనుఁడన్నచోఁ గసరికొట్టుటెకాని
కౌమరాంధ్రు పరిపృచ్ఛకావరు నేఁడు
క్షేత్రజుండన్నచోఁ గేరడింపులె కాని
ప్రోయాంధ్రు తలయూఁచఁ బోరు నేఁడు
మరి, సహోఢజాడన్న మందెమేలమెకాని
పడుచుక్షత్రియలిష్టపడరు నేఁడు
అవుర! గూఢోత్పన్నుఁడన్న దూరులెకాని
మగవాంధ్రు మొగమిచ్చి మనరు నేఁడు

తాబుమాఱమ్మొ జగమెల్ల దంద్రి! వింటె!
యెట్టి విడ్డూరములు నేఁడు పుట్టుచుండె
కాలమెంతలోఁద లక్రిందు గాఁగ నమ్మోఁ
గలిప్రవేశించినట్టి యీ క్షణమునందె

పుత్రులు లేకయున్నయెడఁ బున్నరకంబు తొలంగిపోవఁగా
గోత్రమునిల్ప బ్రాహ్మణుని గూడి సుపుత్రులఁ గాంచుమన్న నే
మాత్రము మాటలిన్ వినదు మాయతి? భామ్మరె యింక నేఁడు తా
పత్రయమెట్లు తీరునొకొ! బాపురె! యెంతటి చెడ్డకాలమో!

బహూపతిత్వము తప్పు పనికిరాదని చెప్పి
మగువ లీపెండ్లిండ్లు మానినారు
చూలాలు పెండ్లాడఁ జుల్కనౌనని చెప్పి
పడఁతులీపెండ్లిండ్ల నుడిగినారు
సంతుగాంచినఁబెండ్లి సల్పరాదనిచెప్పి
ముదిత లీపెండ్లిండ్లు వదలినారు
మారుమనువుగూర్ప మర్యాదకాదంచు
వెలఁదు లీ పెండ్లిండ్లు విడచినారు

తాఋమాఋమ్యె జగమెల్లఁ దంత్రిః వింటెః
మెట్టి విడ్డూరములు నేఁడు పుట్టుచుండెఁ
గాలమెంతలోఁ దలక్రిందు గాఁగనయ్యెఁ
గలి ప్రవేశించినట్టి యీ క్షణముసందె

సత్యమె చెప్పవలయునటె
సత్యము వలయునటె కార్యసాధనకైనన్
సత్యము దప్పిన నరకము
సత్యముగావచ్చునటెః విచారములేలా!

ఏనియమంబులేనియెడ నిష్టముచొప్పున సంచరింపఁ, గా
నీనులు పుట్టవచ్చునని నేఁటికిఁ బెద్దలు బాల్యమందునే
మానక పెండ్లిచేసియును మాయురె యింటనునుంచుచుంద్రి, క
న్యానివహంబు పూర్వము వినంబడెనే యిటువంటి చిత్రముల్ ?

మృగయాక్రీడలనైతమున్ మృగములన్ హింసింప గారాదు, మే
ధగవాశ్వంబులఁ జంపఁగూడదను వాదంబున్ బయల్దేరె, నే
డిఁగనే చిట్టలుపుట్టనున్నవి కదే యేమైన కానిండహో!
తగదీరాజ్యమునందు నిల్వనిఁకమీఁదన్ జాముసేపేనియున్

వేదం బార్షేయమటే
వేదంబెల్లరును జదువ వినఁజదివింపం
గాఁదగుదురటే, చిత్రము
గాదటెః యిదియెన్నఁడేని కంటిమెచెపుఁడీః

మదిరాపానముతప్పటెః
మదిరాక్షులు దీనిమాట మన్నించుటెః త
ప్పిదమటెః పూర్వాచారము
లదవదలైపోయెనేమి యబ్బురమొ కదే

పోయెదనింక నేను వనభూముల మౌనుల సేవఁజేయుచుం
బ్రాయముపుచ్చెదన్ వినుఁడు ప్రాయముఁబట్టుదుగట్టిగాఁ దృణ
ప్రాయముగా శరీరమును బాసెద మోక్షపదంబుఁబొంద నీ
తోయము మంచిమార్గమని తోఁచెను బెక్కులిఁకేల? చెప్పితిన్

నాతోవత్తురయేనిన్
జేతో మోదంబుతోడఁ జేకొని పోదున్
మీతెఱఁగును వినిపింపుఁడు
వాతూలతనూజ! తక్కువారలు నీవున్

నావుడొకరి మొగంబు లొకరు చూచుకొని తుట్టతుదకుఁ "మీతోడ నెందేని వచ్చుటకు సంసిద్ధులమ"ని యెల్లరు చెప్ప, ధర్మజుఁడు పరీక్షిత్తును వెంటనే పిలిపించి సకల కురు రాజ్యంబునకుఁ బట్టంబుఁగట్టి "ఇది సంధికాలమగుటం జేసి ధర్మాధర్మ నిరూపణంబుఁ జేయుట మిగుల దుష్కరంబు, కాన నప్రమత్తుఁడవై యతి శ్రద్ధాళుఁడవై రాజ్యపాలనంబు జేయుచు ననూకపరిపాటిని గాపాడు"మని మనుమనికి మనికి తెఱంగులు చెప్పి, బుద్ధులు కఱపి హస్తినాపురంబు డించి,

ధృతిమెయి మాతృభూమి శతశృంగ మహీధర సానుదేశముల్
పతనుగ నేర్పరించుకొని వాసముఁజేయు తలంపుతోఁ బృథా
సుతుఁడు సహోదరుల్ ద్రుపదసూతియు గొల్వ గ రూక్షకంటకా
వృతనధిఁబట్టిపోవఁ దొడవెన్ వెనుకాడక దంటకైపడిన్

## సూత పురాణము

దగదప్పులచే నాకఁటి
సెగచేఁ గరువలివలిపిరిచే వగచే నా
మగువయు మగ లొకరొకరే
తెగటారఁగ ధర్మసుతుఁడు త్రెళ్ళక చనియెన్

---

## ముగింపు

ఆటలనాడినాఁడడవులందున నావుల మేపునుండి
పయ్యాటలనాడినాఁడు కొమరాండ్రనుగూడి మనోహరంబుగా
బాటలుపాడినాఁడు వసివాడిన మ్రోళ్ళు చిగుర్పగా జగ
న్నాటకసూత్రధారుడయినాఁడెతఁడోయతని నితనిన్దలంచెదన్